# తెలుగు స్వతంత్ర

## విషయసూచిక




సంపుటి 2. సంచిక 1.

శుక్రవారం, ఆగష్టు 5, 1949



—చిత్రకారుడు: యస్. యస్. ఆలంద్‌కర్

అంతఃపుర రాణి

తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-1

ఆగస్టు 5, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

# వ్యవసాయాభివృద్ధి బిల్లు

ఇటీవల మద్రాసు ప్రభుత్వం ప్రకటించిన వ్యవసాయ పరిశ్రమాభివృద్ధి బిల్లుపై ప్రజాభిప్రాయం యింకా ఒక రూపం దాల్చలేదు: ఆబిల్లు చట్టరూపం దాల్చిననాడు రాష్ట్రప్రభుత్వానికి వ్యవసాయసంస్కరణల విషయంలో అపారమైన అధికారం సంక్రమించడమే కాక, అసలే క్లిష్టంగా ఉన్న మన ఆహారోత్పత్తి పరిస్థితి క్లిష్టతరం అవుతుంది; నేడు అధికారంలో ఉన్న కాంగ్రెస్ నాయకత్వపు మనస్తత్వం ఏ రీతిగా ఉందో పోల్చుకుందికి యీ బిల్లు ఒక ఉదాహరణగా ఉపకరిస్తుంది. పరిష్కారం కోరుతున్న సమస్య నేదైనా ఎదుర్కోడానికి వారు సృష్టించినవి రెండు సులభమైన మార్గాలు: దాని గురించి విపులమైన శాసనం ఒకటి-సర్వాధికారాలూ తమకే సంక్రమింపచేసేది-తయారు చెయ్యడం, అది అమలులో పెట్టడానికి అసంఖ్యాకమైన సిబ్బందితో ఒక కొత్త ప్రభుత్వశాఖ కల్పించడం.

"రాష్ట్రంలో ఎంత యెక్కువ ఆహార ధాన్యాలు పండించడానికి వీలుగా ఉంటుందో పరిశీలించి, అందు కనుకూలమైన సహాయం రైతులకు చేయడానికి; ఇతఃపూర్వం సేద్యంలో లేని భూములుగాని, అసంతృప్తికరంగా సేద్యం చెయ్యబడుతున్న భూములుగాని ప్రభుత్వం వశపరచుకుని, సక్రమ వినియోగం సాధించడానికి; ఏయే ప్రాంతాల్లో ఏ ధాన్యాలు పండించాలనే విషయం నిర్ణయించి ఆజ్ఞాపించడానికి; రైతు పండించిన ధాన్యానికి సక్రమమైన ధర వస్తుందని హామీ యివ్వడానికి," యీ బిల్లు ఉద్దేశింపబడింది.

శ్లాఘనీయమైన ఉత్సాహంతో ఈ బిల్లు తయారుచేయబడిం దనడానికి సందేహం లేదు. అయినా-ఎంతో సూక్ష్మ దృష్టి, జాగరూకతలతో నిర్మింపబడినా-గ్రామీణ జీవితంలోని అసలు సమస్యల్ని బిల్లు విస్మరించింది. ఆచరణలోకి వచ్చాక, వాస్తవంగా జరగబోయే మేలు పరిమితమైనదనే అపోహకు తావు లేకపోలేదు. కారణం-బిల్లులో స్పష్టము, ఆచరణానుకూలమునైన నిర్దుష్ట ప్రణాళిక ఏదీ గోచరించక పోవడమే. పంటలకు ధరలు నిర్ణయించడం విషయంలో, పొగాకు మొదలైన వ్యాపారపు పంటలకూ, ఆహార ధాన్యాలకూ విలువల్లో ఉన్న భేదాలను లెక్కలోకి తీసుకొని,

అందరికీ సంతృప్తి పరచగలిగే ధరలు నిర్ణయించడం సులభసాధ్యం కాదు. సేద్యంలో లేని భూముల్నీ, బంజర్లని స్వాధీనం చేసుకోవడం వాంఛనీయమే. కాని, అంతమాత్రాన వాటి సమస్య పరిష్కరింపబడదు; ఏకారణాల వల్ల అవి నిరుపయోగమైనాయో, వాటిని తిరిగి ఉపయోగంలోకి తీసుకురావలసిన మార్గాలేమిటో తెలుసుకోగల్గి ఉండాలి. ఇవన్నీ విధిగా స్థానికాధికారుల పరిశీలనకూ, తీర్పుకూ వదలివేయవలసిన సమస్యలు: కాని, స్థానికోద్యోగులు తమ అధికారాన్ని దుర్వినియోగం చెయ్యరన్న హామీ యెక్కడిది! అటువంటి దుర్వినియోగం అపు చెయ్యడానికి కావలసిన కట్టుదిట్టాలు బిల్లులో కనిపించవు

భూస్వామ్య విధానంలో మార్పులు తీసుకురాగల్గిన నాడుగాని, అంతవరకూ ఎటువంటి వ్యవసాయ సంస్కరణలు ప్రవేశపెట్టినా అవి నిష్ప్రయోజనమేనని విజ్ఞులంతా ఏనాడో అంగీకరించారు. ఆధునికపద్ధతులలో వ్యవసాయం నడిచి, ఆహారోత్పత్తి అధికం కావాలంటే, జమీందారీ విధానం, ఆర్థికంగా లాభకరం కాని చిన్నచిన్న చీలికల వేర్వేరు సేద్యం, రైత్వారీ విధానంలో నైనా వందలకొద్దీ ఎకరాలు ఒకే ఒకని అధీనంలో ఉండడం—వీటన్నిటినీ రద్దుచేయడం ప్రథమ కర్తవ్యం. తరవాత పరిష్కరించవలసింది వ్యవసాయ ఋణసమస్య. సహకార పరపతి సంఘాల ద్వారా, యింకా అవసరమైనప్పుడు ప్రభుత్వం ద్వారా, వ్యవసాయదారుడికి ఆర్థిక సహాయం లభించాలి. వీ లయినంతవరకూ ఆ సహాయం ధనరూపంలో గాక, వస్తు రూపంలో ఉండడం అభిలషణీయం. ఒక గ్రామానికి చెందిన చిన్న చిన్న భూఖండాలన్నీ ఒకచోట చేర్చి ఉమ్మడిగా వ్యవసాయం సాగించడానికి ప్రభుత్వం అవకాశం కల్పించాలి. ఈ సమస్యలన్నిటినుండీ విడదీయటానికి వీలులేనిది వ్యవసాయ కూలీల సమస్య. తక్కిన పట్టణ పరిశ్రమలలోని కార్మికులకు లభిస్తున్న జీవన సౌకర్యాలయినా వీరికి అందుబాటులో ఉండే ఏర్పాటులు జరగనిదీ గ్రామసీమల్లోని అశాంతి తగ్గే అవకాశం లేదు. వ్యవసాయం ఎంత మందికి జీవనోపాధి కల్గించగలదో అంతకంటె ఎన్నో రెట్లు ఎక్కువమంది నేడా వృత్తిపై ఆధారపడి ఉన్నారు. శాస్త్రీయ వైజ్ఞానిక పద్ధతులపై వ్యవసాయం అభివృద్ధి పొందిననాడు, తత్ఫలితంగా నిరుద్యోగసమస్య మరీ ఎక్కువవుతుంది. అట్టివారికి ప్రత్యామ్నాయ వృత్తులు కల్పించడం ప్రభుత్వం విధి.

సోషలిస్టు పార్టీవారు ప్రచారం చేస్తున్న "ధాన్యపు బ్యాంకులు" నేడ విచ్చిన్నంగా సాగుతున్న బ్లాక్ మార్కెటునూ, దొంగనిల్వలనూ అరికట్టడంలో సహాయకారి కాగలవు. కొన్ని గ్రామాల సమూహానికి ఒకొక్క "బ్యాంకు" స్థాపిస్తే, ధాన్య సేకరణ విధానం సైతం సుకరమై, యిటు ప్రభుత్వానికీ, అటు కొనుగోలుదారునికీ ఆర్థికంగా సహాయకరం అవుతుంది. ఇటువంటి ఉదాత్తమైన పరివర్తనలన్నీ కేవలం శాసనాలు ప్రచురించడంతో కలుగబోయేవి కావు. బహుళమైన ప్రచారంద్వారా రైతు లోకంలో ఉత్సాహం యినుమడింపచేయగల్గాలి. అందుకు భూస్వామ్యంలో సంస్కరణలు అవసరం.

# హ్యూమనిజం - మార్క్సిజం

ఆవుల గోపాలకృష్ణమూర్తి

హ్యూమనిజానికి మార్క్సిజానికి తేడా యేమిటి అన్న ప్రశ్న పదేపదే అడుగుతున్నారు. అందులో హ్యూమనిస్టు వుద్యమ నాయకుల్లో ఒకరైన యం.యన్.రాయ్ 1920 నుంచి 1927 దాకా మాస్కోలో మంత్రిగా, అధ్యక్షవర్గంలో వుండటం, చైనాకు మాస్కో రాయబారిగా వెళ్ళటం వల్లా - హ్యూమనిజానికి మార్క్సిజానికి తేడా విషయంలో వివరంగా చర్చించుకోవాలి.

మార్క్సు రచనల్లో కమ్యూనిస్టు ప్రణాళిక, పొలిటికల్ యికానమీ, కాపిటల్, జర్మన్ ఐడియాలజీ, గోధా కార్యక్రమం, ఫిలాసఫీ యొక్క దారిద్ర్యం, పారిస్ కమ్యూన్ మొదలైనవి ముఖ్యం. వాటిలోనే ఆయన సిద్ధాంత మంతా యిమిడి వుంది.

మార్క్సు, ఆయన సహాధ్యాయి ఎంజెల్సు కలిసి చాలాభాగం కృషిచేశారు. ఎంజెల్సు వ్రాసిన 'యాంటి - డుహిరింగ్', 'కుటుంబం, ఆస్తి, రాజ్యాంగం' మొదలైన పుస్తకాలూ మార్క్సిజానికి పునాదులే. మార్క్సు, ఎంజెల్సు రాక పూర్వం సోషలిస్టు వుద్యమం చాలావుంది. కాని, మార్క్సు రాకతో దానికి కొంతవిశిష్టత యేర్పడింది. వీరి సోషలిజాన్ని 'సైంటిఫిక్ సోషలిజం' అన్నారు.

మార్క్సు సిద్ధాంతాల్లో ముఖ్యమైనవి-(1) వర్గపోరాటం (2) డైలెక్టిక్సు (3) సోషలిజం. వర్గపోరాటం ద్వారా శ్రామిక నియంతృత్వాన్ని స్థాపించాలి. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను నిర్మించాలి. డైలెక్టికల్ భౌతిక వాదాన్ని ప్రచారంచేసి, మార్గాన్వేషణకు వుపాధుల్ని కల్పించాలి.

మార్క్సు జర్మన్ వేదాంతి హెగెల్ నుండి చాలా గ్రహించాడు; కొన్నిచోట్ల ఆయన భావాల్లో చిక్కుకుపోయి బయటికి రాలేని తనమూ కనబడుతుంది. హెగెల్‌లో వున్న మూడు సూత్రాల్ని మార్క్సు అనుసరించాడు వ్యతిరేకానికి వ్యతిరేకం జరగటం ద్వారా అభివృద్ధి వస్తుందనీ, వ్యతిరేకంగా వున్న శక్తుల ఢీకోలువల్ల పెరుగుదు అబ్బుతుందనీ, సంఖ్యాబలంవల్ల గుణాలో మార్పువస్తుందనీ భావించారు. అంటే- వరిగింజ తీసుకుంటే, దానిని మొలక కట్టితే, మొలక రాగానే గింజ వుడిగిపోతుంది. గింజకు వ్యతిరేకం జరిగింది; మొక్క వచ్చింది. మొక్క పెరిగి, వాడి, యెండి, కొన్ని వందల గింజల్ని యిచ్చి చచ్చిపోతుంది. దీంతో మొదటి వ్యతిరేకానికి వ్యతిరేకం జరిగింది. దాని వల్ల ఒకగింజ కొన్ని వందల గింజలుగా అభివృద్ధి చెందిందని మార్క్సు వాదన. మొక్క గింజలు వేయకముందే చావవచ్చు; గింజ మొక్కలోదగ కుండానే జీర్ణం కావచ్చు. పైగా, యీ పోలిక, వృక్షజాతిలో యెట్లావున్నా, మానవజాతికి అన్వయించదు. పిల్లపుట్టగానే మరణించే తల్లులున్నా, అది స్వభావసిద్ధం కాదు అందువల్ల యీ సూత్రాన్ని మన సంఘ గమనంలో అన్వయించ వీలులేదని హ్యూమనిస్టులు.

ఇక రెండో సూత్రం. వ్యతిరేకంగా వున్న రెండుశక్తుల ఢీకోలువల్ల పెరుగుదు వస్తుందని- అంటే వ్యతిరేకశక్తులు ఢీకొన్నప్పుడు తప్పక అభివృద్ధి వస్తుందని. అందులో ఒకటి మంచి శక్తి అని, రెండవది దుష్టశక్తి అని. తప్పక అభివృద్ధి వస్తుందంటే, విధిగా దుష్టశక్తి పతనం కావాలి. కాని, విప్లవ వ్యతిరేకశక్తుల విజయం మనం సదా చూస్తూనే వున్నాము. ఈసిద్ధాంతం కర్మవాదానికిదగ్గరగా, చారిత్రక నియతివాదంగా వుంది. దీనినుండే విప్లవాలు అనివార్యం అన్న కమ్యూనిస్టు నినాదం వచ్చింది. ఇద్దరు కొట్టుకుంటే బలంగలవాడు గెలుస్తాడు. మంచివాడే గెలవాలని యెక్కడా లేదు. అందువల్ల యీ సూత్రంకూడా సమంజసంకాదని హ్యూమనిస్టులంటాము.

మూడో సూత్రం. సంఖ్యాబలంవల్ల, సంఖ్యం పెరగటంవల్ల గుణంలో మార్పు వస్తుందని. మంచుగడ్డకు వేడి పెంచిన కొద్దీ నీరుగా, ఆవిరిగా మారటం; ఆవిరికి చలిగాలి సోకించిన కొద్దీ నీరుగా, మంచుగా మారటం నిదర్శనగా యిస్తారు. ఒక మనిషి ప్రక్కన లక్షమందిని కూర్చోబెట్టినా, ఒకకడవ నీరున్నచోట ప్రవాహం కట్టించినా గుణంలో మార్పు లేదు. ఈ సూత్రాన్ని మానవ సమాజానికి అన్వయించ వీలులేదు. సమాజంలో వేడి క్రమక్రమంగా పెంచితే విప్లవాలు పుడతై అని కమ్యూనిస్టు భావించొచ్చు: అశాంతి పెంచిన కొద్దీ విప్లవాలు నెగ్గుతాయనీ, దౌష్ట్యం యెక్కువైన కొద్దీ విప్లవాగ్ని ప్రజ్వరిల్లుతుందనీ యీ సూత్రాన్నుంచి భాష్యం చేయవచ్చు. కాని యిది సంబద్ధంకాదని హ్యూమనిస్టు లంటారు.

మార్క్సు సిద్ధాంతంలో పునాదులయిన యీ మూడు సూత్రాలమీదనే వర్గపోరాటవాదం ఆధారపడివుంది. దీనినే మరీ సూత్రీకరిస్తూ, థీసిస్ + యాంటీథీసిస్ = సింథసిస్‌గా చేశాడు. అంటే, జమీందారీ విధానంమీద పెట్టుబడిదారీవిధానం, దీనిమీద శ్రామికపోరాటం నిదర్శనలుగా చూపి, దీనివల్ల అభివృద్ధి కలుగుతుందంటాడు. తప్పనిసరిగా పాతది దెబ్బతిని, కొత్తది గెలుస్తుందని యీ వాదన. ఇక్కడా విప్లవ వ్యతిరేకోద్యమాలు నెగ్గటానికి వీల్లేదు. కాని నెగ్గుతూనే వున్నాయి. కాబట్టి యీ సూత్రం సమంజసంగా తోచదు. ఇట్లా నిర్ణయింపబడి, విధి నిర్ణయంగానో, చరిత్ర నిర్ణయంగానో జరగటం అసంభవం అని హ్యూమనిస్టు లంటారు. మార్క్సు మానవచరిత్రకు కదలికజోస్యం చెప్పాననేది అంగీకార్యం కాదంటారు.

వర్గపోరాటం ద్వారా శ్రామిక నియంతృత్వాన్ని స్థాపించా లంటారు. ఈ నియంతృత్వం సార్వకాలికం కాదు- సంధికాలంలో కొన్నాళ్ళు మాత్రమే వుంటుందనీ, తర్వాత రాజ్యాంగం (స్టేట్) వాడిపోతుందనీ మార్క్సు అంటాడు. దీనిని లెనిన్ "స్టేట్ అండ్ రివల్యూషన్" అనే గ్రంథంలో విపులీకరిస్తూ మార్క్సుకు తీరని అపచారం చేశాడు. ఆ అపచారాన్ని, 1949 లో స్టాలిన్ పరిపూర్తి చేశాడు: రాజ్యాంగం వాడిపోవటం అసంభవ మన్నాడు. స్టేట్ అంటే, మార్క్సు ప్రకారం, దోపిడీ చేసే నిరంకుశ పాలనా యంత్రం అని; పై వర్గ నియంతృత్వపు గుర్తు అని కాని, వారి సిద్ధాంతాల్ని చర్చించుకొన్నా, రష్యాలో అనుభవంవల్ల యీ 30 యేళ్ళనుంచీ చూచినా, రాజ్యాంగం వాడదని తేలింది.

రాజ్యాంగ పరిపాలనా యంత్రం గనక అయితే యేదో రకమైన పాలనా యంత్రం వుండక తప్పదు. ప్రజ కలిసివుండేది సంఘం; సంఘానికి కొన్ని నియమాలు, నీతి, నడవడి, విధులు, హక్కులు తప్పవు. పాలనా యంత్రం వుండక తీరదు. కాని యెటువంటి యంత్రం వుండాలి అన్న విషయం వేరు.

శ్రామిక నియంతృత్వంలో, సంఘం యావత్తు మీద శ్రామికుల నియంతృత్వం, శ్రామికవర్గం మీద కమ్యూనిస్టుపార్టీ నియంతృత్వం, పార్టీ మీద కేంద్ర కార్యవర్గ నియంతృత్వం తప్పనిసరిగా వుంటై. సిద్ధాంతరీత్యా అయినా, ఆచరణరీత్యా అయినా యిదే తేలుతుంది. నియంతృత్వం యేదైనా పనికిరాదని, సంధికాలంలోనైనా పనికిరాదని హ్యూమనిస్టు లంటారు.

(సశేషం)

యువకుడు:-(కోటు దులుపుకుంటూ) ఇటుచూడూ, నీ ఫేస్ పౌడరంతా నా కోటుకి పట్టించావు—

యువతి:-ఫరవాలేదు! డబ్బాలో ఇంకా చాలానే వుంది!

# 'తెలుగు భాష తీసిపోలేదు'

బి. రామారావు

జులై 22 వ తేదీ 'తెలుగు స్వతంత్ర' లో శ్రీ పా. వెం. నరసింహారాజుగారి 'తెరువు తప్పిన తెలుగుభాష' అనే వ్యాసాన్ని చదివిన వెంటనే, నా హృదయం వ్యాకులతతో దానికి జవా బివ్వమని ప్రోద్బలించింది.

శ్రీయుతులు ఆధునిక యుగంలో జరిగే సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరివర్తనల శ్లాఘిస్తూ హిందీ, బెంగాలీ భాషలలో ఆంగ్లసంపర్కంవల్ల క్రొత్తపోకడలతో, నవీనభావాలతో చక్కని నాటకాలు, కథానికలు, గేయాలు వెలువడ్డాయని; మన తెలుగుభాషలో నూతన పరిణామం పాండిత్య పరిపక్వ సాహిత్యపటుత్వాన్ని నూటు పడవేసిందని విచారపడ్డారు.

భాషలో మార్పు అవసరమని, కాని ఆ మార్పు పండితుల ద్వారా రావాలని; యతి, ప్రాస మొదలగు ఛందస్సులు కవిత్వానికి చాలా ముఖ్యమని; ఉత్తమరచనలు ఉత్తమ భాషలోనే రావాలని; అది గ్రాంధికమైనా సరే, గ్రామ్యమైనా సరేనని; కాని వ్యావహారిక భాషలో కావ్యాలు సవ్యంగా ఉండవని తెల్పారు. రెండవది: ఇప్పటి రచనల కథావస్తువు, భావాలు చాలా అధ్వాన్నంగా ఉన్నవని విమర్శించారు.

రాజుగారు ఆవేదనపడ్డట్టు నేను గూడా కొన్ని విషయాలలో తెలుగు భాషను కొందరు కొందరు వ్యక్తులు పాడుచేస్తున్నారని విచారపడుతున్నాను. కాని ఆ కొందరితో, యే కొద్దో బజారు రచనలతో భాష చెడదు. ఆ రచనలు ఆ కాగితంతోనే నాశమౌతా యనడంలో సందేహంలేదు. కొన్ని పత్రికలు డబ్బే ముఖ్యాశయంగా పెట్టుకొని కామోద్రేకం కలిగించే మాటలతో నిండిన రచనలు, కొన్ని రసహీనమైన రచనలు సాగిస్తున్నాయి. దీన్ని అరికట్టడానికి పండితులు, వారి గ్రంథాలు కాదు—భాషాపరిషత్తులు, సంఘాలు—ముఖ్యంగా నవ్య సాహిత్యపరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘం, హైద్రాబాద ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచారంద్వారా ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి, ఇటువంటి రచనలమీద నిషేధం పెట్టించవచ్చు.

ఇక భాషలో మార్పు రావాలి, అది పండితులచేతనే కావాలన్న అంశాన్ని తీసుకుందాం. రాజుగారు మార్పును ఆహ్వానిస్తూ-కావ్యాలు గ్రాంధికమైనా సరే, గ్రామ్యమైనా సరే-కాని వ్యావహారిక భాషలో సవ్యంగా ఉండవని అపోహపడ్డారు. ఆధునిక యుగంలోని అన్ని అభ్యుదయభాషలూ, ప్రత్యేకంగా ఆంగ్లభాషా, హిందీ-బెంగాలీ భాషలూ వ్యావహారిక భాష మీదనే నిర్మితాలు. అన్ని ఆధునికభాషలూ వ్యావహారికభాషావిమానంలోనే అభ్యుదయగగనమండలంలో విహరిస్తున్నవి. యూరపులోని భాషల మార్పు, అభ్యుదయం; టర్కీలో కమాల్ పాషా తెచ్చిన తేజం, భాషలో మార్పు; అమెరికాలో ఆంగ్లానికే క్రొత్త మెరుగులు, అభ్యుదయాలు; రష్యాలో సాంఘిక, ఆర్థిక రాజకీయాల మార్పులు వ్యావహారిక భాషద్వారానే వచ్చాయని యావత్ప్రపంచం ముక్తకంఠంతో చాటుతోంది.

వ్యావహారికభాషలో కావ్యాలు సవ్యంగానే గాక, రమ్యంగా- పండితులకేగాక, పామరులకు గూడా చదువ నింపుగా ఉంటా యనడానికి ఒక్క నిదర్శనం—మన మహాకవి గురజాడ అప్పారావుగారి కావ్యాలు—ప్రత్యేకం కన్యాశుల్కం.

తెలుగు సాహిత్యంలో నూతన పరిణామాలు, వాటి మంచి చెడ్డలు చర్చించే ముందు అసలు పండితులవల్ల మార్పు సాధ్యమా? అన్నది ఆలోచిద్దాం. అరచున్నవంటి కొన్ని నియమాలు సడలించి; యతి, ప్రాస మొదలగు నియమిత ఛందస్సులతో పండితోత్తముల ద్వారానే రావాలంటే-అది రాదు. వచ్చినా మార్పు అనిపించుకోదు. అనిపించుకున్నా- 'పాత సీసాలో క్రొత్త సారాయి' అన్నట్లుండును. యతిప్రాసాభిమాను

శైవ పండితులు, వారి ఆగీవశాస్త్ర భాషాలతో, బూజుపట్టిన సాంఘికాచారాలతో కర్మసిద్ధాంతపు ఆర్థిక అసమానత్వంతో, వ్యక్తిగత రాజకీయాభిలాషతో మార్పేమి తేగలరో రచయిత నిర్ణయానికి వదలుతున్నాను. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ అంతటి పండితోత్తములు తమ ఒక మద్రాసు ఉపన్యాసంలో బోధించినట్లు- 'వేదగ్రంథాలు పాఠ్యగ్రంథాలుగా చేసి, ప్రతి బాలునికి ఆర్య సాంప్రదాయాలు అలవడేట్టు చేయాలి' అంటే, ఆ మార్పుతో వచ్చే లాభనష్టాలు చదువరులే ఆలోచించగలరు.

ఇక మార్పు ఏ విధంగా ఎవరు తేవాలి, ఇంతవరకు వచ్చిన దేమిటి అన్నది ఆలోచిద్దాం.

భాష సముద్రం లాంటిది. సముద్రాన్ని యీదడానికి త్రోవచూపిన వాళ్లే అంతా అనుసరిస్తారు. సముద్రం లేనిదీ మార్గము చూపే వారూ, మార్గమూ లేనట్లు - భాష లేనిదీ వ్యాకరణాది నియమాలన్నీ లేవు. భాష అంటే జనసామాన్యం నిత్య వ్యవహారాలకై వాడే సంజ్ఞలే రానురాను దాల్చిన స్వరూపం. ఆ ప్రజానీకం నుండే తెలివి గలవాడు అందరూ వాడే నియమాలను సృష్టించటమే వ్యాకరణం. ఇప్పు డున్న వ్యాకరణాలు ఒకప్పుడు అందరూ పాటించే వారే. కాని పోనుపోను భాష మారుతుంటుంది. ఇప్పుడు వ్యావహారిక భాషాప్రాముఖ్యం జగమంతా గుర్తించింది. వ్యావహారిక భాషకు మన తెలుగులో వ్యాకరణం ఇంతవరకూ వ్రాయబడలేదు. దాని జననమే దాదాపు ౫౦ సంవత్సరముల క్రిందట జరిగింది. గిడుగు రామమూర్తి పంతులు, గురజాడ అప్పారావు గార్లచే విత్తు నాటబడి; వీరేశలింగం పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం మొదలగు వారిచే పెంచబడి; శ్రీ. శ్రీ, చలం మొదలగు వారిచే రక్షింపబడుతూ యావదాంధ్ర యువక హృదయాల నాకర్షించ గలిగింది వ్యావహారిక భాష. ఈ వ్యావహారికభాష కూడా ఇంకా అభివృద్ధి కావలసి ఉంది. దీనికి కొన్ని నియమాలు, సూత్రాలు చేయవలసిన బాధ్యత యువకుల పైననే ఉంది. ఇంతవరకూ అభివృద్ధి అయిన వ్యావహారికభాష, అభ్యుదయ కవిత్వం కొన్ని నియమాలతోనే నడుస్తున్నాయి. ఆ నియమాలు కూర్చేవాడు కావాలి. మల్లవరపు విశ్వేశ్వరరావు గారన్నట్టు "ప్రతినవకవి వ్రాసే వచన పద్యంలోనూ కొన్నికొన్ని నూతన ఛందో గమనాల యొక్క బీజాలు యిమిడి ఉన్నాయి. ఇందులో ఇంద్రధనుస్సులాగ అనేక రంగులు, అనేక గమనాలు, అనేక అలంకారాలు, అనేక ఆలోచనలు, లోతు, వైశాల్యం, ఉద్రేకం మొదలగు గుణాలన్నీ కనిపిస్తాయి."

తెలుగుభాష అంటేనే కవిత్వభాష. కవిత్వం తెలుగులో అభివృద్ధిఅయినంత ఏ యితర భాషలోనూ కాలేదు. మన పూర్వగ్రంథాలలో నూటికి ౯౦ పద్యకావ్యాలలో, పాటలలో, జోలలలో, భక్తిగేయాలలో; ౧౦ వంతులు వచనకావ్యం- అందులో కొంత కవిత్వం కలిసే ఉంటుంది. ఇటువంటి కవిత్వభాషకు అభ్యుదయత్వం ప్రసాదించింది గురజాడ అప్పారాయకవి. ఈయన "దేశమును ప్రేమించుమన్నా" అనే గేయం అభ్యుదయ కవిత్వానికి నాంది అనవచ్చు. తర్వాత ఎందరో నవ్యకవు లుద్భవించి, ఎన్నో నవ్యమైన పోకడలతో ముందుకు సాగుతున్నారు. వారు పండితుల భావాలను, భాషను ధిక్కరించినా- పండితులు ఆ రసపూరిత, ఉత్తేజకర, హృదయరంజక కవిత్వాన్ని మెచ్చుకోవడమే గాదు, ప్రచారానికై ఉపోద్ఘాతాలు కూడ వ్రాసినట్టు ఎన్నో ఉదాహరణాలున్నవి.



# నివేదించని నిజానిజాలు

## శ్రీ శంకరరావ్ దేవ్ విచారణపై విమర్శ

తెన్నేటి విశ్వనాథం, ఎం. ఎల్. ఏ.

కొందరు మద్రాసు మంత్రులపై చేయబడిన ఆరోపణలమీద శ్రీ శంకరరావ్ దేవ్ నివేదికలోని కొన్నిభాగాలు వార్తాపత్రికలలో ప్రకటింపబడ్డాయి: అవి కేవలం ఆరోపణలను ఖండించినంతవరకే ప్రచురింపబడడంవల్ల, చదివే వారికి యీ సమస్యగురించి కొన్ని అపోహలను కలిగించవచ్చు; అందువల్ల శ్రీ దేవ్ నివేదికలోని కుతర్కాన్నీ, అసంగత అభిప్రాయాలనూ క్లుప్తంగా యిక్కడ విశదీకరింప దల్చుకున్నాను.

మేము చేసిన ఆరోపణలు చాలా అస్పష్టమైనవని ఆయన వాదన. ఆ వాదన సమర్థించడానికి, ఏ ఆరోపణలైతే ఆయన దృష్టిలో అస్పష్టమైనవో, నిరాధారమైనవో, వాటిని ఆయన వరసగా పేర్కొంటే, మాకు సంతోషకరంగా ఉండేది. హైదరాబాదు సమస్యను మంత్రివర్గం సంతృప్తికరంగా ఎదుర్కొనలేదన్న మా ఆరోపణ ఆయన ప్రస్తావించారు. అప్పట్లో జరిగిన దోపిడీలు, హత్యలు, గృహదహనాలు, స్త్రీలకు జరిగిన పరాభవాలు, చంపివేయబడ్డ శిశువులు—యివన్నీ ఆయనకు అస్పష్టమైన విషయాలు. ప్రభుత్వం సకాలంలో చర్య తీసుకోని కారణాన తమ ఆస్తిపాస్తులతో పాటు ప్రాణాలను సైతం కోల్పోయిన వారంతా తమ దురదృష్టంలోని అస్పష్టతకు ప్రభుత్వాన్ని అభినందిస్తారు! ఈ ఆరోపణ 1948 ఏప్రిల్ మాసంలో చేయబడింది: అంచేత అప్పట్లో జరిగిన సంఘటనల దృష్ట్యా అది విచారించబడాలి కాని, పోలీసుచర్య ముగిసి శాంతి ఏర్పడిన అనేక మాసాల తరవాత పరిస్థితి దృష్ట్యా కాదు. ఈ విధంగానే తమిళప్రాంతాలు తప్ప రాష్ట్రంలోని మిగిలిన ప్రాంతాల విషయంలో మంత్రివర్గం చూపిస్తున్న నిర్లక్ష్యభావం కూడా ఆయనకు అస్పష్టమైన ఆరోపణవలెనే గోచరించింది. కాదా మరి! రామపాదసాగర-ప్రాజెక్టు విషయంలో నడచిన తతంగం ఆయనకు అస్పష్టం! సెక్రటేరియట్‌లో, తక్కిన ప్రభుత్వశాఖల్లో, అత్యంత స్వల్పంగా ఉన్న తెలుగువారి సంఖ్య కూడా ఆయనకు అస్పష్టం. మద్రాసు పట్టణంలో పాఠశాలల్లో తెలుగు చదువుకుందికి ఆస్కారం లేకపోవడం సైతం ఆయనకు అస్పష్ట విషయమే!

ఇంకా - మంత్రివర్గంలోని ఆంధ్రమంత్రుల చర్యల ఫలితంగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌లో క్రమశిక్షణ నశించిందన్న ఆరోపణ కూడా అస్పష్టమైనదనే ఆయన తీర్పు! స్థానిక కాంగ్రెస్ సంస్థలతో నిమిత్తం లేకుండానే, మంత్రివర్గం వారు ఆంధ్రలో ఒక లక్షమంది ప్రాథమిక కాంగ్రెస్ సభ్యులను క్రమవిరుద్ధంగా చేర్పించి, ఆ పట్టిక శంకరరావ్ దేవ్‌కు పంపించడం కూడా అస్పష్టమేనా? ఈ విధంగా చేర్పించబడ్డ సభ్యుల చందా మొత్తం 24,083 రూపాయలకు ఆయన పేర పంపబడిన చెక్కు కూడా అస్పష్టమైనదే? అప్పట్లో కాంగ్రెస్ సంస్థలో పదవి ఏదీ లేని గౌరవనీయులైన కళా వెంకటరావు గారు, యీ చెక్కు యిచ్చారు. ఆయనకూ యీ చందాల సేకరణకూ ఏమీ సంబంధం లేదు. ఇది కూడా అస్పష్టమైనదే. అధికార కాంగ్రెస్ పార్టీకి పోటీగా స్థాపించబడిన "ప్రోగ్రెసివ్ పార్టీ" అస్పష్టం; ఆ పార్టీని రద్దు చేస్తూ అనంతరం కాంగ్రెస్ ప్రెసిడెంటు పంపిన తాఖీదు అస్పష్టం; శ్రీశంకరరావ్ దేవ్ సాక్షాత్తూ శ్రీ శంకరుడు: మనకు నిజంగా, స్థూలంగా గోచరించేవన్నీ ఆయనకు మాయగా, మిథ్యగా, గోచరిస్తాయి.

ప్రస్తుత మంత్రివర్గ పరిపాలనక్రింద, రాష్ట్రంలో ఆహారధాన్యాలు పండించే ఎకరాల సంఖ్య క్రమంగా తగ్గిపోవడం కూడా అస్పష్టం; 1946-47 లో వరిపంట క్రింద ఉన్న 109,86,124 ఎకరాలు, 1947-48 లో ఐదులక్షలకిపైగా తగ్గిపోయి 104,34,149 అవడం; 1948-49 వచ్చేసరికి యింకో రెండు లక్షల వరకూ తగ్గి 102,29,000 అవడం—యిదంతా దేవ్ గారి దృష్టిలో మిథ్య. పైగా, ఆయన నిర్వచనం ప్రకారం, మేము కావించిన ఆరోపణలన్నీ, ఏ మంత్రివర్గం పైన నైనా, ఏ ప్రతికూల పక్షమైనా తయారు చెయ్యగలదు!

న్యాయ- కార్యనిర్వాహక శాఖల విభజన గురించి ప్రస్తావిస్తూ, అది ఉన్నత పాలకవర్గ నిర్ణయాలకి చెందిన విధానమనీ, తత్ఫలితంగా ఆ విషయంపై అభిప్రాయ భేదాలు ఉండక తప్పదనీ శ్రీ దేవ్ వాదన. ఆ రెండు శాఖలనూ విభజించాలని రాజ్యాంగ పరిషత్తు చేసిన నిర్ణయం కూడా, బహుశా ఆయన దృష్టిలో చర్చనీయాంశం కాబోలు! మంత్రివర్గంలో ఏ సభ్యులపై యీ ఆరోపణ చెయ్యబడిందో, వారంతా, ఆ విభజన వాంఛించిన రాజకీయ సంస్థకి చెందిన వారు. ప్రకాశం మంత్రివర్గం పాలనలో ఉన్నప్పుడు యీ సమస్య పరిశీలించి ఒక ప్రణాళిక తయారు చెయ్యడానికి కమిటీ ఏర్పాటయింది: అందుకు అప్పట్లో బడ్జెటులో కూడా కొంత మొత్తం కేటాయించబడింది. తరవాత వచ్చిన మంత్రివర్గం యీ విషయం మూలపడేసిందన్నదే ఆరోపణ. అంచేత "అభిప్రాయభేదం ఉండి తీరా"లనడం అసందర్భం. ఆ వాంఛనీయ విధానాన్ని తలక్రిందులు చేయడానికి బుద్ధిపూర్వకంగా చేసిన పని అది. ఇటీవలి శాసనాలలో యించుమించు అన్నిటిలోనూ సివిల్ కోర్టుల "జూరిస్ డిక్షన్" తొలగించడంతో పైది సమన్వయం చేసి ఆలోచిస్తే, అందులోని అంతరార్థం బోధపడుతుంది.

అన్నిటిలోకీ చిత్రమైంది, మంత్రివర్గంలో అన్ని గ్రూపులకూ స్థానం లభించనందువల్ల జనించిన నిరాశ యీ నేరారోపణలకు ఒక బలీయమైన కారణం అని ఆయన అనడం. శ్రీ శంకరరావ్ దేవ్ గారు సైకో-ఎనలిస్టు (మనస్తత్వ శాస్త్రవేత్త) కూడా కాబోలు! కాని, అన్ని గ్రూపులకూ సమన్వయం కుదర్చడం విషయంలో ఢిల్లీలో చర్చలు జరుగుతున్నప్పుడు, 4-4-1949 తారీకున శ్రీ ప్రకాశం కాంగ్రెస్ అధ్యక్షుడికి వ్రాసిన ఉత్తరంలో ఇలా అన్నారు: "ఇప్పట్టున, పాత మంత్రివర్గంలోని సభ్యులపై ఉన్న ఆరోపణలను విస్మరించి తిరిగి వారిని కొత్తనాయకుడు తన మంత్రివర్గంలోకి తీసుకొనడం అభిలషణీయం కాదు." ఇది శ్రీ శంకరరావ్ దేవ్ గమనించారా? ఏది ఏమైనాసరే, అన్ని గ్రూపులకూ స్థానం ఉన్న మంత్రివర్గం స్థాపించబడాలనా దాని అర్థం? అలా జరగనందుకు మేము నిరాశచెందామనా? మొట్టమొదటి నుండి నేటివరకూ, యీ ఆరోపణ లన్నిటిపైనా సమగ్రమైన విచారణ జరగాలన్నదే మా కోరిక.

కులతత్వవాదం విషయంలో శ్రీ దేవ్ యీ విధంగా వ్రాయక తప్పలేదు: "ముఖ్యంగా దక్షిణభారతదేశంలో యీ కులతత్వవాదం రాజకీయాలను, ప్రజాహిత జీవనాన్ని కలుష భూయిష్ఠం చేసిందని ప్రతి కాంగ్రెస్ వాదీ అంగీకరించక తప్పదు. ఈ వాదం దేశంలో పాక్షికత్వం, అసమర్థత, అనైకమత్యం— వీటికి దోహదం కల్పించింది. ఈ కులతత్వం కూకటివేళ్లతో నిర్మూలించే ప్రయత్నం చెయ్యడం ప్రతి కాంగ్రెస్ వాదికీ విధ్యుక్త కర్తవ్యం."

ఈ విధ్యుక్త కర్తవ్యాన్ని అనుసరించే, వృత్తి విద్యాలయాలలో సీట్లు నూటికి $33\frac{1}{3}$ వంతులు ప్రతిభావంతులైన విద్యార్థులకు ప్రకాశం మంత్రివర్గంలో కేటాయించబడి, భోర్ కమిటీ సూచన ఆచరణలో పెట్టబడింది. తర్వాతవచ్చిన మంత్రివర్గం దీన్ని రద్దుచేసింది. ఈ రద్దుచేయడం అనే చర్యను సాంఘిక న్యాయం" అనే మిషక్రింద శ్రీ శంకరరావ్ దేవ్ సమర్థించడానికి పూనుకున్నారు. మానవుడి ప్రాథమికమైన హక్కుల్ని ఊడబీకి- ఆ చర్య "సాంఘిక ధర్మం" అనడం! కులం పేరు చెప్పి, చదువుకి ఆస్కారం లేకుండా చేసి అదే సాంఘికధర్మం అనడం! బుద్ధి వక్రించినప్పుడు అవగాహన సైతం వక్రిస్తుంది: అప్పుడే సాంఘికమైన అన్యాయం న్యాయంగా గోచరిస్తుంది. పైపెచ్చు యివన్నీ సెలవిచ్చిన

తరవాత, ‘ప్రతి’ కాంగ్రెస్‌వాదీ కులతత్వ వాదంపూలంకషంగా నిర్మూలించడానికి తోడ్పడాలని ఆయన హితోపదేశం. సాంఘికంగా వెనుకబడినవారికి సహాయంగా ఎక్కువ ధనం కేటాయించి విద్యాసౌకర్యాలు అధికం చెయ్యడం సాంఘికధర్మం. ప్రభుత్వం దగ్గిర రిజర్వులో ధనం ఉంది. అందులో కొంత భాగాన్ని మెడికల్, ఇంజనీరింగ్ విద్యా సౌకర్యాల్ని ఎక్కువ చెయ్యడానికి ఉపయోగించడం కంటె పవిత్రమైనది ఇంకొకటి ఏమున్నది! అయినా ఆ డబ్బు అలాగే మూలుగుతూ ఉంటుంది. ప్రభుత్వం దాన్ని ముట్టదు. ఈవిధంగా అధిక విద్యా సౌకర్యాలు కల్పించడానికి ప్రాథమికంగా అయే ఖర్చు యిరవై ముప్ఫై లక్షల రూపాయిలకు మించదు. అయినా సరే, చోటు లేదనే మిషమీద ప్రతిభావంతులైన అనేక మంది యువకులకు ప్రవేశం దొరకలేదు. జాతి యావత్తుకూ అపకారం చేసి అది సాంఘికధర్మం అని ప్రచారం చేస్తే. తత్ఫలితంగా బాధపడిన వారి మూలుగులను “గోల” క్రింద జమకట్టడానికి శ్రీ శంకరరావ్ దేవ్ సిద్ధంగా ఉన్నారు.

ఇదివరకటి ప్రధాన న్యాయమూర్తి రాజీనామాకు కారణం మంత్రివర్గం ఆయనపట్ల ప్రదర్శించిన వైఖరి అని మేము పేర్కొంటే, ఆ పేర్కొనడాన్ని ప్రతీకార వాంఛక్రింద శ్రీ శంకర్‌రావ్ జమకట్టారు. అనేక రకాల కారణాలవల్ల రాజీనామా యివ్వడం సాధారణంగా జరుగుతుంది, నిజమే. కాని, తాను రాజీనామా యిచ్చేముందు, మంత్రివర్గంతో తనకు గల అధికార సంబంధం గురించి కొన్ని ఆక్షేపణలు ఆయన వెలిబుచ్చారా, లేదా? ఆయన ఉపన్యాసాలు శంకరరావ్‌కి అందచెయ్యబడ్డాయా? మమ్మల్ని అడిగివుంటే, మేము సంతోషంగా యిచ్చి ఉందుము.

మహాత్మాగాంధీ, శ్రీ కుమారప్ప, వీరిని-ప్రస్తావించినమీదట వారిచ్చిన సలహాలను పురస్కరించుకుని ప్రారంభింపబడ్డ ప్రణాళికలు (యీ విషయం ఆఫీసు రికార్డులే రుజువు చేస్తాయి) శ్రీ శంకరరావ్ తీర్పు ప్రకారం, విజయవంతం కాగలవనే హామీలేనివి: కాబట్టి వాటిని ఉదహరించడంలో మాచర్య 'సరియైనది కాదు — అదీ ఆయన వరస.

తరవాత ఆయన పేర్కొన్న విషయం ఉత్పత్తి కొనుగోలుదార్ల సహకార సంఘాలు ఎత్తివేశారనే మా ఆరోపణ. ఆహార ధాన్యాలు, యింకా తదితరములైన కంట్రోలు దినుసులు-వీటి సేకరణ, సరఫరా సహకార సంఘాలు జరిపించడం ఆ సంఘాల స్థాపనలోని ఆశయం. ఆ సంఘాలలో యించుమించు ప్రతి ఉత్పత్తి దారుడూ, తరువాత ప్రతి కొనుగోలు దారుడూ సభ్యులుగా ఉంటారు. అందువల్ల వస్తువులు దాచివేసి చీకటి బజారులో అమ్మడానికి గాని, యింకే విధమయిన అవినీతి వ్యాపార విధానలకి గాని అవకాశాలు క్రమంగా తగ్గిపోతాయి. ఈ సంఘాలు మొదట్లో మలబార్‌లోనూ, తరువాత తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలు, కృష్ణా గుంటూరు జిల్లాలలోనూ నెలకొల్ప బడ్డాయి. యుద్ధకాలంలో లక్షలకొద్దీ ఆర్జించుకున్న దళారీ వ్యాపారస్థులంతా తొలగింప బడ్డారు. ఈ సమస్య పైననే ప్రకాశం మంత్రివర్గాన్ని ప్రతిఘటించి కొందరు సభ్యులు తరవాత మంత్రులయారు. శ్రీ ప్రకాశానికి వ్యతిరేకంగా సాగిన యీ పోరాటంలో, అనేకులు దళారీ వ్యాపారులూ, మిల్లర్లూ ఆయనను ప్రతిఘటించిన వారికి మద్దతుగా నిల్చారు. ప్రకాశం మంత్రివర్గం పడిపోయిన తరువాత యిరవై రోజులైనా గడవక ముందే, ఆహారధాన్యాల సేకరణ, సరఫరా పై సంఘాల చేతులనుండి తీసివేసి, యీ ఏజెంట్లూ, మిల్లర్లూ- వీళ్ళ చేతుల్లో ఉంచబడ్డాయి. విషయపరిజ్ఞానం ఉండి, నిష్పాక్షికమైన దృష్టి కలవారి కెవ్వరికైనా, యీ తతంగంలోని అంతరార్థం అవలీలగా బోధపడుతుంది.

ఆయన వాదన సమర్థించుకొనడానికి ఉదాహరణగా శ్రీ శంకరరావ్ దేవ్, ప్రకాశం హయాంలో ఆహారధాన్య సేకరణకు అయిన ఖర్చు 8 కోట్ల రూపాయలనీ, అంతకుపూర్వం ఎడ్వైజర్ల పరిపాలనలో 2 కోట్ల రూపాయిలే అందుకు సాలీనా ఖర్చనీ, ప్రకాశం తర్వాత ఆ ఖర్చు అంతకంటె తగ్గిందనీ అన్నారు. ఎవరో అశ్రద్ధగా, అజ్ఞానంతో తయారు చేసిన యీ లెక్కలన్నీ శ్రీ శంకరరావ్ దేవ్ కళ్లు మూసుకు

నమ్మేవారు. ఎడ్వైజర్ల పరిపాలన కాలంలో, ప్రొక్యూరుమెంటు అప్పుడే ప్రారంభం అయింది. ఏజంట్లు తమ స్వంతఖర్చుతో సేకరణ చేసేవారు. అప్పట్లో అది రాష్ట్రంలో అన్ని ప్రాంతాల్లోనూ అమల్లో లేదు; అన్ని రకాల ఆహార ధాన్యాలూ సేకరించబడలేదు. ఈ విధానం తొలిసారిగా రాష్ట్రం అంతటా ప్రకాశం హయాంలోనే ప్రారంభించ బడింది. తరవాత సంవత్సరాలలో ప్రొక్యూరుమెంటుకి అంత ఖర్చు అవలేదంటే, అందుకు కారణం నేను చెప్పనక్కర లేదు. తరవాత బడ్జెట్ మెమొరాండంలో యిలా ఉంది: "1947-48 సంవత్సరానికి ఆహారధాన్యాలసేకరణకు రివైజు చేసి వేయబడిన ఎస్టిమేటు ప్రకారం 452 లక్షల రూపాయలు. ఈ ఎస్టిమేటు తగ్గిపోవడానికి కారణాలు: గోధుములు, గోధుమదినుసులు- వీటి సేకరణ విక్రయాలలో క్రిందటి సంవత్సరం ఖర్చుపెట్టబడిన ధనంలో కొంత తిరిగి జమ కట్టుకోవడం, ప్రభుత్వపు డిపోలనుండి బియ్యం అమ్మించడం, గోధుమ విక్రయానికి ప్రభుత్వం యిస్తున్న సబ్సిడీ ఆపుచేయడం, ప్రభుత్వపు డిపోల నుండి సరఫరా చేయబడిన ధాన్యానికి ఎక్కువ ధరలు అమ్మకంలో రావడం." నిజానికి 1946-47 లో బియ్యం కొనడానికి ప్రభుత్వానికి అయిన ఖర్చు 5,90,00,000 రూపాయలు. ప్రకాశం మంత్రివర్గం తరువాతి సంవత్సరంలో అందు కయిన ఖర్చు రూ 6,46,00,000 లు. ఏ సాకు దొరికినా వినియోగించుకుందుకు చూస్తున్నది మేము కాదు; తనని, తన్ను సమర్థిస్తున్న మంత్రివర్గాన్ని ఎదుర్కొన్న గురుతరమైన సమస్యను కొంచెం చేసి చూపడానికి ఏ సాకు దొరికినా ఉపయోగించేందుకు ఆయన ప్రయత్నిస్తున్నారు.

ఆయన నివేదికలోని అన్నిటికన్నా అత్యద్భుతమైనది - పెర్మిట్లూ, లైసెన్సులూ మొదలైనవి మంత్రివర్గంవారి ఆశ్రితులకూ, బంధువులకూ పంచిపెట్టే ప్రవర్తనను సమర్థించిన ఘట్టం. ఆ సమర్థనకి ఆయన చెప్పిన కారణం, యీ పద్ధతి ప్రతి రాష్ట్రంలోనూ అమల్లో ఉంది కాబట్టి తప్పులేదని!

కేవలం రాష్ట్రంలో ఉన్న తమ స్నేహితులను దాచిపుచ్చడానికి, ఉన్నతస్థానంలో ఉన్నవారు యిటువంటి ప్రమాదకరమైన మనస్తత్వం ప్రదర్శిస్తే, పరిపాలనాశాఖల్లో ఋజువర్తనకు ఏమాత్రమూ ఆస్కారం లేకండా పోతుంది. గడచిన ముప్ఫై సంవత్సరాలు మనం స్వేచ్ఛను కోల్పోయి జైళ్లలో మగ్గి, జీవితాలు కష్టభరితం చేసుకుని, సర్వస్వమూ కోల్పోయి ఎదిర్చి నిలిచింది. చివరికి యీ విధంగా అధికార పదవి వల్ల జనించిన పాక్షికత్వాలకూ, వ్యక్తిగత లాభాలకూ, ప్రలోభాలకూ లొంగిపోయి, స్వీయ ప్రతిష్ఠనూ, కాంగ్రెస్ ప్రతిష్ఠనూ భగ్నంచేసేందుకేనా? ఇందుకేనా శ్రీశంకరరావ్ దేవ్ మద్రాసు పట్టణంమీదికి వచ్చి వ్రాలారు?

ఇద్దరు మేధావంతులు-ఒకరు అమెరికాలోనూ, ఒకరు ఇంగ్లండులోని నాటింగ్‌హామ్ పట్నంలోనూ వుంటూ-ఒకరితో ఒకరు 4 సంవత్సరాలనుంచి పోస్టుద్వారా చదరంగంఆడుతున్నారనీ,ఇప్పటికింకా ఒక్క ఆటకూడా ముగియలేదనీ ఒక అమెరికన్ పత్రిక ప్రకటించింది. ఓస్సి, ఇంతేనా! గౌతమీతీరాన్ని వుండే కవిగారొకరు పదిసంవత్సరాలనుంచి పోస్టుద్వారా సాగిస్తున్న ప్రణయంలో ఒక్క ఆటకూడా ఇంకా ప్రారంభించనేలేదు!

# "కించిత్తు నల్లికుట్టిన మంచమునకు బెట్టు"

జోశ్యుల సూర్యనారాయణమూర్తి

"కించిత్తు నల్లికుట్టిన మంచమునకు బెట్టు వచ్చు మహిలో సుమతీ!" అన్నది మన సూక్తి. సంస్థల ఉద్దేశాలు సాధ్యమైనంతవరకు మంచివిగానే ఉంటాయి. కాని ఆ సంస్థ కొందరు వ్యక్తులమీద ఆధారపడి ఉండకతప్పదు. ఆ ఖరికి అది ఏసంస్థ ఐనా కాని. వ్యక్తుల ఉద్దేశాలు భిన్నభిన్న మార్గాలలో ఉండటం సహజం. ఈ వ్యక్తిగత దోషాలు సంఘాలకి తగులుతాయి. దీనిద్వారా జాతి కలుషిత మౌతుంది. కలుషిత జాతిని నిష్కళంక పరిస్థితులలో పెట్టటానికి తిప్పలుపడేవాళ్లు పడుతూ ఉంటారు. అల్లాటి సమయాల్లో సంభవించే పరిస్థితులే విషమాలు క్లిష్టాలు అవుతున్నాయి. లోకంలో అరాజక పరిస్థితులు ఏర్పడుతున్నాయి. కారణాలు అందరికీ తెలిసినవే. నివారణోపాయాలు అనేకరకాలై అవీ అందరికీ తెలియనివి కావు. తప్పించుకొని వెక్కిరిద్దామనే పద్ధతి ఆధునిక లోకానికి చేతనైనంతగా సహకారం చేద్దామనే బుద్ధి అలవడలేదు. సహకారం సహకారం అని అరవటం చేతనైనంతగా విచక్షణపూర్వక సానుభూతి సహకారాలు ఆచరింపబడలేదు. దుష్టసహకారాలకు తావు సర్వత్రా ఉంది. మన జాతి ప్రపంచకానికి ఒకప్పుడు గుణపాఠం చెప్పిందని చెప్పుకోటానికి పనికివచ్చేదిగా కొంతకాలం చలామణీ ఐంది. అంటే మా తాతయ్య చాలా గొప్పవాడట అని, అర్థాత్తూ మనం పండిత పుత్రులం (పరమశుంఠః), అగస్త్య భ్రాతలంగా చాలా రోజులనుంచి వ్యవహరిస్తున్నాం. కాని దానికీ హద్దు ఉంటుందిగా. మనపూర్వు లెంత గొప్పవాళ్ళయితేనేం, అల్లాటి జాతిలో ఇంత నికృష్టసంతతి తయారైనందుకు సిగ్గుపడక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి ఈనాటికి. మన పై తరంవారు మనకి ఒక సంగతి నేర్పారు. అది "సహాయ నిరాకరణం". దానికి ప్రబలకారణాలు ఈనాటికీ సుస్పష్టమైనవే. దీని పరిణామం చిత్రంగా తయారైంది. చిన్నపిల్లవానిచేత చిన్నప్పుడు మనకు శత్రువైనవాణ్ణి తిట్టిస్తే క్రమక్రమంగా ఆ తిట్లు అలవడి వాడు మననీ తిట్టటం సంభవిస్తుంది. అది మన కనుభవ దూరం కాదు. ఎందుచేతనంటే వాణ్ణి ఎందుకు తిట్టాలో తెలియకుండానే మనం నేర్పితే తిట్టాడు. ఆ అభ్యాసం వాడికి ఒక ధైర్యం చేకూర్చింది. అదే మనని అకారణంగా తిట్టినా ఫరవాలేదనే బుద్ధికి కారణం. చివరకి మనం చేసిన దాని ఫలితం మనమే అనుభవించవలసి వస్తూంది. ఈ మాదిరిగానే మన సహాయనిరాకరణోద్యమంలో మనవారందరూ సంపూర్ణంగా అర్థంచేసుకోకుండానే (చేసికొన్నవారు సరే) ప్రవేశించారు. ఫలించింది కూడా. కాని అజ్ఞసంఘం మాత్రం అజ్ఞత్వం విడవలేక ఇంకా సహాయనిరాకరణోద్యమం సాగిస్తూనే ఉంది. అది మనకి ముప్పు. అది మన తప్పే. ఇంకా గొప్ప తప్పేమిటంటే సహాయం చెయ్యాలి అనే అభ్యర్థనకు ఫలితం సహాయనిరాకర్తలకు సహకరించడం రూపంలో ప్రత్యక్షమవుతోంది. ఈ కారణాలవల్లనే జాతి కలుషితం కావలసి వస్తూంది. ఈ మాదిరిగా ప్రజాసామాన్యం నిత్య పరిణామాలలో పడి దారితెలియక బాధ పడుతోంది—

మొత్తంమీద దోషపరిశోధన చెయ్యబోయే సరికి దోషాలేమిటో వ్యక్తం కాకపోవటం సరి కదా, పరిశోధనలలో దోషాలు ఏర్పడి లోకకంటకం అవుతున్నాయి. ప్రభుత్వ పరిశోధక శాఖ గాని, పోలీసుశాఖ గాని యీకశ్మలంలో(?) యాథార్థ్యాన్ని తెలుసుకోలేక ప్రజాసామాన్యాన్ని పీడిస్తున్నాయి. అందులోని సంఘటనలు ఈమధ్య కళ్లారా చూస్తున్నాం, పత్రికలలో చదువుతున్నాం. మహానాయకులను కూడా కదుపుతున్నాయి. కాని ప్రయోజనం ఏమైనా, సంఘంలో ఒకడు చెడ్డచేస్తే ఆసంఘమే

ఆ ఫలితాన్ని అనుభవించక తప్పదు. ఆ అవయవం ఆ సంఘశరీరానిదే కనక, దానిని బట్టి సంఘంలో అవయవాలు పాడయితే బాగుచేసుకోవలసిన బాధ్యత సంఘీయులదే. లేకపోతే సంఘం పాడవుతుంది కనక—

ఆ పురస్కృత్తు సంఘం స్వయంగా చేసుకోకపోయినప్పుడు ప్రభుత్వం చేయవలసి వస్తుంది. ఆ ప్రభుత్వానికి సహకరించకుండా ఉన్న సమయంలోనే మంచానికి నల్లిమూలంగా కలిగిన ప్రమాదం లాంటిది తప్పదు.

నిజానికి ప్రభుత్వం అక్రమంగా ఈ విషయాలలో సంచరించినా సమయానికి అది తన తప్పు ఒప్పుకోదు - కారణం అప్రతిష్ఠ కలుగుతుందనే కాకుండా, ఇతరనష్టాలు కూడా ఉండటం. ఇంతకీ "ఐకమత్యమే మహాబలం", 'సంతోషం సగం బలం" వంటి నీతులెన్నో చిన్నప్పటినుండీ మనకి పట్టుబడక పోవటమేమిటో అర్థం కావటంలేదు. సరికదా, లోకంలో తల్లికీ పిల్లకీ సంబంధం లేనంత భిన్నత్వం ఏర్పడుతోంది. ఈ భిన్నత్వం వల్ల కూరిమి విరసమవుతోంది. దానితో నేరాలే తోస్తున్నాయి. ప్రతివాడూ స్వతంత్రుడే కనక స్వతంత్రంగా ఆలోచించడం ఆచరించడం జారీ అవుతోంది. అది ప్రమాదం. అదేమంటే వాక్స్వాతంత్ర్యానికీ వ్యవహార స్వాతంత్ర్యానికీ అడ్డుకగులుతున్నట్టు భావించటం కంటె యుక్తాయుక్త విచక్షణకి దారితీయటం, విజ్ఞానం పెంపొందించుకొని ప్రవర్తించటం ఉంటే చాలా బాగుండేది.

ఓటుకి ఎంత హక్కుందో మన ముపన్యసించటానికి మాత్రం తెలుసుకుంటాము గాని ఇప్పటికి ఆ ఉపన్యసించేది గ్రహించి ఆచరణలో పెట్టబోతే అది అలా సాగనియ్యం కదా! అంటే ధర్మోపదేశకుడైనవాడే ధర్మాచరణకి నిరోధకుడౌతున్నాడన్న మాట. దేశం విద్యావంతం కావాలనుకోవటమే గాని సామాన్యజనానికి ఉచితంగా సామాన్య విద్య గరపిన సంస్థలు కనిపించవు. ఒకవేళ కొద్దో గొప్పో ఉన్నాయో వాటిల్లో కావలసినన్ని రాజకీయాలు. వయోవంతులకు ప్రతి పల్లెటూరులోనూ రాత్రి సమావేశాలు కల్పించి చక్కటి విజ్ఞాన విషయాలు బోధించవచ్చునే- అట్లాంటివి కర్మం జాలక ఈ రోజులలో ఏర్పడితే వ్యర్థంగా తగవులూ, గ్రామ రాజకీయాలలో దుష్పరిణామాలూ పెరుగుతున్నాయి. ఒకళ్ళని ఒకళ్ళు నమ్మక, ఒకళ్ళకొకళ్ళు సహాయపడక యూనిటీ లేకపోతే యింక నిష్కృతి ఏమిటి? ఒకడొక మంచి చేస్తూ ఉన్నప్పుడు కనివల్ల కొందరు దుర్మార్గులకు నష్టం ఏర్పడినా, ఆ దుర్మార్గుల సన్నిహితులైన సజ్జనులు వారి నిమిత్తం సత్కృతికి భంగం కల్పించేలాగ సంచరిస్తే, దానివల్ల పార్టీలు ఏర్పడితే, తద్వారా గ్రామాలకే ప్రభుత్వాలవల్లనైతేం, అంతరంగికంగానైతేనేం చాలా హాని కలగటం సహజం. భిన్నభిన్న ప్రకృతులు పెరిగిపోవటంవల్ల దోషం కనిపిస్తే యథార్థంగా విమర్శించి పరిశీలిద్దామనే బుద్ధికన్న పందు దొరికింది కనక ఎదుటివానిని దెబ్బకొడదామని కాచుకొని వేటాడటమే ఏర్పడుతోంది. ఇది చాలా ప్రమాదకరమై క్రమంగా నాయకులమీద కూడా విశ్వాసం లేకపోతూంది ప్రజాసామాన్యానికి- అది వారి తప్పుకూడా నన్నది నిజమే.

"రాజానశ్చార చక్షుషః" అనే నీతి ఈనాటిది కాదని గ్రహించి ఈ తరుణంలోనే మన గ్రామాలలో పెద్దలు సహకారభావంతో ప్రభుత్వం బలపడేటట్టు చూడాలి. లేకపోతే ఎవళ్ల ఓట్లకోసం, ఎవళ్ల పలుకుబడికోసం వాళ్లు తిప్పలుపడి కేసులు పెట్టుకొని "త్వం శుంఠః త్వం శుంఠః" అనుకొనే ఈ రోజుల్లో (వి) నాయకులు మనకేదో ఒరగదోస్తారనుకోటం తెలివితక్కువ. గ్రామీణ విద్యావంతులే గ్రామసంస్కరణ, ప్రజాసంరక్షణ కలిగించాలి. ఇతరులవల్ల కాదు. లేకపోతే జాతి పతనమైపోతోంది. విదేశస్థులు వెక్కిరిస్తున్నారు. జాతికి సిగ్గుచేటు మాత్రమే కాకుండా మధ్య తరగతి అమాయక ప్రజల గతి నల్లుల మంచంలాగే దెబ్బలు తినవలసి వస్తూ ఉంది. నాయకులు కల్లోలప్రపంచంలో స్వార్థసంపాదనపరులై దేశాన్ని నవ్వులపాలు చేస్తే అల్లరి పడటం తప్పదు. వేరువేరు కాంగ్రెసు సంస్థలన్నీ పేరుకి మాత్రమే ఉండకూడదు. పరిస్థితులు ప్రజాసామాన్యానికి సులభంగా అవగతం చెయ్యాలి. లేకపోతే ప్రజలకు దూరమైపోతాయి.

స్కెచ్

# రైల్లో ఇంద్రజాలం

'జయంతి'

"సిగరెట్టొకటి ఇప్పిస్తారా, సేటుగారూ!"

"నేను కాల్చనండీ"

"పాసీ పాన్ ఒకటి"

"సరే ఇదిగో"

సేట్ రామానందం మనుష్యుల్ని పరీక్ష చెయ్యడంలో ఆరితేరిన చెయ్యి. ఏ మనస్తత్వమైనా, ఘటికలో పసికట్టేస్తాడు. ఇందాకా ఢిల్లీ స్టేషన్‌లో తన చేతిలోని నోట్లకేసి పరకాయించిన వ్యక్తే తనతో ఫస్టుక్లాసులో ప్రయాణం చేస్తున్నాడు. మూడోవాళ్లెవరూ లేరా పెట్టెలో. ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా జేబు ఖాళీ అయి వూరుకుంటుంది. అయితేనేం, తన కల్లాంటి భయాలుంటేనా!

'కొంచెం సుపారీ పెడతారా"

"ఇదిగో తీసుకోండి - మీ రెంతవరకూ పోతూన్నారు?'

"బెజవాడ"

"తమ నామధేయం"

"సహస్రబుద్ధి"

సేటుకూడా వెళ్లేది బెజవాడే. రెండు రాత్రులు కాచుకోవాలి. రైలు శరవేగంతో పోతూంది. సహస్రబుద్ధి 'బయటకు చూస్తున్నాడు. నీరెండలు ప్రకృతిమీద వింతగా మెరుస్తున్నాయి. తన కళ్ళముందే సేటు వెయ్యి వరకూ నోట్లుమడిచి జేబులో పెట్టుకున్నాడు. చీకటి పడడమే తడవు తన జేబు నిండుతుంది. దారిలోనే దిగిపోవచ్చు. తనకున్న అప్పులన్నీ తీర్చుకుని ఈ పాడువ్యాపారానికి స్వస్తి చెప్ప వచ్చు. ఈ భావతరంగాలలో ఉన్మత్తుడై మెల్లగా పాటలు మొదలుపెట్టేడు.

రైలు మధుర సమీపించింది. "యమునా మాయీకీ జై" అంటూ సన్యాసులు బయట గోల చేస్తున్నారు. స్టేషన్‌లో ఆగడమే తడవు సహస్రబుద్ధి "బాబూ నా సామాను కొంచెం చూస్తూండండి" అని ప్లాట్‌ఫారం మీదకు దిగి వెళ్లేడు. సేటు రెండో పక్క వున్న అతని పరుపు మీద కూర్చుని బయటకు తొంగి చూస్తున్నాడు. జనసమ్మర్దం ఎక్కువగా వుంది. యాత్రకై వచ్చిన వారు తిరుగుముఖం పెట్టినా రైల్లో దూరడానికి తలక్రిందులు పడుతున్నారు. గార్డు ఈలవేశాడు. సహస్రబుద్ధి లోపలికొచ్చి 'ఇదిగో, మీకు బిస్కట్లు' అన్నాడు.

'ఎందుకండీ, ఇవన్నీ' అంటూ సేటు తన పక్క మీదికి జరిగేడు. సహస్రబుద్ధి పుస్తకం చదువుతూ పడుకున్నాడు. సేటు కూడా మేను వాల్చాడు. కోటు హేంగరుకు తగిలించి వుంది. సహస్రబుద్ధి దృష్టి పుస్తకం మీద వున్నా ధ్యానం ఆ కోటుమీదే వుంది. అలాగే నిమిషాలు, గంటలు గడచిపోతున్నాయి. రైలు ఆగ్రా, గ్వాలియరు దాటింది. సేటు గుర్రుపెడుతున్నాడు. సహస్రబుద్ధి లేచాడు. ఆ కోటు తీసి బాత్‌రూమ్‌లోకి దుమికేడు. సేట్ లేచి, చుట్టూ చూసుకుని పడుకున్నాడు. పదినిమిషాల తర్వాత సహస్రబుద్ధి ఇవతలికి వచ్చి, కోటు తగిలించి, పడుకున్నాడు. అతని మనస్సు విప్పారినట్లు కనిపించదు. అతని నుదుటిమడతలమీద విషాదచ్ఛాయలు ప్రస్ఫుటమవుతున్నాయి. తీరని త్రాస అతన్ని వేధిస్తోంది. నోట్లు దొరకలేదు కాబోలు!

"తప్పకుండా మొలలో దాచుకుని వుంటాడు లేదా పరుపులో పెట్టుకోవాలి. ఎలాగైనా సరే అవి నా చేత పడితీరాలి!"

ఝాన్సీస్టేషను. రామానందం లేచి, పంచ సర్దుకొని "ఇప్పుడే వస్తాను. కొంచెం చూస్తూండండి" అంటూ దిగేడు.

సహస్రబుద్ధికి అదృష్టం పండినట్లయింది. వెంటనే లేచి పరుపుగలేబులు, హోల్డాల్ అంతా పరిశోధన సాగించేడు. కాని అతని ఆశ నిరాశ అయింది.

సేటు లోపలికొచ్చాడు. సహస్రబుద్ధి ఆలోచిస్తున్నాడు. "పంచ సర్దుకోడం తాను చూశాడు. ఏమీ కనపడలేదు. సేటు మంత్రవేత్త కాదు కదా!" రైలు కదిలింది. సేటు సుఖంగా నిద్రపోతున్నాడు. సహస్రబుద్ధికి నిద్ర రావడంలేదు. చేతబడ్డ పెన్నిధి మాయమయినట్లు, చేతి కందిన పండు ఎవరో ఎత్తుకుపోయినట్లు బాధపడుతున్నాడు. మార్గాంతరాలు ఆలోచిస్తున్నాడు అన్వేషణకి. రాత్రి నిద్ర చెడిన తర్వాత అతనికి తోచింది-సూట్ కేసులో పెట్టివుంటాడని. ఇంతలో భోపాల్ వచ్చింది. యథాప్రకారం సహస్రబుద్ధి ప్లాట్ ఫారం మీద పచార్లు చేస్తున్నాడు. సేటు బయటకు తొంగిచూస్తున్నాడు.

సహస్రబుద్ధి లోపలికి,రావడమే తడవు తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. సేటు మళ్లీ నోట్లు లెక్క పెట్టుకుంటున్నాడు.

"ఈరాత్రి సర్వం గాలిస్తాను. ఇంక తప్పించుకోలేడు" అంటూ దినమంతా ఆనందంగా గడిపాడు. ఎప్పుడు రాత్రి వస్తుందా అని ఆత్రుత. ఒకే ఆత్రుత.

సాయంత్ర మయింది. రైలు వార్ధా దాటింది. ఇద్దరూ భోజనం చేసి పడుకున్నారు. సేటు మొలలోని తాళంచెవులు కింద పడివున్నాయి. సహస్రబుద్ధి కళ్లు వాటిమీదే వున్నాయి. సేటు నిద్రపోవడంలేదు. వేదాంతపు పాటలేవో పాడుకుంటున్నాడు. రైలు బాలార్షా దాటింది. సేటు బాత్ రూమ్ లోపలి కెళ్ళాడు. వెంటనే లేచి సహస్రబుద్ధి పెట్టె తెరచాడు. అరగంట దాకా సేటు వెలుపలికి రాకపోవడంవల్ల సహస్రబుద్ధి అన్నిబట్టలూ దులిపి దులిపి చూశాడు. మళ్లీ పరుపు గాలించాడు. కోటుజేబులో వెదికాడు. ఏమీ దొరక్క హతాశుడైపోయాడు. సేటు వచ్చాడు. ఎప్పటిలాగ నిశ్చింతగా పడుకున్నాడు. కాజీపేట దాటింది.

సహస్రబుద్ధికి మతి చెడింది. 'సేటు నిజంగా మంత్రగాడే!' ఏమీతోచక వెర్రిగా బయటకు చూస్తున్నాడు. తనమీద తనకే జాలి వేస్తూంది. వేగుచుక్క వెలవెలబారుతోంది. చీకట్లు క్రమంగా మాయ మవుతున్నాయి ప్రకృతితో పాటు అతని హృదయానికి పరివర్తన కలుగుతూన్నట్లయింది. కాకులు అరుస్తూ ఎగురుతున్నాయి అతని మనస్సులాగే. రైలు తన దారిని తాను పోతూంది వెనకచూపు లేకుండా. తెల్లవారింది. స్త్రీలు పక్కనున్న రోడ్డుమీద పాలముంతలు మోసుకుపోతున్నారు. పైమీద బట్టలేనా లేకుండా కూలీలు పనిలోకి వెళ్తున్నారు. జొన్నచేలలో ఎడ్లు తమ స్వాముల భూములు దున్నిపెడుతున్నాయి. పక్కనున్న కాఫీహోటల్లో జనం మూగుతున్నారు. ఒక సాతాని పాడుకుంటూ పదిమందికి వినోదం కల్పిస్తున్నాడు. సహస్రబుద్ధి ఆలోచిస్తున్నాడు. ఇవన్నీ భుక్తికి మార్గాలు. భారమైపోతూన్న బ్రతుకులో వాళ్లు సహనశక్తి అలవరచుకున్నారు. కష్టపడకుండా ధనం రావాలని వాళ్లెవరూ ఆశించరు. తానూ వాళ్ళలాగ ఎందుకు పాటుపడకూడదు? ఈ సూర్యోదయంతో పాటు తనకు జ్ఞానోదయ మయిందా?

బెజవాడ మైలు దూరంలో వుంది. సేటు పరుపుచుట్టి నోట్లు లెక్క పెట్టుకుంటున్నాడు. సహస్రబుద్ధికి సందేహనివారణ అయింది. సేటు తప్పక మంత్రగాడే! కురిసి వెలిసిన వానలాగ ప్రయాణం పూర్తి అయింది. ఇద్దరూ దిగి ఎవరి దారి వారు పట్టేరు. స్టేషన్ బయట సేటు తనకారులో ఎక్కుతూంటె సహస్రబుద్ధి పరుగెత్తుకు వచ్చేడు.

"సేటుగారూ! ఒక్కమాట అడుగుతాను. ఏమీ అనుకోకుండా సమాధానం చెబుతారా?"

"దానికేం బాబూ, అడుగు. నాకు తెలుసులే నువ్వేం అడుగుతావో- ఆనోట్ల సంగతి..."

"చిత్తం"

సేటు మెల్లిగా నవ్వాడు. అది భావశూన్యమైన వెకిలినవ్వు కాదు. అర్థసహితమైన చిరునవ్వు.

"ఆ నోట్లు సాయంత్రం నీ హోల్డాల్ మడతలో దాచి ఉదయం నువ్వు బాత్ రూముకు వెళ్ళినప్పుడు తీసికొనేవాడిని. నాకు తెలుసు, నీ హోల్డాల్ లో నువ్వెలాగా చూడవని." సహస్రబుద్ధికి మీద పిడుగు పడినట్లయింది.



'అన్నయ్యా, పాడమంటావా?'

జవాబు చెప్పలేదు. కిటికీలో కూర్చుని బయట ప్రకృతిని చూస్తున్నాడు. సుందరమయిన సాయంత్రం. ప్రొద్దు వాలింది. ఆకాశంలో అక్కడక్కడ అప్పుడే ఒకటి రెండు నక్షత్రాలు కనబడుతున్నాయి. క్రింద తోటమాలి యింకా పని చేస్తున్నాడు. బయట రోడ్డు మీద కార్లు వెడుతున్నాయి.

ఆకాశం ఎక్కడో దూరంగా భూమిని కలుసుకున్నది. అటు కేసి చూస్తున్నాడు అన్నయ్య. మాలతీలత వాడిశరీరాన్ని తాకుతున్నది.

'అన్నయ్యా, ఈ పాట ఎవరు వ్రాశారో కాని చాలా బాగుంది.' అన్నాను మెల్లగా, 'ఆనందం అర్ణవమయితే' అనే పాటపాడుతూ. వాడు మాట్లాడలేదు. అదేమిటో గంటలతరబడి అలాగే కూర్చుంటాడు. దేన్నిగురించి ఆలోచిస్తాడో—హృదయంలో ఆందోళనేమో అంటే, దాని కవసర మేమీ లేదు.

కొంచెం సేపాగి—

'సీతా, 'ఆపాట బాగుందికదూ?' అన్నాడు.

నాకు తెలుసు వాడికే పాట యిష్టమో.

'పాడనా?' అన్నాను. ఇకమళ్ళీ జవాబు లేదు. అప్పుడప్పుడు మహా చిరాకేసేది. 'ఆనందం అర్ణవమయితే-' అనేదే పెద్దగా పాడటం మొదలెట్టాను. వింటున్నాడో, లేదో నాకేం తెలుస్తుంది!

'వినకపోతే పాడటం కూడా దేనికి?' అన్నాను, పాట ఆపి. 'లేదమ్మా, వింటున్నాను పాడు.' అన్నాడు.

మా అన్నయ్యమాట అంటే నాకెంతో ఆనందం. అమృతధారలు వర్షించినట్లుంటుంది. వాడు నన్ను పాడమని అడగడమే భాగ్యమని పించేది. వెంటనే పాట అందుకున్నాను.

పాట అయిపోయింది. ఆకాశంలోకి చంద్రుడు వచ్చేశాడు. వెన్నెల అన్నయ్య ముఖంమీదపడి ఏదో ఔదార్యాన్ని, సౌమ్యతని ప్రతిఫలించింది. శాంతం వుట్టిపడుతూ వుంటుంది. అలాగే వాడి ముఖంలోకి చూస్తూ నిలబడిపోయాను, దీపం వెలిగించాలన్న విషయం సైతం మరిచిపోయి.

కొంచెం సేపటికి అంతా చీకటిగా వున్నట్టు తోచింది. దీపం వెలిగించాను.

'అబ్బ, ఎప్పుడూ ఏమిటా ఆలోచన-' అన్నాను విసుగ్గా. నవ్వుతూ నావైపు చూశాడు. ఇప్పటికీ కళ్ళకు కట్టినట్లుంది. వెన్నెల చిలికినట్లే వుంటుంది వాడు నవ్వితే.

దగ్గరకు వచ్చి, నా చేయి పుచ్చుకుని, 'అన్నం తిందామా, సీతా' అన్నాడు.

---

నరసింహామూర్తి

'ఇందాకటి నుంచీ అన్నంగురించే ఆలోచిస్తున్నావా? అంతా నాటకం!' అన్నాను క్రిందికి పరుగెత్తుతూ.

'అమ్మా, అన్నం పెట్టవే అన్నయ్యకూడా వస్తాడు.' అన్నాను, అమ్మదగ్గర కెళ్ళి.

'రండి పెదతా, మీ నాన్న వచ్చేదాకా వుంటారేమో అనుకున్నాను.'

'కాదులే పెట్టు, రారా అన్నయ్యా.'

అన్నం తినేశాము.

'అన్నయ్యా, యివాళ మేడమీద పడుకుందాంరా' అన్నాను.

'అలాగే, కాస్సేపు చదువుకోవద్దూ!'

'బయట కూర్చుని చదువుకో. టేబిలు బయట వేస్తాను. అయినా ఒక్కరోజుకి చదువు లేకపోతే యేం?'

'త్వరగానే ముగిస్తాలే. టేబిలు బయటవెయ్యి, యిప్పుడే వస్తాను.' అని అలా కొంచెం దూరం నడచిరావటానికి వెళ్ళాడు. వాడికదో అలవాటు- అన్నం తినగానే నడవటం.

బల్లా, పుస్తకాలూ అన్నీ బయట అమర్చాను. బల్ల పక్కగా మంచాలు వేశాను. అన్నయ్య వచ్చికూర్చుని పుస్తకాలు తీసి చదవటం మొదలెట్టాడు. వుద్యోగం చేస్తూ వున్నా విద్యార్థికంటె ఎక్కువగా చదివేవాడు. వాడి కెన్ని తెలుసని! వాడు చదువుతూంటే అలాగే చూడాలనిపించేది. ఏ పనిచేసినా అంతముచ్చటగా వుండేది.

దాదాపు పదికాగానే పుస్తకంమూసేసి 'లైటు ఆర్పేయనా, సీతా' అన్నాడు. తమాషాకు నేనేం మాట్లాడలేదు. వెంటనే బల్లా, పుస్తకాలూ లోపల పెట్టేసి, లైటు ఆర్పి పడుకున్నాడు.

'అన్నయ్యా, వెన్నెల బాగుంది కదూ?' అన్నాను.

'దొంగా, నిద్రపోలేదూ? ఇందాకా ఎందుకు మాట్లాడలేదు! నేను మాత్రం ఎందుకు మాట్లాడాలి!' అన్నాడు.

'అబ్బో! నువ్వు మాట్లాడకపోతే ఏం ఫర్వాలేదు. నీ మూతిబిగింపులకి కూడా జడుస్తే ఎట్లా!" అన్నాను. అన్నానేకాని నిజంగా వాడికి కోప మొచ్చిందేమోనని భయమేసింది. అలా మెల్లిగా మంచం పక్కగా వెళ్ళి ముఖంలోకి చూశాను. నవ్వుతున్నాడు. నేను లొంగిపోయా ననుకుంటూ దాని గబుక్కున వెనక్కి తిరిగాను. నా చేయి పట్టుకుని—

'సీతా, ఇవాళ భలేకథ చదివాను-చెప్పనా!" అన్నాడు.

'ఆఁ, చెప్పు.'

కథ మొదలుపెట్టాడు. కథలు చెప్పటంలో మంచి ఆరితేరినవాడు. చెపుతూనే వున్నాడు. నా కెప్పుడు నిద్రపట్టిందో తెలియదు. పొద్దున్న కళ్ళు తెరిచేసరికి దాదాపు ఏడుగంట లవుతుంది. సూర్యుడి కిరణాలు నామీద పడుతున్నాయి. మా అన్నయ్య అప్పుడే లేచి స్నానంచేసి వచ్చి కూర్చుని చదువుకుంటున్నాడు. నాకే అవమానమనిపించింది, ఇంత ఆలస్యంగా లేవట మేమిటని. అమ్మా, నాన్నా కోప్పడరు కనక కాని, పెళ్ళి కాని పిల్లని యింత పొద్దెక్కే దాకా లేవక పోతే ఎట్లా!

నేను స్నానం మొదలైనవి ముగించుకుని వచ్చేటప్పటికి చాలా సేపయింది. అన్నయ్య మామూలు పరిస్థితిలో వున్నాడు. పుస్తకం ఒడిలో వుంది. ఎటో చూస్తున్నాడు. ఇక చచ్చి గీపెట్టినా పలకడు. ఈ ఆలోచన దేనినిగురించో కాని, రాత్రింబగళ్ళు లేవు.

కుర్చీలోంచి లేచి వెళ్ళి కిటికీచువ్వలు పట్టుకు నుంచుని బయటకు చూస్తున్నాడు. ఇంతలో బయట ఏడుపు వినిపించింది. అన్నయ్య చలనం లేకుండా నుంచుని చూస్తున్నాడు. నాకుమాత్రం వుండబట్టలేదు. బయటకు వెళ్ళి చూశాను. ఎవరో ఏడుస్తున్నారు. పాపం ఎవరు పోయారో! పట్నవాసాల్లో పక్కింటివాళ్ళ సంగతే తెలియదు. ఇంకా కొంచెం ముందు కెళ్ళి చూసేసరికి శవం కనపడ్డది. పాడెమీద కెక్కిస్తున్నారు శవాన్ని.

గబగబా లోపలికి వచ్చి—

'అన్నయ్యా, పక్కింట్లో ఎవరో పోయారు పాపం. శ్మశానానికి తీసుకెళుతున్నారు" అన్నాను.

ఏమీ మాట్లాడలేదు.

'చూడిట్లా రా. అదుగో వెళుతున్నారు". అన్నాను పిట్టగోడమీదికి వంగి. మా అన్నయ్య కూడా వచ్చాడు. వెడుతూన్న శవాన్ని అదే

దీక్షగా చూడటం మొదలుపెట్టాడు. ఆ శవం మలుపు తిరిగి అదృశ్యమైంది.

అన్నయ్య వెనక్కు తిరిగి మెడమెట్టు దిగటం ప్రారంభించాడు. ఎక్కడికని నే నడగనూ లేదు. వాడు చెప్పనూ లేదు. నేను కూడా వాడివెంట దిగాను. క్రమంగా గదులన్నీ దాటి, యింటితోట దాటి రోడ్డుమీది కొచ్చేశాము. ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకోలేదు. ముందు చూపుతప్ప వెనక నే నొస్తున్నట్టు గమనించాడో లేదో వాడు. అలాగే వెళుతున్నాం. శవం తిరిగిన మలుపే మేమూ తిరిగాం. అప్పుడింకా ఎనిమిదయి వుంటుంది. రోడ్లమీద జనం అంత క్రిక్కిరిసి లేరు. అసలు మాదో మారుమూల. అలాపోయి శ్మశానం దగ్గిర ఆగాడు అన్నయ్య. నాకు గుండెలు గుబుక్కు మన్నాయి. అదే మొదటి తడవ-నేను శ్మశానంలో శవం ఉండగా చూడటం. శవాన్ని దింపారు. పక్కనే కొడుకు కాబోలు ఏదో బ్రాహ్మలు చెప్పినట్టు చేస్తున్నాడు. మా అన్నయ్య మరీ దగ్గరకు పోతున్నాడు. గుండెలు భయంగా కొట్టుకుంటున్నా వాడికి దగ్గరగా నడుస్తూ వెళ్ళాను మమ్మల్ని ఎవరూ అడ్డగించలేదు. శవంతోపాటు వచ్చిన వాళ్ళంతా అక్కడ పాకలాంటి దాంట్లో కూర్చున్నారు. శవానికి దగ్గరగా కాటికాపరి కట్టెలు పేరుస్తున్నాడు- ఒకదానిమీద ఒకటి. చూస్తూ నిలుచున్నాం యిద్దరం. కొంతసేపటికి మంత్రాలు చదవటం అయిపోయింది. శవాన్ని పాడెమీదనుంచి ఎత్తారు. భయం జాస్తి అవుతున్నది. కాని చూడా లనిపించింది. అన్నయ్య చెయ్యి పట్టుకుని వెనకగా నిల్చున్నాను. అన్నయ్య మాత్రం చలించకుండా తదేకదీక్షగా చూస్తున్నాడు. శవాన్ని ఎత్తి కట్టెలమీద పడుకోబెట్టారు. కాళ్లు రెండూ కట్టేసి వున్నాయి. ఒంటిమీద కప్పినగుడ్డ లాగేశారు. మొలకో ధోవతిలాంటిది మాత్రం వుంచారు. వరసనే కాళ్ళదగ్గరనుంచి పెద్దపెద్ద మొద్దులు పెట్టటం ప్రారంభించారు. భయం మరీ జాస్తి అయింది. అన్నయ్య చెయ్యి గట్టిగా పట్టుకున్నాను. ఇప్పుడు తల్చుకుంటే నవ్వొస్తుంది. దాదాపు శవం అంతా కట్టెలు పెట్టేశారు. ఎక్కడా ఏ భాగం కనబడటం లేదు.

కొడుకు నిప్పుకుండ తీసుకుని మూడుసార్లు ప్రదక్షిణం చేశాడు. బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. ప్రదక్షిణ లయిన తర్వాత మెల్లగా తలదగ్గర కట్టెలమీద కొన్ని పిడకలు పెట్టి వాటిమీద నిప్పుకుండ బోర్లించేశాడు కొడుకు. దానిమీద కొంచెం కిరసనాయిలు పోసి నట్టున్నారు. ఏమో అంత జ్ఞాపకం లేదు. భగభగమని అంటుకున్నాయి కట్టెలు. కొంచెం సేపటిలో పెద్దమంట అయింది. చురచుర మని మండుతున్నాయి. నా కళ్ళవెంట నీళ్లు గిర్రున తిరిగాయి. కళ్లు వాటంతటవే మూసుకున్నాయి. కళ్ళు తుడుచుకోవాలని కూడా అనిపించలేదు. అన్నయ్య మాత్రం మొదట్లో ఎలా వున్నాడో అలాగే చూస్తూ నుంచున్నాడు. మంటలు మరింత ప్రజ్వలించాయి. కొడుకు కొంచెం దూరంగా కూర్చుని, కుండ బద్దలు కొట్టి, బ్రాహ్మడు మంత్రాలు చదువుతుంటే ఏదో కర్మ చేస్తున్నాడు. వివరంగా చూడలేక పోయాను. శవంమీది మంటలు నా హృదయాన్ని కదిలించేస్తున్నాయి. ఒకటి రెండు కట్టెలు కిందికి దొర్లితే పెద్దగడతో కాటికాపరి పైకి నెడుతున్నాడు.

కొడుకు చేయవలసిన పని అయిపోయింది కాబోలు. పాకలోకి వెళ్ళి కూర్చున్నాడు. వాళ్ళలో ఎవరో—

'ఇంక పోదాం, పదండి. అయిపోయిందిగా అంతా' అన్నాడు అతిదీనంగా.

"కాస్సే పుండి వెడదాం' అన్నాడు కొడుకు.

'ఏంవుంటే ఏం లాభం-అంతా అయిపోయిం తర్వాత' అన్నాడు మరొకాయన.

"అంతే, క్షణంలో కొచ్చేది తెలియదు. వెధవ జీవితం ఎంతసేపు!'

వాళ్లున్నంతసేపూ మేమూ వున్నాం. వాళ్ళు బయలుదేరిన తరవాత 'అన్నయ్యా, వెడదాం రా' అన్నాను.

మాట్లాడకుండా వెనక్కు తిరిగా డన్నయ్య.

మెల్లగా యింటికి చేరుకున్నాం.

మా అమ్మ ఎదురుచూస్తున్నది. 'ఎక్కడికెళ్లావు నాయనా, యివాళ ఆఫీసు లేదూ!' అంది.



గబుక్కున తలెత్తి 'వున్నా!' అని లోపలికి పోతున్నాడు.

'అయితే టైము కాలేదూ?' అన్నది అమ్మ మళ్ళీ.

'అయిందమ్మా!' అన్నాడు.

'అన్నానికి రా. సీతా, పోయి కంచం పెట్టు- వస్తున్నా' అని తోటవైపు వెళ్ళింది.

అన్నయ్య మేడమీదకి వెళ్ళి ఎంతసేపటికీ రాలేదు. దాదాపు అరగంట అయింది. అమ్మ పిలుచుకు రమ్మంటే పైకి వెళ్ళాను. కుర్చీలో కూర్చున్నాడు. నిజంగా ఎంత నిశితమయిన చూపులు!

'అన్నయ్యా, అమ్మ రమ్మంటోంది, రా, అన్నం పెట్టింది!' అనగానే—

'ఆఁ- వస్తున్నా. ఆఫీసు టైము కాలేదు'

'అయింది- అప్పుడే పదకొండున్నర కావస్తుంటే!'

'పద, వస్తున్నా' అని అన్నానికొచ్చేశాడు.

అప్పుడనిపించింది నాకు-బహుశా అన్నయ్య రోజూ దీన్నిగురించే ఆలోచిస్తాడేమో నని. నేను చాలా కథలు విన్నాను. ఇలా ఆలోచించి ఆలోచించి కొందరు సన్యాసులైపోయారని. చాలా భయమేసింది- అన్నయ్య కూడా అలా అయిపోతాడేమోనని. అప్రయత్నంగా నాకు తెలియకుండానే దుఃఖం వచ్చింది.

అన్నయ్య ఆఫీసుకి వెళ్ళాడు. నాకదే ఆలోచన. వాడు తిరిగి వచ్చేదాకా కడుపులో ఏదో గుబులు. వాడిలాగే ఎప్పుడూ వుంటే ఎట్లా, అనిపించింది. అన్ని పుస్తకాలూ తిరగేశాను. ఆరోజున ఏవీ రుచించలేదు. ఒక్కపాట పాడుకుందామన్నా గొంతు రాలేదు. ఇల్లంతా ఒకటే అలాగం తిరిగేశాను. అన్నయ్య వచ్చేదాకా అంతే. నాలుగయింది. ఇంకో అరగంటలో అన్నయ్య వస్తాడు. ఎక్కడలేని సంతోషం వచ్చింది.

ఇంతలో 'సీతా, సీతా' అని కేకేశాడు అన్నయ్య. ఒక్క గంతేసి బయటికెళ్ళాను. అన్నయ్య చేతిలో ఏదో పుస్తకం ఉంది.

'ఇదుగో, ఎంకిపాటల పుస్తకం కూడా తెచ్చాను. నాకు పాడి వినిపిస్తావా?' అన్నాడు.

వాడు పాడమనాలే గాని పాడటానికేముంది-

'ఆ-పద' అన్నాను. ఇద్దరం మేడమీదికెళ్ళాం.

అన్నయ్య కోటు విప్పి వంకెకు తగిలించి, కూజాలో మంచినీళ్ళు తాగి కుర్చీమీద కూర్చున్నాడు.

# ధమ్మఘోష

కావ్యావళి : రమణారెడ్డి

సత్యం వద:

జగత్తులో మిజరీ వున్నది,
మిజరీపై కలదు మిస్టరీ;

మిస్టరీ బట్టలు విప్పాలని
మిజరీ గిట్టలు త్రుంచాలని

కర్మాగారాలు పొలాలు వంటయిళ్ళు
ఏకంగా అంగారంగా ఆకంగా వూర్ధ్వముఖంగా
వివిధంగా బహిరంగంగా వేగంగా బాహాటంగా

శోకానికి హేతువు పైకం,
పైకానికి అసలు మైకం,

మైకాలను వర్జించాలని శోకాలను నిర్జించాలని;

మిజరీలకు హేతువు మైజర్
మైజర్లకు అసలు ఖైజార్

ఖైజార్లను వంచేయాలని మైజర్లను దంచేయాలని
ఈలో జీ లోకం సకలం కలకలమను న్యాయస్థానం.
ఉత్సాహం మోక్షపుమార్గం, నిర్వాణం సామ్య ప్రపంచం.
నిద్రాణత క్షయనే చూపుట, నిగ్రాణులు మరణకణమ్ములు.
ఏ సత్యం అన్వేషిస్తూ ఏ ధర్మం పరిశోధిస్తూ
చీకటినీ కాటిరుంటనూ లాఠీనీ జైలుగోడనూ
లంఘిస్తూ ముందుకు తెలివికి యిన్నాళ్ళూ పోతున్నామో
ఆ రాస్తా స్థల పరిసరమును స్మృతి సయితం యేర్పరించదు.

అడవులలో క్రేక్షరు మనమై
ఎడారిలో ఒయాసిస్సుమై

మన మూర్తులు ధర్మతేజమై మననీతులు అసిధారలుగా
మన మిప్పుడు అగ్ని స్కంధులం, మనమిప్పుడు బోధిసత్త్వాలం.

సోమరి పాటల వందల కంటే
ఆకలిగీతం ఒకటి మేలయా!
అర్ధమనస్కులు పందల కంటే
ఆత్మామనస్కుడు ఒకడు మేలయా!

లోకజీవనపు చండ భానుతప
నాగ్ని ధారలను తాగిన వాడే
మహాత్ము డనగా మహర్షి యనగా;
మానవ కోటికి నూటికొకటు దరి
జూపినవాడే నాయకు డనగా.

ముందు ముందు మత్తుమందు
ముందు ముందు మిత్తికలదు:
బ్రతుకు అతుకు బొంత, జగమూ యిరుల కంత;
నారోజా వృత్సరమే మనగమ్యం, కాని ముళ్ళకంప;
రోజా పూవులవంటివి కామితాలు, ఆదర్శాలన్నీ కలలు.

× × ×

## ధర్మం చర:

లోకజీవనపు మహాయాతనల
తెలివి - మొక్క నీడ క్రింద బాధ
ను వధించే మేధా యుద్ధము

లో, లో కడ కదిగో మన కాంచిన వెలుగు కడవ;
హోహోయ్! ఛలో ఛలో, ఆగే ఛలో, వెలుగు కనవ?

విప్లవాలంటే పళ్ళికిలించే నరప్లవంగాలంటే
భయమెందుకు! కానది దిబూని బూచి కాదు!
నా కలమే విప్లవం, పంటపొలం కూడా విప్లవం,
వంటయింటిలోనూ విప్లవం, వానరాలు
నరుని యవాడిమూకలు; నరుని తొలితొలి బంధువులు.
నిరాశావాదులు నిషాదులు, దురాశాపరులు కబంధులు.

కరాలు

విదళిత విచలిత పరివలయిత జ్వలిత కృపాణాలు, నిష్కృపాణాలు.

కరాలు

జ్వాలామాలాభీల ఖగోళ క్రమక్రమ మహోద్దామ
పరిభ్రమణ జవమ్మున హఠాత్పతిత విదళిత
వికృత భయంకరోద్ధృత వికల శకల శిలలు, వడిసెలలు;

కరాలు

కరాళ విశాల విషాద విహాయసగుహాల
మహాధ్వజార్చి కోటిస్మృతి విదిల్చి వదల్చిన జ్వరాలు జలాలు;
భళీ భళీ యను మానవ శంఖమ్ములు
విశృంఖలములై ఖలవిదారణో
ద్యమాన నరాలు ఛిదేలు కమాన్లు.

## జ్యోతిర్దర్శనం:

కాళరాత్రి గర్భంలో కదులుతోంది పొడుపు,
విశ్వమాత్ర గర్భంలో మెదులుతోంది సమత:

ఉదయం కావాలా? మరి, దించు రాత్రి మడుపు,
ప్రసవం కావాలా? మరి, తెంచు కడుపు ప్రేవు;
ఉదయం వద్దంటావా? ఉషస్సులేక బ్రదుకవు,
సమతను పొమ్మంటావా? మరి, జనతిభావి యవనత.

బలప్రయోగం లేకుంటే ప్రాణదాత పొడువదు,
శస్త్రం వాడకపోతే స్వామిత్వ మదుదేర

('జగము జఘనము ఖండితము
ప్రసవకార్యము దుష్కరము.
దారికాదు సుగమము
మరి
చేరలేము శిఖరము...'

అలాగా, కవిగా? అలాగయితే సరే సరి!
జనం హాహాకారికి పూనుకొన్న నా హరీహారి?
ఆత్మధ్వంసీ కవీ? కవి కపివారసుడండి,
అబ్బురం ప్రతిదీ అతనికి, క్షణక్షణముల్
కవిగాంధ్ర చిత్తముల్.)

విప్లవాలంటే భయంకరమే సరప్లవంగములు
పుంగనూరి పెద్దమ్మలు రావూరి దాచిప్ప
లంటే లేశం లెక్కించండి!

ఆటాయిటా నట్టింటా ప్రతిచోటా
ప్రతిఘోటా ప్రతిపేటా కూప్ కూప్ కూప్ డే'థా!
ప్రతిచోటా ప్రతిభేటా కూప్ కూప్ కూప్ డే'థా!
కూర్ ద'లయిన్ కూర్ ద'లయిన్, కూప్ డే'థా!

(అకటా యననిండు, కటకట పడనిండు
కాని కటకటాలు
పటపట యనునుండి, వికటమకుటమణులు
భ్రూయుగమ్ము ముడివేసిన భీతిపడుట రోత)

కూప్ డే'థా, కూర్ ద'లయిన్!

జఠరాగ్నికి జరఠం దుఃఖానికి ముసలం
విప్లవం మహార్ణవం సంగరం ఘురం ఘురం
ఈ కలం తుపాకి మడిమ! అక్షరాలు గుళ్ళు కాక!
(పర్ణ భుక్కుల భోజనం స్వాతంత్ర్యం యీ కలానికి!)

పక్షాంచల చలనమ్మున శూన్యము సుడిగుండ మగును !
పరమరణాస్త్రుల దుర్మరణం తొలిచరణ మీ కలానికి!
కీలు గుర్రం (మీర్జా పురానిది కాదు) కలం, రూకబలం
గణించని కలం; యీ కలము లేశ మెరయని కలానికి అవధి ఆనందం
ఆనందం మహా (వారెవా !) సముద్రం, మధుద్రవం !
ఆనందం పెదవు కొరికి నిలింప రసం పచ్చటి మాధుర్యం
మాధుర్యంలో సితా సిత కాంతి ప్రవాహ గమనం,
హిమాలయాగ్ర రావివనం, ఒక భూజం క్రింద వెలుగు,
చవిచూడవలెనన్న చో, బుద్ధం శరణం గచ్ఛామి !
(వర్గ సమర వ్యూహ క్రమ విజ్ఞానియే బుద్ధుడు)
చవి చూడ వలెనన్న చో, సంఘం శరణం గచ్ఛామి !
(పీడితవర్గం సంఘం, స్వయం సేవకులు గోరక్షకులు కారు)
చవిచూడ వలెనన్న చో, ధర్మం శరణం గచ్ఛామి !
(పీడకుల పీడ చీడ కీడు కడిగివేయుడ మొకటే ధర్మం)

"యదాయదాహి ధర్మస్యగ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య సంభవామి యుగే యుగే."

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

× × ×

## ఉపదేశమాలః

లేమి నశియింపవలె గీము హరియింపవలె
కీడు కైదొలగవలె భీతి చితి కెక్కవలె
మనిషి తల నెత్తవలె
శిఖరమటు గిరివృక్షమటు.

భూమిపై దేవతలు కాపురాల్ సేయవలె
వర్షములు హర్షములు సస్యములు విరియవలె
హాసము విలాసములు నాగర వినోదములు
విరియవలె విరియవలె విరియవలె విరియవలె.
వాహినుల్ పొంగవలె దాహముల్ క్రుంగవలె
పూపిందె తొడుగవలె భూమాత భూషలటు !
పూపసుపు పూదేనె పూనునుపు పూనాగు
మిసమిసల తీయదియగ లలితముగ నెగుర వలె !
పగతురు నశింపవలె ఒలిమి మిసి మించవలె
శిశువు శీతాంశుడై దినదినము నెదుగవలె !
అక్షరము అక్షయము ప్రతివాని కబ్బవలె,
వెలుతురులు నిండవలె దిశలెల్ల వెలుగవలె
జ్ఞానమటు చలనమటు !

# కవికుల వంద్యునికి కైమోడ్పు

## బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు

శ్రీ ద్విడి లక్ష్మన్న

కళాప్రపూర్ణ, శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ఆంధ్ర వాణీమతల్లికి చేసిన అపారమైన సేవా ప్రాబల్యం, ప్రాశస్త్యం తెలుసుకోవాలంటే, నవయుగారంభంలో ఉండే పరిస్థితులని కూడా స్థాలీపులాక న్యాయంగా తడిమి చూడాలి. పందొమ్మిదవ శతాబ్దిని తెలుగు సారస్వతంలో నూతన శకారంభం అయింది. పుస్తకాలు అచ్చుకావడం 1827 నుంచిన్నీ. అప్పట్నుంచీ భాష అభివృద్ధి పొందసాగింది. అయితే, సంస్కృతి అన్యప్రకృతి అనీ ప్రాకృతం ద్వితీయ ప్రకృతి అనీ, ఆంధ్రం వికృతి అనీ అనుకునే రోజులు అవి. బ్రౌను, శంకరనారాయణ, బహుజనపల్లి సీతారామాంజనేయులు గార్ల వంటి నలుగురు నిఘంటుకారులనీ మినహాయిస్తే మిగిలే వాఙ్మయకారులంతా ప్రబంధ కర్తలే. ఆ ప్రబంధులకయినా ఒకటే మూస-విశిష్టత ప్రత్యేకించి లేకుండా అవే సన్నివేశాలూ, అవే వర్ణనలూ, అదే పరిణామమున్నూ.

ఇలాగ ఉంటూన్న రోజుల్లో ఆంగ్ల విద్యా ప్రాబల్యం వచ్చిపడింది. వాఙ్మయంలో కూడా అది నిస్తులంగా కనిపించింది—మొదట వంగ దేశంలోనూ, తరువాత ఆంధ్రదేశంలోనున్నూ. బంకించంద్రుడు ఆంగ్ల విద్యావ్యాసంగ పరివర్తనానికి పరవశుడయిపోయేడు. ఇలాగే తెలుగు దేశంలోనూ యిద్దరు వ్యక్తులు కనిపిస్తారు: ఒకరు సర్. ఆర్. వెంకటరత్నం నాయుడు గారు, రెండవవారు రా. బ. కందుకూరి వీరేశలింగం పంతులుగారు. అయితే నాయుడు గారు కేవలం ఆంగ్ల పండితుడు అవడం చేత ఆయన ప్రతిభావ్యుత్పత్తులు తెలుగు భాషకీ, వాఙ్మయానికీ తోడ్పడ్డాయికావు; మతసంస్కారంలోనే ఆయన వ్యక్తిసంచలనం ఆగిపోయింది. కాని వీరేశలింగం పంతులుగారు "దేశీయ సంస్కృతి"గల మనిషి. ఆయన మతోద్ధరణ కూడా భాషాభివృద్ధికి దోహదమయింది. మున్నొక నాడు ఆంధ్ర భాషకీ, కవిత్వానికీ కేంద్రమయిన రాజమహేంద్రవరం, మళ్ళీ ఆంధ్రసంస్కృతికి కేంద్రం అయి నిలిచింది. తెలుగు సారస్వతంలో నవయుగారంభకులు వీరేశలింగం పంతులుగారు. వీరి సపర్య వలన భాషాసౌలభ్యం, బహుముఖ సారస్వత వ్యాప్తి. అన్యభాషా సారస్వతం ఆంధ్రీకరణ మవడం, యిత్యాది విషయసౌలబ్ధి అఖండంగా యేర్పడింది.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరులదీ యిటువంటి సేవే. వీరు పండితర్షభులూ. సమాజకవులున్నూ. సంస్కృతాంధ్రాలలో మంచి ప్రజ్ఞా, ఉభయ భాషలలోనూ అనర్గళమయిన కవితాధారా వీరికి పెట్టనిసొమ్ములు. "పెద్దనాదులకి కృష్ణరాయలులాగే వీరికి పోలవరం కృష్ణభూపతి ప్రాపు. ఆయన పరిపోషణఛత్రంకిందా, తరవాతా వీరు చేసిన వాఙ్మయ సేవ యించుమించు వీరేశలింగం పంతులుగారు చేసినంతా వుంది—" యింకా కాస్త మెరుగ్గా ఉండేమో కూడాను!

**కవిపండితులు:**

నేడు ప్రాచుర్యంలో ఉన్న సారస్వత రూపాలు చాలా వరకు వీరు తీర్చిదిద్దినవే. నాటక రచనలో వీరి ప్రతిభ అగ్గలమయింది. వీరు తెలిగించిన మృచ్ఛకటిక, ముద్రారాక్షసాలు నిరుపమానంగా నిలిచేయి; గీర్వాణంలో ఉన్న మాతృకలకి మెరుగులు దిద్దేయి. వీరి పాండవ పంచకం—దానికి అదే సాటి.

దేవీభాగవతం వ్రాసి పురాణశైలి తమకైవసం చేసుకున్నారు.

అప్పటివరకూ చర్వితచర్వణంగా వస్తూన్న ప్రబంధాలతో విసుగెత్తి, చవిచచ్చిపోయిన

తెలుగు జివ్వాకి శ్రవణానందం అనే ప్రబంధ మధుర మాకందాన్ని అందిచ్చేరు. ఈ కావ్యం లోని ఒకటి రెండు పద్యాలయినా కంఠతారాని ఆంధ్ర వాఙ్మయాభిలాషి ఉండడు. 'లైట్ అఫ్ ఏషియా'ని అనుసరించిన వీరి బుద్ధచరిత్ర నవ్య భారతి గళభాగాన్ని అలంకరించిన నవరత్న ఖచిత స్వర్ణాభరణం. వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రలాగే వీరూ జాతకచరిత్రా, కామేశ్వరీ శతకాలు రచించేరు.

జన్మకారాయతే కవిః అన్న సూక్తి వీరిపట్ల వర్తించినట్లుగా యింకొకరి పట్ల వర్తించదు. వీరి కావ్యాలలో రసపుష్టి కళోపాసనా యెంత బిగువుగా కనిపిస్తాయో, ఆధ్యాత్మిక చింతనా అంతతీవ్రంగా అవుపిస్తుంది; "ప్రజ్ఞాపురాణీ" పంతతిలో వారు మరి! భావనలోనూ రచనలోనూ జిగిబిగువులతో పాటు అతి వేలమయిన స్వాతంత్ర్యం. నిరంకుశాః కవయః!

అనాదిగా వున్నటువంటి నాటక, ప్రబంధేత్యాది కావ్యాలేకాక, తద్విలక్షణమయినదీ, విశిష్టమయినదీ అయిన "అధిక్షేప" కావ్యాన్ని కూడా వ్రాసేరు వీరు. అధిక్షేపకావ్యాలు తెలుగు రచనలలో క్వాచిత్కంగా కనుపిస్తాయి. అప్పటప్పట కవులు అధిక్షేపిస్తూ చాటువులు చెప్పడేవూ కద్దు. కాని, యీ యుగంలో నిశితదృష్టితో తీవ్రశోపానాన్ని సంపూర్ణ కావ్యరూపంగా వెలువరించింది వీరే. గిరతం భారతానికి దీటు వచ్చే గ్రంథం. అందులో లాగే యిందులోనూ-చెప్పెట్లపర్వమనీ, మేకు బిగింపు పర్వమనీ, జీలుగు బెండు పర్వమనీ-పర్వవిభాగం ఉంది. రామకృష్ణకవులు వెంకటశాస్త్రిగారి శిష్యులు కాము అనడంతో వెలువడిం దీ గ్రంథం. ప్రతిపక్షులకి వెన్నెముక విరిగిపోయింది. అదిలోనే గిరత నిర్వచనం యెలాగ చేసేరో చూడండి—

"గీర్షుయేషురతా స్తే వై గిరతాః పరికీర్తితాః
తాసుద్దిశ్య కృతం కావ్యం గిరతం పరిచక్ష్యతే"

మాట అనే అర్థం యిచ్చే వాగాది పదాలు ఉన్నా గీశ్శబ్దం ప్రయోగించడంలో వారికిగల భాషాపాండిత్యం, పదముల వాడుకలో వారు పాటించే ఔచితీ వ్యక్తం అవుతాయి. ఈ గీశ్శబ్దానికి బదులు మరి యే యితరశబ్దం ప్రయోగించినా కవు లుద్దేశించిన అధిక్షేపం (satiric effect) రాదన్న సంగతి యీపాటికి విదితం అయే ఉంటుంది.

"కాకవి! కావపాత్రల మొ
గంబులు మూసెను జీల్గుబెండ్లకున్
జేకురునే సభాస్థితియు,
జేకురుగా కది; జద్రసంబులన్
గైకొనువేళ నొక్క కడ
గా బడవైవరె! పట్టుబట్టినన్
మేకు బిగించి లాగి బలి
మిన్ పలుముక్కలు సేయకుందురే."

యిత్యాది ఘట్టాలలో ఉండే అధిక్షేపసాహిత్యం కొల్లలుగా అవుపిస్తుంది గ్రంథం అంతటానూ. అయినప్పటికీ, వారి ఉదారస్వభావం ఎక్కడికక్కడే తొంగిచూస్తూ వుంటుంది. తమ గురువులకి నీరాజనం ఎలాగ పట్టేరో చూడండి!—

"రఘువంశము భుజంగరాడ్గురు సన్నిధి
నింపుమీరగ బఠియించినాడ
శ్రీపాద కృష్ణమూర్తి కవీంద్రుకడ నైదు
మాసముల్ శుశ్రూష చేసినాడ
కాశీలూరను నూర గామసోములయొద్ద
నొక మూడు మాసమ్ము లున్నవాడ
చామర్లకోటలో జనివితి రాఘవా
చార్య్య సన్నిధి మాసత్రయమ్ము
పై ననంతార్య సూరయపండితు లిరు
వురును మూడు మాసమ్ములు గురువులైరి
పిదప శ్రీ బ్రహ్మయమనీషి పేరుదెచ్చు
గురుడు నా కయ్యె........."

ఇలాగే, ఉత్తమకవి ప్రశంస కూడాను—

"ఎవని కవిత్వము న్విని య
హీనమహామహిమాను భావులౌ
కవు "లిదివో! కవిత్వ"మని
కంపిత శీర్షచమత్క్రియా మహో
త్సవ సవిశేష సూచిత సు
ధారస ధారధళీకులౌదురో,
కవియనగా నతండ యగు
గాకవులేకవులేని గాకవుల్."

భాషాసేవ:

వీరు సారస్వతానికి యెంత సేవ చేసేరో, భాషాభివృద్ధికోసం అంతకుమించి పాటుపడ్డారు

కృతకృత్యు లయినారు. భాషావిషయక మైన వీరి సేవాగరిమ యీనాడు మనకి నిశితంగా అర్థం కాకపోవచ్చును. కాని, గద్యకవిబ్రహ్మ అనిపించుకున్న వీరేశలింగం పంతులుగారు సభలకి మొదటంగా నుంచుని, “రామ్మూర్తి పంతులు చేసే వాదంలో సత్యం లేకపోలేదు. కాని కొన్ని విషయాలు పునః విమర్శించాలి” అని ముందుకి వెనక్కి ఊగులాడుతున్న ఆ రోజుల్లో—“వీరు గ్రాంథికభాషలో మాట్లాడ్డం లేదు కనక ఉపన్యాసమే ఆపించెయ్యా”లని పండిత ప్రకాండులంతా ఏకగ్రీవంగా అభిప్రాయం యిచ్చి ప్రజాభిప్రాయాన్ని అల్లకల్లోలం చేసిన ఆ దినాలలో- అంతవరకూ సనాతనులలో సనాతనులయిన శ్రీ వెంకటశాస్త్రిగారు “నేను” అని ముందుకు వచ్చి, “గిడుగు కాదు పిడుగు” అంటూ సత్యకార్యాచరణకి పూనుకున్నారు. కాలప్రవాహంతోపాటు భాషావాహిని కూడా మారుతూ ఉంటుంది అనీ, శృంఖలాబద్ధంగా ఉన్నన్నాళ్లూ భాషకి ప్రగతి చేకూరదనీ చెవి నిల్లు కట్టుకుని శత విధాల పోరుతూన్న ద్రష్ట రామ్మూర్తి పంతులు గారి మాటల్లో ఉన్న సత్యాన్ని సమగ్రంగా గ్రహించిన మహనీయులు వీరు. ఉదార స్వభావులు!

వ్యావహారిక భాషావాదానికి సారళ్యం ప్రధానం. తెలుగుసామెతలలో ఉన్న రసపుష్టి, ఎరువు సొమ్ములు పెట్టుకున్నట్టుండే సంస్కృత వ్యాకరణానుబద్ధమయిన గ్రాంథికపు తెలుగులో మృగ్యం అయిపోతుందని ఉగ్గడించి, భావరమ్యతకి అక్షర రమ్యత చేదోడువాదోడుగా ఉండేటట్టు రచించేరు. పద్యాన్ని కృతకభాషనుంచి తప్పించి, వ్యావహారికభాషకి ఎంతో సమీపంగా తీసుకువచ్చేరు.

వచన రచనలు:

పద్యరచనలలో లాగే వ్యాసరచనల లోనూ వీరికి ఒక ప్రత్యేకత ఏర్పడింది. అతి నిగూఢమయిన భావాలని కూడా శిరీష కుసుమపేశలంగా, పండితపామరు లందరికీ సులభబోధకం అయేటట్టు నివేదిస్తుంది వీరి శైలి. భావోద్దీపనకీ, అర్థసౌలభ్యానికీ, రసపుష్టికీ అప్రతిమమయిన సామరస్యం కుదిరించి వీరి రచనా శిల్పంలో, సామాన్య సంభాషణలలో ఉండే పదాలని సహితం తమ రచనలలో ఒప్పించి, ఒప్పించి వాటికి ఒక స్థాయీ అంతస్థూ ఏర్పరిచేరు.

కాగా, “సరస్వతి” పత్రికద్వారా అనేక అముద్రిత గ్రంథాలని వెలికి తెచ్చేరు. ఇప్పటికీ- యింతవార్ధక్యంలో ఉన్నాకూడా —ఆంధ్రవార పత్రికాదులలో వ్యాసకుసుమాలని వెదజల్లుతూనే ఉన్నారు. శిష్టవ్యావహారిక రచనకి వీరి వ్యాసాలు గీటురాయి.

చాటుధారులు, అవధానాలు:

ఓం ప్రథమం శ్రీనాథుడు చాటుపద్య చక్రవర్తి ననిపించుకున్నాడు. తరువాత మళ్లీ కృష్ణదేవ రాయల సమీపకాలంలో ఉండిన రామరాజ భూషణుడు తాను శతలేఖినీ పద్యసంవిధాన నిపుణుణ్ణి అని చెప్పుకున్నాడు. ఈ నాడు తిరిగీ తిరుపతి వెంకటకవులు పాతయుగాలని జ్ఞప్తికి తేవడమే కాకుండా, వాటిని మించి చరించేరు. కలం చేత పుచ్చుకుని పద్యం రాస్తున్నప్పుడు చెయ్యి కనక ఆగితే ఖండించ వచ్చునని శపథం పట్టిన మహనీయులు వీరు. అలాగని వీరు చెప్పిన ఆశువులు పాదపూరణలు గాకుండా ఉత్తమరస స్ఫోరకంగా ఉన్నాయి. వీరి శతావధానాల వల్ల ఆయాస్థలాలకి పేరు ప్రతిష్ఠలు వచ్చేయి అన్నారు, వెనకటికి ఓ సారి వేటూరి వారు. అంతేకాదు-రసస్ఫూర్తితో చక్కని రాగవరసని పద్యాలు చదివే చాతుర్యం అలవడచేసిన ఆచార్యపీఠం చెళ్ళపిళ్ళవారేనట. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు యింకా ఏమంటున్నారో చూడండి:

“కొంకులువోని సక్కవన
  గుంభన మంజకు మించి బింకముం
బొంకము గల్గగా చవులు
  బొంపిరిపోవ పఠించు నేర్పు మా
వెంకటశాస్త్రిపండితక
  విప్రభు చక్కటిదక్క తక్కువి
ద్యాంకుల యందు నెందు గల
  దా సకలాంధ్ర మహామహీస్థలిన్.”

వక్తృత్వం:

వీరి వక్తృత్వం కూడా, శతావధానాల లాగే, ముచ్చట గొలుపుతూ ఉంటుంది. అసలు

శ్రీ శాస్త్రిగారి ఉపన్యాసం లేని పురజనసభలు ఉండేవి కావుట, బందరులోను. ముందుగా విషయాన్ని తరచి, వాంశాలు యెత్తి వ్రాసుకుని, ఫలానా విధంగా చెప్పాలి అనుకోవడం వెంకటశాస్త్రిగారు ఎన్నడూ యెరగరట. అయినా అలాగ పరిశ్రమించి వచ్చి ఉపన్యసించిన వారి వాటికంటె వీరి ఉపన్యాసాలే ఉరుతరంగాను, గురుతరంగాను, సూరి సభాయోగ్యంగాను, శ్రవణపేయంగాను పరిణమించేవిట. శ్రీ శాస్త్రి గారు వేదిక నెక్కి స్వర్గంగాప్రవాహ వేగంతో ఆంధ్ర సంప్రదాయ స్వతస్సిద్ధమయిన స్వభావోక్తులతో, ఛలోక్తులతో, సరసోక్తులతో, మధ్యే మధ్యే ఆశురాగాలతో ఉపన్యసిస్తూ ఉంటే సదస్యులు మంత్రముగ్ధులయే వారని వ్రాసేరు శ్రీ తురుగంటి సీతారామయ్యగారు.

**ఛలోక్తి:**

శ్రీ శాస్త్రిగారు ఛలోక్తికి పెట్టినది పేరు. పట్టుబట్ట యెన్నాళ్ళదాకా మడి అంటే, "కంపు కొట్టకుండా ఉంటే యెన్నాళ్ళయినా మడే" నన్నారుట. ప్రయాణోన్ముఖుడికి, శునకం కుడి నుంచి యెడమకిపోతే శుభమా, ఎడమనుండి కుడికిపోతేనా అని పృచ్ఛ వస్తే, "కరవకుండా పోతే మంచిది" అన్నారుట యింకోసారి.

ఈ రీతిగా, సర్వతోముఖ ప్రజ్ఞాధురంధరు లయిన శ్రీ శాస్త్రిగారికి ఏ ప్రభువూ తన కొలువు కూటంలో నిత్యకవితా వైభోగాన్ని సమకూర్చ లేకపోయినాడు; కాని చెళ్ళపిళ్ళవారే ప్రజా హృదయంలో ఒక ఆస్థానాన్ని స్థాపించు కున్నారు. వీరిని ఏనాడో ఆంధ్రభారతి తన విద్వజ్జన రత్నహారంలో కౌస్తుభమణిగా పరిగణించింది. ఈనాడు ప్రభుత్వాభిప్రాయం కూడా ప్రజాభిప్రాయంతో ఏకీభవించింది. శ్రీ శాస్త్రి గారిని ఆస్థానకవిగా అంగీకరించింది. ఈ ఘట్టం ఆంధ్రజాతికీ, విజ్ఞానానికీ ఒక అపూర్వ గౌరవం. చెళ్ళపిళ్ళవారిని గౌరవించడం, మనలని మనం గౌరవించుకోవడమే అవుతుంది.

---

# మన నాటకప్రదర్శనాల తీరని లోపం

ప్రసాదశర్మ

"ఏమండీ, రాత్రి నాటకం ఎలావుంది?" అన్న ప్రశ్నకు శ్రీ...గారు అద్భుతంగా నటించారనో; శ్రీమతి...గారు బ్రహ్మాండంగా గానం చేశారనో సమాధానం వస్తుంది గాని, "ఆహా, ఏమి గొప్పనాటకమండీ!", "ఛా, అసహ్యంగా వుంది" అన్న ముక్కలు మాత్రం మన చెవిన పడవు గదా! హేమాహేమీలు నటిస్తున్నారు, కళావేత్తలు చూచి ఆనందిస్తున్నా మంటున్నారు. మరి ఇటువంటి సమాధానాలకు కారణం అసలు నాటకరచనే బాగాలేక పోవటమా, లేక నాటకప్రదర్శనం లోపభూయిష్ఠమై వుండటమా అన్న సంశయం మనలను బాధిస్తుంది. మన వృత్తినాటకాలు ఎలా ప్రదర్శింపబడు తున్నాయో అందరికీ తెలిసిన విషయమే. నాటకం బెర్నార్డ్‌షా రచించింది కానివ్వండి, మరో షా వ్రాసింది కానివ్వండి, నాలుగు ముఠాలలా వున్న "సాటిలేని మేటి నటులు" దాన్ని ప్రదర్శించా లని ఏ సుముహూర్తాన్నో తీర్మానించుకుంటారు కాబోలు... అంతే బ్రహ్మాండ నాటకప్రదర్శనం నాటి రాత్రే వారందరు కలుసుకోటం—గ్రీను రూములో. ఇక్కడే వుంది అమెచ్యూరు నాటకప్రదర్శనాలకు, వృత్తినాటక ప్రదర్శనా లకు తేడా. అమెచ్యూరు సంఘాలకు దర్శకుడు అంటూ ఒకడు వుంటాడు. అతని ఇష్టానుసారమే నాటకం ప్రదర్శింపబడుతుంది; అలా జరగాలి కూడాను. ఈ ప్రదర్శనాలే మెరుగని వేరే చెప్పనక్కరలేదు.

కవి తన సందేశాన్ని నాటకరూపంలో ప్రజా

లకు అందకేలా చేసుకోండి. ఈ నాటకం ప్రదర్శించినప్పుడే అతడు సృష్టించిన పాత్రలు సజీవము లవుతాయి. అప్పుడే నాటకంలోని కథ, సందేశం. రసవంతంగా ప్రేక్షకుల హృదయాలలో నాటుకపోతాయి. నాటకాన్ని సమగ్రంగా అవగాహన చేసుకుని, కవి దృక్పథాన్ని ప్రేక్షకులకు చూపే బాధ్యతనంతా వహించే వ్యక్తి ఒక్కడే-అతడే దర్శకుడు. పుస్తకరూపంలో వున్న కవికీ ప్రేక్షకులకూ నడుమ జీవనదిని ప్రవహింపజేసే కళాస్రష్ట అతడే. నాటకాన్ని సూక్ష్మంగా పరిశీలించి, అందులోని అంతరార్థాలను విప్పి చూపటానికి, ఏరంగానికి, ఏసంఘటనకు ఎంత ప్రాధాన్యం ఇవ్వవలసిందీ నిర్ణయించుకుంటాడు దర్శకుడు. ఇంతేగాక ప్రతి రంగంలోను, కథాగమనానికి తోడ్పడే విషయాలు, కావ్యసందేశాన్ని ప్రేక్షకులలో స్ఫురింపజేసే ప్రధాన సంభాషణలు ఏవేవో స్థిరపరుచుకుంటాడు. కాబట్టి నాటకం మొత్తం మీద ఏరంగానికి, ఏరంగంలో ఏపాత్రకు ఎంతెంత ప్రాధాన్యం ప్రదర్శనంలో ఇస్తే నాటకంలోని అంతర్గతభావాలు ప్రేక్షకులలో ప్రేరేపింపబడగలవో, దర్శకునికి కళ్ళకు గట్టినట్టు వుంటాయి. అంటే మొత్తం నాటకం అంతా ఒక్కసారిగా అతని మనోనేత్రానికి కనిపిస్తూంటుం దన్నమాట. ఇలాటప్పుడు సరియైన దర్శకుడు ప్రదర్శించిన నాటకం విజయవంతం కావటం, కావ్యసందేశం ప్రేక్షకుల హృదయాలలో గాఢంగా నిలిచిపోవటం జరగటంలో ఆశ్చర్యం ఏముంది?

నటులు, రంగస్థలాలంకరణ, వెలుగునీడల నిర్మాణం, వీటన్నిటినీ సమయానుకూలంగా ఉపయోగించి నాటకాన్ని రసవంతంగా ప్రేక్షకులకు అందజెయ్యటమే దర్శకుని విధి. తన శిల్పాంగాలలో ఏఒక్కదానికీ అనవసర ప్రాధాన్యం ఇవ్వకుండా, నాటకాన్ని సజీవంగా ప్రదర్శించటమే అతని ఆదర్శం. వృత్తి నాటకాలలో ప్రతినటుడు రంగాన్నంతటిని ఆక్రమించి తనే నటకావతంసుడు, తనే గాయకశిరోమణి అని మెప్పు పొందాలన్న దురుద్దేశ్యంతో నే నటన సాగిస్తాడు, తన పాత్రకు ఆ రంగంలో ప్రాధాన్యం లేకపోయినా సరే. మిగిలిన పాత్రలు ఎలా తగలబడిపోయినా తన కక్కర లేదు; మొత్తంమీద నాటకం ఎలా పాడయినా పట్టించుకోడు. ఇలా "ఎవరికి వారే యమునా తీరే" అన్నట్టు, నటులు నాటకం "ఆడిపోతే," ఆ ప్రదర్శనం తర్వాత ప్రేక్షకుల హృదయాలలో నిల్చిన ముద్ర ఏమిటి?—శూన్యం! పోనీ ఈ దురుద్దేశ్యం నటుల మనస్సులలో లేదనుకుందాం. అప్పుడుకూడా నాటకం మొత్తం మీద ఆలోచిస్తే తన పాత్ర స్థితిగతులేమిటో ప్రతినటుడికి తెలియటం కష్టం. కాబట్టి ప్రతి విషయంలోను— నటనా విధానంలో, రంగస్థలం మీది కదలికల విషయంలో, మిగిలిన పాత్రలకు తనకు వున్న సంబంధంలోనూ దర్శకుని సలహా ప్రకారం ప్రతినటుడు సంచరించాలి. అవసరమైతే ఏ విషయాన్ని గురించయినా రిహార్సల్సు సమయాలలో, విశ్రాంతి సమయంలో దర్శకునితో చర్చించవచ్చును. ఒక నటుడు అతిగా నటించ వచ్చును, మరొకడు అసలే నటించక పోవచ్చును. వీరందరి నటనను ఒక స్థాయికి తీసుకవస్తేనేగాని నాటకప్రదర్శనం ఒక నిండైన చిత్రంగా తయారు కాజాలదు. దర్శకుడు తన శిల్పాన్ని ఎలా వినియోగించుకున్నా, ప్రదర్శనానంతరం ప్రేక్షకుల మనస్సులలో నాటక సందేశం మాత్రం గాఢంగా ముద్రించుకపోవాలి. అప్పుడే కవి, దర్శకుడు, నటులు—వీరందరి కృషి ఫలించిం దన్న మాట.

# 'మాతృదేవో భవ'



చెల్లాయి జాలిచూపులకు గుండె తరుక్కుపోయి పర్యాన చించేశాను వాచకపుస్తకం. మేష్టారు సంతోషంతో ఒళ్లుమరిచి చెప్పుకు పోతున్నారు పాఠం: 'తల్లికంటెను వేరుదైవంబు గలదె!' తల్లి ప్రత్యక్షదైవం. పదినెలలు మోసి కన్నది! తన రక్తం ధారపోసి రూపమిచ్చింది! అసహ్యం చూపకుండా మలమూత్రాలెత్తి పోసింది! కడుపు గట్టుకుని పోషించింది! ప్రాణాలకైనా తెగించి ఏ కష్టం కలక్కుండా కంటికి రెప్పల్లే కాపాడింది! ఇంతకంటె యింకేం కావాలి నిదర్శనం? 'అబ్బ! మాష్టారెంత బాగా చెప్పార్రా పాఠ మివ్వాళ!' అనుకున్నారు పిల్లలందరూ. తల్లి ప్రత్యక్ష దైవం! ఔను గా[illegible].

నాన్నకు పక్షవాత మొచ్చి నాలుగేళ్ళ నుంచి మంచాన వున్నారు. ఇంట్లో అమ్మ ఒక్కర్తే-ఆడకూతురు. నాన్న ఉద్యోగం చేస్తున్నప్పుడు మామయ్యలు ఒకరు విడిచి ఒకరు ఎప్పుడూ అమ్మకు తోడుగా వుండేవారే; కాని తరవాత క్రమంగా మా యింటివేపే రావటం మానేశారు. 'మామయ్యలు రావటమే లేదేమే!' అని అమ్మ నడిగితే, 'వాళ్ళకేం యిళ్లూ వాకిళ్లూ లేవా, అస్తమానం నీయింట్లో చాకిరీ చెయ్యటాని' కని కసిరింది. వాళ్లీ మధ్య యిళ్లూ వాకిళ్లూ కట్టుకుని వుంటారు! నాన్న కేదన్నా మందూ మాకూ తీసుకు రావాలన్నా, అంగడివెచ్చాలు తేవాలన్నా మార్కెట్నుంచి కాయగూరలు తేవాలన్నా నేనూచెల్లాయే వెళ్లేవాళ్ళం. అమ్మ బజారుకు పోగూడదుట. పాపం, అమ్మను కొడతారు గావును బజార్లో. ఓనాడు బియ్యం మోసుకురాలేక కూలాడికి బేడిచ్చి ఎత్తించుకొస్తే, 'తింటిపోతులు మీరుండగా బియ్యానికూలి మనిషెందు' కని కోప్పడ్డది కూడా అమ్మ. ఈ చెల్లాయికి డబ్బు విలువే తెలియదు. 'నాన్నకు ఉద్యోగం లేదుగదా, మన తిండికే డబ్బుచాలదు - కూలి మనిషికూడా బేడెట్లా వొస్తుంది, నేను మోస్తానే.' అంటే 'అమ్మ

వై. యం. శర్మ

తలనూనెలూ, పూలూ రిబ్బన్లూ, పవిత్రవికేలూ కొనుక్కోటం లేదమ్మా? ఓదేదలోనే యిద్దై పోతావూ ఏమిటి? పసివెధవ్వి నువు మొయ్యలేవు, నీ మెడలు నెక్కి పెడతై వద్దమ్మా' అన్నది నామాట వినుపించుకోకుండా.

ఈ నాలుగేళ్లూ పాపం నాన్నకు రామారావుగారే వైద్యం చేస్తున్నారు. మనిషి చాలా నెమ్మదస్తుడు, దయగలవాడు, జబ్బు నయమైతే సంతోషించి యిచ్చిందేదో పుచ్చుకుంటాడు. నయంకాకపోతే కానీ తీసుకోడు, మందుఖర్చుతప్ప. ఇంతెందుకు - నాన్నకు దమ్మిడీ సంపాదన లేకపోయినా నాలుగేళ్ళ నించీ ఎర్రని యాగాని పుచ్చుకోకుండా మందిస్తున్నాడంటే ఆయన మంచి తెలియటంలేదూ? అదే కారణంఆయన వైద్యం అంత పెరగటానికి. పైగా మా యింటిఖర్చు లేదన్నా పదీ యిరవై కావలిస్తే ఆయన దగ్గిరికే పంపిస్తుండేది అమ్మ. మాటలా మరి- ఆడకూతురొక్కతీ సంసారం యీదడమంటే! మాయింటి కొచ్చిన కొత్తల్లో ఆయన నన్నూ చెల్లాయినీ ఎంత మెచ్చుకునేవాడనీ!' "నీ పిల్లలు నిజంగా రత్నాల్లాంటి వాళ్లు సులోచనా! చక్కగా నీలాగే కలకల్లాడుతూ వుంటా'రంటూ మమ్మల్నెత్తుకుని ముద్దెట్టుకునేవాడు! నాన్న మందుతో పాటు రోజూ మాకు పిప్పరమెంట్లూ చాక్లెట్లూ తెచ్చేవాడు. పండగలప్పుడు చెల్లాయికి ఫ్రాకులూ నాకు బుష్ కోట్లూ, అమ్మకు సిల్కుచీరెలూ జాకెట్లూ తెచ్చేవాడు. రానురాను చెల్లాయికి ఫ్రాకులు లేవటం మానేసి అమ్మకే మంచిమంచి చీరలు తెచ్చేవాడు. చిరుగ్గుడ్డల్లో వుండే చెల్లాయిని చూస్తే ఆయన కసహ్యంకాదూ మరీ?

ఆవేళ పూలబ్బి దగ్గిర సేరు పూలు కొంది అమ్మ. గబగబా చెల్లాయిని పిల్చి, గౌను తెప్పించి పంపుకింద పుతుకుతూ, 'ఇవాళ అమ్మ పూలు కొన్నదే!' అన్నాను. పాపం చెల్లాయి ఎంతో సంబరపడింది. "నువ్వెందుకు లేరా మొగవాడివి, ఆడపిల్ల న్నేనింట్లో వుండగా? నే పుతుక్కుంటాన్లే - నచ్చేట్టలేదూ?" అనడిగింది. నిన్న డాక్టరు బజా రెళ్ళి బటాసీలు కొనుక్కోమనిచ్చిన అణా వుంటే, సుబ్బిసెట్టి దుకాణం దగ్గిరికి పరుగెత్తి ఎర్రసబ్బు తెచ్చిచ్చాను.

సాయంత్రం చెల్లాయీ నేనూ కలిసి అరగంట కష్టపడి పూలచెండు గుచ్చాం! ఆరేసుంచిన ఫ్రాకు తొడుక్కొచ్చింది చెల్లాయి. మొగవాణ్ణి యెరక్కపోయినా కష్టపడి చెండును చాతైనంత షోగ్గా అమిర్చాను చెల్లాయి తల్లో. ఆసంతోషంతో నేను పిలుస్తున్నా వినిపించుకోకుండా అమ్మదగ్గిరికి పరిగెత్తింది చెల్లాయి, "అమ్మా, నే నెంత బావున్నానో చూడవే!" అంటూ. అమ్మ నిర్ఘాంతపోయి, "ముష్టి ముండా, నీకి వేషాలేమిటే? పావలా బెట్టి కొనుక్కున్న పూలు తగలేశావు!" అని తిట్టింది. అమ్మ డాక్టరుతో అవసరమైన విషయాలు మాట్లాడేటప్పుడు పలకరించకుండా వుండాలిసింది - చెల్లాయికి వేళాపాళా తెలియదు! పాపం, నన్ను కావిలించుకుని ఏడిస్తే నాకూ ఏడుపొచ్చింది.

మా అదృష్టం బాగుండక నాన్న చచ్చిపోయారు. అమ్మ దిగులుపడ్డది. ఆవాళ ఒక్కరూ మాయింటి కొచ్చి పలకరించలేదు. మామయ్యలన్నా రాలేదని అమ్మ నన్ను కావిలించుకుని ఏడ్చింది. "వాళ్ళెలా వస్తారే యిళ్లూ వాకిళ్లూ వుంటేనూ" అని నేను సముదాయిస్తే మరీ వెక్కివెక్కి ఏడ్చింది. పాపం, ఒక్క డాక్టరే అన్నిసహాయాలూ స్వయంగా చేశాడు! పదిరోజులూ అయాక అద్దె యిచ్చుకోలేమని మే మంటున్న యిల్లు ఖాళీ చేయించి మమ్మల్నందర్నీ డాక్టరు తనయింటికి తీసుకెళ్ళాడు. పాపం డాక్టరు చాలా మంచివాడు. అమ్మ చెప్పింది కూడా.

నాన్నను తలుచుకుని అమ్మ రోజూ ఏడిచేది కళ్లు కాయలుకాసేట్టు. పాపం, విచారంతో చిక్కి సగమైన అమ్మ డాక్టరిచ్చే టానిక్కులతోనూ ఓదార్పులతోనూ క్రమేణా కోలుకుంటున్నది. ఆరోగ్యాని కని బలవంతంగానయినా అమ్మను నవ్విస్తున్నాడు డాక్టరు. ఇప్పుడిప్పుడే కాస్త మంచిగుడ్డలు కట్టుకుని పూలవీ పెట్టుకుని అమ్మ లోకంమొహం చూస్తున్నది. బలం పట్టేందుకు అమ్మను డాక్టరు తనవెంట షికారుకు నడిపించుకెళ్తున్నాడు. నిజంగా డాక్టరు సాయమే లేకపోతే అమ్మ యేమయ్యేదో!

డాక్టరు మేలును అమ్మ మరిచిపోలేదు. ఇప్పు డమ్మ ఏ పని చేసినా డాక్టరును సంతోష

పెట్టటానికే. అనాడే, ఆఫీసరుట ఆసుపత్రి చూడ్డానికొచ్చారు. ఆయన కారోజు టీపార్టీ ఏర్పాటు చేశా డాక్టరు, ఇంట్లోనే. పొద్దున్నే తానూ చెల్లాయికి తలంటి పోసి పట్టుబట్టలు తొడిగిం దమ్మ. పట్టుఫ్రాకు తొడుక్కుంటే చెల్లా యెంతందంగా వుందో! "ఎలా వున్నాన్రా అన్నాయ్!" అనడిగింది నన్ను. ఆనందం పట్టలేక ఎత్తుకుని ముద్దెట్టుకున్నాను. మమ్మల్ని చూసి అమ్మకూడా మురిసిపోయి ఉంటుంది. చెరో రూపాయీ జేబులో వేసింది బొమ్మలూ మిఠాయీ కొనుక్కొమని. "ఎంచక్క అనుకుంటూ డాక్టర్ని నాన్నా అని పిలుస్తావు గదూ!" అనడిగింది. నాకు వొళ్లు మండి రూపాయి నేల విసిరి కొట్టి. "ఛోఛో. మే మేం పిలవం" అన్నాను. అమ్మ గుడ్లురిమింది. కాని నేను లొంగక పోవటం చూసి, "ఈ వొక్కరోజుకే నాన్నా- ఆఫీసరుగారొచ్చారు. డాక్టర్ని తప్పుపడతారు- పాపం డాక్టరు ఉద్యోగం పోతుంది; డాక్టరు మనకు సాయం చెయ్యలేదూ!" అని మరిమరీ బుజ్జగించి చెపితే పాపమని సరే నన్నాం. ఆ పగలల్లా చాలాసంతోషంగా గడిచింది! నాన్నను చాలాకాలంనించీ మరిచిపోయివున్న చెల్లాయి ఒక్కసారిగా నాన్న దొరికేసరికి సంతోషంతో ఎగిరి గెంతసాగింది! రోజూ నాతోనేగాని మాట్లాడందే ఆ వేళ పసపోసిన పిట్టయింది! ఎన్ని కొండాలు చెప్పిందో నా మీదా, అమ్మ మీదా డాక్టరుతో! ఆఫీస రెదట డాక్టరు చెల్లాయి నెత్తుకుని ముద్దెట్టుకున్నాడు కూడా! పాపం. నాన్నే వుంటే చెల్లాయి రోజూ యిలానే కేరింతలు కొట్టేదిగావును! నా కళ్ళమ్మట నీళ్ళు గిర్రున తిరిగాయ్. కాని అమ్మ చూస్తుందని తుడిచేసుకున్నాను.

ఆఫీసరు మమ్మల్నెంతో మెచ్చుకున్నాడు! చెరో పెన్నూ బంగారపువి బహుమానమిచ్చి మరీ వెళ్ళాడు! "అమ్మకు చాకలిపద్దు నేనే రాసిపెడతానా" అన్నాయ్-నా పుస్తకంనిండా వేస్తా బొమ్మలు గీసేస్తా-ఎంచక్క అమ్మకు ముగ్గులు నేర్పుతా!" చెప్పాను గదూ, ఆరోజు చెల్లాయి వాగుడు కంతులేదని! ఆఫీసరు వెళ్ళిపోగానే మా రెండు పెన్నులూ అమ్మా డాక్టరూ వారొకటి లాక్కున్నారు. చెల్లాయి కోపమొచ్చి ఏడుస్తూ కిందపడి దొర్లింది. "చూడ్డి గాడిదెలా దొర్లుతున్నదో!" అని అసహ్యించుకున్నా డాక్టరు. అమ్మొచ్చి చెల్లాయిని చావచితగ్గొట్టింది. కింద దొర్లితే పట్టుఫ్రాకు పాడైపోతుందని చెల్లాయి తెలుసుకోదాయిని.

రానురాను మేం కేవలం డాక్టరు చేతిలో కీలు బొమ్మలంగా, సర్కసు జంతువులంగా తయారైనాం! పొద్దున్నే ఆయనకు గుడ్మార్నింగు కొట్టాలి, కాఫీ ఫలహారం అందివ్వాలి. బట్టలు కట్టుకోమంటే కట్టుకోవాలి విప్పెయ్యమంటే విప్పెయ్యాలి! అలా చేస్తేనేగాని మేము మనుషుల్లో వుండే బుద్ధిమంతులం కామట. అమ్మా డాక్టరూ ఒకే కంచంలో తింటారు! వాళ్లు విడిచిపెట్టిన యెంగిలి మెతుకులు మేం తినాలి! "వస్తువు పారేసుకుంటారుటే పిచ్చి తల్లీ!" అని చెప్పిందట చెల్లాయితో అమ్మ! నా కోపమొచ్చి రొండ్రోజులు తిండి మానేశాను. పెంకి వెధవ! కడుపు మాడితే వాడే తింటాడ్లెమ్మనుకుని వూరుకున్నారు అమ్మా, డాక్టరూ! కోపొచ్చి పడిపోతే ఏరిపారబోసిన నూక తెచ్చి చెల్లాయి అమ్మ చూడకుండా గంజి కాచిచ్చింది. ప్రాణాం కొంచెం కుదుటబడ్డవి. ఆ సాయంత్రం అమ్మా డాక్టరూ పకోడీలు చేసుకుని గదిలో పెట్టుకు తింటుంటే ఆవాసనకు చెల్లాయి నోరూరి కాలుగాలిన పిల్లిల్లే గోడలు పట్టుకు తిరుగుతున్నది! నాలేసి బజారుకు పరిగెత్తి నాకొత్త పెన్ను లమ్మేసి నూనెపకోడీలు తెచ్చిస్తే చెల్లాయి మొహం చందమామైంది! మర్నాడు పెన్నులు కనపడ్డందుకు నా వీపుపగిలింది.

ఆ రాత్రికిరాత్రి యిల్లువిడిచి పారిపోయాం చెల్లాయీ నేనూ! బయటికైతే వచ్చేశాం గాని ఎక్కడికి పోవాలన్నదీ తేలలేదు. కడుపులు తగలబడి పోతున్నై, చేతులో కానీ లేదు! మా కెదురుగా ఓ పట్టు చొక్కా లాయన వొస్తున్నాడు. ఆయన దగ్గిరి కెళ్లి, "పాపం మీరా ట్రంకు మొయ్యలేక అవస్థ పడుతున్నారు- ఇలా యివ్వండి నే తెస్తా," నన్నాను. ఆయన నవ్వుకుని "వద్దులేరా అబ్బాయ్ ఈ రూపాయి తీసుకు ఏవన్నా కొనుక్కో" మని యిచ్చాడు! ఊరికే యిస్తే అక్కర్లే

పనున్నాను, మున్సిపాలిటీకోట మిష్టాలేక. పాపం మా యున నాఅభిమానం గమనించి బరువులేని పని ఇచ్చి తనవెంట తిప్పించుకున్నాడు. ఓ పావలాతో కారప్పూస కొనుక్కుతిని పంపుదగ్గర నీళ్లుతాగి ఆరాత్రికి రైలుస్టేషన్‌లో పడుకుని హాయిగా నిద్రపోయాం! పొద్దున్నేలేచి చూసుకుంటే జేబులో డబ్బులు కనపడ్లేదు!! ఆపొద్దున బళ్ళవాళ్లెవరూ నాకు దమ్మిడీ కూలి దొరకనివ్వలేదు. పాపం, చెల్లాయి ఆకలికి మొహం వేలేసి, "అన్నాయ్, ఆకలౌతున్న దింటి కెళదామ్మటా?" అన్నది! "ఛీఛీ! నన్ను చంపినా మళ్ళీ ఆయింట్లో అడుగెట్ట"నన్నాను. ప్లాటుఫారం మీద తిని పారేసిన అన్నపొట్లాలు కుక్కలొస్తోంది లాక్కొని అందులో మెతుకు ఏరుకుతింటూ ఇద్దరబ్బాయిలు సంతోషంగా పాడుకుంటున్నారు, "మాదీ స్వతంత్ర దేశం, మాదీ స్వతంత్రజాతీ!" అని. వాళ్ళ దగ్గిర కెళుతున్న చెల్లాయిని దవడ పగలేద్దామని చెయ్యెత్తి, మళ్ళీ జాలేసి దించేశాను. ఆ పగలు పస్తున్నాం!

ఇలా చాలా అవస్థలు పడ్డాం - కూలి దొరికి నాడు తినీ, లేనిరోజున మాడీ. ఈవూరు రణబస్తీ కావటాన మొదట్లో రాకపోయి నా క్రమేణా బాగానే దొరుకుతున్నది కూలి. మెల్లి మెల్లిగా నాలుగురాళ్ల వెనకేశాం! నాకు రెండు చొక్కాలూ, రెండు లాగులూ - చెల్లాయికి రెండు పట్టు ఫ్రాకులూ, రెండు చెడ్డీలూ కుట్టించుకున్నాం. ఓనెల అద్దె ముందుగానే యిచ్చేసి ఓగది అద్దెకు తీసుకున్నాం. ఎప్పటిల్లే మళ్ళీ బళ్లో కెళుతున్నాం! పొద్దునే లేచి తొమ్మిది గంటలదాకా కూలికి పోయొచ్చే వాణ్ణి. ఈలోగా చెల్లాయి అన్నం వుడకేసేది. ఇద్దరం పెట్టుకుతిని బడికెళ్లి చదువుకునే వాళ్లం. పరీక్షలో నాది ఫస్టుమార్కు, చెల్లాయిది సెకండు మార్కు.

ఈ ఆర్నెల్లనించీ మా మేష్టారింటి అక్కర్లేక పోయినా నిన్న, మా మార్కులు చూసి మా క్లాస్రూంలో కొచ్చింది అమ్మ - విడుస్తూ మా కోసం. పళ్లూ ఫలారాలూ తెచ్చింది కూడా. సరిగా ఆ సమయాన అమ్మ పాఠం చెబుతున్నారు మేష్టారు! మమ్మల్ని తన కడుపుదివ్వ తెచ్చేట్టు అల్లరిచిల్లరగా తిరగటం మాని తన వెంట రమ్మన్నది. నాకు పళ్లమాలిన కోప మొచ్చిందిగాని గొడవౌతుందని టూకీగా "పోం రా"మన్నాను. చెల్లాయి "డాక్టరు దగ్గిరికి తీసుకెళ్లటానికామ్మా మళ్ళీనీ!" అనడిగింది, కొంచెం తెలివితక్కువగా. క్లాసంతా గొల్లుమన్నది. మేష్టారు కల్పించుకుని "అదేమిటమ్మాయి, అలా అనొచ్చా? అమ్మ నల్లరివెళితే నీకాదా అల్లరి! తల్లి చెడుదైతే పిల్లల్నేమని పిలుస్తారు? పుస్తకంలో చూడూ, అమ్మను గురించెంతగొప్పగా రాసున్నదో!" అని హితబోధ చేశారు.

చెల్లాయి జాలిచూపులకు గుండె తరుక్కుపోయి పర్రున చించేశాను వాచకపుస్తకం.

కథానిక

# మరణ శాసనం

బి. ఎస్. ఆర్. కృష్ణారావు

"నాన్న చాలా ప్రమాదస్థితిలో వున్నారు. అర్జంటుగా రావాలి" అన్న టెలిగ్రాం చూసేసరికి రామారావుకి చాలా ఆశ్చర్యం కలిగింది. సాధారణంగా ఏదయినా టెలిగ్రాం వచ్చిందంటే ఏదో పెద్ద అవాంతరం జరిగితేనే గాని టెలిగ్రాం ఇవ్వరనే విషయం అందరికీ తెలుసును. టెలిగ్రాం తీసుకువచ్చిన మనిషి రామారావు దగ్గరకు రాగానే ఏం ఉపద్రవం జరిగిందోనని తోటి గుమాస్తాలందరూ ఆదుర్దాగా రామారావువైపు చూడసాగారు. టెలిగ్రాం చదువుతున్నంతసేపూ అతని ముఖలక్షణాలు విచారాన్ని సూచించకుండా ఆశ్చర్యాన్ని సూచించేసరికి ఆందరికీకూడా చాలా ఆశ్చర్యం కలిగింది. పక్కనున్న గుమాస్తా చేతిలోనిది తీసుకుని చూశాడు. అది చదివేసరికి పరాయివాడయినా అతనికి కలిగిన విచారంలో పదోవంతయినా రామారావుకు కలుగలేదు. ఇంత ఉపద్రవమైన కబురు తెలిసినప్పటికీ అతను చలించక పోవటాన్ని చూసి అంతా తలో మాటా అడిగారు. కాని దేనికీ రామారావు సమాధానం చెప్పలేదు. అయినప్పటికీ వెంటనే నాలుగురోజులు సెలవు రాసి, ఆ సాయంత్రం బండికే బయల్దేరాడు రామారావు.

మర్నాడు ఉదయానికల్లా ఇల్లు చేరుకున్నాడు. సవతి తల్లి అతన్ని చూడగానే బావురుమని ఏడ్చింది. పిల్లలు ఇద్దరూ - అన్నయ్యా, నాన్న చచ్చిపోయాడు- అని కాళ్ళకి చుట్టేసుకుని ఏడవసాగారు. పరిస్థితులు ఇదివరలో ఎట్లా వున్నా ఆస్థితి చూసేసరికి రామారావుకూ దుఃఖం పొంగి పొర్లుకొచ్చింది. వచ్చే విచారాన్ని దిగమింగుకుంటూ ఒకచోట చతికిల బడ్డాడు. ఇంతలో దహన సంస్కారం చేసిన వాళ్లుకూడా వచ్చారు. వాళ్ళందర్నీ చూసేసరికి రామారావుకు దుఃఖం పొంగి పొర్లు కొచ్చింది మళ్ళీ.

"ఎన్ని అనుకున్నా తండ్రి కొడుకులు కాకపోరు. ఇంటికి పెద్దకొడుకువై వుండికూడా ఆసాంతానికి అందుకో లేకపోయావు. నీకు టెలిగ్రాం ఇచ్చిన మనిషి ఇంటికి రాగానే 'టెలిగ్రాం ఇచ్చారా' అని చెప్పి ప్రాణం వదిలాడు. రాత్రి తెల్లవార్లూ ఉంచాం. ఇంకా ఉంచటం దేనికని ఇప్పుడే అంత్యక్రియలు జరిపించి వచ్చాం. మీ పెద్దతమ్ముడే పెద్దకొడుకై వాడే దహనం చేశాడు" అన్నాడు అక్కడి పెద్దల్లో ఒకాయన.

"అన్నయ్యా, నాన్న మనల్ని విడిచి వెళ్లాడు. ఇంక మన గతేం కానుందో" అని అన్నగార్ని కావిలించుకుని ఏడ్చాడు సవతి తల్లి పెద్దకొడుకు. రామారావు వస్తూన్న దుఃఖాన్ని ఆపుకుంటూ "ఏం చేస్తాం చెప్పు-అంతా విధికృతం. ఎవరెంత వరకూ నోచుకున్నారో అంతే ప్రాప్తి" అని ఊరుకున్నాడు రామారావు.

తరువాత కర్మకాండలన్నీ అన్నదమ్ములిద్దరూ పూర్తిచేశారు. పన్నెండోనాడు ఆశీర్వదించటానికి పెద్దలందరి సమక్షంలోనూ అన్నదమ్ములిద్దర్నీ కూర్చోపెట్టారు. ఆశీర్వచనాలూ, బట్టలు పెట్టటాలూ అన్నీ అయాయి. "పెద్దవాళ్లెవరన్నా నాలుగుముక్కలు చెబితే చెప్పండి, పాపం వాళ్ళూ చిన్నవాళ్లు" అన్నారు ఎవరో. "ఏముంది చెప్పటానికి - సత్యం పాపం చిన్నవాడు. వాడికి సంసార విషయాలు తెలీవు. మిగిలినవాళ్లంతా మరీ చిన్న వయస్కులు. ఇంక రామారావే అందర్నీ సంబాళిస్తూ సంసారాన్ని దిద్దుకురావాలి" అన్నాడు వచ్చిన పెద్దల్లో ఒకాయన.

"ఎంత మాటన్నారు బాబుగారూ. పరిస్థితులు అన్నీ తెలిసికూడా మీరిట్లా అనటం నాకు బాగుండలేదు. సత్యం చిన్నవాడయినా సంసార స్థితిగతులు పూర్తిగా తెలిసిన వ్యక్తి మా పిన్ని ఉన్నది. ఆమే అన్నీ చూసుకోగలదు. నా పాటి

[illegible] అవసరం వుండదని నా ఉద్దేశ్యం" అన్నాడు రామారావు.

"అవున్లెండి, ఆమాటా నిజమే. దూరాన ఉద్యోగపు ఊళ్ళో వున్నవాడికి వాడికేమటుకు ఎట్లా తెలుస్తుంది! అంతా ఇక నేనే చూసుకు పోవాలి" అని గదిలోంచి వస్తున్నాయి నొక్కులు నొక్కుతూ అన్నది రంగమ్మ.

ఇంకా చావు కొచ్చిన వాళ్లుకూడా వెళ్ళలేదు. అప్పుడే ఈవిడ ఇట్లా మాట్లాట్టం మొదలు పెట్టిందేమని అంతా ముక్కుమీద వేలేసుకున్నారు. ఇంక మళ్ళీ ఎవరూ నోరెత్తలేదు. వచ్చినవాళ్ళంతా ఆ రోజునే ఎవరిదోవన వాళ్లు వెళ్ళిపోయారు.

ఈలోగానే మళ్ళీ ఒక పదిహేనురోజుల పాటు సెలవు పెట్టాడు రామారావు. తండ్రి చావు విషయం కనుక మంజూరుకూడా ఐంది.

రెండుమూడు రోజుల తరువాత పినతల్లి మెల్లిగా రామారావు దగ్గర కొచ్చి "మీ నాన్న రాతకోతలు ఏం రాశారో ఎవరికీ తెలీదు. పెట్టె తీసి ఏమయినా రాసిపెట్టిపోయారేమో కాస్త చూడు" అన్నది.

రామారావు మాట్లాడలేదు. శూన్యాంగణం లోకి చూస్తూ కూర్చున్నా, పైకి మౌనంగా వున్నా లోపల్లోపల ఆలోచిస్తూనే కూర్చున్నాడు. తన పినతల్లి నైజం ఇదివరకునుంచీ తనకు తెలిసిన విషయమే కాబట్టి అతనికాట్టే ఆశ్చర్య మనిపించలేదు ఆమె మాటలు. అతనేమయినా మాట్లాడతాడేమోనని కొంతసేపు అక్కడే నిల్చుంది. కాని రామారావు మాట్లాడలేదు. ఏవో తీవ్రమైన ఆలోచనలు అతని మనస్సులో చెలరేగుతున్నాయి. గతాన్ని స్మృతికి తెచ్చుకుంటూ, తన తండ్రి నైజాన్ని ఒకసారి తల్చుకుంటూ కన్నార్పకుండా మరోవైపు చూస్తూ కూర్చున్నాడు. తన పినతల్లి కాపురాని కొచ్చిన రోజునుంచీ తనుపడిన అవస్థలూ, ఆవిడ చేత తను పడిన మాటలూ, తిట్లూ, తిరస్కారాలూ తల్చుకునేసరికి అతనిగుండె చెరువై పోయింది. "నీకు తెలీందేముంది పిన్నీ, నీకు తెలీకుండా ఈ ఇంట్లో చీమకూడా దూరటానికి వీల్లేదు. ఆ రాతకోతలేవో నీకు తెలియాలి గాని నాకేం తెలుస్తాయి" అన్నాడు సహజంగానే.

లోపల ఆ మాటకు సంతోషించినా, కృతఘ్నతాన్ని సహజంగా ప్రదర్శించాలనే ప్రయత్నంతో, "ఇదేమిటి రామం, అట్లా అంటావు! ఇంటికి పెద్దకొడుకువు నీవు. ఆయన పోయిం తరువాత సంసారంలోగల బరువు బాధ్యతలు వహించవలసింది నీవే కదా. ఇదివరకుదాకా తెలిసినా తెలీకపోయినా ఇకనైనా ఆకళింపు చేసుకోవాలి మరి" అన్నది తల ఆడిస్తూ. ఈ మాటలో అతని ముఖంలో ఆవరించి వున్న నీరదాలు నశించిపోయి నిర్మలా లవుతాయని ఆమె ఆశించింది. కాని రామారావు ఏ మాత్రం తొణకలేదు.

"పోనీ నీవయినా చూడరా, సత్యం" అన్నది రంగమ్మ కొడుకువైపు చూస్తూ.

"నాకు తెలీదు, అన్నయ్యనే చూడమను. లేకపోతే నువ్వే చూడు" అన్నాడు సత్యం.

"ఎవరికీ పట్టకపోతే ఇంక నేనే వెతకాలి-ఏంచేసేది" అంటూ వెళ్ళింది గదిలోకి.

పినతల్లి ఇట్లా వెళ్లేసరికి, రామారావు మళ్లీ ఆలోచించసాగాడు. తానేమో ఎవరికీ అక్కర లేనివాడుగానూ, ఎందుకూ పనికిరాని వాడు గానూ- ఇంకా ఏమేమో అల్లుకొని పోతున్నది అతని మనస్సు. దానిని నిబంధించే సంకల్పా, అదుపులో ఉంచే శక్తిమూ కానరాలేదు అతనికి.

రంగమ్మ పెట్టె వెతికి ఒక కాగితం తీసుకు వచ్చి రామారావు కిచ్చింది. ఎంత మనస్సు చిక్కబట్టుకున్నా మనస్సాగక ఆ కాయితం చూసి చదివాడు. అంతా తాను అనుకున్నట్టుగానే వుంది. ఆస్తంతా తండ్రి స్వయంపాదనే కాబట్టి రెండవ భార్యకూ, ఆమె సంతతికీ రాశాడు. అందులో రామారావు ప్రసక్తే లేదు. ఇల్లు పినతల్లి పేరి కిచ్చాడు. ఆమె ఆ కాయితం తీసుకుని ఆదోమాదిరిగా అతనివైపు చూసి వెళ్ళిపోయింది. తల్లి అటు వెళ్ళగానే సత్యం కూడా వెళ్ళిపోయాడు.

రామారావు మళ్లీ ఆలోచించసాగాడు. తన పినతల్లి ఈ విధంగా చెయ్యటానికి కారణం- ఇక్కడ తనకేమీ లేదనీ, ఇంక అకాశవీధుల్లో వెళ్ళమనీ చెప్పటమేనని అతని అంతరాత్మ బోధించింది. భర్త పోయినాడనే విచారం లేక

పోగా తల్చిన ఇరవై రోజుల్లోగానే ఆస్తి విష
యంలో ఇటువంటి పేచీలు పెట్టటంతో,
బహుశా తనే ఈ విధంగా చెప్పి విలు రాయిం
చిందని అతని మనస్సుకు తట్టి ఆమె మీద
ఒక్క క్షణంలో విరక్తిభావం కలిగింది. ఏదో
అలక్ష్యమయిన దానికోసం మారాము చేసే పసి
పాపకు తల్లి స్తన్యమిస్తే ఏ విధంగా మర్చిపో
తాడో, అవిధంగానే సిగరెట్టును కాలుస్తూ మెల్లి
గా పొగ వొదులుతూ ఆ ధ్యానంలోపడి
మనస్సును ఈ విషయాలనుంచి మళ్ళిద్దామని
ప్రయత్నించాడు. కాని ఇది అట్టేసేపు సాగ
లేదు. సిగరెట్టు పారేయగానే అతని బుర్ర
పనిచెయ్యటం మొదలు పెట్టింది. సత్యం
వంటింట్లో తల్లితో మాట్లాడి బయటికి వెళ్ళటా
నికి వచ్చాడు. రామారావు వాడిని పిలిచి
"సత్యం, ఒక్క మాట అడుగుతా చెబుతావా?"
అన్నాడు లేని నవ్వు తెచ్చుకుని. సత్యం తల
వూపాడు.

"ఆ విల్లు మీ అమ్మ చెప్పి రాయించిందేనా"
అన్నాడు. ఈమాట అనేసరికి అతని కంఠం పూడి
పోయి నట్లయింది.

"ఆ విషయం నాకు తెలీదు" అని విసుగ్గా
వెళ్లిపోయాడు సత్యం. అయింట్లో ఎవరికీ ఇంటి
యజమాని చనిపోయాడనే దుఃఖం లేశ
మయినా లేదని గ్రహించాడు. అందరి దృష్టి
ఆస్తిమీదే కేంద్రీకృతమై వున్నదని తెలుసుకో
టానికి అట్టేకాలం పట్టలేదతనికి.

ఆరాత్రి భోజనం కూడా చెయ్యకుండా కాఫీ
హోటల్లో కాఫీ తాగి పడుకున్నాడు. తతిమ్మా
వారంతా సుష్టుగా భోంచేసి పడుకున్నారు.
ఎంత ప్రయత్నించినా అతనికి నిద్రపట్టలేదు.
తను మాతృవిహీనుడవటమే దీనికి మూలకారణ
మయినప్పటికీ, తన పినతల్లి చేతిలో తండ్రి
కీలుబొమ్మయి వుంటమే దీనికంతకీ కారణమని
ఇదివరకే గ్రహించాడు. మనుష్యులను అతిగా
లోబరుచుకున్న కామప్రభావం వల్ల న్యాయా
న్యాయ విచక్షణజ్ఞానం ఆ సమయంలో నశించి
పోవటమే కాకుండా, ఆ వృద్ధుడు నాటిన
విషబీజం కలకాలం వుండి, చివరకు శరీరంతో
చితించిపోతుందనే మాత్రం ఈ విషయంలో
మరిపోయిందని అనుకున్నాడతను. తొలిభార్య
గతించిన తరువాత వివాహం చేసుకొని మళ్ళీ
భార్యలు చాలా అరుదు. చేసుకున్నప్పటికీ పెద్ద
భార్య పిల్లలని కూడా రెండవ భార్య పిల్లలతో
పాటుగా చూట్టం సామాన్యుని లక్షణం. అట్లా
చూడకుండా తన పడుచుభార్య కనుసన్నలకు
వశులయినప్పటికీ చాటుగానైనా పెద్ద భార్య
పిల్లలకు ఒకింత ముట్టచెప్పటం మధ్యముల లక్ష
ణం. జీవితకాలంలో ఇవేవీ కూడా ఒనగూడక
పోతే ఆసాంతంలో వీలుద్వారా నయినా తన
ప్రేమవాత్సల్యాలు వెల్లడిచేసి చచ్చినతరువాత
నైనా మంచివాడనిపించుకోటం అధముల లక్ష
ణం. చచ్చినతరువాత కూడా మొదటి భార్య
సంతానాన్ని అన్యాయం చేసిపోవటం అధమా
ధముల లక్షణం. ద్వితీయ వివాహం చేసుకోటం
నుంచి పాతబడినసంసారజీవితంలో మళ్లీ మధుర
మైన కలయికలనూ, ప్రణయాలనూ తావున్న
దనుకుని భ్రమించి వివాహం చేసుకుంటారు.
కాని, ఎంతయితే అనుకుంటారో అంతకుమించి తల
అడ్డంకులూ, వ్యతిరేకభావాలూ వుండటం వల్ల—
తా మూహించినట్లు ఉద్భవించవలసిన ప్రణయ
కందళాలు ఊహామాత్రాలుగా మాత్రమే అంత
రించటమే కాకుండా, అపఖ్యాతిపాలయి ఇటు
వంటివారి ఉసురు పోసుకోవాల్సొస్తుందనే
ఇంగితజ్ఞానాన్ని మర్చిపోతారు. రామారావు
ఇవన్నీ ఆలోచించినమీదట ఇంక ఏదీ ఆలో
చించి బుర్ర పాడుచేసుకోకూడదని మనస్సుకు
సరిపెట్టుకుని నిద్రపోయాడు.

మర్నాడు ఉదయమే అన్నది పినతల్లి—

"అయిందేదో అయిపోయింది, రామం. వీలుగా
వుంటే పాపం మాసికాలకు వద్దువుగాని. ఆ మహా
రాజు తన రోజులు వెళ్ళబుచ్చుకుని వెళ్ళిపో
యాడు. కచ్చేరీకి సెలవుపెట్టి సెలవంతా పాడు
చేసుకోటం దేనికి? ఇంక మా తంటాలేం
పడతాంలే. నారువేసినవాడు నీళ్లు పొయ్యక
పోతాడా. ఏదో ఆ పిల్లల్ని పెట్టుకుని జీవితం
వెళ్ళబుచ్చుకుంటాను" అన్నది కళ్లొత్తుకుంటూ.

ఆత్మప్రతిష్ఠా పరుడైన అతనికి ఈ మాట
చాలా వెగటు కలిగించింది. కోర్టుద్వారా పరి
ష్కరించుకోందామనే ఆలోచన తట్టిందతనికి.
కాని మరుక్షణంలోనే తీరా అడుగు పెట్టేసరి
వాస్తవిక వ్యవహార జగత్తులో కష్ట నష్టాలను

ఎదురొడ్డాలని గెలవ గలమా అనే అనుమానం కలిగింది. అయినా ఇది మార్గం కాదను కున్నాడు. తన భావి కృషి మాత్రం కేవలం ఉద్యోగమే అనుకున్నాడు. కాని పినతల్లి అనే మాటలు అతన్ని రెచ్చగొట్టసాగాయి. అయింట్లో వాళ్ళ కెంత హక్కుందో తనకూ అంతే హక్కుంది. కాని విపరీత శక్తుల సమ్మేళనం నుంచీ, తన తండ్రి మెత్తదనం నుంచీ పరిస్థితు లిట్లా విషమించాయి. అందుకనే ఆ రోజున టెలిగ్రాం వచ్చినప్పుడు తన పినతల్లికి తనమీద ఇంతజాలి కలిగిందేమా అని ఆశ్చర్యపడ్డాడు. కొంతసేపయాక సంబాళించుకుని-

“అయితే సరేలే పిన్నీ, నాకూ సెలవు అయి పోయింది. సాయంత్రం బండికి వెళతాను” అన్నాడు ముక్తసరిగా. ఆమెముఖం విప్పారింది. ఆ సాయంత్రమే సెల వున్నప్పటికీ వచ్చే శాడు. ఒకరిద్దరి ప్లీడర్లతో ఆలోచించాడు తరు వాత. అదంతా స్వార్జితం కాబట్టి ఏం లాభం లేదన్నారు వాళ్ళు.

పరిస్థితు లిట్లా వుంటాయని తెలిసే వెళ్ళే టప్పుడు అతను తన భార్యా పిల్లలను తీసుకు వెళ్ళలేదు. తీసుకు వెళ్ళటం అనవసరమని తోచిం దతనికి. ఇంటి కొచ్చిన తరువాత భార్య అడిగింది. జరిగిన విషయమంతా చెప్పాడు రామారావు. “సవతితల్లి ఏ ఆట ఆడినా అది హర్షించి వూరుకోవలసిందే నన్న మాట. ఎంతస్వార్జితమైనా కన్నకొడుక్కి భాగ మియ్యరా” అని అతని అశక్తికి కొంచెం ఈసడింపుగా అన్నది గౌరి. అతను మళ్ళీ ఈ విషయం మాట్లాడలేదు.

అతను వచ్చిన మూడో రోజున అనుకోకుం డానే సవతితల్లి పెద్ద కొడుకు సత్యం వచ్చాడు. రామారావుకీ, అతని భార్యకూ కూడా ఆశ్చర్యం వేసింది. కుశల ప్రశ్న లడిగిన తరువాత సత్యం అడిగాడు అన్నగార్ని—

“అన్నయ్యా, జరిగిందంతా మర్చిపో. మన మంతా ఏక గర్భాన జన్మించక పోయినప్పటికీ సహోదరులమే కదా. మనలో మనకు భేదా లెందుకు చెప్పు. మన తండ్రి ఆస్తిలో మీ కెంత హక్కున్నదో నాకూ అంతే హక్కుంది. మన అన్నదమ్ములం నలుగురం పోనీ సమంగా పంచు కుందామా!” అన్నాడు. ఈ మాటకు రామా రావుకి ఆశ్చర్యం వేసింది - ఇంతలో వాళ్ళ మనస్సు ఎట్లా మారిందని. అన్ని దృక్పథాల నుంచీ పరిశీలించుకుని చూసినప్పటికీ, ప్రస్తుత పరి స్థితులను బట్టి ఆ యింట్లో పూచిక పుల్లకూడా ముట్టుకోటానికి తనకు అధికారం ఏ మాత్రమూ లేదే, వాళ్ళబుద్ధి ఈవిధంగా ఎందుకు మారింది! అతనికి అనుమానం కలిగింది.

ఈ మాటలూ, ఈ పరస్పర సహోదర భావమూ దృఢంగా నిలబడతాయన్న విశ్వాసం అతనికి కుదరలేదు.

“చచ్చిన పాముని చావగొట్టే విధంగా, మీ అమ్మ అన్న మాటలు చాలక ప్రత్యేకంగా నన్ను నువ్వు మాట లందామని వచ్చావా సత్యం?” అన్నాడు రామారావు. “అవును, అందుకనే” అన్నది భార్య గౌరి. సత్యం తల వంచుకున్నాడు.

“కాదు అన్నయ్యా, ఇది నిజం - నా మాట నమ్ము. ఆస్తి మన నలుగురం సమంగా పంచు కుందాం. నీ అంగీకారం కోసమే వచ్చాను” అన్నాడు మళ్ళీ సత్యం. అతని మాటల్లో ఎట్టి కల్మషచ్ఛాయా, కృత్రిమమూ లేవని ఈసారి గ్రహించాడు రామారావు. కాని గౌరికి మాత్రం నమ్మకం కలగలేదు.

“మమ్మల్ని ఈ మాత్రం కూడా బ్రతక నీయ కుండా చేద్దామనుకుందా మీఅమ్మ? చాల్లే, వెళ్ల నాయనా. ఆ స్త్రీ వద్దు ఆ ఆస్తీవద్దు” అన్నది కొంచెం విసుగ్గా గౌరి.

“నువ్వూరుకోవే” అని రామారావు భార్యను మందలించి, సత్యంముఖంలోకి చూడసాగాడు. ఇన్ని సంవత్సరాల అనుభవం లోనూ సత్యం తనతో ఇంత ఆప్యాయంగా మాట్లాడ్డం ఎప్పుడూ లేదు. ఈ విధంగా ఎందుకు మాట్లాడు తున్నాడో, సవతితల్లి మనస్సు యీవిధంగా ఎందుకు మారిపోయిందో అతని కర్థం కాలేదు.

“నే చెబితే నువ్వు నమ్మవు, అన్నయ్యా. రాత్రికి నీకే తెలుస్తుందిలే” అన్నాడు ముక్త సరిగా సత్యం.

“సరే నా కిష్టమే. మనం నలుగురం నాలుగు భాగాలు సమంగానే పంచుకుందాం. అట్లాగే కానియ్యండి. మన మందరమూ సహోదరుల మేగా- నువ్వన్నట్లుగా నాలుగోవంతు తీసుకో టానికి నాకిష్టమే” అన్నాడు రామారావు.

"అంత ఎక్కువ రొందుతుకే అన్నాడాయన. "ఆస్తిలోసగం నీకూ, మిగిలిన సగం మామయ్యకి."

ఆ రాత్రి తొమ్మిది గంటలకు వకీలు చంద్రకాంతరావు వచ్చాడు. చంద్రకాంతరావు తన పుట్టుక నుంచీ తన తండ్రికి స్నేహితుడని, తనంటే ఎంతో అభిమానం కలవాడని తెలుసు రామారావుకు. ఆ పూట వెళ్ళినప్పుడు అతన్ని కలుసుకోకుండా వచ్చినందుకు క్షమాపణ చెప్పుకున్నాడు- ఆ [illegible] సమయంలో రాలేక పోయానని. సత్యం, రామారావు, చంద్రకాంతరావు భోజనాల అనంతరం మంచం మీద కూర్చున్నారు. ఇదంతా వింత అగమ్య గోచరంగా వుంది గౌరికి. రామారావు కూడా అతి ప్రయత్నం మీద మనోవికారాన్ని ఎగరకుండా బంధించుకుని చంద్రకాంతరావు ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు.

"అవసాన దశలో నీ పినతల్లి మోసం చేసి ఆస్తి అంతా తన సంతతికి, తనకూ రాయించుకుంటుందని తెలుసు-అందుకని మీనాన్న ముందుగానే జాగ్రత్తపడి ఈ విల్లు రాయించి, రిజిస్టరు చేయించి నా దగ్గర దాచవుంచాడు. తను చని పోయిన తరువాత ఈ విషయం బయట పెట్టమన్నాడు. భార్యాభర్తలిద్దరూ ఇష్టాగోష్ఠిలో వుండగా ఏదో మాటల సందర్భాన ఆవిడ మనస్సుకు కష్టం కలిగించే పని ఎన్నడూ తన బొందిలో ప్రాణం వున్నంత వరకూ చేయనని మాట ఇచ్చాట్ట. అందుకని ఆవిడ మాట ఇన్ని సంవత్సరాలూ సాగించి, మంచమెక్కిన తరువాత నాచేత రహస్యంగా ఈ విల్లు రాయించి రిజిస్టరు చేయించి, ఆమెకు సంతోషం కలిగేందుకుగాను రెండవ విల్లులో ఆస్తి అంతా రెండవ సంబంధపు పిల్లలకే చెందేటట్లుగా వ్రాశాడు ఈ విధంగా చేస్తున్నానని ఒకరికి ఉత్తరంకూడా రాసి ఈ రిజిస్టరయిన విల్లుకు జత చేశాడు. ఇదిగో చూడు" అని వకీలు విల్లూ, ఉత్తరమూ ఇచ్చాడు. రామారావు చదువుకున్నాడు.

"ఈ విల్లు ప్రకారం ఆస్తిలో సగం నీది. తలిమ్మా సగం వాళ్ళ ముగ్గురిదీ" అన్నాడు చంద్రకాంతరావు. సత్యం కల వాచుకున్నాడు.

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షికక్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## విచారణ జరగాలి

కూడూ గుడ్డామాట ఎలా వున్నా కాంగ్రెసు ప్రభుత్వ హయాములో ప్రజానీకం మానవత్వాన్నే కోల్పోతున్నది. పౌరత్వపు హక్కులు నామరూపాలు లేకుండా అంతర్థానమై, గగనకుసుమాలయాయంటే అందులో అతిశయోక్తి కన్పించదు. దీనికి తార్కాణం— మొన్న కాటూరు, యలమర్రు, పెదపనగల్లు, మొవ్వ మొదలైన కృష్ణాజిల్లా గ్రామాల్లో జరిగిన పోలీసు అత్యాచారాలే! సుమారు నాలుగు వందలమంది పురుషులను వివస్త్రులనుజేసి వీధుల్లో నడిపిస్తూ వారివెంట స్త్రీలను నడిపించిన అనాగరిక చర్యను పత్రికలు, ప్రజానీకం తీవ్రంగా నిరసించాలి.

"తమ చర్యలకు అనువైన పరిస్థితిని కల్పించుకొనడంకోసం యిలాంటి వార్తలను వ్యాపింపచేయటం కమ్యూనిస్టులలో ఒక భాగమై వుండవచ్చు" నన్న మదరాసు హోంశాఖా మంత్రిగారి సుభాషితాలు సత్యదూరాలని వేరే చెప్పాలా? అసెంబ్లీలో ఎలక్ట్రిక్ పంకాల గాలిలో దేవేంద్రలోకంలో లాగా సెక్రటేరియెట్ లో వున్న మాధవమీనన్ గారికి ఎక్కడో ఆంధ్రరాష్ట్రం మారుమూలల్లో కృష్ణా జిల్లాలో జరుగుతున్న పోలీసు అమానుష కృత్యాలు ఏం తెలుస్తాయి! తెలుస్తే పత్రికా ప్రతినిధులతో మంత్రిగారు వైరిధంగా ఎందుకు అని వుంటారు?

కాటూరు మొదలైన గ్రామాలలో పర్యటించి వచ్చిన రంగాజీ కమ్యూనిస్టా? మాజీ మంత్రి కూర్మయ్యగారు కమ్యూనిస్టా? యలమర్రుగ్రామ కాంగ్రెసు సంఘాధ్యక్షులు కమ్యూనిస్టా? గుడివాడ తాలూకా కాంగ్రెసు సంఘాధ్యక్షుడు కమ్యూనిస్టా? కృష్ణాజిల్లాలో పోలీసు దాడుల అనంతరం వాటిని గురించి ప్రభుత్వానికి హెచ్చరిక చేసిన పైవారందరూ కమ్యూనిస్టులేనా?

పౌరస్వత్వాలకు అంత్యక్రియలు జరుగుతున్నాయి అన్నమాట నాల్గుపాళ్లా నిజం. ఏమైనా కమ్యూనిస్టులను పట్టుకొనటానికి గ్రామాలమీద పోలీసు దళాలు దాడులు, విచక్షణ లేకుండా అమాయిక ప్రజలను కిరాతక కృత్యాలకు గురిచెయ్యటం కాంగ్రెసు ప్రభుత్వానికి తగనిపని. ఇలాంటి నీచమైన, నికృష్టమైన విధానాల ద్వారా కాంగ్రెసు తన భవిష్యత్తును అంధకారమయం చేసుకొంటోంది.

ఇందుకు కారకులైన పోలీసు ఉద్యోగులను ప్రభుత్వం వెంటనే విచారించి వారికి తగిన శిక్షలు విధించాలి.

గుంటూరు పా. రంగనాయకులు

## ఇది [illegible]

ఇదివరకు రేషనింగు విధానమూలాన ప్రజలకు కొన్ని బాధలు కలుగుతూ ఉండేవి. కాని ప్రభుత్వం అసమర్థతతో రేషను క్రింది అధికార్ల దుర్వినియోగము వల్ల —— రోజు రోజుకు ఉత్తర్వులు రకరకాలుగా వెలువడుచుండడంచేత ప్రజలు విసుగు చెందుతున్నారు.

[illegible]ంగు కార్డులు ఇదివరకు గ్రామోద్యోగులే ఇస్తుండేవారు. ఈ విధానంలో గ్రామోద్యోగుల్లో సైతం ప్రజలను కాసి నుండి కూడ పీడించే మహానీయులు లేక పోలేదు. కాని యిప్పుడు కార్డు పొందాలంటే గ్రామోద్యోగి వ్రాసియిచ్చి ఆ మీదట దానిపై ఫిర్కాఆఫీసరు గారి సంతకం పడితేగాని మోక్షం ఉండదు. ఇక ఆ ఫిర్కా సప్లయి ఆఫీసరు యెక్కడుంటారో, యెప్పుడొస్తారో, యెప్పుడు పోతారో— కార్డులు కావలసినవారు కూలి నాలి వదలి ఆయనగారి రాకకై యెదురు తెన్నులు కాయాలి. ఈ మధ్య యెలాగైనా యెనిమిది రోజులైనా పస్తుపడి కొనవూపిరితో వుండాల్సిందేనా!

మరి రెండోది: కొందరికి బియ్యము అనీ, మరి కొందరికి మిశ్రమము అనీ రెండు తరగతులుగా యిస్తున్నారు. దీనిలో వీరు సేద్యము చేయువారికి మిశ్రమ మనీ, సేద్యము చేయని వారికి బియ్యమనీ యిచ్చేలాగ ప్రాతిపదిక నిర్ణయించు కున్నట్టుంది. అలాగయితే సేద్యం చేయించేవారుకూడ సేద్యం చేయువారి క్రిందనే జమ. కాని వీరికి మాత్రం 'బియ్యం' అనే యిస్తారు. అంటే వ్యక్తిని బట్టి యిస్తున్నారన్నమాట. ఇది బహుజటిల సమస్య కావచ్చు. ఎవరు బియ్యం తింటారో, యెవరు మిశ్రమం తింటారో సాధారణంగా స్థానికోద్యోగులకు తెలిసి వుంటుంది. ముఖ్యంగా గ్రామోద్యోగులకు అనుభవం ఉంటుంది. కాని గ్రామోద్యోగులు 'బియ్యం' [illegible] యిచ్చిన కార్డులు తాలూకా సప్లయి ఆఫీ[illegible] యే ప్రాతిపదికపై 'మిశ్రమం'గా మార్పు కలుగుతాడో తెలియదు. సేద్యం చేయువారు, చేయించువారు అందరూ 'మిశ్రమ' [illegible]— ఈ ప్రభుత్వంలాంటి [illegible] మాత్రం 'బియ్యం' తినే వారుగా పరిగణించాలనేనా [illegible] అర్థం?

ఇక మనదేశంలో భిక్షుకసమస్య యెంత అపరిష్కృతమైనదో దేశసంచారుల సమస్య కూడా అంతే. వీరి కనుకూలంగానే యిదివరకు ఈ జిల్లా వారు గాక యితర జిల్లావారు వస్తే ఆ గ్రామోద్యోగి 'తాత్కాలికపు బత్తెపు' కార్డులను యివ్వాలని వుత్తర్వు లుండేవి. కానీ యిప్పుడు అలాగ గ్రామోద్యోగస్థు లీయరాదనే ఒక సుగ్రీవాజ్ఞ ఒకటి వచ్చింది. ఇక తమ బ్రతుకుతెరువు కొరకు దేశసంచారులై వచ్చే బీదలు 'తాత్కాలికపు బత్తెము' కొరకు ప్రతి తాలూకా సప్లయి ఆఫీసరు వద్దకు పరుగులెత్తాల్సిందేనా? అంతవరకు అతని కుటుంబమంతా ఏకాదశీ వ్రతాన్ని నిర్విఘ్నంగా సాగించాల్సిందేనా? ఓవేళ తాలూకా సప్లయి ఆఫీసరు యెక్కడో తాలూకా మూలలో మకాం వుంటే అచ్చటికి తిండికిలేని బీదలు తమ సంపాదన వదలి ఆయనగారిని దర్శించాల్సిందేనా?

ఓవేళ గ్రామోద్యోగులు లంచానికి పాల్పడుతున్నారని, ప్రభుత్వాజ్ఞలను విచ్ఛిన్నం చేస్తున్నారని ఈలాచేశా రందుమా, పూర్తిగా ప్రభుత్వమే ఈ వాతావరణంలో వుందే అంతేకాక మన మంత్రులు చెబుతుంటారు ప్రభుత్వోద్యోగులను విశ్వసించండని, ఇది గ్రామోద్యోగులకు వర్తించదనా? అలాగని వారికి సర్వాధికారాలను యివ్వాలని కాదు. ప్రజలకు యెంత అందుబాటు వీలవుతుందో అది కల్పించాలనే మా కోరిక. ఈలాగ విశ్వసించలేని గ్రామోద్యోగులను ప్రభుత్వ మెలా వుంచుకుంటుంది!...

గ్రామోద్యోగులు టెంపరరీ కార్డులు యివ్వ నిరాకరించడంతో నెల్లూరు, కర్నూలుజిల్లాల నుండి వరుస వరుసలుగా వచ్చి ఇక్కడ పనులు చేయువారు ఈ ప్రాంతాలలో మల మల మాడి పోతున్నారు. అంతేకాక సబ్సిడీ బావులు త్రవ్వేందుకు వచ్చిన వడ్డెవారు సైతం పరుగులు తీస్తున్నారు. ఇవన్నీ ప్రజలనుండి ప్రభుత్వాన్ని రోజుకు రోజూ దూరం చేస్తున్నాయి.

రాయల్ పేట — టి. సి. రాజన్

అధ్యక్షుడు, జిల్లా యువజన కాంగ్రెస్




# విషయసూచిక

సంపుటి 2. సంచిక 2.

శుక్రవారం, ఆగస్టు 12, 1949

తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-2

ఆగస్టు 12, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

# స్వాతంత్ర్య ప్రాతిపదిక

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి అప్పుడే రెండేళ్లు పూర్తి కావస్తున్నాయి. స్వాతంత్ర్యం రాగానే మన సమస్యలన్నీ ఇట్టే పరిష్కారమైపోతాయని, జీవితం ఒక అనంత సుఖస్వప్నంగా మారిపోతుందని ఊహాలల్లుకున్న ఆశావాదులకు కావలసినంత కనువిప్పు కలిగింది. ఆర్థికంగా, రాజకీయంగా మనం కోరిన స్థయిర్యం కనుచూపు మేరలో ఎక్కడా కనిపించడంలేదు. ఈ నిలకడలేని స్థితి ఒక్క మన దేశంలోనే కాదు-ప్రపంచంలో 'ఎందెందు వెదకిచూచిన అందందు' ప్రహ్లాదుడి శ్రీహరికి మల్లే నిశ్చయంగా సాక్షాత్కరిస్తున్నది. ఈనాటి మానవుడి స్థితి జూదానికి కూర్చున్న ధర్మరాజును జ్ఞప్తికి తెస్తున్నది. మానవుడు తన ఆస్తినీ, అర్థాన్నీ, సమస్తాన్నీ పందెం ఒడ్డి కూర్చున్నాడు. గెలుపు తనదే అవుతుందని ఆశ ఉంది. కాని ఆందోళన మాత్రం అమితంగా ఉంటున్నది. అతడికి దైవజ్ఞులమీదా, రోడ్డు ప్రక్కను కూర్చున్న మైనాపిట్టల సర్వజ్ఞత్వంమీదా విశ్వాసమే ఉంటే-తన భవిష్యత్తును ఇంతకుముందే ఏనాడో విధి నిర్ణయించి అట్టే ఉంచిందని నమ్మితే-ఈ ఆందోళననుంచి త్వరలోనే బయటపడేవాడు. కాని ఆధునిక మానవుడు కేవలం తారాబలం, చంద్రబలంతోనే భవిష్యత్తును నిశ్చయించుకునేటంత అంధవిశ్వాసపరుడు కాడు. అతడు దైవజ్ఞుల్ని విడిచి సాంఘిక, రాజకీయ నాయకుల్ని ప్రశ్నిస్తున్నాడు. ఏ రాజకీయ నాయకుడూ ఆధునిక మానవుడికి అతని భవిష్యత్తును గురించి స్పష్టంగా హామీ ఇవ్వలేక పోవడంచేత, మానవుడు నాయకుల్ని వదలి చరిత్రవంకకు దృష్టి మరల్చుతున్నాడు. 'ఇటువంటి అనిశ్చితస్థితిలో పడితే మనుష్యుడి భవిష్యత్తు ఏమవుతుం'దని చరిత్రకారుల్ని ప్రశ్నిస్తున్నాడు.

ఈనాడు మానవజాతికి వచ్చిన సందిగ్ధం చరిత్రకేం కొత్తకాదు. మనకు వలెనే మన పూర్వికులు కూడా జీవితంతో జూదమాడారు ఐతే వాళ్లు మనం ఒడ్డుతున్నంత పెద్ద ఎత్తున పందెం కాయలేదు; వాళ్లకీ ఇటువంటి స్థితి ఎదురయింది. కాని అందువల్ల మేలు కీళ్ళు మనకు కలిగేటంత తీవ్రతతో వాళ్లు ఎదుర్కొనలేదు. యంత్రాలతో తాను సాధించిన విశేషాలను చూసుకుని, ఆధు

నిక మానవుడు తాను పూర్వీకుల కంటె ఘనుడనని మురియవచ్చు. కాని పరిస్థితులలో, పరిష్కార సూత్రాలలో, ఫలితాలలో మార్పులేమీ లేవు.

ఆధునికునికి శాస్త్రసహాయంతో తాను సాధించిన విషయాలపట్ల అమితమైన గర్వం ఉంది; కాని సాంకేతిక నైపుణ్యం విజ్ఞానానికీ, స్థిర భవిష్యత్తుకీ ఒక ప్రమాణం కాదు. 'చారిత్రిక విభాత సంధ్యల మానవ కథ' గ్రంథాన్ని మనం పరిశీలిస్తే కేవలం భౌతిక విజయాల వల్ల ఏజాతీ స్థిరంగా నిలబడలేదని తెలుస్తుంది. సంఘంలో అంతర్గతంగా వచ్చే మార్పులనైతేనేం, కాలపరిస్థితుల ననుసరించి కలిగే సమస్యల నైతేనేం యథోచితంగా పరిష్కరించుకోగల సద్యో సంస్కారమున్న జాతికే భవిష్యత్తు ఆశాజనకంగా ఉంటుంది. తన సమస్యల్ని పరిష్కరించుకుని తాపీగా కునుకుతూ కూర్చునే జాతికి భవిష్యత్తు క్లిష్టంగా ఉండక తప్పదు. ఎందుచేతనంటే ఎప్పటికప్పుడు ఎదురయ్యే సమస్యలను పరిష్కరించుకోగల జవమూ, జీవమూ జాతిలో ఉంటేనే దానికి స్థిరమైన భవిష్యత్తు ఉంటుంది.

మనం యంత్రనాగరికత నేర్పును చూసి సమ్మోహితులమై మన యంత్రాల వృద్ధినే ఏకైకాదర్శంగా పెట్టుకుని, జాతి జీవనాని కవసరమైన, మనోవికాసకరమైన కృషిని పూర్తిగా విస్మరిస్తున్నాం. మనోవికాసానికి మూఢభక్తి కంటె మరేదీ ఎక్కువ హాని చెయ్యదు. ఏనాడు మనం మూఢభక్తికి పూనుకుంటామో, ఆనాడే మనోవికాసం గుంట పువ్వులు పూయడం ప్రారంభిస్తుంది. మనం మనజాతినీ, మన మతాన్నీ మన పూర్వ చరిత్రనీ గౌరవించడం మినహా యింకేదీ చెయ్యలేనినాడు ఇంక వికాసమేఉండదు.

మనుష్యులు దైవాన్ని ఆరాధించిన కాలంలో ప్రభుత్వానికి గ్రుడ్డిగా తమ హక్కులన్నిటినీ ధారపోయలేదు. పన్నులు కట్టారు; అధికారానికి లోబడి జీవించారు. కాని వాళ్లు తమ అంతఃకరణాలనుకూడా ప్రభుత్వానికే అమ్ముకోలేదు. సంకుచితమైన జాతీయవాదం ఇందుకొక ఉదాహరణం. పదార్థ విజ్ఞాన శాస్త్రమే ఈనాటి సమస్యలన్నిటినీ పరిష్కరించగలదనే విశ్వాసంకూడా ఇటువంటిదే. పారిశ్రామిక యుగంలో ఉదయించిన సమస్యకు మన శాస్త్రాభివృద్ధి చక్కని పరిష్కారమార్గమైన మాట నిజమే; కాని ఈనాడు మన నెదుర్కొంటున్న సమస్యలు శాస్త్రపరిశోధనాగారాలలో పరిష్కరింపబడవు. మన సమస్యలు నైతికమైనవి. శాస్త్రానికి నీతితో ప్రసక్తి లేదు.

శాస్త్రజ్ఞులు సాధించిన భౌతిక శక్తుల్ని మన మేవిధంగా ఉపయోగించబోతున్నాం? 'శాస్త్రవిజ్ఞానాన్ని మరింత పెంపొందించడంలోనే'—అని సమాధానమైతే మాత్రం మన భవిష్యత్తు క్లిష్టతరం కాకతప్పదు. మనోవికాసాన్ని పెంపొందించే సంస్కారాన్ని వ్యాపింప జేయడానికి మనం ప్రయత్నిస్తే తప్ప ఈ సమస్య సుకరంగా పరిష్కరింపబడదు.

కేవలం సైనిక బలంమీదనే ఆధారపడిన నాగరికత ఏదీ నాలుగు కాలాల పాటు నిలువలేదని చరిత్ర మనకు రూఢి చేస్తున్నది. సైనికుడి ప్రతాపం యుద్ధ

రంగంలోనే; విజయం వల్ల ఏర్పడే సమస్యల్ని అది ఏ విధంగానూ ఎదుర్కొనలేదు. సైనికబలంమీదనే నిర్మితమైన ఏ సామ్రాజ్యమూ స్థిరంగా వేళ్లు పాతుకోలేదు. జీవితం అంత సులువుగా గడిచిపోదు. ఒక్క సూత్రంతో అన్ని సమస్యలూ పరిష్కృతం కావు. ప్రతి కొత్త సమస్యకూ సంఘంనుంచి సద్యః ప్రతిపాదన రావాలి. ఐతే సహజంగా బద్ధకంవల్ల మానవుడు కొత్త సమస్యలకు కూడా పూర్వపు సూత్రాలనే వర్తింపజేస్తాడు. అందువల్లనే ఈనాటి సమస్యలకు భౌతికవాద దృష్ట్యా పరిష్కారమార్గం ఉంటుందనే ఆశ ఆధునిక మానవుడి నింకా విడువలేదు. భౌతిక శక్తివల్ల సముద్రాన్నీ, తుపాను గాలినీ శాసించే అధికారం మానవుడికి వచ్చింది. కనుక ఆ శక్తితోనే ప్రపంచం సమైక్యతను సాధించవచ్చునని అతడు భ్రమిస్తున్నాడు. కాని అది అసంభవం. ఎందుచేతనంటే మానవుడు ప్రకృతిని శాసించడం నేర్చుకున్నాడు కాని తన్ను తాను శాసించుకోవడమే అతనికి చేతకావడం లేదు.

సామాజికంగా ఒక సూత్రంతో ప్రపంచ సమైక్యతను సాధించే అవకాశముంటే మన విజ్ఞానవేత్తలకు దానిని విడిచివెయ్యవచ్చు. కాని అందుకు కావలసింది మానవుడిలో ఆధ్యాత్మిక పరిణామం. ఇది ప్రభుత్వాధికారులకు వదిలివేసే పనికాదు. ప్రతి పౌరుడూ తనంతట తాను ఈ పరిణామాన్ని సాధించవలసి ఉంటుంది. ఇది సులువైన పని కానిమాట నిజమే; కాని ఏ నాగరికతయైనా ఆధ్యాత్మిక పునః చైతన్యం వల్లనే పరిణతస్థితికి వస్తుంది.

ఈ పరిణామ సాధనకు ముఖ్యంగా మనం ఆచరించవలసిన మొదటి పని మూఢమైన ఆరాధనకు స్వస్తి చెప్పడం. ఆధునిక నాగరికత మనకు నేర్పిన పూజావిధానాన్ని–యంత్రాలనూ, ఆర్థిక శాస్త్రాన్నీ, విజ్ఞానశాస్త్రాన్నీ ఆరాధించడం–పూర్తిగా వదులుకోవాలి. ఈ మానవ నిర్మిత సూత్రాలతో తూలింతలాడుతున్నంతవరకూ మన సమస్యలు మనల్ని విడువవు.

ప్రపంచాన్ని సమైక్యం చెయ్యడానికి తమతమ దేశాల గత చరిత్రలపై అంధ గౌరవంతో ఆగిపోని పౌరులు అత్యవసరం. ప్రధాన శక్తులన్నీ ఈ జాతీయవాదమనే పూర్వసూత్రాన్నే పట్టుకుని పాకులాడే పక్షంలో తమ జాతిని మూఢంగా ఆరాధిస్తూ కూర్చొని పౌరులవల్ల మాత్రమే ప్రపంచ సమైక్యత సాధ్యం కాగలదు.

ప్రపంచ సమైక్యత తప్పకుండా అవసరం. అది శాంతియుతంగా, స్వచ్ఛంద ప్రయత్నంతో ఏర్పడడం వాంఛనీయం. ఎందుచేతనంటే, ఏవిధంగా ప్రపంచ సమైక్యత వచ్చినా చాలు ననుకుంటే యూరప్ ఖండాన్ని సమైక్యం చెయ్యడానికి హిట్లర్ ఏర్పరచిన ప్రణాళిక ఉండనే ఉంది. కాని అందుకోసం తమ ఆధ్యాత్మికపు విలువల్ని పోగొట్టుకోవడానికి ఎవరూ సమ్మతించరు.

కేవలం భౌతిక సూత్రాలమీదనే మన సమస్యలు పరిష్కృతం కావన్న సత్యం మన నిత్యజీవితం చాటుతూనే ఉంది. యంత్ర నాగరికత కలిమినేకాక

లేమినికూడా కావలసినంత సృష్టించింది ప్రపంచమంతటా ఉండడానికి ఇల్లూ, బ్రతకడానికి ఉద్యోగమూ కొరతకావడం సువిదితం.

నైతికమైన నిర్ణయాలిప్పుడు మనకు చాలా అవసరమని స్పష్టమవుతున్నది. చరిత్రలో ప్రధాన నిర్ణయాలన్నీ నైతికమైనవే. దీనినుంచి తప్పించుకునే విధానం లేదు. ఏదారిన వెళ్ళినా చివరకు ఎదురయ్యే ప్రశ్న ఇదే. మనం కనిపెట్టే ప్రతి కొత్త శాస్త్ర సూత్రమూ మన నైతికశక్తికి గీటురాయిగా ఉంటుంది. కేవల లౌకికగమ్యాన్నే ఆశయంగా పెట్టుకుంటే జాతి అభ్యుదయాన్ని సాధించే అవకాశం తక్కువగా ఉంటుంది. బలీయమైన విశ్వసౌభ్రాతృత్వానికి మూలంలో శీలవర్తనము పట్ల అచంచలమైన విశ్వాసమూ, ప్రేమా అవసరం.

ఈనాడు ప్రపంచానికి ముఖ్యావసరం ఆధ్యాత్మిక పునర్విశ్వాసం. ఆధ్యాత్మిక విశ్వాసం లేనినాడు పరిశోధనాగారాలలో తయారైన ప్రమాదకరమైన ఆటవస్తువులతో మానవుడే విఘంగానూ సురక్షితంగా ఉండలేడు. ఈఆధ్యాత్మికవికాసంజాతీయవాదంతో కనులు మూతబడని భారతజాతి వంటి వెనుకబడ్డ జాతులవల్లనే వస్తుందేమో. కాని భౌతికంగా పురోగమించిన దేశాల పౌరులకు కూడా కర్తవ్యం లేకపోలేదు. సరియైన సంకల్పం చేసుకునే అధికారం ఇంకా మనకు ఉంది. విశ్వసమైక్యతా, విశ్వసౌభ్రాతృత్వమూ మనం వాంఛించే పక్షంలో ఆధ్యాత్మిక పునర్విశ్వాసం అత్యావసరం. అందుకు సమ్మతించకపోతే అది జాతికి ఆత్మహత్యగా పరిణమించి తీరుతుంది. ఈ ఆత్మహత్యను నివారించే మార్గం లేదా? ఉంది, అది మన నిశ్చయంమీదనే ఆధారపడి ఉంటుంది.



—శంకర్స్ వీక్లీనుండి.

"చోటుంది, రండి!"

డాక్టర్ రామమనోహర్ లోహియా, శ్రీ శరత్ బోసులు తమతమ పార్టీలో వచ్చి చేరమని ఒకరినొకరు ఆహ్వానించుకున్నారు.

# కాంగ్రెస్ రాజకీయాలు - నైతిక ప్రమాణాలు

మోపర్తి వెంకటరమణయ్య

కాంగ్రెసులో మార్పు రావాలి: యీ నాడు ప్రతివారినోటా యిదే మాట. ప్రజలే గాక కాంగ్రెస్ నాయకులుకూడా యిదే నినాదం లేవదీశారు. అసలు యీ నినాదం యీ నాటిది కాదు. ఇండియా స్వతంత్రదేశం కావటంతోనే అందరికంటె ముందు గాంధీగారే యీ సమస్యను లేవదీశారు. ఇందుకోసమై గాంధీగారు ఒక ప్రణాళిక తయారుచేశారు. కాని అది కాంగ్రెస్ సంస్థచేత ఆమోదింపబడక పూర్వమే మహాత్ముడు అకాలమృత్యువు వాతబడటం జరిగింది. తరువాత 1948 సం॥లో బొంబాయిలో సమావేశమయిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ కాంగ్రెస్‌లో మార్పు తేవటానికి ఒక నూతన నిబంధనావళి (Constitution) ఆమోదించింది. ఇంత జరిగినా కాంగ్రెస్‌లో ఏమి మార్పు రావాలి అనేది నాటికి నేటికీ ప్రశ్నార్థకంగానే నిలిచిపోయింది. దీనికి హేతువేమో పరిశీలిద్దాం.

అసలు కాంగ్రెస్ ఒక రాజకీయపక్షంగా కాకుండా జాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాడే ఒక మహాసంస్థగా ఆవిర్భవించింది. స్వరాజ్య సంపాదనే దాని పరమావధి. కాబట్టి భారత దేశంనుంచి ఇంగ్లీషువారు వైదొలగటంతో పాటు తనపని పూర్తిచేసిన కాంగ్రెస్‌కూడా అంతర్ధానమైపోవలసింది. ఈ ఉద్దేశ్యంతోనే గాంధీగారు మొదలు సామాన్య కాంగ్రెస్ సేవకునివరకు స్వరాజ్యం రాగానే కాంగ్రెస్ రద్దయిపోతుందని చెప్పుతుండేవారు. అంతవరకూ - అంటే స్వాతంత్ర్యం సిద్ధించేవరకూ దేశంలో ఒక్క కాంగ్రెస్ తప్ప మరి యే రాజకీయ పార్టీలూ ఉండటానికి వీలులేదని వక్కాణించేవారు. కాని స్వాతంత్ర్య ప్రాప్తితో అధికారములోనికి వచ్చిన కాంగ్రెస్‌వారు తమ పూర్వ వాగ్దానాన్ని పూర్తిగా విస్మరించారు. దేశంలో కాంగ్రెస్ స్థానాన్ని ఆక్రమించగల మరో సంస్థ లేదనీ, కాంగ్రెస్ రద్దయితే అరాజకం తప్పదనీ, అందుచేత తమ కిష్టం లేకపోయినా దేశాన్ని పాలించే బాధ్యత తమపై బడిందనీ చెప్ప నారంభించారు. గాంధీగారు కూడా తమ వెనుకటి అభిప్రాయాన్ని మార్చుకొని కాంగ్రెస్‌ను రద్దుచేయటానికి మారుగా దాని స్వరూపంలోను, కార్యక్రమంలోను మార్పు తేవాలని నిర్ణయించారు. ఇందుకుగాను ఒక ఉపసంఘం నియమించబడింది కూడాను.

గాంధీజీ 'భారత జాతీయ కాంగ్రెస్ నూతన నిబంధనావళి' అనే పేరుతో పత్రాన్ని తయారుచేశారు. ఉపసంఘంవారు కూడ దీనిని ఆమోదించినట్లు తరువాత అధికారపూర్వకంగా ప్రకటించబడింది. కాంగ్రెస్‌లో అవినీతి ప్రబలిపోయిందని, కాంగ్రెస్‌చే నిర్మించబడే సంస్థలలోని ప్రజాస్వామికం కూడా నామమాత్రమేనని గాంధీగారు నిరసించారు. ఈదుర్దశనుండి బయటపడాలంటే కాంగ్రెస్ లోకసేవా సంఘంగా మారిపోవాలన్నారు. సభ్యుల సంఖ్య దేశంలోని ఓటరులసంఖ్యతో సమానంగా ఉండాలన్నారు. అంటే దేశంలోని ఓటరులందరూ యీ సంఘంలో సభ్యులౌతారన్నమాట. దీని ప్రకారం అజ్ఞానంలోను, విద్యావిహీనతలోను పడివున్న కోట్లకొలదీ ప్రజలు గొర్రెల మందవలె ఒక మహాసంస్థలో సభ్యులుగా చేర్చబడి చివరకు తాము ఒక సంస్థలో సభ్యులమనే చైతన్యం కూడా లేకుండా ఉంటారు. పైగా యిది ఏక పక్ష నియంతృత్వానికి దారితీస్తుంది. రష్యాలోని కమ్యూనిస్టు పక్షానికి నకలుగా తయారౌతుంది. దేశంలోని ప్రజలందరూ ఒకే ఒకసంస్థలో సభ్యులయినప్పుడు యితర పక్షాలకు తావెక్కడ?

ఈ సంస్థ సభ్యులు రాజకీయ కార్యక్రమాలలో జోక్యం పెట్టుకోకుండా కేవలం నిర్మాణ కార్యక్రమాలను కొనసాగించాలన్నారు. మరి జాతీయ ప్రభుత్వం చేసే పనేమిటి? ఒక వైపున అధికారంలో ఉన్న రాజకీయ పక్షంగా ఉంటూ మరోవైపున గాంధీగారి నూతన నిబంధనల ననుసరించి రాజకీయ కార్యక్రమాలను విడచిపెట్టడం యెలాసాధ్యపడుతుంది? జాతీయప్రభుత్వానికి నిర్మాణ కార్యక్రమాలను కొనసాగించే బాధ్యతనుండి విముక్తి కలిగించటానికే యీ పద్ధతి ప్రవేశ పెట్టబడింది. ఇతర కార్యక్రమాలను స్వేచ్ఛగా ఆచరించటానికిగాను జాతీయ ప్రభుత్వానికి యీ నిర్మాణ కార్యక్రమం పీడ వదలించుకోవాలని తాపత్రయం బాగా ఉంది. అది నిర్వహించవలసిన ఆ యితర కార్యాలేవి? ఈ విధానం దేశమే కాంగ్రెస్, కాంగ్రెసే దేశం అనే నినాదానికి ఆచరణ స్వరూపం.

ఇందుకోరకు ఒక క్రొత్తమార్గం అనుసరించారు. గాంధీగారి నిబంధనలపత్రం ఎ.ఐ.సి.సి. ముందు చర్చకు రాకపూర్వమే లోక సేవా సంఘాన్ని స్థాపించారు. ఈ సందర్భంలో ఒక్క రాజేంద్రప్రసాదు తప్ప పదవులలో ఉన్న కాంగ్రెస్ నాయకు లెవరూ హాజరు కాలేదు. వారిలో యెవరూ యింతవరకు యీ క్రొత్త సంస్థలో సభ్యులుగా చేరినట్లు తెలియదు. తరువాత బొంబాయిలో సమావేశమయిన ఎ.ఐ.సి.సి. లోక సేవాసంఘం స్థాపించబడిందనే విషయమే పరిగణించకుండా ఒక నూతన నిబంధనావళిని ఆమోదించింది. ఇందులో గాంధీగారి నిబంధనలనుకూడా కొన్నిటిని పొందుపరిచారు. లోక సేవాసంఘం పార్లమెంటరీ రాజకీయాలను వదలిపెట్టాలని నిబంధన ఉంటే ఎ.ఐ.సి.సి ఆమోదించిన నిబంధనలలో సభ్యులు పార్లమెంటరీ రాజకీయాలలో పని చేయవచ్చునని కూడా ఒక నిబంధన చేర్చారు. కాంగ్రెస్ సభ్యులు ఉన్నతపదవులకు అర్హులు కావాలంటే కొన్ని నిర్మాణ కార్యక్రమాలు ఆచరించాలన్నారు. ఇంతకుమినహా క్రొత్తగా ప్రవేశపెట్టిన ప్రజాస్వామ్యసూత్రాలేమీ లేవు.

ఈ విధంగా కాంగ్రెస్ రెండు సంస్థలుగా చీలదీయబడింది. ఒకటి పాలనాధికారం నిర్వహించే కాంగ్రెస్. రెండవది గాంధీగారి సిద్ధాంతాలను ప్రచారంచేసే లోకసేవా సంఘం. అధికారంలోని కాంగ్రెస్ వారికి గాంధీజీ సిద్ధాంతాలు ఆచరణలో పెట్టవలసిన బాధ్యత తప్పింది. లోకసేవాసంఘం కాంగ్రెస్ పాలనయెడల అసంతృప్తులైన ప్రజలను ఓదార్చటానికి ఉపయోగపడుతుంది.

గిరినిబట్టి కాంగ్రెస్ గాంధీజీ సిద్ధాంతాలకు తిలోదకా లిచ్చిందని తేటతెల్లమయింది. అధికార రాజకీయాలలో మునిగి తేలుతున్న కాంగ్రెస్ బాగుపడుతుందనే ఆశ నిరాశ అయింది. పోతే లోకసేవా సంఘం మాత్రం కాంగ్రెస్ కు తోకగా ఉండక స్వతంత్రంగా పనిచేస్తే ప్రజలలో నైతికాభివృద్ధిని కలిగించగలదు.

కలకత్తా బై-ఎలక్షన్ లో ఓడిపోవటంతో కాంగ్రెస్ పునర్నిర్మాణ సమస్య తిరిగి ఉదయించింది. కాంగ్రెస్ లో అవినీతి అధికమయిందని, ముఠా రాజకీయాలు, స్వార్థపరత్వం పెచ్చు పెరిగిపోయినవని అందరూ విమర్శించ నారంభించారు. ప్రజల అసమానం ప్రమాదకరంగా పరిణమించింది. భవితవ్యం విషయమై యెవరికి తోచిన అభిప్రాయాలు వారు వెల్లడిస్తున్నారు. క్రమశిక్షణ లోపించిన కాంగ్రెస్ ను పునీతం చేయటానికి దిట్టమైన నియంత కావాలంటున్నారు కొందరు. నేటి అవినీతికి, ముఠారాజకీయాలకు రాష్ట్రప్రభుత్వాలే కారణం కాబట్టి అసలు రాష్ట్రస్వపరిపాలనా విధానాన్నే రద్దుచేసి కేంద్రంలో బలవంతమైన యూనిటరీ గవర్నమెంటును స్థాపించాలని మనూసుబేదారు మొదలయిన వారంటున్నారు. ఈ విధంగా అధికార కేంద్రీకరణకు, నియంతృత్వ స్థాపనకు కావలసిన మనస్తత్వం పెంపొందుతున్నది. ప్రజాస్వామ్య విధానాన్ని బలపరచి తద్వారా నైతికాభివృద్ధి కలిగించటానికి మారు నిరంకుశత్వం ద్వారా అవినీతిని నిర్మూలించాలంటున్నారు.

ఈ నైతిక పతనానికిముఖ్యకారణం అధికార రాజకీయాలే. పాలకులు సంఘశ్రేయస్సు కంటె స్వలాభానికి అధిక

(తరువాయి 42 వ పేజీలో)

# గాంధీజీ ఎంతవరకు కృతకృత్యుడు?

జార్జి ఆర్‌వెల్

స్వతంత్రాభిప్రాయాలకు, స్వయంప్రతిభకు పేరెన్నిక గన్న ఆధునిక ఆంగ్ల రచయిత, విమర్శకుడు—జార్జి ఆర్‌వెల్ ఈ వ్యాసంలో గాంధీజీ జీవితంవల్ల భారతదేశానికీ, ప్రపంచానికీ కలిగిన మేలును క్రొత్త దృక్కోణం నుంచి ఉగ్గడిస్తున్నాడు.

గాంధీ వంటి వ్యక్తి యొక్క గొప్పతనాన్ని ఎన్నేటప్పుడు ఎంతో ఎత్తునుంచి చూడ్డం కద్దు కావడంవల్ల, ఆయన సుగుణాలు కొన్ని ఇంచుమించు గమనించడమే జరగలేదు. ఉదాహరణకు, స్వతహాగా ఆయన కొంచెమైనా ప్రాణభీతి లేనివాడని ఆయన ఆత్మకథవల్లనే మనకు తెలుస్తుంది. ఆయన నిర్యాణం చెందిన విధం ఆ తర్వాత కనిపించే తార్కాణం: ఎందువల్లనంటే, ప్రాణమంటే ఇంతో అంతో తీపి ఉన్న ప్రజాహితజీవి రక్షణ విషయంలో ఇంకా ఎక్కువ శ్రద్ధ తీసుకోవడం జరిగి ఉండేది. తరవాత, భారతీయుల్లో పరిపాటిగా కనిపించే అవగుణమైన అనుమాన స్వభావం ఆయనలో లేశమైనా ఉన్నట్టు కనిపించదు. ఆయన కాపట్య మెక్కడున్నా కనిపెట్ట చాలిన బుద్ధికౌశల్యం కలవాడనడానికి ఏమీ సందేహం లేదు. అయినా-ఇతరులు నిష్కపటంగానే వర్తిస్తున్నారనీ, వాళ్లతో వ్యవహరించడానికి అనువైన సత్స్వభావం ఉన్నవాళ్లేననీ గాంధీ, వీలైన చోటల్లా, నమ్మినట్టుగా కనిపిస్తుంది. తాను నడిమి తరగతికి చెందిన పేద కుటుంబంలో జన్మించాడు; అననుకూల పరిస్థితుల్లో జీవితం ప్రారంభించాడు; బహుశా నలుగుర్నీ ఆకట్ట చాలిన రూపం కూడా లేదు. అయినప్పటికీ అసూయతో గాని, చిన్నదనం వల్ల గాని బాధ పడ్డవాడు కాదు. రంగు భేదాన్ని మితిమీరిన రూపంలో మొట్ట మొదటిసారి దక్షిణ ఆఫ్రికాలో చూసినప్పుడు ఆయన అది నమ్మలేక పోయినట్టు తోస్తుంది. ఆయన రంగు భేదాన్ని నిర్మూలించడానికి పోరాటం సాగిస్తున్నప్పుడు కూడా ప్రజల్ని గురించి జాతి పరంగా గాని, స్థితి పరంగా గాని ఆలోచించిన వాడు కాదు. రాష్ట్రాన్ని ఏలే గవర్నరు, లక్షలు గడించిన పారిశ్రామికుడు, సగం ఛస్తుండే భారతీయ కార్మికుడు, అట్టడుగు బ్రిటిషు సైనికుడు—అందరూ మానవత్వం విషయంలో సమానమే.

గాంధీ యువక భారతీయ విద్యార్థి సామాన్యమైన ఆశయాలతోనే ఆరంభించాడనీ, తన అతివాదాభిప్రాయాలు క్రమంగా అలవరచుకున్నవనీ, కొన్ని విషయాల్లో అయిష్టంగా కూడా అవలంబించినవనీ జ్ఞాపకం చేసుకోవడం మంచిది. ఇంచుమించు చిన్నతనం లగాయతు ఆయనలో గాఢమైన అభినివేశం కనిపిస్తుంది: అది మతదృష్టికన్నా ధర్మదృష్టికి సంబంధించిన అభినివేశం. కాని ముప్ఫయి యేళ్లు వచ్చేదాకా ఏదీ నిర్దిష్టమైన మార్గం ఏర్పడ లేదు. ప్రజాహిత జీవనమని చెప్పదగినది ఆయన మొదలు పెట్టింది శాఖాహారవాదం ద్వారా. ఆయనలో ప్రత్యేకంగా కనిపించే లక్షణాల మాటున పక్కా వ్యాపారులైన ఆయన పూర్వీకులు ద్యోతకమవుతూ ఉంటారు. తన వ్యక్తిగతమైన కోరికలన్నీ విడనాడుకున్నాక కూడా ఆయన - నిక్కచ్చిగా డబ్బు ఖర్చుపెడుతూ, నేర్పుగా కమిటీలను నిర్వహిస్తూ-యుక్తిపరుడైన లాయరుగాను, వ్యవహారజ్ఞుడైన రాజకీయనాయకుడుగాను వ్యవహరించి ఉంటాడని అనిపిస్తుంది. ఆయన లక్షణాలు ఒక తెగకు సంబంధించినవని చెప్పడానికి వలనుపడదు; కాని వాటిలో యిది చెడ్డదని వేలు పెట్టి చూపడానికేమీ ఆస్కారం లేదు.

గాంధీ పాశ్చాత్య వామ పక్షోద్యమంపట్ల సానుభూతి కలిగి ఉండడమే కాకుండా, అందులో అవసరమైన భాగమే అయివున్నట్టుగా గడచిన కొద్ది సంవత్సరాలలోను ఆయన్నిగురించి మాట్లాడ్డం పరిపాటి అయింది. ముఖ్యంగా అరాజకవాదులు, శాంతివాదులు ఆయన తమవాడని చెప్పుకున్నారు. ప్రభుత్వాధికార కేంద్రీకరణానికీ, ప్రభుత్వ హింసావిధానానికీ ఆయన వ్యతిరిక్తుడని మాత్రమే వాళ్లు గమనించారు. ఆయన సిద్ధాంతాల ఆముష్మిక ధోరణిని, మానవవాద వ్యతిరేకతను ఉపేక్షించారు. మానవుడే అన్ని విషయాలకీ కొలబద్ద, మనకి భూలోక మొకటే ఉన్నది, దీనిమీద మన జీవితాన్ని జీవన సౌభాగ్యం చేసికోడమే మన పని-అన్న విశ్వాసంతో గాంధీబోధలను సరిపుచ్చడం కుదరదని గుర్తించడం అవసరం. దేవు డున్నాడనీ, యీ ఘనపదార్థాలుండే జగత్తు మిథ్యఅనీ, దీనినుంచి విడివడాలనీ అనుకున్ననాడే ఆయన బోధల అర్థ ముంటుంది. ఆముష్మిక, మానవవాద ఆదర్శాలలో ఏది "ఉత్కృష్ట" మైందని తర్జనభర్జనలు చెయ్యవలసిన పనిలేదు. వాటికి పొత్తు కుదరదన్నదే యిక్కడ గమనించవలసిన విషయం. దేవుణ్ణో, మానవుణ్ణో ఎన్నుకోవాలి; అతివాదులు, అభ్యుదయవాదులు అయిన వాళ్ళందరూ మానవుణ్ణే ఎన్నుకున్నారు.

ఏమైనా, గాంధీ శాంతివాదాన్ని ఆయన యితర బోధలనుంచి కొంతవరకు వేరు చేయడానికి వీలుంది. దాని ప్రేరణ మతసంబంధమైంది. కాని, ఆయన దానిని కోరిన రాజకీయ ఫలితాలు కలిగించగల ఒక నిర్దిష్ట విధానంగా, పద్ధతిగా కూడా పేర్కొన్నాడు. గాంధీ దృక్పథం పాశ్చాత్య శాంతివాదుల దృక్పథం లాంటిది కాదు. మొదట దక్షిణాఫ్రికాలో రూపొందిన 'సత్యాగ్రహం' ఒకవిధమైన అహింసా సమరం: హానిచెయ్యకుండా; ద్వేషభావం కలగకుండా, కలిగించకుండా శత్రువును ఓడగొట్టే ఒకమార్గం; దానిలో శాసనోల్లంఘనం, సమ్మెలు, రైళ్ళ ముందు పడుకోడం, పారిపోకుండా నిలిచి తిరిగి కొట్టకుండా పోలీసు దెబ్బలు పడడం మొదలైనవి ఉన్నాయి. 'బదులు చెయ్యని ప్రతిఘటన' (passive resistance) అన్నది సత్యాగ్రహానికి సరైన అనువాదంగా గాంధీ ఒప్పుకోలేదు: గుజరాతీలో యీ మాటకు 'సత్యమునందు దీక్ష' అని అర్థం. తన మొదటి రోజుల్లో గాంధీ బోయరు యుద్ధంలో బ్రిటిషువారితరఫున క్షతగాత్రుల్ని సాయంపట్టుకు వెళ్లేవాడుగా పనిచేశాడు; 1914-18 లో మళ్ళీ ఆపనే చెయ్యడానికి సంసిద్ధుడయాడు. తాను పూర్తిగా హింసను విసర్జించిన తరవాతకూడా, యుద్ధసమయంలో సామాన్యంగా ఏదో ఒకపక్షం అవలంబించవలసిన అవసర ముందని ఆయన భేషజంలేకుండా గుర్తించినవాడు. ప్రతి యుద్ధంలోను యిరుపక్షాలూ ఒకలాంటివేననీ, ఏది గెలిచినా ఒకటేననీ-ఆయ నెప్పుడూ నటించలేదు; ఆయన రాజకీయ జీవితమంతా జాతీయస్వాతంత్ర్య సంపాదనకోసమైన పోరాటానికే అంకితం కావడంవల్ల- అలా నటించలేకపోయాడు. పాశ్చాత్య శాంతివాదులలో చాలామందిలాగ, ఆయన యిబ్బంది కలిగించే ప్రశ్నలను మూల పెట్టడంలో ప్రత్యేక ప్రతిభ ఏమీ సాధించలేదు. కడచిన యుద్ధం సందర్భంలో, ప్రతి శాంతివాదీ తన విధ్యుక్తధర్మంగా జవాబు చెప్పవలసి వుండిన ఒక ప్రశ్న ఇది: "యూదుల సంగతేమిటి? వాళ్లు సమూలంగా నాశనంచెయ్యబడుతూంటే చూస్తూ వూరుకోదలుచుకున్నారా ? లేకపోతే, యుద్ధం ద్వారా కాకుండా వాళ్ళని రక్షించడానికి మీ వుపాయం ఏమిటి ?" ఏ పాశ్చాత్య శాంతివాదీ యీ ప్రశ్న గురించి నిజంగా ఆలోచించిన పాపాన పోలేదు; తప్పదాటు వేసిన వాళ్ళయితే చాలామందే ఉన్నారు. కాని 1938 లో గాంధీని ఒకవిధంగా అటువంటి ప్రశ్నే అడగడం జరిగింది. జర్మను యూదులందరూ కట్టకట్టుకు ఆత్మహత్య చేసుకుంటే, "ప్రపంచంలోను, జర్మను ప్రజలలోను హిట్లరు హింసాత్మక చర్యలపట్ల సంచలనం కలిగేది" అని గాంధీ అభిప్రాయపడ్డాడు. ఆయన తన నమ్మకాలకు అనుగుణమైన జవాబిచ్చాడంతే. ప్రాణం తియ్యడానికి మనం సిద్ధపడకపోతే, ప్రాణాలింకొకవిధంగా పోడానికి తరుచు సిద్ధంగా ఉండా లన్నమాట. 1942 లో ఆయన జపానువారి దండయాత్రను అహింసాయుతంగా ప్రతిఘటించమని బోధించినప్పుడు, దానివల్ల

కొన్ని మిలియన్ల జననష్టం కలగవచ్చునని ఒప్పుకోడానికి సిద్ధంగానే ఉన్నాడు.

1869 లో పుట్టినవాడైన గాంధీ ప్రభుత్వ సర్వాధిపత్యం యొక్క స్వభావం అర్థం చేసుకోలేదనీ, ప్రతీదీ బ్రిటిషు ప్రభుత్వానికి ప్రతికూలంగా తాను సాగించిన పోరాటం పరంగానే చూస్తూవచ్చాడనీ అనుకోవచ్చు. పైని పేర్కొన్నట్టుగా, ఆయన 'ప్రపంచంలో సంచలనం కలిగించడం' మీద నమ్మకం పెట్టుకున్నాడు; మనం చేస్తూన్నదాన్ని గురించి వినడానికి ప్రపంచానికి అవకాశం వుంటేనే సంచలనం కలగడం సాధ్యపడుతుంది. అర్థరాత్రికి అర్థరాత్రి ప్రభుత్వ ప్రతికక్షులు అంతర్ధానమైపోయి, ఆ తరవాత మళ్లీ వాళ్ళ సంగతే తెలియని దేశంలో గాంధీ యొక్క పద్ధతులు అవలంబించడానికెలా వీలవుతుందో వూహించడం కష్టం. ఒక్క దేశాంతరాల్లో సంచలనం కలిగించడానికే కాకుండా, పెద్దయెత్తున ప్రజల్లో ఉద్యమం లేవదియ్యడానికైనా-ఆఖరికి మన సంకల్పాలు ప్రతిద్వంద్వికి తెలియజెయ్యడానికైనా దుర్ఘటమవుతుంది. విదేశ రాజకీయాలకు వర్తించినప్పుడు, శాంతివాదం శాంతిరహిత వాదమేనా అవుతుంది, హింసకు ప్రీతినైవేద్య మయినా అవుతుంది. అంతే కాదు — మానవజన్మలందరూ సౌమ్యస్వభావులేననీ, సరసమైనవాళ్ళేననీ అనే భావన- వ్యక్తులతో వ్యవహరించడానికి గాంధీ కంత చక్కగా ఉపయోగపడినా- యిక్కడ అర్థరహిత మవుతోంది. ఉదాహరణకి, మతిలేని వాళ్ళతో వ్యవహరిస్తూన్నప్పుడా భావన వర్తించదు. అప్పుడు వచ్చే ప్రశ్న యిది- ఎవరు మతివున్నవాడు? హిట్లరు మతి వున్నవాడేనా? ఒక సంస్కృతి ప్రమాణాల చొప్పున వేరొక సంస్కృతి సంస్కృతే మతిమాలిన దవడానికి వీలుందా? జాతులకి జాతులే కలిగివుండే మనోభావాలను కనిపెట్టగలిగినంతలో, దాతృత్వ చర్యకీ సుహృద్భావ ప్రదర్శనకీ మధ్య ఏమాత్రమయినా సంబంధం ఉండవచ్చా? అంతర్జాతీయ రాజకీయాలలో కృతజ్ఞతా భావానికేమైనా ప్రాధాన్య ముందా?

వీటినీ, యిటువంటి ప్రశ్నల్నీ జరూరుగా, ఎవరో ఒకరు మీట నొక్కి రాకెట్లను విడిచిపెట్టడం ఆరంభించక పూర్వమే, చర్చించడం అవసరం. నాగరికత యింకొక మహాయుద్ధానికి తట్టుకోవ గలగడం సందేహాస్పదం; దీనికి అహింస ద్వారా తరుణోపాయం ఉందని అనుకోడానికైనా వీలుంది. గాంధీ సుగుణ మేమిటంటే- పైన వేసినలాంటి ప్రశ్నను గురించి ఆయన నిష్కపటంగా ఆలోచించడానికి సిద్ధపడేవాడు; బహుశా ఆయన యీ ప్రశ్నల్ని ఎక్కడో అక్కడ చర్చించే వుంటాడు. ఆయన కర్థం కానిది చాలానే ఉండివుండవచ్చు; కాని ఆయన చెప్పడానికి గాని, చెయ్యడానికి గాని జంకినదేమీ లేదు. ఆయన రాజకీయభావాలు తప్పని గాని, ఆయన జీవితం విఫల మయిందని గాని అనుకోడం సరికాదు. గాంధీ హత్య జరిగిన సందర్భంలో, ఆయన ఆరాధకులే చాలామంది- అయ్యో, ఆయన జీవితకృషి ఆయన కళ్ళ ముందరే భగ్నమైపోయిందే. అని శోకించడం చాలా విచిత్రమైన సంగతి. కాని, హిందూ-ముస్లిం పోటాపోటీ ఉపశమింపజేసే ప్రయత్నంలో కాదు గాంధీ తన జీవితకాల మంతా వెళ్ళబుచ్చింది. ఆయన ప్రధాన రాజకీయ లక్ష్యం శాంతియుతంగా బ్రిటిషు పరిపాలనకు స్వస్తి చెప్పడం- అది ఆయన సాధించనే సాధించాడు. పోరు లేకుండా, బ్రిటిషు వారు ఇండియానుంచి వైదొలగి వెళ్లారు. ఇంకొక సంవత్సరానికి జరుగుతుం దన్నదాకా ఏ పరిశీలకులూ చెప్పివుండజాలని సంఘటన అది. 1945 నాటికి ప్రపంచం మొత్తంమీద చాలామంది భారతస్వాతంత్ర్యం పట్ల సానుభూతితో కూడిన అభిప్రాయం కలిగివున్నారంటే, దీనిని ఎంతవరకు గాంధీ వ్యక్తిగత ప్రభావానికి ఆపాదించవచ్చు? ఇప్పుడు సూచనలు కనిపిస్తున్నట్టుగా, ఇండియా-బ్రిటనుల మధ్య మెల్లిగా సుహృద్భావ సహకారాలు కుదురుకొన్నాయంటే- యిది కొంతవరకు గాంధీ ద్వేషభావ రహితంగా పట్టుదలతో తన పోరాటం సాగించడం ద్వారా రాజకీయవాతావరణాన్ని నిర్మాలిన్యం చెయ్యడంవల్లకాదా? అటువంటి ప్రశ్నలు వినరావడమే, ఆయన ఎంత గొప్పవాడో తెలియజేస్తుంది.

# ఆగష్టు పదిహేను వచ్చింది: ఔను గాని-

రావెళ్ల హనుమంతరావు

అరవై సంవత్సరాలపాటు స్వాతంత్ర్యోద్యమ కృషిని పట్టుదలతో దీక్షతో కొనసాగించిన మహామహుల ఆశయాలు ఫలించి, ఎన్ని కష్ట-నష్టాలు సంభవించినప్పటికీ వెనుదిరిగి చూడకుండగా శాంతము - సత్యము- అహింసా సూత్రములతో స్వాతంత్ర్యసమరం సాగించిన కాంగ్రెసు ప్రభుత్వాధికారాన్ని స్వీకరించి సరిగా ఇక రెండురోజులకు రెండు సంవత్సరాలు పూర్తి అవుతాయి.

విశాలదృష్టితో చూస్తే ఇది చాలా స్వల్ప కాలమే కావొచ్చు. ఈ వయస్సులో నున్న మానవజీవి పడుతూ లేస్తూ తప్పటడుగులు వేస్తూండవొచ్చు. తోపుడుబండి సహాయంతో ఇంటిముందు వెనుక ప్రహారీ గోడలమధ్య నడక సాగించుతూండ వొచ్చు. వచ్చీ రాని మాటలతో కేరింతాలు కొట్టుతూండవొచ్చు. ఆ వయస్సులో నున్న పసిపాప తెలిసీ తెలియక జేసే అల్లరి చిల్లరిపనుల్ని, హారాముల్ని పెద్దలు సంతోషంతో చూస్తూండ వొచ్చు. ఇది చిన్న పిల్లలకు సహజలక్షణమని నవ్వుకుంటూ సమాధాన పడవొచ్చు.

కాని విశాల ప్రదేశాన్ని పరిపాలించే ప్రభుత్వానికిగూడా ఇదే వర్తించుకుంటుందని అనుకోవటంగాని, ఇంత చిన్న వయస్సులోనే ఎన్ని పనులు చేయగల్గుతామని చెప్పుకోవటంగాని మంచిది కాదు. నూతనంగా అధికారంలోకి వచ్చిన సమయంలో వెంటనే ప్రజల కనుకూలంగా పనిజేయటం, ప్రజలకు కావలసిన సౌకర్యాలు జేయటం సాధ్యపడదని వాదించవచ్చు. ఈ వాదనకే కనక వస్తే యీ నూతనత్వంలోనే పనులు చకచకా చేయవలసి వుంటుంది. ఇప్పుడే త్వరితంగా ప్రజల కనుకూలమైన పనులు జేసి ప్రజల సహాకార సానుభూతులు పొందవలసి వుంటుంది.

చిన్న మొక్క పుట్టగానే తెలుస్తుంది-అది తిన్నగా పైకి పెరిగి పెద్దదై మానుగా తయారై చేవదేరి ఎక్కువకాలం మన గల్గుతుందో, లేక వంకర టింకరగా క్రిందనుంచి బుదుపులు, వంగలతో ఆణగారిపోతుందో. అదేవిధంగా ప్రభుత్వంగూడా ప్రజల కనుకూలమగు మార్గాన్ని నడుస్తూ, వారికి కావలసిన సౌకర్యాలు చేస్తూ, ప్రజల కింత కూడూ-గుడ్డా పెట్టి వారి సహాయ సానుభూతులు పొందటమో, లేక జమీందార్ల-ధనిక భూస్వాముల-పెట్టుబడిదారుల వాదనలకు లొంగి వారి కనుకూలంగా పనిజేసి ప్రజల నింకనూ దుర్భర బాధలకు గురి జేయటమో ముందే తెలుస్తుంది.

విదేశప్రభువులు వెడలిపోగా భారతదేశానికి స్వాతంత్ర్య మొచ్చిందన్న సంతోషమొకటే గాని ప్రజలకు చేకూరిన అధికసౌఖ్యాలేమీ లేవు. ఏ ఆశయాల కొరకు ప్రజలు స్వాతంత్ర్య పోరాటం జరిపారో; స్వాతంత్ర్యం వచ్చిన తరువాత స్వతంత్ర భారతదేశంలో ప్రజల కెలాంటి సౌఖ్యాలు, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు గల్గించబడతాయని కాంగ్రెసు నాయకులు తీర్మానాల ద్వారానూ, ప్రణాళికల ద్వారానూ, ఉపన్యాసాల ద్వారానూ హెచ్చరించితే కోట్లకొలది ప్రజలు స్వాతంత్ర్య సమరానికి తమ శక్తికొలదీ సహాయంజేశారో ఆ వాగ్దానాల్లో ఏ ఒక్కటీ కూడా అమలుపరచడానికి ప్రభుత్వం పూనుకోలేదు. ప్రజాపీడకుల తొలగించి ప్రజల కనుకూలమగు మార్గాన్ని నడవడానికి- పనులు చేయడానికి ప్రభుత్వం ఏవిధంగానూ ప్రయత్నించలేదు. పైగా ప్రజలకు అన్నిబాధలూ అధికమయాయి. ప్రజాద్రోహులకు బ్రిటిషు పరిపాలనలో లేని గట్టి రక్షణ యేర్పరచబడింది. ప్రభుత్వం సాగించే తీవ్రనిర్బంధ విధానం వందలు వేలకు రెట్టుగా పెరిగిపోయింది. భారత ప్రజలు

ఇంతకు ముందున్నదూ ఎరుగనంతటి నిరంకుశమైన ఆర్డినెన్సుల క్రింద బ్రతకవలసి వచ్చింది.

## పౌరస్వత్వాలు :

పౌరస్వత్వపు హక్కులు పూర్తిగా నాశనం చేయబడ్డాయి. మనస్సులో నున్న అభిప్రాయాలను బాహాటంగా వెల్లడించుకునే అవకాశాలు లేకుండా పోయాయి. వాక్స్వాతంత్ర్యము-సభాస్వాతంత్ర్యము-పత్రికా స్వాతంత్ర్యము నామమాత్రాలైపోయాయి. "ప్రజల్లో అరాజకం వస్తుంది, సంఘంలో అశాంతి బయలుదేరుతుంది, మాతృదేశం ప్రమాదావస్థలో పడుతూంది' అనే వింతవాదనలతో అనేక ఆర్డినెన్సుల తయారుచేసి, చట్టాల బిగించి పౌరత్వపు హక్కులు భగ్నం చేయబడ్డాయి. ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడుపడితే అప్పుడు 144వ సెక్షను ప్రయోగించి ఊరేగింపులు-ఉత్సవాలు-మీటింగులు జరగకుండగా చేయటం; ఎవరేమి చెబుతున్నారో విని, తమ కేది అనుకూలమో ఏది ప్రతికూలమో తెలుసుకొని, తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకునే అధికారం ప్రజలకు లేకుండగా జేయటం; కొన్ని పత్రికల నిషేధించటం. మరికొన్నిటి నుండి విపరీతంగా ధరావతులు కట్టించుకోవడం, కట్టిన ధరావతును ఏదో మిషపెట్టి కాజేయటం మన్నగు వివిధ రూపాలలో పౌరస్వత్వాలు నాశనం చేయబడ్డాయి.

వాక్స్వాతంత్ర్యము-సభా స్వాతంత్ర్యము-పత్రికాస్వాతంత్ర్యము ఉన్నాయి గదా అని కొంతమంది అరాజక వాదులు ప్రజాసామాన్యాన్ని రెచ్చగొట్టి దేశంలో అరాజకం వ్యాపింపజేయటానికి ప్రయత్నించవచ్చును. అలాంటి వారిని న్యాయస్థానానికి తీసుకువచ్చి వారికి తగిన దండన విధించటం అవసరము. దీన్ని కోర్టులద్వారానూ, ఇప్పుడున్న సెక్షనుల ద్వారానే చేయవచ్చు. అలా గాకుండా అసలు మొత్తాన్నే నిషేధించటం సరియగు పద్ధతి అనిపించుకోదు. బ్రిటిషు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఏ పౌరస్వత్వాల కొరకు కాంగ్రెసు పోరాటం సాగించిందో- కాంగ్రెసు ప్రభుత్వ పరిపాలనలో ఆ హక్కులే నాశనం గావించబడటం మంచిది కాదు. ఈ విషయాన్నే మద్రాసులో జరిగిన పౌరస్వత్వాల మహాసభ ఉద్ఘాటించింది.

## వ్యవసాయ సంక్షోభం :

మనదేశంలో నానాటికి విషమించిపోతూన్న వ్యవసాయ సమస్యవల్ల అలమటించిపోతూన్న వ్యవసాయకూలీలకు, పేద-మధ్యతరగతి రైతులకు కౌలుపొలం చేసుకునే అభాగ్యజీవులకు ఎలాంటి సౌకర్యాలూ సంప్రాప్తం కాలేదు. జమీందారీ-ధనిక భూస్వామ్య విధానాలు రద్దుచేయబడలేదు. రైతాంగంపైనున్న ఋణాం తగ్గించబడలేదు. పేదరైతులపైనున్న శిస్తు భారం తొలగించబడలేదు. "దున్నేవానికే భూమి హక్కు" అనేసూత్రం అమల్లోకి తేబడలేదు. మన వ్యవసాయం అభివృద్ధిగావటానికి ముఖ్యావసరాలైన ఆనకట్టలు కట్టటం-ప్రాజెక్టులు నిర్మించటం-కాలువలు త్రవ్వటం-ఉన్న వాటిని మరమ్మతు చేయటం వగైరా పనులేమీ జరగలేదు. వ్యవసాయంచేయటానికి రైతు కవసరమైన వ్యవసాయపుపనిముట్లు దొరకటంలేదు. పశువులకు కావలసిన దాణాదినుసులంలేవు. పొలాలకిఎరువులు లేవు. ఉన్నా వీటన్నిటినీ దొంగ మార్కెట్టులో ధరలకు కొనలేక రైతు బాధపడుతున్నాడు...

కాంగ్రెసు ఇంతకుముందు అనేక మహాసభల్లోనూ, 1939—1946 ఎన్నికల ప్రణాళికల్లోనూ రైతుల కేమి వాగ్దానాలు చేసిందో వాటిలో దేన్నికూడా అమల్లోకి తేలేదు. జమీందారీ-ధనికభూస్వామ్యాల రద్దుచేస్తామని, పేదరైతుల ఋణభారం-శిస్తుభారం తగ్గించుతామని కాంగ్రెసు అనేకసారులు గర్జించింది. ఈ గర్జనలన్నీ వర్షం కురవని మేఘాలు చేసే ఆడంబరమైన గర్జనలైపోయాయి! కాంగ్రెసు ప్రభుత్వంలోకి వస్తే తమనెత్తి నేదో బంగారపు కొండత్రవ్వి పెట్టుతారని ఆశించిన రైతుల కాశాభంగం కల్గింది. ఇక జమీందార్లకు-భూస్వాములకు తగిన రక్షణ యేర్పడింది. వారి కున్న భయం తొలగించబడింది. జమీందార్లకు కోట్లకు కోట్ల రూపాయలు నష్టపరిహార మిస్తామంటూ మద్రాసు ప్రభుత్వం ఇంతకుముందు తయారుజేసిన "జమీందారీ రద్దు బిల్లు"లోనూ, ఇప్పుడు

తయారుచేయ బోతున్న "వ్యవసాయ సంస్కరణల బిల్లు"లోనూ ఉద్ఘాటించబడింది.

### ఆహారసమస్య:

ఆహార సమస్య విషయంకూడా అలాగే వుంది. దేశంలో ఏమూల జూసినా "అన్నమో రామచంద్రా" అని అలమటించే ప్రజల ఆర్తనాదాలు అలాగే వున్నాయి.ఇవి అంతకంతకూ అధికమౌతున్నాయి కూడాను. రాష్ట్రాలలోనూ, సంస్థానాలలోనూ,కేంద్రంలోనూ ఉన్న ఆహారమంత్రులు- వారిసలహాదారులు ఎన్నిసార్లు సమావేశమై ఎన్ని ప్రణాళికలు తయారుచేసి, ఎన్ని తీర్మానాలు చేసినప్పటికీ అసలు సమస్య మాత్రము పరిష్కరింపబడటం లేదు.

ప్రణాళికలు పేపర్లమీద ప్రణాళికలుగా అట్లాగే వుంటున్నాయి. ప్రజలబాధలు అధికమౌతున్నాయి. అధిక లాభాలు సంపాదించి ప్రజల కొల్లగొట్టాలనే దురాశతో ప్రవర్తిస్తున్న పెట్టుబడి దారులను తగు విధంగా మందలించటం గాని, దండించటంగాని జరగటంలేదు.

స్వలాభాపేక్షతో దేశంలో అరాజకం చేయజూస్తున్న వారిపై తగు చర్యలు తీసుకోవడానికి ప్రభుత్వం ప్రయత్నించటంలేదు. వారి దగ్గరవున్న అదనపు నిల్వలను స్వాధీనం జేసుకొని సరసమైనధరలకు ప్రజల కందివ్వడానికి ప్రయత్నించటంలేదు. పైగా ప్రభుత్వోద్యోగులు రైతులు దగ్గర వున్న కొద్దిపాటి నిల్వలనే స్వాధీనం చేసుకుంటామని హంగామా చేస్తున్నారు.

### పారిశ్రామిక విధానం:

భారీ పరిశ్రమలను, ముఖ్యవ్యాపార కేంద్రాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని నడపటం అవసరమని ఎంతోకాలం నుండి దేశదేశాల ఆందోళన జరుగుతూంది. దాని వలన ఉత్పత్తి నధికం జేయటానికి, కార్మికులకు తగు సౌకర్యాలు గల్గించటానికి, వచ్చే అదనం లాభాలతో ప్రభుత్వం మరొక విధంగా ప్రజల కవసరమగు పనులు జేయడానికి వీలవుతుందని ఎంతో ఆందోళన జరిగింది. అనేక ఇతర దేశాలు ప్రభుత్వాలే పనులు జేయటం వలన దినదిన ప్రవర్థమానంగా అభివృద్ధి జెందుతున్నాయి. ఆ ప్రభుత్వాలు ప్రజలకు కావలసిన కూడూ-గుడ్డా, నివాస వసతులు, విద్యా-ఆరోగ్య సౌకర్యాల నేర్పరచి, ప్రజల ఆదరాభిమానాల చూరగొంటూ రానాటికీ అధిక బలం సంపాదించుకుంటున్నాయి.

మనదేశంలో కూడా స్వాతంత్ర్యం ముందు నుండీ యీ ఆందోళన జరుగుతూనేవుంది. దీనిపై కాంగ్రెసు అనేక తీర్మానాలు చేసింది. "నేషనల్ ప్లానింగ్" కమిటీ ద్వారా పండిత నెహ్రూ పెద్దపెద్ద ప్రణాళికలు తయారుజేశారు. ఇవన్నీ నేడు ఉత్తుత్త విచారణలుగా తేలిపోయాయి. ప్రజలకు ఆశాభంగం కల్గింది. పెట్టుబడిదారుల కున్న భయం తొలగింది. ప్రభుత్వం మరొక పది సంవత్సరాల వరకు వారి జోలికి పోమని హామీ నిచ్చింది.

### రాష్ట్ర విభజన:

భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సిద్ధాంతాన్ని అంగీకరించుచూ కాంగ్రెసు అనేకసార్లు ప్రకటనలు చేసింది. "విభజించి పాలించు"మనే కుటిల సిద్ధాంతాన్ని ఆధారంగా జేసుకొని బ్రిటిషు సామ్రాజ్యవాదులు భారతదేశంలోని అనేక జాతులను చీలదీసి, అనేక భాషలు మాట్లాడే వారిని ఒక రాష్ట్రంలో చేర్చి వారు ఒకరితో ఒకరు పోట్లాడుకునే పద్ధతుల నేర్పరచి నందుకు వారిని కాంగ్రెసు నిరసించింది. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన మవసరమని తీర్మానాలు చేయటంద్వారాను, కాంగ్రెసు సంఘాన్ని ఆవిధంగా చీలకోసి రాష్ట్రసంఘాల నేర్పరచడం ద్వారానూ కాంగ్రెసు యీ వాదనకు బలం చేకూర్చింది.

ఆ కాంగ్రెసే అధికారంలోకి వచ్చిన తరువాత పెట్టుబడిదారుల వాదనలకు లొంగి భాషా ప్రయుక్తరాష్ట్రవిభజన సిద్ధాంతానికి పంగనామాలు పెట్టడం జరిగింది. ప్రత్యేకంగా ఆంధ్ర రాష్ట్రం విడివడిపోవడానికి అనేక ఆటంకాలు కల్గించబడ్డాయి. దీనివలన దేశానికి గొప్ప నష్టం సంప్రాప్తం కానున్నట్లు కనిపించుచుంది. మద్రాసు నగరంకొరకు ఆంధ్రులు - అరవలు తగవులాడటం అధికమౌతోంది. ఆంధ్ర కాం

గ్రెసు నాయకులు హైకమాండువారిని కలుసు కోడానికి ఢిల్లీ ప్రయాణం సాగించుతున్నారు. ఆంధ్రనాయకుల నడవడిక - ప్రకటనలు-తీవ్ర సంభాషణలు చూస్తే ఈ విషయ సమస్య ఏ విధంగా అంతం కానుందో చెప్పలేకున్నాము. ఏది ఎట్లా జరిగినప్పటికీ మొత్తంమీద కాంగ్రెసు ప్రభుత్వం భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సమస్యను ప్రజల కనుకూలమగు మార్గంలో పరిష్కరించ లేకపోయింది.

## నైతిక వాతావరణం :

నైతికంగా కాంగ్రెసు ప్రభుత్వం ఎంత దిగజారిపోయిందో వర్ణించడం సాధ్యం గాదు. దీనిమీద ఎన్ని పేజీలు వ్రాసినా తరగదనటంలో అతిశయోక్తి లేదు. న్యాయం - ధర్మం-సత్యం - సత్ప్రవర్తన-నీతి-నియమాలనే ఏమహత్తర ఆశయాలతో మహాత్మా గాంధీ కాంగ్రెసును పునీతం జేశాడో, ఏ మహోన్నత భావాలతో రామరాజ్యాన్ని స్థాపించాలని గాంధీజీ కలలు గన్నాడో, ఏనీతి సూత్రాలకు కట్టుబడి వుండాలని కాంగ్రెసు కార్యకర్తలకు పదేపదే హెచ్చరించాడో, అవన్నీ కూడా ఎందుకూ పనికిరాని వ్యర్థప్రసంగాలుగా మారిపోయాయి.

కాంగ్రెసు నాయకులలో పదవీ వ్యామోహం పెచ్చుపెరిగింది. పదవులకోసం ప్రాకులాడటం-ముఠాలు ఏర్పడటం అధికమైంది. అంతటా బ్లాక్ మార్కెట్టు - లంచగొండితనాలు కూడా బయలుదేరాయి. వీటన్నిటి ఫలితంగా ప్రజల బాధలు మరింత అధికమయాయి. ప్రభుత్వోద్యోగులు మరింత అధికంగా అవినీతికరంగా ప్రవర్తించటం-ప్రజల్ని పీడించి బాధించటం జరుగుతోంది.

## ఆత్మ పరీక్ష :

ఈ విధంగా లెక్కకు మించి జరుగుతున్న ఘోరసంఘటనలనుండి, అవమానకర దుష్కార్యములనుండి కాంగ్రెసు నాయకులు- ప్రజలు తగు గుణపాఠములు నేర్చుకోవలసి వుంది. ముఖ్యంగా కాంగ్రెసు నాయకులు క్రితం రెండు సంవత్సరాల నుండీ జరుగుతూన్న సంఘటనలు ప్రభుత్వ మవలంబించుతూన్న మార్గాలు- కల్గుతూన్న కష్టనష్టాలు- జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ జరుగుతూన్న పరిణామాలు- వీటన్నిటిని న్యాయదృష్టితో సింహావలోకనం జేసి, ఆత్మ విమర్శ చేసుకొని, జరిగిన తప్పేదో గ్రహించుకొని సరైన మార్గాన్ని నడవడానికి తగునిర్ణయం చేసుకోవాలి. ఏ మార్గాన్ని అవలంబించితే ప్రజలకు మేలు సమకూరుతుందో, ఆమార్గాన్నే అవలంబించడానికి, ప్రజల సహకార సానుభూతులు సంపాదించడానికి కాంగ్రెసు ప్రభుత్వం ప్రయత్నించాలి.

తాను తప్పుడుమార్గాన్ని పట్టానని తెలుసుకున్నపుడు 1922 లో మహాత్మా గాంధీ ఆత్మ ధైర్యంతో నిలబడి, కొండంత తప్పు చేశానని చెప్పి తన మార్గాన్ని మనసారా నమ్మిన సిద్ధాంతాలవైపు ఏవిధంగా మరల్చుకున్నాడో, అదే విధంగా యీనాడు కాంగ్రెసు నాయకులు గూడా ఆత్మవిమర్శ జేసుకొని, తగు ధైర్యంతో జరిగిపోయిన తప్పిదాలను ఒప్పుకొని, తిరిగి అలాంటివి జరగకుండా చేయడానికి ప్రతిన బూనాలి.

న్యాయ ధర్మాలకు, నీతి నియమాలకు కాంగ్రెసు ఆలవాలమని ఒకప్పుడు నొక్కి వక్కాణించటం జరిగింది. కాంగ్రెసు సిద్ధాంతాలకు-నీతిసూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తించినందుకై అనేకమందిని కాంగ్రెసు నుండి తొలగించటం జరిగింది. ఆనాడు కాంగ్రెసు ఎంత ధైర్యంతోనూ, ఆత్మబలంతోనూ, పటుత్వంతోనూ దుర్మార్గ శక్తులను కాంగ్రెసు నుండి బయటకు నెట్టప్రయత్నించిందో, తిరిగి యీనాడు కూడా అదేవిధంగా ఆత్మబలంతో పనిజేయటానికి ప్రతిన బూనాలి.

ఏది మంచో, ఏది చెడుగో కాలమే నిర్ణ యించుతుందని ఉపేక్షవహించితే పెద్ద ఘా తాలు గల్గుతాయి. శరీరంలో ఒక భాగమందు బయలుదేరిన చెడురక్తం శరీరమంతటా వ్యాపించ తుంది. ఆ మానవుని జీవితమే అగమ్యమై పోతుంది. అదేవిధంగా యీనాడున్న కొద్దిపా

పద్ధతి రద్దుచేయకపోతే అదే సంభవించటానికి దారితీస్తుంది. కాంగ్రెసు ఛిన్నాభిన్నమౌతుంది. భారతదేశం మరింత పతనావస్థకి దిగజారుతుంది.

మన దేశానికి స్వాతంత్ర్యం రాకముందు జరిగిన అనేక కాంగ్రెసు సమావేశాల్లోనూ, 1937-46 సంవత్సరాలలో జరిగిన ఎన్నికల సమయమందుకా ప్రకటించిన ప్రణాళికల్లోనూ, ప్రజలకు చేసిన వాగ్దానాల్లోనూ ఏ యే సమస్యలు ప్రజల కనుకూలంగా ఏ విధంగా పరిష్కారం చేయబడతాయని నమ్మించారో వాటిని వెంటనే ఆ విధంగా అమలు జరప ప్రయత్నించాలి.

(1) జమీందారీ విధానం రద్దు చేయడం, (2) భూస్వాములకు భూమిపై వున్న హక్కు తొలగించడం, (3) రైతు రుణాలు రద్దు చేయడం, (4) పేదరైతుల శిస్తుతగ్గింపు, (5) అవసరమైన ప్రాజెక్టులు నిర్మించటం, (6) ఆహార సమస్యను పరిష్కరించటం, (7) నిరుద్యోగ సమస్య లేకుండగా చేయటం, (8) ప్రజలందరకూ ఉచితంగా విద్యా-ఆరోగ్య సౌకర్యాలు కలుగ జేయటం మున్నగు వాగ్దానాలు ఎన్నో చేయబడ్డాయి.

వీటిల్లో ఏ ఒక్కటీకూడా ప్రజల కనుకూలమగు మార్గంలో పరిష్కరించటం జరగలేదు. ఈనాడు ఆత్మ విమర్శ ద్వారా ఇది తెలుసుకొని తిరిగి పూర్వం కాంగ్రెసు ప్రజలకు ఏయే వాగ్దానాలు చేసిందో, వాటి నన్నిటినీ అమల్లోకి తేవడానికి శపథం చేయాలి.

ఆలా కాకుండగా పూర్వంలాగే ఉత్సవాలు-ఊరేగింపులు-వేడుకలు-వినోదాలు జరుపుకొని మనకు సరకులన్నీ దొరుకుతుంటే, ఆగస్టు 15వ తేదీకేమీ విలువే ఉండదు.

ప్రజల కర్తవ్యం:

ఇందులో ప్రజల కర్తవ్యమూ వుంది. ప్రభుత్వం మంచిచేస్తే బాగుపడేది, చెడుచేస్తే నష్టపడేది ప్రజలే. కనుక ప్రజలుకూడా ప్రభుత్వాన్ని సరిజేయటానికి ప్రయత్నించాలి.

తోటలో పెరుగుతూన్న మొక్కలను చెడిపోకుండగా, పురుగులు వేయకుండగా కాపాడవలసిన బాధ్యత తోటమాలిమీద వున్నట్లుగానే ప్రభుత్వాన్ని సరిజేయవలసిన బాధ్యత ప్రజలపైనకూడా వుంది. తోటలో వున్న చెట్టును సరిజేస్తే- అది చక్కగా పెరిగి పెద్దదై, మ్రానుగా తయారై చలవనీడలు ఇవ్వగల్గితే తోటమాలికి హాయి వుంటుంది. విశ్రాంతి చిక్కినపుడు సంతోషంగా చెట్టునీడను నడుంవాల్చి గుండెమీద చేయివేసుకొని నిబ్బరంగా, సుఖంగా పడుకోగల్గుతాడు. అలా కాక చెట్టు పురుగులు వేసి, ఎక్కడికక్కడే బుడిపెలు, కొమ్మలు తయారై వుంటే ఆచెట్టు సరియైన చలువనీడనీయదు. దానిక్రింద తోటమాలి విశ్రాంతి తీసుకోడానికి అవకాశం వుండదు. ఏదోవిధంగా విశ్రాంతికొరకు కూర్చున్నా, ఆదమరచి నిద్రపోయినా - బుడిపెలతోవున్న ఆచెట్టులో ఏ మూలనుంచో చెదపురుగులు ప్రవేశించి కొమ్మలను గుల్లచేయటంవలన ఏ నిమిషానైనా తీవ్రవాయువుకి ఆవృక్షం విరిగి పడటంతో తోటమాలి ప్రాణానికే అపాయం కల్గుతుంది. కనుక తోటమాలి వృక్షాన్ని సరిగా పెంచుకోవటం అవసరం.

---

సుభాషితాలు

జంతువులు నిజంగా మనకి ఆదర్శమైన స్నేహితులు ; ఏవీ ప్రశ్నలు వేసి వేధించవు; విమర్శించవు.

శత్రువుకైనా సరే, యుద్ధానికి వెళ్లమనిగాని, పెళ్లి చేసుకోమనిగాని సలహా యివ్వకూడదు.

జీవితానికి స్త్రీ అనేది సెలవుదినం వంటిదని కొందరు అనుభవజ్ఞుల అభిప్రాయం.

# కొత్త రాజ్యాంగంలో ఎగువ శాసనసభలు

తాడిమళ్ల జగన్నాథరావు

మన నూతన రాజ్యాంగం ప్రకారం - ఎగువ శాసన సభ కావాలని గాని, ఉండ నక్కర లేదని గాని దిగువ శాసనసభ కోరవచ్చును. ఏ రాష్ట్రంలోనైనా కౌన్సిలు ఉన్నయెడల దానిని రద్దు చేయుటకు, ఎగువ శాసనసభ లేని రాష్ట్రంలో ఒకటి నెలకొల్పుటకు రాష్ట్రంలోని అసెంబ్లీ సభ్యులలోని అధిక సంఖ్యాకులు ఆమోదించుట చేతను, హాజరైన సభ్యులలో మూడింట రెండు వంతుల మందికి తక్కువ కాకుండా వోట్లు ఇచ్చుట వల్లను ఎగువ శాసన సభలను నిర్మూలించుట గాని, నిర్మించుట గాని చేయవచ్చును. ఈ అధికారం పార్లమెంటుకివ్వబడింది. ఎగువ శాసన సభల కోరికను నెరవేర్చడానికి ఇండియా పార్లమెంటు ఒక శాసనం చెయ్యాలి. ఆమార్పు శీఘ్రంగా అమలు జరపడానికై, అది రాజ్యాంగసవరణ శాసనంగా పరిగణింప బడదు. ఎగువ శాసనసభ నిర్మాణాన్ని గూర్చిన అధికారం పార్లమెంటుకు సంక్రమింప చేయడం వల్ల పరిషత్తు సభ్యులు ఈ అంశానికి ప్రతికూలత చూపారు. అందుచేత ఈ విషయం రాజ్యాంగ రచనాసంఘం వారే ఒక పరిష్కార మార్గాన్ని సూచించ డానికి వదలి వేయబడింది. నూతన రాజ్యాంగం ప్రకారం అసెంబ్లీ ఆమోదించి కౌన్సిలుకు పంపిన బిల్లును, కౌన్సిలు మొదటి దఫా మూడు నెలలు, రెండవ దఫా ఒక నెల, మొత్తం నాలుగు నెలల పాటు మాత్రమే శాసనం కాకుండా ఆపగలదు. అసెంబ్లీలకే నూతన రాజ్యాంగం ప్రకారం అధిక అధికారాలివ్వబడ్డాయి. కౌన్సిలు అధికారాలు కేవలం నామమాత్రంగా ఉంచబడ్డాయి. ఇక కేంద్రంలోని ఎగువ శాసన సభకు రాష్ట్రాలలోని ఎగువ శాసన సభలకన్న కొన్ని ఎక్కువ అధికారాలు ఇవ్వబడ్డాయి. బలీయమైన కేంద్రాన్ని ఏర్పరచాలనే ఉద్దేశ్యంతోనే యీ విధంగా చెయ్యబడింది.

రెండు శాసన సభలు ఉండాలా, అక్కర లేదా! అనే విషయంపై ఎంతో కాలంగా చర్చలు జరుగుతున్నాయి. రెండు శాసన సభల సూత్రం వికాసించి ఏర్పడ్డా, ఆ పద్ధతిమటుకు ఇంగ్లండులో జయప్రదంగా కొనసాగడంవల్ల మిగతా దేశాల వారికి కూడ రెండు శాసన సభల మీద మోజు పుట్టింది. పశ్చిమ దేశాలలో విప్లవాల అనంతరం ఒకే శాసన సభతో కార్యకలాపాలు జరుపుదామని ప్రయత్నాలు జరిగాయి. క్రాంవెల్ పరిపాలనలో ఇంగ్లండులో ప్రభువుల సభ నిలుపుచేయబడింది. కాని తరువాత రాజవంశాన్ని పునః ప్రతిష్ఠించడంతో తిరిగి ప్రభువుల సభ స్థాపించబడింది. అమెరికా దేశపు కాన్ ఫెడరేషన్‌లో మొదట ఒకే శాసనసభ స్థాపిద్దామనుకున్నారు. కాని వారుకూడ రెండు శాసన సభలు నిర్మించక తప్పలేదు. ఫ్రాన్సులో 1793 రాజ్యాంగం ఒకేశాసనసభ ఉండాలనే ప్రాతిపదికపై వ్రాయబడింది. ఆ పద్ధతి అనేక అరిష్టాలకు దారి తీయడంతో రద్దు కావించబడింది. తిరిగి 1795 లో రెండు శాసన సభలు ప్రవేశపెట్టబడ్డాయి.

రెండు శాసనసభలు అనవసరం అని వాదించే వారు ముఖ్యంగా చూపించే కారణాలు ఇవి - 'ప్రజా ప్రతినిధుల సభతో ఎగువ శాసన సభ ఏకీభవించక ఎట్లాగూ తప్పదు. ఒకవేళ ఏకీభవించని పక్షంలో దిగువ శాసనసభ మాటే చలామణీ అవుతుంది. అటువంటప్పుడు ఎగువ శాసన సభల వల్ల ప్రయోజనం ఏమీ కల్పించదు వీటి వల్ల వ్యయం మాత్రమే కలుగుతోంది. పైపెచ్చు ఈ ఎగువ శాసన సభలు అభివృద్ధి నిరోధకులతో నిండి ఉంటాయి. శాసన సభల అధికారాలలో రెండు చీలికలు కల్పించడం కంటె ఎగువ శాసన సభల ప్రయోజనం అగుపడటంలేదు.' ఈ వాదం నానాటికీ అధిక బలం సంపాదించు కొంటోంది.

అనేక దేశాలలో నవీన యుగంలో ఒకే శాసన సభ నిర్మింపబడుతోంది.

కాని ఎగువ శాసన సభలు ఎంత అనవసరం అని వాదించినా, వాటివల్ల కలిగే కొన్ని ప్రయోజనాలను మాత్రము విస్మరించలేము. దిగువ శాసన సభల నిరంకుశత్వాన్ని కొంతవరకు ఎగువ శాసన సభలు నిరోధించగలవు. అధికసంఖ్యాకబలంతో ఉండే దిగువ శాసన సభలోని పార్టీ తన అధికారాలను దుర్వినియోగం చేయకుండా ఎగువ శాసన సభ కొంతవరకు ప్రతిబంధకాలు కల్పించగలదు. కొన్ని ప్రత్యేక తరగతుల వారికి ఎగువ శాసన సభలో ప్రాతినిధ్యం కల్పించవచ్చును. ఎగువ శాసనసభల సరియైన సూత్రాలతో నిర్మిస్తే, అందులో తప్పక మేధావులకు, సంస్కర్తలకు, ప్రజాసేవకులకు, కార్మికులకు, సంస్థలకు స్థానం లభిస్తుంది. త్వరలో వయోజన వోటింగు పద్ధతిపై ఎన్నికలు జరుగుతాయి. వీటిఫలితంగా ఎటువంటి ప్రజాప్రతినిధివర్గం అసెంబ్లీకి రాగలదో చెప్పలేము. సరియైన ప్రతినిధివర్గం రాకపోతే ప్రజాస్వామ్య సూత్రాలకే భంగం వాటిల్లవచ్చు. అట్టి పరిస్థితులలో అనుభవజ్ఞులు, మేధావులతో నిర్మింపబడే ఎగువశాసన సభల అవసరం ఎంతైనా ఉంది. తెలివైన నిర్వాహకత్వంతో ప్రజాపాలన మేళవించినప్పుడే రాజ్యాంగం రాణిస్తుంది. ఈ విషయాలనే బ్రజేశ్వరప్రసాద్ రాజ్యాంగ పరిషత్తులో నొక్కిచెప్పారు.

అన్నిటికన్న అతిప్రముఖమైన ఒక పనిని ఎగువ శాసనసభలు నిర్వహించవలసివుంది. అది దిగువశాసనసభలు సరిగా యోచించక తొందరపాటుతో చేసే సంస్కరణలను నిరోధించడమే. ప్రజాప్రతినిధులు తమ ఎన్నికల ప్రణాళికలలో పొందుపరచిన విషయాలను ఆచరణలో పెట్టచూడటం సహజం, అవసరంకూడా. ఆచరణలలో పెట్టే సందర్భంలో వారు తాత్కాలిక ఉద్రేకాలకు తరచు లోనౌతూ ఉంటారు. దిగువ శాసన సభలు తొందరపాటు సంస్కరణలను, వాస్తవికతను పరిశీలించకుండా చేసిన సందర్భాలనేకాలున్నాయి. తొందరపాటు సంస్కరణలు చేయబడ్డవి, మద్యనిషేధం, గుర్రపుపందాల నిషేధం మొన్నగు సంస్కరణలు ప్రవేశపెట్టడంలో కొంచెం తమాయించవలసిందని పండిత నెహ్రూ ఇటీవల వివిధ రాష్ట్రప్రధానులను హెచ్చరించినట్లు వింటున్నాం. మద్యనిషేధం మొన్నగు సంస్కరణలు మంచివి కావని ఎవరూ అనలేరు. కాని వెంటనే అంతకంటే అధికతరమైన ఆహార, ఆర్థిక సమస్యలను సాధించవలసివున్నప్పుడు, తొందరపడి ఆదాయాలను కోల్పోయే సంస్కరణలను చేయడంలో ఔచిత్యం గోచరించదు. ఈ సంస్కరణల ద్వారా కలిగిన లోటును భర్తీచేయడానికి మధ్యతరగతి వారిని పీడించే అనేక పన్నులు వేయవలసి వస్తోంది. కాబట్టి తొందరపాటు సంస్కరణలను కొంతకాలంపాటు నిలుపుచేసేటట్లు ఎగువ శాసనసభలు చూడవలసియుంది. ప్రస్తుత రాజ్యాంగం ప్రకారం ఎగువ శాసనసభలు ఆ నిలుపుదలను మూడు మాసాలుమాత్రమే చేయకలవు. మొదట్లో రాజ్యాంగ రచనా సంఘం వారు యోచించినట్లు ఈ కాలపరిమితిని ఆరు నెలలు చేస్తే బాగుండేది. కొన్నికొన్ని ప్రధానములైన శాసనాలను చర్చించడానికి కూడ మూడునెలల కాలపరిమితి ఎగువ శాసనసభలకు సరిపోక పోవచ్చును. సరియైన సూత్రాలపై, వివిధవర్గాల ప్రాతినిధ్యంతో నిర్మింపబడే ఎగువ శాసనసభలు ముఖ్యంగా నూతన ప్రజాస్వామికాలలో ఎక్కువ ఉపయోగకరంగా ఉంటాయనే విషయం నిర్వివాదాంశం. అట్టి ఎగువ శాసన సభలను కేవలం నామమాత్రావశిష్టంగా చేసేసి దిగువ శాసనసభలకే అసలైన శాసన నిర్మాణాధికారాన్ని సంక్రమింపచేస్తే మన ఈ నూతన ప్రజాస్వామికాలకు అంతగా సరిపడదు.

స్కెచ్

# అనుమాన ప్రమాణం

'హితశ్రీ'

హైస్కూల్ వార్షికోత్సవ సందర్భంలో ఆటల పోటీలు పెట్టి గెలిచిన వాళ్ళకి బహుమతు లిస్తున్నారు. ఈ బహుమతులు తమ చేతుల మీదుగానే ఇవ్వటానికి డిప్యూటీ సూపరింటెండెంటు దొరవారు దయతో అంగీకరించారు. ఆటలమీద తమకెంత ఆసక్తి ఉన్నదీ, అందరికీ ఎంత ఉండవలసిందీ స్పష్టంగా చెప్పేసి దొరవారింకా ఇలా అన్నారు-

"మనదేశంలో కమ్యూనిస్టు ప్రమాదం మహా ఉధృతంగా ఉంది. కమ్యూనిస్టుల్ని మొదలంట నాశనం చేయాలంటే మీరందరూ మాతో సహకరించాలి. మీరు భావి భారతపౌరులు; వారసులు. కమ్యూనిస్టుల్ని ఎదుర్కోటానికి మీరంతా శక్తివంతంగా తయారు కావాలి. కమ్యూనిస్టుల్ని —"

ఉపన్యాసం శ్రద్ధగా వినే ఓ కుర్రవాడికి "కమ్యూనిస్టు"అంటే ఎవరా అని ధర్మసందేహం కలిగింది. నిర్భయస్థుడు కావటంచేత అడిగేశాడు ధైర్యంగా. "కమ్యూనిస్టు అంటే ఎవరండీ?" "కమ్యూనిస్టు" అంటే అర్థం తెలియకపోయినా ఆ పదాన్ని చాలాసార్లు విన్న కుర్రాళ్లు అతడివైపు ఆశ్చర్యంగా చూశారు. హెడ్ మాష్టరుగారు భీకరంగా చూశారు; దొరగారు కొంచెం కోపంగా చూశారు. దొరగారికి సమాధానం వెంటనే దొరకలేదు. కమ్యూనిస్టు అనే పదానికి నిర్వచనం కంఠస్థం చేయనందుకు కాసేపు విచారపడి, ఇంతలో ఏదో స్ఫురించగా దొరగారిలా అన్నారు-

"కమ్యూనిస్టంటే ఎర్రజెండా పట్టుకు తిరిగేవాడు. కాబట్టి మీరు ఎర్రజెండా వాళ్ళని చూడటం తటస్థిస్తే వెంటనే వాళ్లు కమ్యూనిస్టులనీ, దేశానికి పరమ శత్రువులనీ గ్రహించుకోండి. మీకో ముఖ్యవిషయం చెబుతున్నాను. ఈ చుట్టుపక్కల ఉన్న కమ్యూనిస్టు లందర్నీ ఎక్కడున్నాసరే వెతికి, కమ్యూనిజాన్ని సమూలంగా నాశనం చేసేదాకా నేను నిద్రపోను. ఈ ప్రయత్నంలో మీకు కొన్ని ఇబ్బందులు కలుగవచ్చు. (దొరగారు తాము మాట్లాడేది పిల్లలతోనని మర్చిపోయినట్టున్నారు.) కాని మీరు ఓర్పువహించి ప్రభుత్వంతో సహకరించాలి." హెడ్ మాష్టరుగారు చప్పట్లు చరవటం చూసి పిల్లలంతా దిక్కులు పిక్కటిల్లేలా కరతాళధ్వనులు చేశారు. దొరగారు గర్వంగా కలయచూసి కారువైపుకు నడిచారు.

దొరగారు చెప్పిందాంట్లో ఏమీ అతిశయోక్తి లేదు. అక్షరాలా తమ విధానాలు అమలు జరుపుతున్నారు కమ్యూనిస్టుల్ని గాలించటానికి. అవి ఎంతవరకు ఫలిస్తున్నాయీ అనేది వేరే సంగతి.

పక్కఊళ్లో పనిఉండి ఓరోజు తెల్లవారుజామున బయలుదేరాను. సగందూరం వెళ్ళాను. చీకటి ఇంకా బాగా వుంది. రోడ్డుమీద నేను తప్ప మరో ప్రాణి నడవటంలేదు కనుచూపు మేర దూరంలో. దూరంలో లైట్లు కనపడుతున్నాయి... పోలీస్ వాన్ వొస్తోంది. నా దగ్గరికి ఒచ్చేసరికి తపీమని ఆగింది వాన్. ఓ పోలీసాయన (ఇన్‌స్పెక్టరు కాబోలు) అడిగాడు-

"ఎవరు మీరు?"

"సివిలియన్"

"ఎక్కడికి పోతున్నారు?"

"పక్క ఊళ్ళోకి"

"మీ పేరు?"-చెప్పాను.

"ఇంత చీకట్లో బయలు దేరాలిసిన అవసరం ఏమిటి?"

"పొద్దెక్కకముందే చేరదామని"

"చేతిలో ఆ పుస్తకం ఏమిటి?"

చచ్చాను- పుస్తకానికి ఎర్రట్ట ఉంది.

"దేశం బాగుపడాలంటే అనే పుస్తకం"

"హాహా-దయచేయండి లోపలికి..."

"ఏమిటి మీ అభిప్రాయం?"

"ఎక్కువయ్యా వాన్" రెక్క కట్టుకు లోపల కూర్చోపెట్టాడు పోలీసాయన.

* * *

ఇందాక మీకు ఓ విషయం చెప్పడం మర్చిపోయాను. సూపరింటెండెంటుతో నాకు కాస్త పరిచయం ఉంది. ఆయనా, నేనూ ఒక కాలేజీలోనే చదివాం. మా పక్క రూములో ఉండేవాడు.

"మరోలా అనుకోకండి. ఏం చేస్తాం చెప్పండి. తప్పని పని." అన్నాడాయన ఓదార్పుగా టౌన్ పోలీసు స్టేషన్లో.

"ఫరవా లేదులెండి. కాని మీకు కోపం రాకపోతే ఓ సంగతి అడుగుతాను."

"ఏమిటి?"

"రోడ్డుమీద పోలీస్ వ్యాన్ తిరగడం ఎందుకు?"

"కమ్యూనిస్టుల్ని పట్టుకోడానికి - అదో విధానం."

"రోడ్డుమీద కాలేసుకు పచార్లు చేస్తే కమ్యూనిస్టులు దొరుకుతారనా మీ ఉద్దేశం? దాక్కోదలచిన వాళ్లు బహిరంగంగా తిరుగుతారా ఏమిటి?"

"మీకు తెలియదు- వాళ్లకి తెగింపు జాస్తి."

"అలా అయినా-పోలీస్ వ్యాన్ చూసికూడా, కొరవిదయ్యాల్లాంటి ఆ హెడ్ లైట్లు రెండు ఫర్లాంగులదూరంలో చూసి కూడా ఎదురుగా వచ్చే మూర్ఖులా వాళ్లు?"

సూపరింటెండెంటు మాట్లాడలేదు.

"రోడ్డుమీద పోయే ప్రతివాళ్లనీ కమ్యూనిస్టని అనుమానించడం చూస్తే నవ్వొస్తుంది. చచ్చి చెడి సగందూరం నడిచాను. కాళ్లనొప్పులే కాక పనికూడా చెడ్డది మీ పోలీసువాళ్ళ అతి తెలివివల్ల." కోపంతో అన్నాను.

"తప్పని పని — పరిస్థితు లలాంటివి."

"ఆధారాల కంటె కమ్యూనిస్టుల కుంద కలసిన లక్షణాలు వల్లించి అవి చూచాయగా ఎవరిదగ్గరైనా ఉంటే వాళ్ళని అరెస్టు చెయ్యటమో, నిర్బంధించటమో చూస్తే కోపం పోయి నవ్వొస్తోంది. పౌరస్వాతంత్ర్యాలకి విలువ ఏముంటుంది ఇహ?"

"ఇప్పుడిలాగే అంటారు. రేపు పీక్ల ఉపద్రవం మరీ ఎక్కువైతే పోలీసు డిపార్టుమెంటు కుంభకర్ణుడితో పోటీ చేస్తోందా అంటారు?"

"ఏమైనా అనండి - తగినంత ఆధారం లేకుండా కేవలం అనుమానంమీద నిర్బంధాలు జరగటం ఉచితం కాదు."

ఆయన నిర్లక్ష్యంగా నవ్వి అన్నాడు.

"పోనిద్దురూ ఈ గొడవలు - కాస్త చిన్నప్పటి కబుర్లు చెబుదురూ - మిమ్మల్ని ఇన్నాళ్ల తర్వాత చూస్తే కాలేజీ జీవితం అంతా కళ్లకు కట్టినట్టుంది."

"ఏమిటో ఆరోజులు-" ఇద్దరమూ నిట్టూర్పు విడిచాం. కాసేపు మాట్లాడిన తర్వాత ఆయన అన్నాడు.

"సాయంత్రం ఓ సారి కనిపిస్తారు గదూ - కాస్త అలా తిరిగి వొద్దాం. ఈ ఆఫీసు పనితో మరీ చిరాగ్గా ఉంటోంది."

తల ఊపాను.

* * *

కబుర్లు చెప్పుకుంటూ ఊరుపొలిమేర దాటాం ఇద్దరమూ. బాగా చీకటిపడ్డది. మాటలసందడిలో టైం తెలియలేదు. తీరా టైంచూసేసరికి తొమ్మిదయింది. వెనక్కి తిరిగాం. హెడ్ లైట్లు మెరిశాయి. పోలీస్ వ్యాన్ వొస్తోంది. దగ్గరగా వొచ్చి తటాలున ఆగింది. లోపల రిజర్వుదళం ఉంది.

"ఎవరు!" అధికార స్వరంతో అన్నాడు పోలీసాయన.

"సివిలియన్" అన్నాను. సూపరింటెండెంట్ మాట్లాడలేదు. ఆయన సాదాదుస్తుల్లో ఉన్నాడు.

"మీరు, మాట్లాడరేం!"

"సివిలియన్" అన్నాడు. ఆశ్చర్యంగా చూశాను ఆయన వైపు. చిన్నగా నవ్వాడు.

'ఇక్కడేం చేస్తున్నారు ఇంత చీకట్లో?"

"ఏమీ లేదు" అన్నాడు సూపరింటెండెంటు. పోలీసు అధికారి మమ్మల్ని పరకాయించి చూశాడు.

"మేం కమ్యూనిస్టులం కాదు" అన్నాడు సూపరింటెండెంటు.

"ఆకారాలు చూస్తే కమ్యూనిస్టుల్లాగే ఉన్నారు - తడబడుతున్నారు కూడా-" అని నెమ్మదిగా ఇంకో పోలీసాయనతో సంప్రదించాడు.

"మీరు కమ్యూనిస్టులు కాదనటానికి ఆధారాలు ఏమిటి?" ఠీవిగా అడిగాడు పోలీసు అధికారి.

"నాకు మార్క్స్ అనే పదానికి అక్షరక్రమంకూడా తెలియదు" అన్నాను

"మేం కమ్యూనిస్టులం కాకపోవటమే ఆధారం" అన్నాడు సూపరింటెండెంటు కొంటెగా.

"చాలాదాకా ఉందే, సోదా చెయ్యవోయ్."

సూపరింటెండెంటు జేబులోంచి ఒక కరపత్రం తీశారు బయటికి. "కమ్యూనిజం అరికట్టండి" అని పెద్ద అక్షరాలతో ఉంది దాని మీద.

"ఇంకా అనుమానం ఎందుకు? మిగతా కాగితాలుకూడా ఇక్కడే దాచి ఉంటారు ప్రజలకి అందకుండా. దయఉంచి వాన్ ఎక్కండి స్వామీ" ఎగతాళిగా అన్నాడు.

"మమ్మల్ని అనవసరంగా బాధిస్తున్నారు" అన్నాడు సూపరింటెండెంటు.

"నిర్దోషులైతే తెల్లవారింతర్వాత క్షేమంగా ఇళ్లు చేరుకోవచ్చు-ఎక్కండి."

నేను మర్యాదగా ఎక్కాను. సూపరింటెండెంటు, సరదాగా ఉంది కాబోలు. రెక్కపట్టి లాగించుకున్నాడు. స్టేషన్ సమీపించాం. దిగాము. పాపం, సర్కిల్ ఇంకా పని చేస్తూనే ఉన్నట్టున్నాడు. చూట్టానికి వచ్చాడు కమ్యూనిస్టు నిర్బంధితుల్ని! "ఏరే సార్" అన్నాడు పోలీసాయన. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ అదిరిపడి నిటారుగా నుంచుని సెల్యూట్ చేశాడు డిప్యూటీ సూపరింటెండెంట్ కి. రిజర్వు దళం నోరు తెరుచుకు చూసింది. రెక్కపట్టుకు లాగిన పోలీసాయన దడదడలాడి కుప్ప కూలాడు. "దొరగారు!" తమలో తాము గొణిగారు రిజర్వు పోలీసువాళ్లు. లోపల కూర్చున్నాం. "ఈ సాయంత్రమే వచ్చింది ఈ రిజర్వు దళం. పాపం, గుర్తుపట్టలేదు."

నేను మాట్లాడకుండా జేబులోంచి ఓ పావలా తీసి బల్లమీద పెట్టాను. ఆయన ఆశ్చర్యంగా చూశాడు.

"నరకబాధ తప్పించినందుకు ప్రతిఫలం-గవర్నమెంటుకు ముట్టచెప్పండి దయచేసి."

గట్టిగా నవ్వేశాడు సూపరింటెండెంటు. నేనూ నవ్వాను.

"మరి పొద్దున ఇవ్వలేదేం?"

"పొద్దున నా గమ్యస్థానం వేరు" - మళ్ళీ నవ్వాడు.

కాసేపాగి అన్నాను. "బహుశా ఇప్పుడు తెలిసి ఉంటాయి మీకు మా అగచాట్లు."

"ఇదివరకు తెలియవనా మీ రనేది?"

"అది కాదు. అనుభవంలోకి వస్తేగాని-"

"ఇక్కడే పొరపడుతున్నారు. మా విధానాల ఫలితాలు మాకు పూర్తిగా తెలుసు-కాని గత్యంతరం లేదు. నన్ను నిర్బంధించకపోతే నేను తప్పక చర్య తీసికోనే వాణ్ణి. మా డిపార్టుమెంటులో అనుమానం లేకపోతే పని జరగదు."

"అనుమానించి ఆధారాలు తీరిగ్గా వెదకడం నేను ఒప్పుకోను- క్షమించాలి."

"మీ అనుభవాలు మాకు తెలుసు, కాని మా అనుభవాలు మీకు తెలియవు. బయటినుంచి కబుర్లు చెబుతారు మీరు, మీరు ఈ ఉద్యోగంలో ఉంటే ఇలాగే చేసేవారు."

"నేను అలా ఊహించలేను."

"అవును. మీవి వట్టి ఊహలే. మా ఊహలు కార్యరూపం దాల్చాలి. ఫలితం మీది, బాధ్యులం మేము"

"మీరే మనుకోకపోతే, పోలీసువాళ్ళ ప్రవర్తన కొన్ని సందర్భాల్లో చాలా హాస్యాస్పదంగా ఉంటోం దంటాను."

"వారు ఏ విషయం గురించి మాట్లాడుతున్నారో గ్రహించాను. కాస్త ఎక్కువ జాగ్రత్త తీసుకుంటే కనిపించినవాళ్ళనల్లా అనుమానిస్తున్నా మంటారు. లేకపోతే, బాహాటంగా తిరుగుతున్నా కమ్యూనిస్టుల్ని పట్టుకోటానికి పోలీసువాళ్ళకి చాతకావడం లేదంటారు."

"అదలా ఉంచండి. అసలు పోలీసువాళ్ళు మర్యాద నేర్చుకోవాలండీ! నైతికంగా వాళ్లలో

గొప్ప విప్లవం రావాలి" అన్నాను, నిర్మొహమాటంగా.

"నేను గౌరవంగా మాట్లాడటం లేదా!" నూకరించేండెంటు నవ్వి అన్నాడు. "దళంలో చేరేముందు వాళ్లూ పౌరులే. అప్పుడు వాళ్లూ ఇలా అన్నవాళ్లే."

"వృత్తితోపాటు మనసు మారుతూ ఉంటుంది కాబోలు."

"పరిస్థితుల ప్రాబల్యం. దృక్పథం మారటానికి తగినంత అవకాశం ఏర్పడలేదు వాళ్ళకి. వాళ్ళ అవసరం ప్రజలకి తగ్గకపోగా ఎక్కువవుతోంది- అర్థం చేసుకున్నారనుకుంటాను."

"ఊఁ- కాని నే ననేది కనీసం మర్యాదగా ప్రవర్తించటమయినా-"

"అది ప్రజల చేతుల్లోనే ఉంది. సైనిక విప్లవం అంటున్నావే. అది రావలసింది ముఖ్యంగా ప్రజానీకంలో. ప్రజా మారకపోతే ఏదీ మారదు. మారినా ప్రయోజనం లేదు." స్వరం తగ్గించి అన్నాడు. "కావాలని కత్తి కొట్కించుకుని బరువుగా ఉందంటే ఏంలాభం?- మార్పు సమానంగా రావాలి. మేం మారినా మీరు మారకపోతే ప్రయోజనం శూన్యం. మీరు మారితే మా మార్పు మీచేతుల్లోనే ఉంది."

మెదడులో ఏదో కదుల్తూ ఉంది. కాని నోరు పెకలిరాలేదు. సంతృప్తీ, అసంతృప్తీ సినిమా స్లైడ్లలా ఒకదాని తర్వాత మరొకటి ద్యోతకమవుతూన్నాయి. సెలవు తీసికొని బయటికి వొచ్చేశాను. చీకటిగా ఉంది. మెరుపులు చూపించిన దారి అనుసరించాను.

---

గతసంచిక తరువాయి

ఆగష్టు-12-1949

# హ్యూమనిజం—కమ్యూనిజం

ఆవుల గోపాలకృష్ణమూర్తి

మార్క్సు దృష్టిలో ఉత్పత్తి, పంపిణీ, మారక సాధనాల్ని సంఘపరం చేసి, ఆసంఘాన్ని శ్రామిక నియంతృత్వపరం చేస్తే అది సోషలిజమౌతుంది. ఉత్పత్తి, పంపిణీ, మారకాల్లో వ్యక్తుల జోక్యం, పెత్తనం లేకుండా వుంటే అది స్వర్గధామంగా వుంటుంది. సర్వం మానవుని శ్రమ ఫలితమనీ, శ్రమే సర్వానికీ మూలమనీ, ప్రతి విలువను నిర్ణయించేది యీ శ్రమని ఇట్టేనని అంటాము. దీన్నే "లేబర్ వ్యాల్యూ" అంటాడు. శ్రమించేవాడికి యివ్వక దాచుకొని అదనపు లాభాన్ని కాజేస్తారు గనక, యీ 'అదనపు విలువ' ప్రయివేటు ఆస్తికి మూలమని అంటాము. ఇది మార్క్సిజంలో గొప్ప సిద్ధాంతం. నిజానికి యిది సత్యంలో ఒక భాగం. కాని యీ సూత్రాన్ని బట్టి ఆస్తిఅంతా 'దొంగతనమే' నన్న బందిపోటు సిద్ధాంతాన్ని లేవదీశారు. అదనపు విలువ లేందీ అభివృద్ధి వుండదు. మానవుడు సృష్టించింది కాస్త. ప్రతిక్షణం గుటకవేస్తే మిగిలేది లేదు; మిగిలేది లేందీ అభివృద్ధి లేదు. ఈనాడు సోవియట్ ఆర్థికవిధానం తీయండి. అదనపు విలువను కోటానకోట్లు తిరిగి ఉత్పత్తిలోకి మార్చినమూలంగానే ఆదేశంలో అభివృద్ధి కలుగ వీలైంది. అభివృద్ధి యెంత పెరిగితే, అంత అదనపుశక్తి, ఆదాయం తిరిగి రాజ్యాంగంలోకి వచ్చినట్టే. అందువల్ల మార్క్సు చెప్పే అదనపు విలువ సిద్ధాంతం ఆచరణయోగ్యం కాదనీ, రష్యా అనుభవం యీ సిద్ధాంతాన్ని త్రోసివేసిందనీ హ్యూమనిస్టు లంటారు. అదీగాక, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థానిర్మాణంలో వున్న రూఢక్రమ పద్ధతి, అంత దిగ్బంధన విధానం స్వేచ్ఛకు చాలా భంగమనీ వాదిస్తారు.

మార్క్సిజం సిద్ధాంత రంగంలో గొప్పగా భావించేది 'డైలెక్టికల్ భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం' అని చెప్పబడేవి. దీనిలో వున్న ప్రధానాంశమేమంటే, చరిత్రగమనాన్ని, మానవ సంఘగమనాన్ని అవగాహన చేసుకోటానికి యిది బ్రహ్మరహస్య మంత్రం. చరిత్రగమనం వర్గపోరాటంవల్ల జరుగుతుందనీ, వీరు మిక్కిలి ఆర్థిక నియతివాదం దీనికి శిఖాగ్ర అనీ వారి విశ్వాసం. దీనినే పారిడిటీలో యిలా మధ్య జొప్పుతున్నారు. మానవుని మనుగడను నిర్ణయించేవి, శాసించేవి, తేల్చేవి ఉత్పత్తి సాధనాలు - దేవుడూ గాదు, దయ్యమూ గాదు. వర్గానికి అధినేత ఉత్పత్తిసాధనం. ఆదిమ కమ్యూనిస్టుదశలోగాని, జమీందారీ, పెట్టుబడిదారీ, శ్రామికనియంతృత్వ మార్గాల్లో నిన్నూ, నీ పాత్రను, నీభవితవ్యాన్ని నిర్ణయించేది ఉత్పత్తి సాధనం. దీన్నే ఆర్థికనియతివాదం అంటారు. డైలెక్టికల్ విధానానికి మూలసూత్రం.

నిజంగా ఉత్పత్తివిధానాల కింత మహత్తు వుంటే, ఒక యుగసంబంధమైన ఉత్పత్తి విధానాన్ని యింకో యుగసంబంధమైన వాటిగాకి మార్చగలిగే శక్తి యెక్కడిది? అట్లా భేదించ గలిగాడని మానవచరిత్రే చెబుతోంది. అయినప్పుడు యీ నియతివాదం వల్ల లాభం? అన్ని ఉత్పత్తి సాధనాల్ని సృష్టించిన మానవుని మేధస్సు యేమౌతుంది? అన్న ప్రశ్నల్ని హ్యూమనిస్టు వేస్తాడు. పరిస్థితుల ప్రభావం వ్యక్తిమీద లేదని హ్యూమనిస్టు అనడు. పరిస్థితులకు వ్యక్తి లొంగుతాడు; పరిస్థితుల్ని లొంగదీసుకుంటాడు; పరిస్థితులకు అతీతంగా వ్యవహరిస్తాడు. లేకపోతే, భావాలు యెట్లా యెదుగుతూ, పరిణామం చెందుతూ వచ్చాయో అర్థం చేసుకోవటం అసంభవం. భావాల్నిబట్టి నేను ఫలాని ఉత్పత్తిసాధనాల యుగంలో వున్నానని చెప్పటం అసంభవం.

కాబట్టి, మార్క్స్ ప్రధాన సూత్రాలుగా భావించిన వేవీ హ్యూమనిస్టు అంగీకరించటం లేదని తేలుతుంది. ఇదీగాక మార్క్సిజం ఒక వర్గసిద్ధాంతం. హ్యూమనిజం సామాజిక సిద్ధాంతం.

పోతే, మార్క్సిజంలో, వర్గపోరాటంవల్ల అభివృద్ధి కలుగుతుందని వాదన. మార్క్స్ ఆశయం 'వర్గరహిత సమాజ నిర్మాణం'. వర్గపోరాటంవల్ల అభివృద్ధి కలిగితే, వర్గరహితం కాగానే అభివృద్ధి ఆగిపోతుంది. అభివృద్ధి లేని, దారిలేని యానాన్ని హ్యూమనిస్టు అంగీకరించడు. మార్క్సిజంలో మనం అవలంబించేది యేమార్గమైనాసరే, మన ఆదర్శాన్ని చేరితే చాలునని. ఆదర్శాన్ని చేరటంలో ఆదర్శానికి భిన్నమైన మార్గాల్ని మార్క్సిస్టు అంగీకరిస్తాడు. హ్యూమనిస్టు ఉత్తమఆదర్శాన్ని నీచమార్గం ద్వారా సాధించలేమంటాడు. అందువల్ల ఆదర్శాన్ని చేరే మార్గం అవినీతి మార్గమైనా మార్క్సిస్టుకు పట్టింపు లేదు. నియంతృత్వం ద్వారా ప్రజారాజ్యం వస్తుందని వాదిస్తాడు. ఆచరణ, అనుభవం దానికి భిన్నమార్గాన్ని చూపుతున్నై.

మార్క్స్ దృష్ట్యా సాంఘిక నిర్మాణానికి యూనిట్ వర్గం; హ్యూమనిస్టుకు 'వ్యక్తి'. మార్క్సిస్టు శ్రామికవర్గీయుడే విప్లవకారి అంటాడు; హ్యూమనిస్టు విప్లవకారిగా వుండటానికి వర్గప్రసక్తి లేదంటాడు. వర్గాల పోరాట చరిత్రే సంఘచరిత్ర అంటాడు మార్క్స్; వ్యక్తుల భిన్నాభిరుచుల సమన్వయ స్వరూపగాథే సంఘచరిత్ర అంటాడు హ్యూమనిస్టు. విప్లవం రక్తపాతంతో తిరుగుబాటు ద్వారానే వస్తుంది అంటాడు మార్క్స్; సుస్థిరవిప్లవం ప్రవిమల విద్యాప్రబోధం వల్ల వస్తుందంటాడు హ్యూమనిస్టు. వర్గశ్రేయస్సు ప్రధానం గావటంలో వ్యక్తిభద్రత వర్గభద్రతకు లొంగాలంటాడు మార్క్స్; వ్యక్తిభద్రత వినా సంఘభద్రత లేదంటాడు హ్యూమనిస్టు.

ఈ విధంగా హ్యూమనిజానికి మార్క్సిజానికి మార్గాన్వేషణలోనూ, అంతస్తుల్లోనూ యెంతో తేడా కనబడుతుంది. హ్యూమనిస్టు దృష్ట్యా, మానవవాదిగా బయలుదేరిన మార్క్స్ హెగెల్ భావాల్లో చిక్కి తార్కిక వాదనలో పడి, చివరకు మానవవాద భావాలకే వ్యతిరేకి అయ్యాడు.

(సమాప్తం)




(గతసంచిక తరువాయి)

వెలమ లంకట శ్రీశైలముపై నాశను వదలు కొనలేదు. కరియోద్ధు గడచిన పిమ్మట అనపోత నాయకుని కుమారుడు సర్వజ్ఞసింగ భూపతి కాలమున గావలయును మఱియొక ప్రయత్నమును గావించిరి. వారిపక్షమున క్రీ. శ. ౧౩౯౦-౯౧ వ సంవత్సరమున దేవరాయల యేలుబడియందుండిన యుదయగిరి రాజ్యముమీద బహమనీ సుల్తాను మొదటి మహమూదు శాహా దండు వెట్టెను. ఈ దండయాత్ర వృత్తాంతము పరమారి తామ్రశాసనమున సంగ్రహముగ వర్ణింపబడి యున్నది. ఇమ్మడి హరిహరరాయల యాజ్ఞానుసారము దేవరాయలు షడ్విధబలములతో గూడ బయలు వెడలి తుంగభద్రానది యుత్తర తటమునకుండు ఆలంపురమును బోయి చేరెను. ఈ దండయాత్ర గమ్యస్థానము బహమనీరాజ్యము; వెలమవారికి సహాయము వచ్చిన బహమనీ సైన్యమును గ్రమ్మఱచుటయే దాని ముఖ్యోద్దేశము; కాని యది యెట్లు పర్యవసాన మందెనో, యుద్దిష్టకార్యము సమకూరెనో లేదో చెప్పుటకు సాధ్యము గాదు. దేవరాయ లిట్లు బహమనీరాజ్యముపై దండయాత్ర నడుపుచుండగా, బహమనీ ఫౌజులతో గూడ వెలమవా రుదయగిరి రాజ్యముపై నెత్తివచ్చిరి; కాని తండ్రి పక్షమున రాజ్య పరిపాలనా కార్యములను నిర్వహించుచుండిన దేవరాయల కుమారుడు రామచంద్రరాయలు వారి నెదుర్కొని యోడించి తఱుముగొట్టెను. తుద కెట్టి యుద్ధము ముగిసెనో తెలియదు; కాని దానివలన వెలమరాజుల కోరిక యీడేరనులేదు; బహమనీసుల్తాను సైన్యమెచ్చటను విజయ మందనులేదు. దీని బట్టి చూడగా నీయుద్ధమున చిట్టచివర విజయలక్ష్మి రాయరాణువనె వరించెనని తోచుచున్నది.

### ఇమ్మడి హరిహరరాయలు — ఫిరోజుశాహా:

ఇమ్మడి హరిహరరాయలకు క్రీ.శ. ౧౩౯౮ వ సం॥న మఱియొక సారి వెలమల తోడను వారి మిత్రుండగు బహమనీ సుల్తాను తోడను పోరు పొసంగెను. మహమ్మదీయ చరిత్రకారులును, హిందూ గ్రంథకర్తలును ఈ యుద్ధమున సంభవించిన విషయములను వెక్కొటిని తెల్పియున్నారు. మహమ్మదీయ చరిత్రకారుల బట్టి యీయుద్ధము జరిగిన సమరాంగణము కృష్ణాతుంగభద్రల మధ్యదేశము; కృష్ణ యుత్తర తటమందలి నగర పట్టణమునుండి తుంగభద్రా దక్షిణతీర మందుండు విజయనగరము వఱకును వ్యాపించినది. మహమ్మదీయ చరిత్రకారులు వెలమ లీయుద్ధమున పాల్గొని నట్లయిన చెప్పరు; మఱియు సుల్తానుకు గల్గిన పరాజయముల మాట యెత్తరు. కాని రెండవ హరిహరరాయల శాసనములు కొన్నిటి యందును సమకాలిక గ్రంథములు కొన్నిటి యందును ఈ యుద్ధ వృత్తాంతము కొంత కలదు. కావున ఉభయపార్శ్వముల సాక్ష్యమును బోల్చి పరిశీలించి చూచిన సత్య మేర్పడగలదు.

క్రీ.శ. ౧౩౯౭ వ సంవత్సరము నవంబరు మాసమున గుల్బర్గ రాజనగరు నం దొక విప్లవము సంభవించినది. అప్పుడు బహమనీ రాజ్యము నేలుచుండిన సుల్తానును బందీకృతుని గావించి యతని దాయాది ఫిరూజ్ ఖాను నను నతడు సింహాసనము నాక్రమించి, ఫిరూజ్

షాహాను రాజ్యభారమును వహించి రాజ్యపాలన సేయఁగడఁగెను. ఈ విప్లవమువలన గలిగిన కళవళమును సందు చేసికొని ఇమ్మడి హరిహరరాయలు బహామనీ రాజ్యముపై దండు వెడలినట్లున్నది. నగరు ముట్టడితో యుద్ధమున కంకురార్పణ మాయెను. విజయనగర సైన్యము కృష్ణను దాటిపోయి నగరు నరికట్టి స్వాధీనము జేసికొనెను. ఆవార్త తెలియఁగనే ఫీరూజు షాహు, వెలమబలగము తోడు నడువ, గొప్ప సేనతో గదలిపోయి నగరు సమీపమున విజయనగరబలములను యుద్ధమున నోడించి తఱుముగొట్టి పట్టణమును మరల స్వాధీనము జేసికొనెను. అచటినుండి రాయలపై బగ తీర్చుకొనుటకు విజయనగర రాజ్యముపై దండు వెడలు నుద్దేశముతో కృష్ణవైపు కూఁడిచేసెను. కృష్ణ నిండుకొని ప్రవహించుచుండినది; రేవు లన్నిటికడను దేవరాయల సైన్యములు జతనముతో గాపుండినవి. నదిని దాటుట దుస్సాధ్యముగ గాన్పించినది. కాని సుల్తాను కొలువునం దుండిన కాజీ యొకఁడు నట్టువునివలె మారువేషము వేసికొని నదినిదాటి నర్తక నర్తకీ జనముతో మైత్రిసల్పి వారితో గూడ రాయల శిబిరమును బ్రవేశించెను. రాత్రి. కరదీపికా సహస్రముల వెలుఁగున శిబిరము పట్టపగటివలె దేదీప్యమానమై ప్రకాశించుచుండినది; దేవరాయల కుమారుఁడు నిండుకొలువున గూర్చుండి నాట్యప్రదర్శనమును జూచుచుండెను. కాజీ నాట్యవిద్యా ప్రవీణుఁడు. ఆరాత్రి యతఁడు తన నేర్పంతయుఁ దెల్లమగునట్లు నర్తనము సేయఁగడఁగెను అందరి దృష్టియుఁ నతని యందే లగ్నమై యుండినది. అభినయము జూపుచు మెల్లఁగ మెల్లఁగ రాజకుమారుని సమీపించి యకస్మాత్తుగ తన యుడుపునందు దాచియుంచిన చిక్కుతారితో నతని బొడిచి చంపెను. శిబిరమంతటను హాహాకారధ్వనులు రేఁగినవి; కళవళముచే జనులు విభ్రాంతులైరి. సందు చూచుకొని శిబిరమునుండి కాజీ సన్నసన్నఁగ జాఱుకొనెను. విజయనగర శిబిరమునుండి వినవచ్చు నార్తధ్వనులవలన కాజీ తన కార్యమును నెఱవేర్చెనని యెఱిఁగి ఫీరూజుషాహు కృష్ణను దాటివచ్చి రాయల స్కంధావారముపై బడెను. దుఃఖపీడితుఁడై దేవరాయలు తనకుమారుని శవము నెత్తికొని విజయనగరమునకు బాఱిపోయి కోటయందు జొచ్చి ద్వారాలన్నిటి బంధింప నాజ్ఞ యొసఁగెను. జనశూన్యమై విసర్జింపబడి యుండిన రాయల స్కంధావారమును ఫీరోజు షాహు కొల్లగొట్టి యందుండు సర్వమును హరించెను.

తరువాత ఫీరోజు షాహు విజయనగరముపై గూడిచేసి యాపట్టణమును ముట్టడించెను. పట్టణమును వైవసము జేసికొనజాలక పోయెను, పరిసర ప్రదేశములను నాశనము గావించి దేవరాయలను సంధి కొడంబడ జేసెను; అపారధన మిచ్చి ఫీరోజు షాహును సంతృప్తుని జేసి దేవరాయలు సంధిని విలిచెను. అంతట ఫీరోజుషాహు వెనుదిరిగి నిజరాజ్యమునకు బోయెను.

ఇది సంగ్రహముగ ఫెరిష్తా వర్ణించిన యుద్ధవృత్తాంతము. సందేహాస్పదములైన విషయములిందు పెక్కు గలవు. ఈ యుద్ధకాలమున దేవరాయలు విజయనగరమును పాలించుచుండినట్లు ఫెరిష్తా చెప్పుచున్నాఁడుగదా. ఇది సరికాదు. క్రీ.శ. ౧౪౦౪ వఱకును ఇమ్మడి హరిహరరాయల యేలుబడి సాగినది. కావున ఫీరోజుషాహు విజయనగరముపై దండెత్తి వచ్చినప్పుడచట రాజ్యము సేయుచుండిన రాజిమ్మడి హరిహరరాయలు కాని దేవరాయలు కాదు. ఇందువల్ల ఫెరిష్తాకు పై దండయాత్ర వృత్తాంతము నిశ్చయముగ దెలియదనియు, దెలియని తావులందు కల్పన జేసినాఁడనియు తత్కారణమున నాతని వ్రాఁత యంత విశ్వాసపాత్రము గాదనియుఁ దెల్లమగుచున్నది. ఇంకొక చిత్రము. సింహాసనము నధిష్ఠించినది మొదలు పరరాష్ట్రముల నాక్రమించి నిజరాజ్య వైశాల్యమును బెంపొందింపవలయునని దృఢసంకల్పము గల ఫీరోజుషాహు రాయలను యుద్ధమున నోడించియు గొంతధనమును మాత్రము గైకొని రెండురాజ్యముల యెల్లలును యథాపూర్వము వలె నుండుట కంగీకరించి సంధి కొడఁబడెనఁట! ఫీరోజుషాహు కంతటియౌదార్య మేల కలిగెనో! విజయనగరమునుండి మరలి నిజరాజధానియగు కలుబరిగెకు బోవునపుడు ఫీరోజుషాహు ఫూలాదుఖాను దను సర్దారును కృష్ణా తుంగభద్రల మధ్యదేశమునకు పాలకునిగ నియమించిపోయినట్లు ఫెరిష్తా వ్రాసి యున్నాఁడు. ఇదియు సంశయా-

త్మకము. ఏలన ఫిరోజుశాహు కృష్ణాతుంగ భద్రల మధ్య దేశముపై దండువెడలెనని కాని విజయనగరమును ముట్టడించెనని కాని దుర్గా సేయగల సాధనము లక్ష్యము లెవ్వియు గానరావు. ఫెరిష్టాకంటె బూర్వుడైన తబకాత్-ఇ-అక్బరీ రచయితయగు నిజామ్-ఉ-ద్దీన్ అహమదు కృష్ణాతటమున విజయనగర స్కంధావారముపై బడి దాని దోచుకొనిన పిమ్మట ఫీరోజుశాహు వెనుదిరిగి నిజరాజధానికి బోయెనని వ్రాసి యున్నాడు. బుర్హాన్-ఇ-మఆసిర్ గ్రంథకర్త యగు సయ్యద్ అలీ బిన్ అజీజ్-ఉ-ల్లా తబా తబ ఈ యంశమును దృఢపఱచుచున్నాడు. ఆ శేషధనమును సమర్పించి ప్రతివర్షమును గప్పము కట్టుట కియ్యకొని దేవరాయలు ఫిరోజుశాహుతో సంధి గావించుకొనెనని యతడు చెప్పినను, సుల్తాను కృష్ణాతుంగభద్రల యంతర్వేదిపై దండు వెడలెనని కాని విజయనగరమును ముట్టడించెనని కాని చెప్పలేదు. ఇవి కేవలము డాబు సరి మాటలు. వాస్తవ దూరములు. ఫీరూజుశాహు రాజ్యారంభమువఱకు కృష్ణాతుంగభద్రల యంత ర్వేది బహామనీ రాజ్యముక్రింద నుండలేదు. అతని పూర్వికులు దాని జయించుటకు పలుమారు తలపెట్టిరి; కాని వారి కదెక వెఱవేఱలేదు. ప్రప్రథమమున నంతర్వేదిని స్వాధీనము జేసి కొనుటకు బ్రయత్నము జేసి నాతడు మొదటి మహామ్మదుశాహు బహామనీ. బుక్కరాయలతో పరిపోరజాలక రెండు రాజ్యములకును మధ్య కృష్ణానదియే యెల్లయని యొాక డొప్పుకొని సంధి జేసుకొన్న విషయ మీపట్టున స్మరింపదగి యున్నది. అతని వెనుక బహామనీ సింహాసనము నెక్కిన యతని కుమారుడు ముజాహిదుశాహు పై సంధి షరత్తులను దన కనుకూలముగ మార్ప వలయునని ప్రయత్నమొనర్చెను; కాని యతడు దండయాత్రయందు ఘనపరాభవ మొం దుటయేగాక హంతలచే నసువుల గోల్పోయెను. కావున రెండు రాజ్యముల మధ్య సరిహద్దు మాఱు పాటులేక పూర్వమున్నట్టే యుండెను.* ఫిరోజు శాహు సింహాసన మధిష్ఠించి నప్పుడు కృష్ణా తుంగభద్రల యంతర్వేది బహామనీ రాజ్యాంతర్గ తము గాదు. మఱియు నిజామ్-ఉ-ద్దీన్ అహ మదుగాని, సయ్యద్ అలీ బిన్ అజీజ్-ఉ-ల్లా తబాతబా కాని ఫీరూజుశాహు కృష్ణా తుంగ భద్రల యంతర్వేది నాక్రమించుకొనినట్లు చెప్ప లేదు. తరువాత కొన్నియేండ్లు గడచిన పిమ్మట క్రీ.శ. ౧౪౧౧-౨ వ సం॥న అంతర్వేది యుత్తరపు టంచున కృష్ణాతటమందలి మహాళ్ళను గొన్నిటిని దక్కఁబఱచుకొనుటకు సుల్తాను రాయలతో ఘోర యుద్ధము సేయవలసివచ్చెను. వాస్తవస్థితి యిట్లుండ ఫిరోజు శాహునకు క్రీ. శ. ౧౩౯౭ వ సం॥న అంతర్వేది యంతయు నెట్లు స్వాధీనమై యుండ గలదు? పై జేర్కొనిన విషయముల నన్నిటిని విచారించి చూడగా ఫిరోజు శాహు యొక్క ప్రథమ విజయనగర దండయాత్ర కృష్ణా దక్షిణ తటమున నాగిపోయెననియు రాయల స్కంధా వారమును లూటీగొట్టుటతో దృప్తిసంది యతడు వెనుదిరిగి పోయెననియు దలచుట యుక్తము.

ఫెరిష్టా కథ విశ్వాసపాత్రము గాదని తలచు టకు మఱియొక ముఖ్య కారణము గలదు. ఫెరిష్టా చరిత్ర ప్రకారము ఫిరోజుశాహు విజయ నగరమున సంధి షరత్తులకు రాయల నొప్పించు చుండిన సమయమునందె ఇమ్మడి హరిహర రాయలు, వెలమ రాజులతోడను వారికి బోటట

* క్రీ. శ. ౧౩౭౫ మే నెల ౧౯ వ తేదినాడు మొదటి మహమ్మదుశాహు గద్దె నెక్కె నను వార్త చెవిసోకగనే, యప్పుడు రాయచూరు దుర్గమును ముట్టడించి యుండిన విజయనగర రాయలు ముట్టడి లేవదీసికొని యంతవపూర్వము మొదటి మహమ్మదుశాహునకు దాను కట్టుచుం డిన కప్పము నతనికి గట్టెదనని యొప్పుకొనెనని ఫెరిష్టా వ్రాసియున్నాడు. ఇది బొల్లు. విశ్వాస పాత్రము గాదు. యుద్ధమున గెలువజాలక కృష్ణానదియే ఉభయరాజ్యములకు సరిహద్దని యొప్పు కొని బుక్కరాయలతో సంధిజేసికొన్న మొదటి మహమ్మదుశాహు కతనిపై గప్పమును విధింప గల సామర్థ్య మెచటనుండి వచ్చినది? మఱియు ముజాహిదు నోడించి తఱుమగొట్టి కృష్ణా తుంగ భద్రల యంతర్వేదిని జయించుచుండిన (ఇమ్మడి హరిహర) రాయలు ఊరు పేరు లేని మహమ్మదు శాహను యువకుడు కలుబరిగె గద్దె నెక్కె నన్నమాట వినగనే రాయచూరు ముట్టడి నేల విసర్జిం చును? కప్పము గట్ట నేల యొప్పుకొనును? వట్టిమాట.

నిలిచియుండిన బహమనీ సుల్తాను తోడను యుద్ధము సలుపుటకు శకాబ్దము ౧౩౬౫ వ సం॥నకు సరియైన ఈశ్వరవర్ష నభస్య (క్రీ.శ ౧౩౬౫ వ ఆగస్టు - సెప్టెంబరు) మాసమున దన కుమారుడగు యువరాజ ఇమ్మడి బుక్కరాయల నాయకత్వము క్రింద పెక్కండ్రు సుప్రసిద్ధ శూరవరులతో కూడ నొక గొప్ప సేనను తెలింగాణము మీదికి దండయాత్ర యంపెను. ఈ దండయాత్ర వెలమరాజ్యముయొక్క గర్భమును భేదించుకొని చొచ్చినది. నల్లగొండ మండలములోని పానుగల్లు దుర్గమును సమీపించు సరికి నచ్చట విడిసియుండిన బహమనీ సైన్యముతో సంఘట్టన కలిగినది భయంకర యుద్ధము సంప్రాప్తమాయె. మహమ్మదీయులోడిపోయి కోటను రాయరాణువకు వశపఱచిరి. ఈ విజయమును బ్రకటించు శాసన మిప్పటికి నచట గలదు. ఇమ్మడి బుక్కరాయల ప్రాణాచార్యుడైన భిషగ్వల్లభ లక్ష్మణ పండితుడు వైద్యరాజ వల్లభ మను దన వైద్యగ్రంథ పీఠికయందీ దండయాత్రను విపులముగ వర్ణించి యున్నాడు. మనుష్యరూపము నందిన రాక్షసులగు తురుష్కుల దళములు పంచబంగాళమై పాఱిపోయిన పిమ్మట తురుష్క ప్రభువు పూరిగఱచెనట; ఆంధ్ర (వెలమ) నృపాలుడు ఇమ్మడి బుక్కరాయల పాదపద్మములను గడు నంతసముతో శిరముపై నిడుకొని తన ధనము నంతటి సమర్పించెనట.

ఫెరిష్తా చెప్పునట్లు విజయనగర రాయలు ఫీరోజు శాహుచే బరాజితుడై తన రాజధానిని పరిసరదేశమును సంరక్షించుకొనజాలక సంధి చేసుకొన్నది వాస్తవమగునేని, యట్టిస్థితి యందతడు తెలింగాణముపై దండయాత్రనంపి యచట సుల్తాను సైన్యముచేకాక, యతని మిత్రులైన వెలమ రాజులనుసైత మోడించుట ఎట్లు సాధ్యమగును? ఈయంశములనన్నిటిని పరికించి చూడగా ఫీరోజుశా హాతని ప్రథమ విజయనగర దండయాత్ర యందు విజయుడాయెననినమ్ముటకుపీలు లేకున్నది. ఇంతవఱకు లభ్యమైన సాక్ష్యమునుబట్టి చూడగా ఫీరూజుశాహ సంగ్రామ ప్రారంభదశయందు విజయనగరసైన్యముల నోడించి కృష్ణానది దక్షిణ తటమున గొంతరాష్ట్రమును జయించి యుండినను, తుదకు రాయలే విజయుడాయెనని దృఢముగ జెప్పవచ్చును.

ఇమ్మడి హరిహరరాయల కడపటి దినములలో సామ్రాజ్యమున నెట్టి కలవరము లేక శాంతి నెలకొనియుండెను. అంతఃకలహములు గాని వైదేశిక దండయాత్రలు గాని లేవు. క్రీ. శ. ౧౪౦౩ వ సంవత్సరాంతమున హరిహరరాయల కారోగ్యము చెడి వ్యాధిగ్రస్తుడై పెక్కునెలలు శయ్యాగతుడై యుండెను. రాయలు బ్రతుక దనుకల పెల్లవారికి గలిగినది. అతని యనంతరము రాజ్యాధిపత్య మెవ్వరి దను సమస్య యందరి మనస్సును బీడింపగడగినది. యువరాజగు నిమ్మడి బుక్కరాయలు సామ్రాజ్య పదమునకు నిర్దిష్టుడై యుండినను తండ్రియనంతర మతడు నిరాటంకముగ సింహాసనము నెక్కగలడను నిశ్చయము లేదు. అతని సోదరులలో ముఖ్యముగ విరూపణ్ణయు దేవరాయలును అతని యభ్యుదయమును సహించువారుగాడు. కడిదేఱిన దండనాయకులగుటయేగాక గొప్ప మండలాధిపతు లగుటచేత, వారి ప్రతిరోధము దుర్లంఘనీయమే. తండ్రి వ్యాధిపీడితుడై పడక బట్టియున్నాడను సమాచారము తెలియగనే తమ పక్షమును బలపఱచుకొనుటకొఱకు వారిరువురును తమస్థానములను విడిచి విజయనగరమును వచ్చి చేరిరి. రోగముచే నవసినవసి యిమ్మడి హరిహర రాయ లిరువదియొనిమిదేండ్లు ప్రజాపాలనము జేసిన పిమ్మట, క్రీ. శ. ౧౪౦౪ వ సంవత్సరము ఆగస్టు ౧౬ వ తేదీనాడు తనువు ద్యజించి కైలాసవాసి యాయెను.

విజయనగరమును పాలించిన రాజులలో నిమ్మడి హరిహరరాయల స్థాన మత్యున్నతమైనది. అతడు రాజ్యభారమును వహించిన యిరువదియెనిమిదేండ్ల కాలములో విజయనగరరాష్ట్ర మన్నిదిశల విస్తరిల్లి మహాసామ్రాజ్యమై పరిణామ మందినది. బహమనీ సుల్తానుల నోడించి కృష్ణాతుంగభద్రల మధ్యదేశమును జయించెను; ఉత్తర కర్ణాటమును సప్తకొంకణములను సాధించి రాయరాజ్యమున గలుపుకొనెను. రెడ్డిరాజుల నోడించి యద్దంకి శ్రీశైల భూములను నాచికొనెను. హరిహరరాయల ఘనకార్యము రాజ్యవిస్తారణ మొక్కటియే కాదు. అతని యేలుబడిక్రింద రాజ్యసంపద తామరతంపరగ నభివృద్ధి

జరిగినది. పశ్చిమ సముద్ర తీరమంతయును స్వాధీన మగుటచేత, కందలి రేవుపట్టణములన్నియు రాయల యేలుబడి క్రిందికి వచ్చినవి. వీనిమూలమున విజయనగర సామ్రాజ్యమునకు ద్వీపాంతరములతో రాకపోక లతిశయించి విదేశవ్యాపారము హెచ్చు పెరిగినది. ఐరోపా పశ్చిమాసియాలనుండియు పూర్వ సముద్రద్వీపములనుండియు ధనవాహిని యవిచ్ఛిన్నముగ రాయరాజ్యమునకు ప్రవహింప సాగినది. ఇక నది సర్వసంపదల కాకరమగుటయం దబ్బుర మేమి కలదు.

ఇమ్మడి హరిహరరాయలు శూరుడే; కాని తన తండ్రివలెను సోదరులవలెను సుప్రసిద్ధ దళనాయకుడు గాడు; కాని యతని పుత్రులగు నిమ్మడి బుక్క, విరూపాక్ష, దేవరాయలు ముగ్గురును నారితేరిన యోధులు. నేర్పరులైన సైన్యాధిపతులు. దళములను నూన్చుటయందును, విచ్చుటయందును, నడపుటయందును, వ్యూహరచనయందును వారి ప్రజ్ఞ యద్వితీయము. సోదరుడైన మల్లప్పయును నతని పుత్రుడైన చెన్నప్పయును వీరికి సరియుద్ధులు. మాధవమంత్రి కీర్తిప్రతాపములు మొదటి హరిహరరాయల కాలమునుండియు వాసికెక్కినవే. వీరు గాక గుండదండనాథుడు, ఇరుగపదండనాథుడు మున్నగు పరాక్రమశాలులగు సేనాధిపతు లెందరో హరిహరరాయల ఖడ్గమునకు గర్తలై శత్రుభయంకరులై యుండిరి. కావుననే యతడు రణకర్కశులైన తురుష్కులమీదను, దుస్సహపరాక్రమ తేజులగు వెలమరెడ్డి రాజులమీదను జయప్రదముగ దండయాత్రలు సలుప గల్గినది.

సామ్రాజ్య పరిపాలన యందు విశేషముగ మార్పులేవియు గానరావు. బుక్కరాయల కట్టుదిట్టముల ననుసరించియే పరిపాలన సాగుచు వచ్చినది. మంగుళూరు, బారకూరు, గోవారాజ్యముల వంటి పశ్చిమ సముద్రతీర మండలముల యేలుబడిని సామంతుల కప్పగించినను, తక్కిన సామ్రాజ్యముపై నిమ్మడి హరిహరరాయలు తన కుమారులనె మండలాధిపతులుగ నియమించెను. విరూపణ్ణ ఒడయలు తన పితృవ్యుడైన కుమార కంపణవలె ద్రావిడ దేశమున కంచికిని రాయ ప్రతినిధి యాయెను. యువరాజగు నిమ్మడి బుక్కరాయలు ఆరగ మలెయ్యాల రాజ్యములు రెంటికి నధిపతి యాయెను. దేవరాయలు రాయ సామ్రాజ్యమున మొదటి దుర్గమైన యుదయగిరి దుర్గాధ్యక్షుడై దక్షిణాంధ్రమునకు పాలకుడాయెను. హరిహరరాయలు సజీవుడై యుండినంత కాలము ఈ యేర్పాటులు వ్యతిరేకము లేక చక్కగ నడచినవి; కాని యతని మరణానంతరము సామ్రాజ్య విచ్ఛేదమునకు సాధకములైనవి. సమానరాజ్యబలసంపత్తిగల రాజకుమారులు పరివారి యభ్యుదయమును సైతురా? కావున ఇమ్మడి హరిహరరాయల పుత్రులు ముగ్గురును తండ్రి యూపిరి విడవగనె సామ్రాజ్యాధిపత్యమునకై యొండొరులతో పోట్లాడ గడంగి.

ఇమ్మడి హరిహరరాయలు గొప్ప విద్వాంసుడు. ఇతనికి రాజవాల్మీకి రాజవ్యాసేత్యాది బిరుదములు గలవు. వీనిబట్టి చూడ నితడు కవిత్వము చెప్పనేర్చిన ప్రభువని తోచుచున్నది. మఱియు నితడు హిందూధర్మ ప్రవర్తకుడు. తండ్రివలె నితడును వేదమార్గ ప్రతిష్ఠాపక యను బిరుదమును వహించి, మాధవవిద్యారణ్య సాయణాది పండిత వర్గముచే దండ్రి కాలమున ప్రారంభమైన వేదభాష్యములను సంపూర్తి చేయించెను. వేదమార్గము నాచరణకు దెచ్చుటకై, వేదవేదాంగ పారగులగు బ్రాహ్మణుల నాస్థానమునకు రప్పించి సత్కరించి వారిచే యజ్ఞాదివైదికకర్మలను జేయించెను. స్వాధ్యాయము సేయుటకును శిష్యుల కధ్యయనము సెప్పుటకును వారికి అగ్రహారాదుల నొసగి తగువసతుల గల్పించెను. హరిహరరాయల వలె నతని పుత్రులును విద్యావంతులు. విరూపాక్షుడు స్వయము కవి. నారాయణీవిలాసోన్మత్తరాఘవములను రెండు సంస్కృత నాటకములను రచించెను. ఇమ్మడి బుక్కరాయలును దేవరాయలును సంస్కృతాంధ్ర కవుల కనేకుల కాశ్రయ మొసగి వారి నుత్తమ గ్రంథరచనకు బురికొల్పిరి.

ఇమ్మడి హరిహరరాయల కాలమున విజయనగర మాంధ్రదేశమందలి ముఖ్యవిద్యాపీఠములలో నొక్కటియై కొండవీడు రాచకొండలతో సరితూగ నారంభించెను. శ్రీనాథాది మహాకవు లెందరో విజయనగరమునకు బోయి రాయలను మెప్పించి సన్మానమందిరి. దేవరాయ లాంధ్రభాషాభిమాని. ఆంధ్రకవులను పోషించి నూతన కావ్యములను వారిచే రచియింపించెను.

# భూదేవి పుట్టుపూర్వోత్తరాలు

నిడుమోలు వెంకటరామసుబ్రహ్మణ్యము

"నమ్మరు, నమ్మరు కామా, రహస్యాలు వెల్లడి చేసే రట్టడిరాళ్ళు ఉన్నవంటే నమ్మరు కామా? ప్రకృతిలో ప్రతివస్తువూ తన రహస్యం బట్టబయలు చేయడానికి కుతూహల పడుచున్నప్పుడు, రహస్యాలు చెప్పే రాళ్లు ఉన్నవా, అంటారేమిటి?" కన్ను లుండి చూచే విజ్ఞాన పిపాసువులకు భూమండలపు పుట్టుపూర్వోత్తరాలు రాళ్ళలోనే వెల్లడి అవుతాయి. ఈరాళ్లే, పర్వతాగ్రములందు, పచ్చిక బీళ్ళయందు, మహాసముద్ర గర్భములందు, మంచుభూములలోను, ఎక్కడ చూచినా, ఉన్నాయి. ఈ రాళ్లు ఎక్కడ లేవు, భూమిని ఎక్కడ (తగినంత లోతువరకు) త్రవ్వి చూచినా, రాయి తగులుతుంది. భూమండలము పైభాగమంతా రాతిమయమే. తొలుదొలుత, మనము నివసించే యీ భూమిపై ప్రాణికోటి లేదు; మట్టి లేదు; ఇసుక లేదు; అంతా రాతిమయంగా ఉండేది. ఇప్పటికీ, ఎంతో భాగము రాతితోనే కప్పబడి ఉంది.

కాని, ఆ అనాదికాలమునుండి ఇప్పటివరకు, ఎన్నో వింతయగు మార్పులు కలిగాయి. ఇప్పుడు భూమండలము పైభాగములో, నాల్గింట మూడు వంతులు జలమయము. భూమండల మేర్పడిన పిమ్మట సుమారు నూరుకోట్ల సంవత్సరాలు జరుగువరకు, జలభాగమందు గాని, భూభాగమందు గాని ప్రాణిచయమే లేదు. కాని, రాళ్లు మాత్రము, అప్పటినుండి ఇప్పటి వరకూ, విశ్వములో యుగయుగముల తరబడి జరుగుచున్న సృష్టి, స్థితి, లయముల క్రమమును తమ గర్భమందు పదిలపరచుచు, మూగప్రేక్షకుల వలె నిలిచియున్నవి. మానవయుగము ప్రారంభమైనప్పటినుండియు, కాలానుగుణంగా, వారి నిత్యావసరాలు తీర్చుకొనుటకై, ఇనుము, బంగారము, రాగి మున్నగు లోహములను, వజ్రము మొదలగు పలువిధములగు రత్నములను యీ రాతి నుండియే సంగ్రహించుట తెలుసుకొన్నారు. దీని యొక్క కాలక్రమపరిణామమే ఇప్పటి మానవ నాగరికతకు మూలాధారము. శిలాజన్యములగు పై లోహములేగాక, ప్రకృతిసిద్ధంగా, 'అడుసు రాతి' (Sedimentary rock) లోనే ఏర్పడిన నేలబొగ్గు, పెట్రోలు, ఉప్పు, మొదలగు ఉపయోగకరమైన పదార్థములు రాతియందే దొరుకుచున్నవి. విశ్వసంరంభములో యుగయుగముల వెంట అంతరించి, కథావశేషములైన భూతజాలముయొక్క ముద్రికలు (fossils) కొన్ని ప్రదేశములలో రాతియందే లభించుచున్నవి. వీని సహాయమున, సృష్ట్యాదినుండి ప్రాణికోటియందలి వివిధతరగతుల పరిణామదశలను పరిశీలించుటకు మిక్కిలి యనువుగా నున్నది.

సృష్టియందలి ప్రాణికోటి యంతయు శిలాపదార్థముల నాధారము చేసికొనియే వెలువడి, ప్రభవిల్లుచున్నదనుట అతిశయోక్తి గానేరదు. మూలపదార్థమగు ఈ శిలలు ఎప్పు డేర్పడినవో తెలిసికొనుటకు అత్యంత ప్రాచీనమగు మన భూమండలముయొక్క ప్రథమ దివసములనాటి పరిస్థితుల పర్యావలోకనము గావింపవలయును. ఈ విషయమును ప్రత్యక్షముగ నెరిగినవారు లేకున్నను, దీనిని గుర్తెరుంగుటకై తగిన ప్రమాణములు లేకపోలేదు. సూర్యమండలముయొక్క రసాయనిక తత్వము, మున్నగు విషయములను గాఢముగ పరిశోధించిన శాస్త్రజ్ఞులు భూమండలము కూడ నొకప్పుడు సూర్యమండలముయొక్క భాగమేనని నిర్ణయమునకు వచ్చారు. సుమారు మూడువందలకోట్ల సంవత్సరాలకు పూర్వము ఒక పెద్ద నక్షత్రము (సూర్యమండలము కంటె ఎన్నో రెట్లు పెద్దది) సూర్యమండలమున కత్యంత సమీపముగ నతిశీఘ్రగతిని అనంతపథములోనికి దూసుకుపోయినది. దాని దాపుచే గల్గిన ఆకర్షణ శక్తివలన, సూర్యమండలము చుట్టును మేఘరూపమున నుండు వాయుపదార్థము తోకవలె బయటికి లాగబడినది.

చంద్రుని యొక్క ఆకర్షణశక్తి భూమిపైనుండు సముద్రభాగములం దెట్లు అలలు కల్గించుచున్నదో, అట్లే ఆ నక్షత్రము యొక్క ఆకర్షణశక్తి గూడ నుండెడి వాయుపదార్థమును, సూర్యమండలమునుండి వేరుపరచ కల్గెను. ఆ నక్షత్రము సూర్యమండలమును సమీపించుకొలది, ఆకర్షణశక్తి ప్రబలము కాజొచ్చెను; తుద కది అనంతపథములోనికి దాటిపోవునరికి తోకవలె బయటికి లాగబడిన నుండెడి వాయుపదార్థము, మూలమగు సూర్యమండలము నుండి వెలువడి, స్వధర్మమగు పరస్పరాకర్షణ వలన, సూర్యమండలము చుట్టును, చిత్రమగు భ్రమగతిని పరిభ్రమింప మొదలిడెను. కాలము గడచిన కొలది, ఉష్ణోగ్రత శమించుటచే, ఆ వాయుపదార్థము, క్రమముగ చల్లారి గోళరూపమును దాల్చెను. శీతల మొందుటవలన, ఈ వాయుగోళము ఘన పరిమాణమునందు తగ్గి, మరింత వేగముగ తిరుగుచు, కొంతకాలమునకు ద్రవరూపమును దాల్చి, విభిన్నగోళములుగ విడిపడెను. ఇవి యన్నియు, సూర్యునిచుట్టు తిరుగ మొదలిడెను. వీనియందొకటి భూగోళమైతనచుట్టు తానుపరిభ్రమించుచు సూర్యునిచుట్టు గూడ కోలాకారమగు పథమునందు పరిభ్రమింపసాగెను. ఈగోళము లన్నిటిని కలిపి మనము ప్రస్తుతము నవగ్రహములని వ్యవహరించుచున్నాము. సూర్యుని కత్యంత సమీపముగ నున్నది బుధుడు; తర్వాత క్రమంగా శుక్రుడు, భూమి, అంగారకుడు, గురుడు, శని, రాహువు, కేతువు, మొదలగు గ్రహము లున్నవి. ఈ నవగ్రహముల యేర్పాటులో, సూక్ష్మ గ్రహకణికలు (Planetesimals) ఎన్నో అనంతపథములోనికి విడివడిపోయెను. కాని, క్రమేణా ఈ గ్రహముల ఆకర్షణ బలిమివలన, అవి తిరిగి వానిలో లీనమైపోయి, వాని పరిమాణము నినుమడింపజేసెను. వీనిలో కొన్ని ఇప్పటికి తోకచుక్కల రూపమున (meteorites) భూమిని చేరుచుండుట అనుభవమగు విషయమే.

కొన్నిలక్షల సంవత్సరాలు గడిచాయి. ద్రవరూపమున నుండు భూగోళము క్రమముగ ఘనీభవింప మొదలిడెను. ఈ పరిణామదశలో, గోళమధ్యమున అత్యంత భారమగు ధాతువులు [నికల (nickel) లోహము, ఇనుము-యొక్క మిశ్రమలోహము] కూడుకొనెను. పైకి వచ్చుకొలది, క్రమముగా తక్కువభారము గల ధాతువులు ఘనీభవించెను. తుదకు పైభాగమునం దంతట స్వల్పభారము గల శిలాపదార్థముల పొర (Lithosphere) ఏర్పడెను. కాని, భూగోళమంతయు నీటియావిరి చేతను, పొగరూపమున నుండు పెక్కువిధములగు వాయుపదార్థములచే నావరింపబడి యుండెను. ఇందు మూలమున సూర్యరశ్మి సోకుటకు మిక్కిలి ప్రతిబంధకముగ నుండెను. కొన్ని యుగములు గడచిన పిమ్మట గాని యీ వాయుపదార్థములు నీటిరూపమును దాల్చి ఘనీభవించలేదు; మరికొన్ని నీటియావిరితో కలిసి, చల్లబడి నీటిరూపమును దాల్చలేదు.

అప్పటికి భూమి పైభాగము చాలవరకు చల్లబడుటచే, మేఘము లేర్పడుట కవకాశము గల్గెను. భూనభోంతరాళములు బ్రద్దలగునట్లు ఉరుములతో, తీగమెరుపులతో, ప్రళయకాల సన్నిభమగు కుంభవృష్టి కురియ నారంభించెను. మిట్టపల్లములతో గూడిన భూభాగమందలి పల్లపు ప్రదేశములన్నియు జలమయము లాయెను. ఇప్పుడు మనకు గానవచ్చుచున్న మహాసముద్ర భాగములన్నియు తొలుత నీవిధముగ ఏర్పడినవే. ఈ నీటితాకిడి వలన, కాలము గడచుకొలది, భూమండలము త్వరితగతి శీతలపడ సాగెను. ఉష్ణోగ్రత శమించుకొలది, ఘనీభవించుచున్న భూమి పైపొర బీటలు వారెను. ఈ పగుళ్ళలోగుండా, గొప్ప ఒత్తిడిశక్తితో, శిలాద్రవము పైకుబికి వచ్చి భూమి పైభాగమున నున్న మిట్టపల్లముల నధికము గావించెను. తొలుత ఏర్పడిన రాతి పొరతో గూడి, ఇవి యన్నియు ప్రథమమున ఏర్పడిన శిలాద్రవజన్య శిలలే (Igneous rocks). వర్షపాత మధికమించుటచే, భూగోళము నావరించియున్న మేఘములు పలుచబడెను. అంతట సూర్యకాంతి భూమిపై ప్రసరింప నారంభించెను.

ఇక ప్రారంభించినది ప్రకృతి భూతముల విలయతాండవము. సూర్యరశ్మి సోకుటచే, మరింత నీరు తిరిగి మేఘరూపమును దాల్చి, ఆకాశమునందలి పై భాగములందు శీతలపడి, వర్షరూపమున మరల భూమిని తాక మొదలిడెను. ప్రథమ

మున చిన్న కాలువలుగా, పిమ్మట సెలయేరులుగా తర్వాత పెద్ద నదులుగా భూమిని లోయలుగ నొనర్చుచు, మిట్ట పల్లముల నధికము గావింపుచు ప్రవహింప మొదలిడెను. భూమిపై నున్న కటికి శిలలన్నియు పంచభూతముల శక్తిచే శిథిలమై ఒండ్రు రూపమున సముద్రభాగములలోనికి గొనిపోబడుట మొదలయ్యెను. ఈ ఒండ్రు సముద్రగర్భమును చేరు కొలది సముద్రముయొక్క అడుగుభాగము దీని భారముచే కుంగి, సముద్రముయొక్క లోతు హెచ్చసాగినది. క్రమముగ ఈ ఒండ్రు మట్టి పొరలన్నియు కొన్ని యుగములు గడచిన పిమ్మట, సంతతము వచ్చి కూడుకొనుచున్న ఒండ్రు పదార్థము యొక్క ఒత్తిడిచే అదుమబడి అడుసు శిలలుగా మారిపోయినవి.

ఇంతలోనే కాలము గడచినది. భూమిపై నున్న ఎగువ ప్రదేశములు, పర్వతరూపమున నున్న ఎత్తైన స్థలములన్నియు మట్టము చేయబడినవి. వీనియొక్క శిథిల పదార్థము లన్నియు సముద్రమును చేరుటచే దాని అడుగుభాగమునందు బరువుయొక్క ఒత్తిడిశక్తి అధికము కాజొచ్చెను. ఈ ఒత్తిడిచే భూమిగ నున్న ఖండభాగములు కొన్ని విడివడిపోయెను. కొన్ని, కొంతదూరము వరకు, వివిధ దిశలకు లాగబడెను. ఈ భూప్రళయపు మార్పులలో సముద్రగర్భమున ఇమిడియున్న అడుసు శిలలన్నియు ముడతలు పడి, పైకుబికి వచ్చి పెద్ద పర్వత పంక్తులుగా మారెను. ఈ క్రమము భూమండల చరిత్రయందు పలుప్రదేశములందు వివిధ కాలములలో జరిగినట్లు ప్రమాణములు గానవచ్చుచున్నవి. మనదేశమున ఉత్తరదిశను పెట్టని గోడవలె ఎల్లగా దనరారుచున్న హిమవత్పర్వత పంక్తి కూడ నీవిధముగ ఏర్పడినదే. మన దేశభాగను మధ్యయుగాంతమున (Mesozoic Era) ఉత్తర దిశకు లాగబడుటచే ఇది సంభవమాయెను. ఆ కాలమున, మధ్యధరా సముద్రమునకు లంకె గావించు సముద్రము మన ఉత్తరమున ఎల్లగా నుండినది. ఆ సముద్రగర్భమున ఏర్పడిన అడుసు శిలలే, యీ భూప్రళయపు మార్పులలో, హిమాలయ పర్వతములుగ మారినవి.

ఈ విధమగు మార్పులు జరుగుచుండ, భూమి మీద గాలి చాలవరకు చల్లబడినది. పర్వతపంక్తుల మధ్యనున్న లోయ భాగము లన్నియు మట్టిలో నింపబడెను. ప్రప్రథమమున, నేల (మట్టి) యీ విధముగ ఏర్పడినది. క్రమముగ భూమి చుట్టును వాతావరణ మేర్పడినది. అందు, వివిధ వాయువుల పరిమాణముల యొక్క నిష్పత్తి ప్రాణు లేర్పడి బ్రతుకుట కనువుగా ప్రభవిల్లినది.

అనుకూల పరిస్థితులన్నియు ఏర్పడినవి. గాలి చల్లబడినది. సూర్యరశ్మి బాగా సోకుట ప్రారంభించినది. సముద్రపు నీటి యందు తగినంతగా వివిధములగు లవణ పదార్థములు ఏర్పడినవి. జీవితమున కనువగు వాతావరణ మేర్పడినది. అంతట సృష్టి ప్రారంభమైనది భూమి మీద. ఇప్పుడు మనకు అగపడు ప్రాణి సంతతి కాదు, సృష్టి ప్రారంభమైనపు డున్నది. ప్రథమమున పొడసూపినవి, అతి సూక్ష్మమగు బిందురూపమున నుండు ప్రాణిపదార్థముచే (protoplasm) నావరింపబడి యుండు సూక్ష్మజీవులు. ఈ ప్రాణిపదార్థము ఎప్పు డెట్లు ఏర్పడినదో సరిగ నూహించుట సులభము గాకున్నను మొదటి ప్రాణిచయము, అతిసూక్ష్మమగు వృక్షజాతికి చెందినదని మాత్రము రూఢిగ చెప్పవచ్చును. ఎందుకన, ఇప్పటికిని ఈ శాఖకు చెందిన సూక్ష్మజీవులను (bacteria) మనము సూక్ష్మదర్శిని సహాయమున చూడగల్గుచున్నాము. ఏకాగార ప్రమాణంగా (unicellular) ఉండే యీ సూక్ష్మజీవులు, నియమితాకార బద్ధములై చలన రహితములైనను, క్రమముగా వివిధ పద్ధతులచే పరిస్థితుల ననుసరించి పెద్దవగుచు, బహుళమగు గదులు గల (multicellular) ప్రాణులుగ మారెను. పరిమాణము హెచ్చగుటచే, ఆహారమును వెదకుకొనుట, ఆహారమును తినుట, సూర్యరశ్మి గైకొనుట, ఆధార మేర్పరచుకొని నివసించుట, మున్నగు జీవితావసర కార్యములను, శరీర మందున్న గదులలో ప్రత్యేకమొక్కొక్క గదుల కూటము ఆచరింప మొదలిడెను. ఇంతటిలో, వీనిని ఆహారముగ గొని బ్రతుకనేర్చిన జంతుసంతతికూడ ఏర్పడెను. జంతువులుగూడ మొదట ప్రాణిపదార్థపు బిందువులుగ, ఏకాగార ప్రమాణముగ నున్నను, ఆకార

రహితము అగుటచే, చలనశక్తి గల్గియుండెను. కాలక్రమమున, వీని పరిమాణము హెచ్చగుచు, జీవితావసరములకు వివిధములగు పనులు నిర్వహించుటకై, ప్రత్యేకమగు గదుల కూటము ఏర్పడెను. పొట్ట, కళ్లు, కాళ్ళు మొదలగు అవయవములు క్రమంగా ఏర్పడినవి. ఎంతో కాలము గడచిన పిమ్మట, మెదడుకూడ ఏర్పడినది.

భూమియందలి సృష్టి యీ విధంగా ప్రారంభమై, కాలచక్రము తిరుగుకొలది, వివిధ పరిణామములు జెందుచు వచ్చినది. భూమండలము ఏర్పడి ఇప్పటికి 24 గంటలు అని లెక్క వేసికొనిన, 12 గంటల కాలము భూమియందు ప్రాణిచయమే లేదు. ఈ కాలాన్నే "అప్రాణి యుగ"మని (Archaean Era) పిలుచుచున్నాము. ఆ యుగంలో ప్రాణు లున్నటుల ఆధారము లేవియు లేవు. ఆ యుగాంత కాలమునకు సృష్టి ఆరంభమైన దనుకొనినను, ప్రథమమున ఏర్పడిన ప్రాణులందు, గట్టిచిప్పలు (shells) గాని, ఎముక భాగములుగాని లేకుండుటచే, వాని ముద్రికలు ఆ కాలపు రాతియందు దొరకుటలేదు. అందువలన, సృష్టి ప్రారంభ సమయమును సరిగ గీటుగీసి చూపించుట సులభ సాధ్యము గాకున్నది.

అప్రాణి యుగము పిమ్మట వచ్చినది, ఏడు గంటల కాలమునకు సరియగు "ప్రాచీనయుగము" (Palaeozoic Era). ఈ యుగంలోనే సృష్టి ఆరంభమైనది. క్రమంగా, వృక్షజాతికి చెంది జలమందు పెరుగు ప్రాణులు, శరీర భాగములపై చిప్ప లమర్చుకొనిన జంతుజాలము, ఎన్నోరకాలు అభివృద్ధి జెందాయి. పిమ్మట, వెన్నెముక లేని జంతుజాలానికి చెందిన ప్రాణుల తరగతులెన్నో వచ్చాయి; లయమై పోయాయి. వీనిలో చాల కొలది తరగతులు మాత్రమే ఇప్పటికీ నిలిచి ఉన్నాయి. తర్వాత వృక్షజాతి కొంత పెంపొందింది. ఇతట్లో, చేపలు సముద్ర భాగములందు విపరీతంగా అభివృద్ధి చెందాయి. మరి కొంత కాలము గడచిన పిమ్మట వృక్షజాతి విపరీతంగా పెరిగిపోయినది. ఆకాలంలోనే ప్రపంచమందున్న బ్రహ్మాండమగు నేలబొగ్గు గనులన్నీ ఏర్పడెను. జంతువులలో, ముఖ్యంగా పాములు, పాలీస్ప మొదలగు పురుగులు క్రొత్తగా వచ్చాయి.

తర్వాత, 3 గంటల కాలమునకు సమానమగు మధ్యయుగము (Mesozoic Era) ప్రారంభమైనది. ఈ యుగ సందర్భములో ముఖ్యముగ సరీసృపములు (reptiles), ప్రథమ క్షీరదములగు జంతువులు, పూలుపూచు చెట్లు అవతరించాయి; చేపలు బాగా అభివృద్ధి చెందినవి. కొలది శరీర ప్రమాణము గల జలచరములగు జంతువులు సముద్ర భాగములలో విపరీతముగా అభివృద్ధిలోనికి వచ్చెను. వీని చిప్పలన్నీ క్రమేణా సముద్రగర్భమున గుట్టపడుటచే, సున్నపురాయి (shell limestone) ఏర్పడెను. ముత్యపు చిప్పల నొసగు జంతువులు (oysters), పగడపు (coral) దీవుల నిర్మించు జంతువులు యీ యుగంలోనే ప్రాభవము చెందాయి. సరీసృపమునుండి పక్షి సంతతికూడ వేరుపడి విపరీతముగ వృద్ధి చెందినది.

"నవీనయుగము" (Cenozoic Era) మధ్యయుగమైన పిమ్మట ప్రారంభమైనది. దీని యొక్క కాలపరిమితి 1-3/4 గంటలకు సమానము. ఈ యుగంలోనే, క్షీరదములగు జంతువులు విపరీతముగ పెక్కుతెగల క్రింద ప్రభవిల్లాయి. ప్రస్తుతము మనము చూచే పుష్పించి ఫలముల కాయు చెట్లన్నీ, ఈ కాలంలోనే రూపు పొందాయి. మొసళ్లు, పాములు, ఎండ్రకాయలు, కప్పలు, మొదలగు ద్విభాగచరములు (amphibians), వివిధములగు పురుగులు ఎన్నో హెచ్చుగా వృద్ధిజెందెను. ఇప్పుడులేని ఎన్నో వింతరకాల ఏనుగులు, పులులు, సింహములు, గుఱ్ఱములు, అన్నీ పెంపొందాయిగాని కాలగర్భంలో లయమైపోయాయి. కొన్ని రకాలు మాత్రమే పెక్కు పరిణామములు చెంది ఇప్పటికీ అక్కడక్కడ నిలిచి ఉన్నాయి.

తుదకు, పావుగంట ప్రమాణముగల "సమీప యుగము" (Quaternary period) ప్రారంభమైనది. ఈ యుగ ప్రారంభంలో, భూభాగంలో చాలవరకు మంచుచేత కప్పబడి యుండినది. ముఖ్యంగా, పశ్చిమార్ధగోళ ప్రదేశములు (ఉత్తర అమెరికా మొదలగునవి) మంచుచేత దట్టముగ కప్పబడి యుండెను. కాలము గడచు కొలది, మంచు చాలవరకు విడిపోయెను. ఈయుగంలో మానవాకృతిగల జంతువులెన్నో విపరీతంగా వృద్ధి

లోనికి వచ్చెను. ముఖ్యంగా, ఏనుగులు, ఎలుగు బంట్లు, తోడేళ్ళు, సింహములు, కోతులు, మున్నగునవి మిక్కుటంగా తిరుగ మొదలిడెను. కాని వీనియందలి తరగతులు పెక్కు కథావశేషములైనవి. ఈ యుగారంభ కాలంలోనే కోతుల నుండి వేరుపడి మానవజాతి అభివృద్ధిగాంచుట అత్యంత ప్రాముఖ్యమగు విషయము. ఇందువలన దీనిని "మానవయుగ"మని పిలుచుట పరిపాటైపోయినది. మానవయుగము ప్రారంభమైనప్పటినుండి మానవుల కాలానుగుణ పరిణామము, విజ్ఞానాభివృద్ధి, నాగరికతాభివృద్ధి మున్నగు విషయములను, దాదాపు, అన్నియును చరిత్రరూపంగా మనము తెలిసికొనియున్నాము.

ఇదీ, భూదేవి పుట్టుపూర్వోత్తరాల కథ. "పుట్టిన ప్రతివాడికీ ప్రపంచము కొత్తగానే కనిపిస్తుంది. ఇకర గ్రహాలూ, నక్షత్రాలూ, మొదలైన వాటి వయస్సును బట్టిచూస్తే ప్రపంచము (భూమండలమని నా యూహ) ఇప్పుడే నడక నేర్చుకొన్న పసిపిల్లలాగే కనిపించవచ్చు" నని అన్నాడొకాయన. అందులో మానవయుగము ప్రారంభమై ఎంత కొద్దికాలమైనదో, పై నుడివిన అంకాలను పరిశీలించిన బోధపడుతుంది. ఇంత స్వల్పకాలంలోనే, సర్వతోముఖాభివృద్ధి గాంచి మానవుడు తనవిజ్ఞానపటిమచే ప్రకృతిశక్తులచాల వరకు నిర్జించి బంధించి, తన అవసరాలకై వినియోగించగల్గుట ప్రపంచచరిత్రలోను, మానవాధ్యాయములోను మిక్కిలి ప్రాముఖ్యమగు విషయము. కాని భూమిమీద సృష్టి ఆరంభమైనప్పటినుండియు, ఏ తెగకు ఆ తెగ బ్రతుకుటకై, అభివృద్ధి జెందుటకై, ఉన్నతి గనుటకై పెనగులాడుచునే వచ్చినవి. ఆ ప్రయత్నములో ఎన్నో రకముల జంతువుల శాఖలు విఫలములై సర్వదా పరిణామము జెందు విశ్వసంరంభము యొక్క ధాటి కోర్వజాలక, కాలచక్రపు పరిధిలో లయమైపోయినవి. మానవ జాతియొక్క ప్రభావము, శక్తి ఈ సత్యము నెంతవరకు గుర్తించి చిరకాలాలపాటు ఈ ప్రపంచములో ప్రభవిల్లునది ముందు కాలమునగాని తేట తెల్లము గాదు. ఆ కాలపరిమితి నూహించుట కశక్యమైనను మానవాధ్యాయమును పొడిగించుటకై అభిలషించుట ఎంతయు ప్రయోజనకారి కాగలదు. జరిగిన వృత్తమునంతయు సింహావలోకనము గావించిన, మానవయుగమునందు ఆవగింజలో అరవయ్యోవంతు జరుగలేదను విషయము తెల్లమగును. ఈ కొలది కాలమునందలి సాధనలకే మానవజాతి విఱ్ఱవీగి స్వధర్మమును విస్మరించిన పతనోన్ముఖమగుననుట కేమియు సందియము లేదు. దేశ, మత, వర్ణ, విభేదాలు మున్నగు కృత్రిమపు గోడలెన్నో జీవితవ్యవస్థయందు విరివిగ పాటింపబడుచున్నవి. ఈ విభిన్నమగు దృక్పథముల, వాని వలన రూపొందు పరస్పర విరోధకార్యములు శుభచిహ్నములు గాజాలవు. సర్వనాశనకరమగు యీ పద్ధతుల వదలి, మానవజాతి ఏకత్వమును గుర్తించి, విశ్వమానవ సౌభ్రాతృత్వము నెలకొల్పి, ప్రపంచమందున్న మానవులంతా ఒక జాతిగా, ఒక కుటుంబంగా, ఒక పంచన యున్నట్లు ప్రవర్తించిననే మానవజాతి ఈ విశ్వసంరంభపు ఆటుపోట్ల కతీతమై విజయంగా నిలుస్తుంది. లేకున్న మానవజాతియొక్క సాధనలు, తనకంటె ఎంతో భిన్నమని తలచే, తక్కిన వృక్ష, జంతు శాఖలయొక్క అపూర్వ సాధనలకంటె ఎంతో న్యూనముగ పరిగణింపబడతాయి.

---

అపరభీష్ముడు

ఆ మనోహరమైన సాయంత్రం ప్రియుడు ప్రియురాల్ని కడసారి ప్రార్థించాడు: "నువ్వు నా ప్రేమ తిరస్కరిస్తే నాకు మరణమే శరణ్యం." ఆమె తిరస్కరించింది, అతడు మరణించాడు—యాభై యేళ్ళ తరవాత.

కథానిక

# నాయకుడి జపపం

ఘట్టి ఆంజనేయశర్మ

"కాలేజీ స్టూడెంట్స్ చేసిన హంగర్ స్ట్రయిక్‌లో రామకృష్ణ పాల్గొనటమే కాకుండా, కాంపౌండ్ దాటి వెళ్ళనందున, ఇతర విద్యార్థుల్ని నిరోధిస్తున్నందున నిన్న పోలీసువారు కస్టడీలోకి తీసుకున్నారు. క్లాసులో మొదటివాడు గాను, బుద్ధిమంతుడు గాను వుండిన రామకృష్ణ ఇలా ఒక్కసారి తెలివితక్కువగా, బాధ్యతారహితంగా, కాలేజీ స్టూడెంట్సుతో కలుస్తాడనుకోలేదు. నాకు ఇదివరలో అతనిమీదవుండే విశ్వాసంతో మీకు ఎరుక పరచడం... కాలవశాన మీ అల్లుడు అవటం జరిగింది. ముందు రామకృష్ణ ఇలాంటి విషమ రాజకీయాల్లో పాల్గొంటే మన కందరికీ ఆశాభంగాన్ని విషాదాన్ని కల్గిస్తాడనడంలో సందేహంలేదు. ఆపైన మీ బాధ్యత."

ఈ జాబు సబ్ జడ్జి రామనారాయణ చూడటంతోటే నిలువునా నీరైపోయినాడు. తీరా తను పెళ్ళిచేసి సంవత్సరం కూడా కాలేదు. అందగాడు, తెలివి గలవాడు, అన్నివిధాలా కూతురు విమలకు తగినవాడు అని చేశాడు గాని, ఇలా రాజకీయ వ్యామోహ పీడితుడని అనుకోలేదు. పైగా మిత్రుడు ప్రొఫెసర్ నారాయణరావు వ్రాసింది చూడగా చదువు చాలా దెబ్బ తినేట్టు వుందనే చెప్పాలి. మొక్కై వంగనిది మానై వంగుతుందా?

"అమ్మాయ్... విమలా!..." గట్టిగా అరిచాడు.

విమల చేతిలో వున్న పుస్తకంతో పరిగెత్తుకొచ్చింది.

"ఏమిటా పుస్తకం చేతిలో!"

'ఏదో పుస్తకం గాని... నాన్నా... ఎందుకు పిలిచావో చెప్పు!...'

"నువ్వు చదివే పుస్తకం నేను తెలుసుకోరాదా ఏమిటి!..."

"............"

"ఏదిది నట్టే వుంది" రామనారాయణ లేచి, విమల చేతిలో పుస్తకం లాక్కున్నాడు.

'అంతిమ పోరాటానికి కదలి రండు.'

"ఇదా పుస్తకం!... అమ్మాయ్... నీకేనున్నా పిచ్చి ఎక్కలేదు కద! రామాయణ, భాగవతాల్లేవా... అటు ఇంగ్లీషులో షేక్స్‌పియర్ నాటకాలు లేవా... ఎడిసన్ వ్యాసాలులేవా?... ఈ ముష్టి రాజకీయాలు ఎందుకంట!"

ఇంతలో పార్వతమ్మ, విమలతల్లి దగ్గుకుంటూ వచ్చింది.

"ఏమిటండీ... పొద్దున్నే దాన్ని చీదరించుకుంటారు!... ఒక్కగాను ఒక్క ఆడ పిల్ల!"

"సంతోషించాం - ఇంక నీ భారతాన్ని విప్పకు... అమ్మాయీ... అబ్బాయికి విస్తట్లో కూడు నోటికొచ్చేట్టు లేదు..."

"ఇప్పుడు ఏమైందని?..."

"రామకృష్ణని కాలేజీలో హంగర్ స్ట్రయిక్ చేసినందుకు జైల్లో పెట్టారుట... నారాయణరావు వ్రాశాడు..."

"జైల్లో పెట్టారా... నాన్నా..." అంది విమల సంభ్రమంతో...

"అయ్యో... చదువూ... గౌరవం... రెండూ పున్న..." అని నిట్టూర్చింది పార్వతమ్మ.

"మన రాత... దాని ఖర్మ..." అన్నాడు రామనారాయణ.

"పోనీ యిక్కడికి పిలిపిస్తారూ!... ఆ నాలుగూ చెప్పి పంపిద్దాం..." అంది పార్వతమ్మ.

"పండగలకి రానివాడు... ఇప్పుడొస్తాడా అంట!..."

"నేనే వెళ్ళి నా తంటాలు పడతాను, నాన్నా... ఈ రైలుకి పంపించండి." అంది

విమల... భార్యాభర్తలు ఒకరి నొకరు చూసు కున్నారు.

*   *   *

రామకృష్ణ చాలావృద్ధిలోకివచ్చి,ఏదో గొప్ప ఉద్యోగం చేస్తాడని అందరూ అనుకున్నారు. క్లాసులో మొదటిబెంచిపై కూర్చుని, ఆడపిల్లల వంక చూడకుండా, ఫస్టుమార్కులు సంపాదించే వాడి విషయంలో ఎందుకు సందేహం వుంటుంది గనుక! కాని ఈ రామకృష్ణ ఉన్నట్లుండి విప్లవ వాదిగా తయారయిపోయాడు—ఉన్నట్లుండి ఎదిగిన ఆడపిల్లలు ఒక్కసారి రజస్వలలైనట్లు- సిద్రపోతున్న అగ్ని పర్వతాలు ఒక్క సారి బ్రద్దలైనట్లూ — కాని లోకానికి అవి సహజమేమోకాని ఇలా విద్యార్థి హక్కుల కోసం జైలుకుపోవడం-కాలేజి చదువు పోగొట్టు కోవడం, సహజమైన ఆచారంగా అవుపించదు.

రామకృష్ణని తిరిగి కాలేజీలో చేర్చుకో డానికి ప్రిన్సిపాలు నిరాకరించాడు. సమ్మెలో నాయకత్వం వహించినందుకు పేపర్లో పడటం- నలుగురునోట్లో నానడం తప్ప వచ్చిందేమీ లేదు. ఇంట్లో తండ్రి మంచపడ్డాడు. బీదరికంలో, ఆయనను వేడిపుట్టి తలవాచేటట్లు చివాట్లు పెట్టాడు.

"పురుషుడివైతే ఎక్కడికైనా పోయి సంపా దించుకో." అన్నాడు ఒకసారి ఉండబట్టలేక. ఇంక రామకృష్ణతల్లికి ఒకటే ఆశయం ... నమ్మకమూను...వాడు గొప్పవాడవ గలడని- ఏదిచేసినా మంచిదేననీ!

రామకృష్ణ ఒకనాడు పడకకుర్చీలో కూర్చుని "దేశనాయకులు" పుస్తకాన్ని చదువుతుండగా విమల హఠాత్తుగా వచ్చి, వాడి చేతిలోని ఆడ్డి, నమస్కారంతో నిలుచుంది. ఇలారావడం- అందులో తనకే ఇంటిలో స్థానం సరిగా లేక పోవటంతో రామకృష్ణ చికాకుపడ్డాడు.

"మీకూ దేశనాయకులా తారా ఏమిటి సంగతి?" అంటూ ప్రారంభించి, "చిప్పచేతికి తెస్తారు" అంటూ ముగించింది. అంతకంటె వ్యాఖ్యానం అనవసరం. చదువుకున్న రామకృష్ణ చదువురానిఅమ్మాయిని తర్కంలో ఓడిద్దామని వ్యర్థ ప్రయత్నం చేశాడు.

రామకృష్ణ రాజకీయ ఆందోళన జరుగుతుండే రోజుల్లో ఒక మీటింగుకి వెళ్ళాడు. వేడి వేడి ఉపన్యాసాలు విన్నాడు. ఇంకా కొన్ని లాఠీచార్జీలు, కాల్పులు చూశాడు కూడాను. పైగా దేశమంతా జోహారులు అర్పించే దేశనాయకుల పదవాలనే కాంక్ష ఒకటి పీడిస్తోందాయె! "ఇదే సమయం...చల్లబడిన ఇనుముని సాగకొట్టలేం."... ఇలా ఓ సమా వేశంలో యిచ్చిన పూరకదంపు ఉపన్యాసంతో 'బి' క్లాసు ఖైదీగా తయారయ్యాడు. ఇక్కడ ఓ తమాషా వుంది. ఖైదీ జీవితం ఏమీ కష్టంగా లేదు పైగా పూలమాలలు—పై పద్యమాలు బాగానే వున్నాయని పించింది. అందుకే వ్యాపారం చేసుకుంటున్న మల్లయ్యసెట్టి తనతో పాటు ఒక్కలాఠీదెబ్బ తినకుండా, పువ్వులాగా జైలులో వున్నాడు. తను ఇక్కడకి కేవలం యువకులు, న్యాయశీలురూ వస్తారనుకున్నాడు. ధనవంతులు, వర్తకులు అంతా ఎ-బి' క్లాసుల్లో హోదాప్రకారం సౌఖ్యం అనుభవిస్తుంటే, లాఠీ దెబ్బలుతిని వ్యథపడ్డవాళ్ళు 'సి' క్లాసులో అవు పించారు.

ఒకనాడు, జైలుగది వూడవటానికి ఒక ఖైదీ వచ్చాడు. వుండబట్టలేక, ఒకపెద్ద మానసిక వేత్తలాగా అతని జీవితం భోగట్టా చేశాడు. తను దొంగతనం చేశానని, బీదరికం కారణమని చెప్పాడు ఆ ఖైదీ. రోజూ చాలామంది వూడవ టానికి వస్తున్నారు. చాలామంది ఇలాగే చెబు తున్నారు. రామకృష్ణ ఒకరోజున ఫలాని ఆదర్శమే తన జీవిత పరమావధి అని చెప్పిన రోజు లున్నాయ్ మానసికంగా పరివర్తన రానిదీ సంస్కరణ విజయవంతం కాదు. ఇంకో రోజు ఒక ఖైదీ చాలా మాసిన బట్టలతో, పెరిగిన గడ్డంతో వచ్చాడు.

"నీ పేరు!" అన్నాడు రామకృష్ణ.

"ఎందుకు లేండి!"

"చెబుదూ...ఒక విషయం అడగాలి!..."

"రామయ్య...ఏం విషయం బాబూ!..."

"నువ్వు ఏం నేరం చేశావు!..."

"అయిపోయిందేదో అయిపోయింది...అవన్నీ ఎందుకు లేండి!"

"నా చేతనయినంత చేస్తాను...సహాయం... తర్వాత—"

"పొలం తగాదాల్లో ఖూనీ జరిగింది. చాలా మంది కొట్టుకున్నాం—మా పొలాలన్నా కావు—మా కామందులవి.—వాళ్ళే తగువులు పెట్టి మా చేత చేయించారు—"

"నువ్వు ఖూనీ చేశావా!—"

"తాగిన మైకంలో ఎదో కొట్టానుబాబూ—నా కెవ్వరిమీదా కోపంలేదు—అసలు దబ్బిచ్చి, ఖూనీ చేసిన మా నాయుడుగారు తప్పించుకొన్నారు—"

రామకృష్ణ, రామయ్యని పరిశీలనగా చూశాడు. హంతకుడూ మనిషే!—అందులో రామయ్య నిస్సహాయంగా చూస్తుంటే ఎదో సానుభూతి కలవరపెడుతూంది.

"అయితే, బాబూ—రేపు మీరు రాజ్యం చేసేటప్పుడు మా సంగతి చూడండి—"

రామకృష్ణ నిశ్శబ్దంగా బయటికి నడిచాడు.

* * *

రామకృష్ణ ఒక పెద్ద గవర్నమెంటు ఉద్యోగి కాలేదు సరికదా కనీసం దేశనాయకుడన్నా కాలేదు. జైలునుంచి వచ్చిన మల్లయ్యసెట్టి మాత్రం వ్యాపారం ఇతోధికంగా వృద్ధిచేసుకున్నాడు పరిమిట్లమీద పరిమిట్లు సంపాదించి. ప్లీడరు గుప్తాగారు యమ్. యల్. ఏ. అయినారు. ఇంకా చాలామంది రావుగార్లకి, శాస్త్రిగార్లకి మంచి ఉద్యోగాలు దొరికాయ్ ఖైదీల మానసిక ప్రవృత్తేగాక, కార్మికుల అనేక రైనందిన సమస్యలమీద, స్త్రీలహక్కులమీద, యమ్ ఎల్. ఏ. లకు, ఛోటాకాంగ్రెసు నాయకులకు, సంస్కరణలని గురించి చెప్పడం, వాదించడం, తిరస్కరింప బడటం జరిగాయ్. పత్రికల్లో జరిపిన ఆందోళన కాకిగోలగా మారిపోయింది.

చివరికి రామకృష్ణ ఏమీ కాలేక, అదే గత్యంతరం లేక ఒక ఎన్. జీ. వో అయినాడు. ఇంతవరకు తనకు జీవితంలో కలిగిన రెండు అనుభవాలు గెజిటెడ్ ఆఫీసర్ని గాని, దేశనాయకుణ్ణి గాని చేయకపోయినా, ఫారెస్టు ఆఫీసరుగా మాత్రం చేసినయ్.సూక్ష్మంగా ఆలోచిస్తే, రామకృష్ణకు ఎప్పటికైనా గొప్ప ఉద్యోగం రాకపోదు. అయితే కొన్ని ఆశయాలు మాత్రం ఆచరణలో పెట్టవీలులేదని (ప్రస్తుతం) అంటూ వుండాలి. కాని ఈ స్వల్ప విషయం వీడికి ఎంత చెప్పినా అర్థంకాదు. పుస్తకాల్లో విహరించే నాయికా నాయకులు, సామాజిక జీవితంలో ఎలా మారిపోయి, విరహ గీతాలు మరిచి, వీపు గోక్కుంటూ ఇంటి విషయం ఆలోచించే వెంకయ్య నాయకుడూ, అంట్లు తోమే రాధమ్మ నాయికగానూ మారిపోతారో అలాగే ఈ రాజకీయ ఆదర్శాలూను అంటే నమ్మడు.

ఇంతలో ఎన్.జీ వో. సమ్మె వచ్చింది. రామకృష్ణ అందర్నీ కూడదీసి సమ్మె నడిపించాడు. కాంగ్రెసు నాయకులు, పెద్దఆఫీసర్లు,మామగారు, జిల్లా సబ్ జడ్జి రామనారాయణగారు ఎంతో చెప్పారు.

సమ్మె జోరుగా సాగుతోంది.అప్పుడే రామకృష్ణ ఉపన్యాసం చెప్పి, ఇంటికి తిరిగొచ్చి, విమలకు రాజకీయ చైతన్యాన్ని గురించి బోధిస్తున్నాడు. పోలీసులు, లాకప్‌లో పెట్టేదాకా ఆ బోధన ఆగలేదు.

"విమలా... మనకి లేక పోతే యేం...నీకు నగలు, చీరెలూ లేక పోతేయేం... సత్యాదర్శం ఒక్కటి చాలు..." ఇలా జైలు దాకా చెప్తూను పోయాడు. విమలకి ఈ భాష అర్థం కాదు.

సమ్మె ఆగిపోయింది, రామకృష్ణ ఉద్యోగం పోయింది. ఇంకెక్కడైనా దొరుకుతుందన్న ఆశ కూడా పోయింది.

"మేం చెబితే వినలేదు కదూ?... శాస్తి అయింది." అన్నారు ఇదివరకటి పెద్ద మనుష్యులు.

* * *

రామకృష్ణ జైలునుంచి తిరిగి వచ్చేటప్పటికి ఇంట్లో సామాను చిందరవందరగా వుంది. విమల పెద్దగా ఏడుస్తూ తన గుండెల మీద అనుకొని "మీరు వెళ్ళిన మర్నాడే నన్ను హింసించి ఇంట్లో పుస్తకాలు తగుల బెట్టి లూటీ చేశారు!" అంది.

రామకృష్ణకి ఇప్పుడు గొప్ప వైరాగ్యం వచ్చింది! తనని ఇంక చివరికి మిలిటరీలో కూడా చేర్చుకోరు. జీవితం- న్యాయం వీటి సమన్వయం కుదరలేదు. ఈ అంతరాత్మపరీక్షల్లో రామకృష్ణకి ఏమీ జిజ్ఞాస లేదు మామగారు తనని, ఈ ఉద్య

మంలో ఎప్పుడు ప్రవేశించాడో అప్పుడే విడనాడాడు. తండ్రికి తన ఆదర్శాల మీద సానుభూతి లేదు. ఇంక ఆలోచించుకునే గొప్ప భవిష్యత్తు లేదు. తల్లి హృదయంలో తనని ఆశీర్వదిస్తుంది అంతే. ఆమె తనని సమీపించలేదు. ఈ అఖండ భారతావనిలో, తనవాటి సోదరులు ఎలా జీవిస్తున్నారు? మనిషి ఆలోచనలకి, ఆశలకి ఒక హద్దు వుంది. దాన్ని దాటిపోయినప్పుడు, జీవితం మీద మమకారం పోతుంది.

విమల కన్నీరు చొక్కా తడుపుకొంది.

'పిచ్చిదానా! ఇదే జీవిత ప్రారంభం! ఇదివరకు దంతా స్వాప్నిక జగత్తు!''

ఎక్కడి నుంచో దూరాన ఘోషలాగా విజయనాదాలు వినిపిస్తున్నాయ్.

రామకృష్ణకి జొన్నచేలో 'ఏంకి పాటలు' పాడుకోటానికి పొలంలేదు! 'చల్ మోహన రంగా' అని పాడుకుంటూ మల్లె తెప్పపైన తేలి పోవడానికి 'ఒక చిన్ని నావ' కూడా లేదు! ఎక్కడెక్కడనుంచో కార్మికులు, రైతులు, ప్రజలు అందరూ తన దగ్గరికి వస్తున్నారు. నమస్కారాలు చేస్తున్నారు. జయగీతాలు ఆలాపిస్తున్నారు. హృదయపూర్వకంగా ఆరాధిస్తున్నారు.

విమల కన్నీరు ఆనందంతో మెరిసింది.

ఇప్పుడు రామకృష్ణ దేశనాయకుడు కావాలని అనుకోవడం మరిచి పోయినాడు. అసలా మాటే జ్ఞాపకంలేదు. ఎంత సేపటికీ - సేవ - త్యాగం. ఇదే ఆనందం!

"మా గుడిసెల్లోనే వుంటాము, మేమూ కూలి పని చేస్తాం. మీ సౌభాగ్యమే మా ఆదర్శం." రామకృష్ణ గర్జించాడు.

"నవజగత్తు నిర్మిద్దాం." ఉప్పెనలాగా వచ్చింది ఆ నినాదం.

విమల హృదయం వికసించింది. ఆమె ప్రత్యక్షంగా 'ఒకనాయకుడి జననాన్ని' చూసింది.

స్కెచ్

# అలకపాన్పు

ఓగేటి శివరామకృష్ణ

వాసు తన పెళ్ళి విషయంలో ఆసక్తి చూపక పోయేసరికి తండ్రి శ్రీమన్నారాయణకూ, తల్లి లక్ష్మీ నరసమ్మకూ ఒక్కసారి మింగోదా మన్నంత కోపం వచ్చింది.

కోపం వస్తేమాత్రం యేం చేస్తారు? అసలు వాసు అప్పటికి యిరవైయేళ్లు నెత్తిమీదకొచ్చినా నాకిప్పుడప్పుడే పెళ్ళి వద్దోయ్ అని మొత్తుకొంటున్నాడు. ఏలాగో తైవాను గ్రహంవల్ల ఆ అమ్మాయిని పెండ్లి చేసుకోడానికి యిష్టపడ్డాడు.

పెండ్లి సంబంధం నిశ్చయమయిన రోజు నుంచీ లక్ష్మీనరసమ్మ కొడుకుతో వీలయినప్పుడల్లా "నాయనా, అలకపాన్పు సమయంలోనే నీకున్న కోరికలు తీర్చుకోవాలి. తరువాత నీకు లభించేది ఉండదు. అదే అదనుగ ఏదో మంచి ఖరీదుగల వస్తువు కోరుకోవాలి. అంతే కాని యేదోవస్తు వన్నానని యేభైరూపాయల రిస్టువాచీమాత్రం కోరకు." అని చెప్పేది. ముందుగానింకా ఆడపిల్లలకు పెండ్లిండ్లు చెయ్యాలి. అవబోయే కొత్త అల్లుళ్ళందరూ తమను అలకపాన్పుమీద తలలువంచి గుంజాటారు అన్న ఉద్దేశం ఆమె మనసులో లేకపోవటంవల్ల. ఈవిధంగానే కాపురంచేస్తున్న శ్యామలా, ఫిఫ్తుఫారం చదువుతున్న తమ్ముడూ కూడా చెప్పారు.

ఎటొచ్చీ చిన్నపిల్లలు సరోజా, చిట్టీ- కొద్దికాలంలో వివాహం చేసుకోబోతున్న మంగా మాత్రం యేమీ అనక, అన్నయ్యచెప్పే జవాబు ఎలా ఉంటుందో అని యెదురుచూచేవారు.

వాసు కదంతా విచిత్రంగా కన్పించింది. అతడు మనస్సును ఆలోచనతో వేధించలేదు. కాని అలకపాన్పుదగ్గర తనకు కావలసిన వస్తువు కోరుకోటం, అటువంటిపు వాళ్లు, అంటే తన కవబోయే మామగారివైపు వాళ్లు, తనకోరిక తీర్చటం ఆచారం అనుకొన్నాడు.

అనుకొన్నట్లుగా వివాహ మయిపోయింది. ఇక అలకపాన్పే తరువాయి.

"ఏదో నాయనా, ఏం అడుగుతావో యిదే సమయం - నీ మామగారు యేమి యివ్వటానికి వాగ్దానంచేసిరా, నువ్వు పుచ్చుకోడానికి ప్రయత్నంచేసినా' అని తన తల్లి తిరిగి పాట ప్రారంభించింది.

'అన్నయ్యా, ఏదయినా చక్కని విలువగల వస్తువును కోరుకోరా, ఇదే సమయం.' అని తల్లికి తోడయింది శ్యామల.

ఇలా అంతా వాసు వైపు చూచి 'యిది కోరు, అదికోరు' అని చెపుతున్నారు.

అయిన కొత్త బావమరది, అప్పుడే మంచం మీద (అదే అలకపాన్పు) కూర్చున్న తన వైపుచూచి - ఏదో కొంచెంగా గంధం, సెంటూ పామి వదలక, ఏకంగా వంటినిండా పులిమేస్తూ 'లేవయ్యా బావగారూ' అని ఒకే వరుస నంటున్నాడు.

తమతో వచ్చిన పురోహితుడు కూడా 'ఆలోచించి చెప్పు. ఈలాంటి అదను యింకోటి లేదు. నువ్వు కోరుకొనేది తప్పక యిచ్చితీరవలసిందే' అంటూ వాసును ఉద్రేకపరుస్తున్నాడు.

"ఏమి కావాలో కోరుకోవోయ్' అంటూ కొత్తమామగారు కూడా తనవైపు ఒక తీక్ష్ణమైన చూపు చూశాడు.

"నాయనా- అవతల ఇని దిగడింది- తొందరగా లేవల్చాలి."అంటున్నాడు ఆడపెండ్లివారి పురోహితుడు.

అంతా అలా తలోవిధంగా చెపుతున్నప్పటికీ వాసు మనస్సు మాత్రం వేరేవిధంగా నడుస్తోంది. అంతా తన్ను 'యిది కోరు', 'అది కోరు' అని చెపుతున్నారు. అవును, కోరాలి. శ్యామల పెం

ట్లో! అలక పాన్పు వద్ద తన బావను తనెంత బలవంతపెట్టాడు! మొత్తంమీద బావమరది తప్పక యిస్తారన్న వాగ్దానం ముందు పుచ్చుకొని రేడియో గ్రామఫోను కోరాడు. రేడియో గ్రామఫోనుకు దగ్గర దగ్గరగా నాలుగు వందలు ఖర్చుపెట్టి యివ్వటానికి వాళ్ళ యెంత బాధపడ్డారో కళ్ళారా చూచిన తనకు తెలుసు! ఇప్పుడు తాను వారిని ఏదో ఒక విలువ గల వస్తువును కోరితే తిరిగి సమయ మొచ్చినప్పుడు తన్ను అవతల బావమరదులు కోరకుండా ఉంటారా?

ఈ విధంగా అతని మనసు యుద్ధం చేస్తోంది. చూడ్డానికి వచ్చిన 'వాళ్ళంతా అల్లుడుగారికి చాలా కోపం వచ్చినట్లుంది- పాన్పు దిగటం లేదు' అంటున్నారు. అంతవరకూ గంధం పామటంవల్ల చేతులు నొప్పి పెట్టాయేమో బావమరిది సర్దుకొని 'ఏం కావాలో కోరుకోవయ్యా' అంటున్నాడు.

'ఏయ్, జవాబు చెప్పేదాకా పానుపులోనే ఉండు' అంటూ యెవరో అధికార స్వరంతో బావమరిదితో అన్నారు. బావమరిది తిరిగి తన పని చేస్తున్నాడు. వాసు కిదంతా సహించటానికి శక్యం కాకుండానే ఉంది. కాని తాను యేదో ఒక జవాబు చెప్పేదాకా బావమరది వదల్డు- ఏం చెప్పటం?

'సైకిలు అడగరా—' అంటోంది శ్యామల, వాసుకు అసలు యేం కోరుకోవలసింది ఆలోచన తెగలేదనే ఉద్దేశంతో—

'రేడియో గ్రామఫోను కోరుకోవోయ్—' అన్నాడు పెండ్లిచూడ్డానికి వచ్చిన ప్రాణస్నేహితుడు.

'మంచి ఖరీదయిన రిస్టువాచి అడుగు' అంటున్నాడు తన తాలూకు మనిషి ఒకాయన.

'ఏ మడిగినా సరే—కోరే వస్తువు నాలుగు మూడు వందలు కిమ్మత్తు చెయ్యాలి' అంటోంది ఒళ్ళువాచిన శ్యామల (శ్యామల మొగుడు దగ్గర దగ్గరగా 'ల' కారాని కధికారి లెండి.)

'ఏదో పెద్ద వస్తు వడుగు'- అంటోంది తల్లి యిదివరకు తాను చెప్పిన మాటలన్నీ తనకు నెమరు వేసి స్ఫురణకు తెస్తున్నట్లుగా.

'ఏమిటోయ్ నాయనా- అవతల టయిమయిపోతోంది' అంటున్నారు మామగారు తిరిగి.

'తొందరగా చెప్పవోయ్ బావా' అంటున్నాడు బావమరది.

'ఊ—చెప్పూ' అంటోంది తల్లి!

వాసు కింకా జవాబు దొరకలేదు! పాపం అతని మనస్సు యెందుకో బాధ పడుతోంది. దూరంగా తన చిట్టి చెల్లెలు 'మంగ' కన్పిస్తోంది. కొద్ది కాలంలో మంగకు వివాహం చెయ్యాలి. బోలెడు డబ్బు కావాలి. అప్పటికే తమ ఆస్తి అంతా సన్నగిలి పోయింది. ఆమె వివాహ సమయంలో తండ్రి యిలాంటి యెన్నిటికి జవాబు చెప్పవలసివస్తుందో! పాపం, వాసు మనస్సు మనస్సులో లేదు!

'ఏమోయ్!'

ఇంకా జవాబు వాసునుంచి రాలేదుకాని 'ఎందుకిదంతా' అని మాత్రం అనకలిగాడు.

'ఏదో సరదా. దానికేంగాని ముందు—' అన్నా రెవరో.

'ఆ - ఏదో మీకు తోచింది' అంటూ లేవబోయాడు వాసు.

మామగారూ, పురోహితుడూ, బావమరదీ తేలిగ్గా తెమిలిపోయిందని ఒకరివంక ఒకరు చూసుకొంటున్నారు.

'ఆ లేవకు, ఏం కావాలో అడిగి మరీకదులు' అంటున్నా రెవరో; వాసు తిరిగి కూర్చోక తప్పింది కాదు.

ఇంక రహస్యంగా కూర్చుంటే అనవసరంగా సమయం దాటిస్తున్నా డన్న ఉద్దేశం చేత కాబోలు 'ఒరే అబ్బీ అల్లా కాదు—ఏదో ఖరీదు గల వస్తువును కోరు కోవాలి కాని అల్లా చెప్పితే యెల్లాగ! ఏం కోరుకుంటావో మీ మామగార్ని పిల్చి చెయ్యాలి'', అంది నవ్వుతూ తల్లి.

ఈ సారి వాసులో ఓర్పు తక్కువయిపోయింది.

''ఏడిసి నట్లేవుంది. ఇవాళ మనం యీ విధంగా కోరి వాళ్ళ నేడిపిస్తే రేపు యిల్లాగే నిన్ను వాళ్ళేడిపిస్తారు. ఆ కోరికకు ఒక హద్దు ఉండాలి. వాళ్ళకు తోచినది వాళ్ళేయిస్తారు. నీకేం బుద్ధిలేదు'' ఈ విధంగా అంటూ అలక పాన్పు మీంచి లేచిపోయాడు వాసు. రెండు వైపుల వాళ్ళూ తెల్లపోయి చూస్తున్నారు.

# పెండ్లి ముందా, ప్రేమ ముందా ?

జోశ్యుల సూర్యనారాయణమూర్తి

చాలా కాలంనుంచి దినపత్రికలలోను, వారపత్రికలలోను ప్రచురింపబడి ఒక వాదము వ్యర్థంగా పెరుగుతోంది. పెండ్లి ప్రేమించి చేసుకోవాలని; అల్లా సాగదనీని. కాని ఒక నిర్ణయానికి వచ్చినట్టు తోచదు. వచ్చే విషయం కాదనికూడా తేలుతోంది.

"పూర్వులు ఏదో అనుకొని చెడగొట్టారు, మనం ఊరక బాధపడుతున్నాం సంఘ సంస్కారం చేసి" అనుకో నక్కరలేదు సరికదా, "పూర్వులే మెఱుగు మనం పాడయి పోతున్నాం" అని అనుకోటంకూడా శుద్ధ భ్రాంతనమే.

పెండ్లి అనేది అనశ్వరమైన ఉత్తమ సంస్థ అనే ఉద్దేశ్యంతో ప్రారంభమైంది. అది మనం కూడా ఒప్పుకుంటున్నామనే అనాలి. ఇక దాంపత్య జీవనములలో వచ్చే విఘాతాదులు చూచి మనం పెండ్లి చేయటంలో కలిగిన తప్పు కోసం వెదుకుతున్నాం.

పూర్వులు అది ఒక తప్పుగా కాక వాళ్ళ కర్మం అనేవారేమో? పైగా "నూరు కల్లలాడి ఒక పెళ్ళి చెయ్యాలి" అని విశ్వసించేవాళ్లు. మొదటిది వాళ్ళ తెలివి తక్కువ. దానికి కారణము రెండవసూత్రం. ఒకప్పుడు రెండవనీతికి మొదటిమాట (ఆ తర్వాత వాళ్ళకర్మం) వ్యాఖ్యగా ఉండేది. ఇది కొంతమంది పూర్వులనే అనాలి గాని అందరినీ అనలేం కదా! సంప్రదాయం చూచి నడిపడిన సంబంధాలతో సంతోషించిన సత్పురుషులు లేరా! ఒకటి కాకపోయినా కొన్ని కట్టుబాట్లతో ఉన్న మన సాంఘిక వ్యవస్థ ఉద్దేశ్య దృష్టిలో చాలా మంచిదని ఒప్పుకోక తప్పదు. ఆచరణ దృష్టిలో మన సంఘమంత పాడు సంఘం కనిపించదు. సమయానుకూలమైన అపవాదశాస్త్రాలు పుట్టి సాంఘిక సదుద్దేశాలకే దుష్కీర్తి తెచ్చిపెట్టాయి.

ఇప్పుడు విచ్చలవిడి ఎక్కువైంది. విద్యార్థి వృద్ధి కలుగుతోంది. అది వర్తక సిద్ధాంతాల మీద సాగుతోంది. బ్రిటిషు సాంగత్య సంజాత సమ్మోహాలలో ఇదికూడా ఒకటే గదా!

అందుచేత సర్వవిషయాలు- అవర్ణ్యాలు తెలుసుకోటానికి టైము వినియోగించలేక విద్యార్థులు తమకు కలిగిన కామోద్రేకాలకు సగం సగం తెలిసిన విషయాలతో లంకెపెట్టి నిర్వచనాలు, సిద్ధాంతాలు సృష్టిస్తున్నారు. వాళ్ళకి తాళం వేసి పెద్దవాళ్లు - "ప్రేమించుకొన్నారు, పెళ్ళి చేసుకొంటున్నారు" అని తమ సాంఘిక సంస్కృతీ దృక్పథం ప్రకటిస్తారు యశస్కాములై.

అసలు ప్రేమించుకోవటం ఏమిటి? ప్రేమ ఎప్పుడు కలుగుతుంది? ఎందుకు కలుగుతుంది? అది అంటే యేమిటి? - తల్లికి పిల్లమీద పిల్లకి తల్లిమీద ప్రేమ ఉంది. అదే యితరులలో ఉండేది స్నేహమవుతుంది. స్నేహమంటే ఆర్ద్రత్వం- మనస్సు దయవల్ల గాని, కరుణవల్ల గాని, సన్నిహితత్వం మొదలైన ఇతర కారణాలవల్ల గాని ద్రవిస్తుంది- అదే కరగటం, దానినే ఆర్ద్రత్వం అంటాము అది చూడటానికి కనిపించదు. అది ముదిరితే నిష్కామంగా, నిష్ప్రయోజనంగా వర్ధిల్లిన రూపం ప్రేమ అనిపించుకుంటుంది. దాని అభివ్యక్తి సుస్పష్టం కాకపోవటమే కాకుండా చేష్టావ్యవగతమై నిర్ధారితమయ్యేది కూడా ఒకొకప్పుడు దుష్పరిణామాన్ని పొందిస్తుంది. అదే రాజరాజనరేంద్రాదులకు చిత్రాంగ్యాదులమీద ఉండేది, కైకేయిమీద దశరథుని కుండేదీని. అదీ ప్రేమే? కాని ఒక రహస్యం— చిత్రాంగికి సారంగధరుని మీద ప్రేమ ఉంది గదా! అది ప్రేమేనా? జాగ్రత్తగా అర్థం చేసుకొంటే అదీ ప్రేమకాదు. అదే అసలైన కామం. కాని మొదట్లో అతనికి చేస్తే ఎలా ఉండేదో అంటే బాగానే ఉండేది. కాని అది ప్రేమించి

చేసుకొన్న పెళ్లి అంటానికి వీల్లేదు. నచ్చాడు, చేసుకుంది. ఏబాధా లేదు. సంసారం బాగుంది. అంతే. క్రమక్రమంగా వాళ్ళ ఉభయుల శీల వ్యసనాలు పరస్పరం నచ్చితే, ఏకమైతే వాళ్ళలో ప్రేమను కాలాంతరాలు పుట్టిస్తాయి. అది స్థాయీభావాన్ని పొంది రససిద్ధి కలుగవచ్చు. అప్పుడు సంపూర్ణ స్వరూపం ప్రేమకు ఏర్పడిందనుకోవాలి. అట్లాంటి ప్రేమ (ఎవరికైనా) మొదట్లోనే ఏర్పడ్డాక, ఆతర్వాత పెండ్లి చెయ్యాలనటం శుద్ధ బుద్ధిహీనత.

'సమాన శీలవ్యసనేషు సఖ్యం' అనే సూక్తికి నిదర్శనాలు చాలా మనకి కనిపిస్తున్నాయి. అదే దాంపత్యం విషయంలో కూడా అంగీకరించవలసిందే. 'మరి సమానమైన శీలవ్యసనాలున్నాయా లేదా ఆ నూతనదంపతులకు?' అనే సంగతి చూడవలసింది తల్లిదండ్రులే గాని వాళ్లు కాదు—వాళ్ళు చూచుకుంటున్నారు. వాళ్ళు చూచుకోనీలోగా వాళ్ళ పరస్పర సన్నిహితత్వం ఎట్లా ఉంటుంది అంటే నిప్పుదగ్గఱ వెన్న పెట్టినట్టుంది. (ఒకళ్ళు కొకళ్లు నిప్పు - యిద్దరూ వెన్నలే) దానివల్ల సంజాతమయ్యేది కామం. దానికి వాళ్ళు పెట్టేపేరు ప్రేమ. అదే మనమూ అనటం క్షమించరానిది. ఈమాదిరి తెలివితక్కువ వ్యాఖ్యలే కొంపలుముంచి సంసారాలు తగలేస్తున్నాయి. స్నేహము వృద్ధిపొంది, నిష్కామరూపంలో గాని ప్రేమ ఏర్పడదు గదా! ఇది మరిచిపోగూడదు. అందుచేత సరియైన ప్రేమ ఎక్కడైనా ఉందేమో దాంపత్యంలో అని వెదికితే అది దొరికితే వృద్ధదంపతులలో దొరకాలి. వాళ్లకి స్వప్రయోజనదృష్టి నశించింది. ఇది సత్యం- లేదా పరస్పరం త్యాగశీలురైన కొందరిలో. అదైనా మొదట కాదు.

"మొదలు చూచిన కడుగొప్ప పిదప కురుచ
ఆది కొంచెము తర్వాత నధిక మగుచు
దనరు, దినపూర్వ పరభాగ జనితమైన
ఛాయపోలిక కుజన సజ్జనుల మైత్రి"

ఈపద్యం జాగ్రత్తగా పరిశీలిస్తే అసలు సంగతి బయట బడుతుంది. ఇంతకీ ప్రేమకు పూర్వ రూపం స్నేహమని ఒప్పుకొంటేనే. స్నేహం పెరిగికదా ప్రేమ కలుగుతుంది? అట్లాంటప్పుడు కొద్దికాలంలో కలిగిన స్నేహమే చిరకాలం ఉండదంటే ప్రేమ నిలుస్తుందీ అసలే పుట్టనిది?

పెండ్లి వేరు-ప్రేమ వేరు.

ప్రేమకలిగి సుఖంగా ఉండే దాంపత్యం ఏర్పరచాలంటే పెద్దలే చెయ్యాలి ఒకపని. అది ఇది—

తమ పిల్లవాడుగాని, పిల్లగాని ఎట్లాంటి అలవాట్లు కలిగిఉన్నారో కనిపెట్టి అట్లాంటి అలవాట్లుగల పిల్లని గాని, పిల్లవానిని గాని ఎన్నుకోటానికి హృదయపూర్వకంగా ఎక్కువగా పరిశ్రమ చెయ్యాలి. ఇందులో విజ్ఞత చూపితే వ్యాఖ్య లక్కఱలేదు.

'కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతం" అనే సూక్తిలో చివరది అంతరించింది. మిగిలిన రెంటికి ప్రాధాన్య మివ్వబడుతోంది. అందే కొంపకల్లరి. ప్రేమ నిష్కామం, నిష్కల్మషం కదా! ఇది దాంపత్యంలో ఎలాగ? అన్నంత అనలేము. ఆమాటకి వస్తే తల్లిపిల్లని ప్రేమించటం,పుత్రుడు తండ్రిని ప్రేమించటంగూడ స్వప్రయోజనానికే. కాని దీనికంటె భిన్నం. కనుక అసలు ఒక పుత్రుడో పుత్రికో కలిగిన తరువాత సమానమైన ప్రేమ అటు మాతాపితరులకి ఏర్పడుతుంది. ఆ సంతతి సంసక్తమైన చిత్తశుద్ధి గల ప్రేమను పురస్కరించుకొని భార్యాభర్తలు పరస్పరం ప్రేమ ప్రవర్తిల్ల జేసుకొంటారు. అందుచేత ఆప్రేమ మొదటకలిగిందనుకోక, చక్కటి అనుకూలమైన దంపతులను ఏర్పఱచటంలో పెద్దలు చాకచక్యం చూపిస్తే (కట్నాలకోసం కాట్లాడక) ఈసమస్య సమస్యే లేనిదౌతుంది. అప్పటికీ చెడితే విడిపోవలసిందే దాంపత్యం.

'విప్రియమాప్యె నకల్పంతే సంబంధాః
సహృష్ఠితాః' అని కాళిదాస వచనము. మంచి వాళ్ళు కుదిర్చిన సంబంధాలు విచ్ఛేదమును పొందవు (చెడవు) అని తాత్పర్యం. ఇందుకు సత్పురుషులు తక్కువవున్నారు. కనుక హృదయాలు గల పిల్లలని పెద్దలు పరిశీలించక పాడుచేస్తే పైగా సఘసంస్కర్తలమని గొప్పలు విరుచుకోటం జరుగుతున్నట్టు తోస్తోంది. మరి ఎప్పటికైనా వివాహ సంస్థ బాగుపడుతుందో లేదో.

(౩వ పేజీ నుండి)

ప్రాముఖ్యం యిస్తున్నారు. ప్రజల అసంతృప్తికి కారణాలను అవగాహన చేసుకొని దానిని తొలగించటానికి బదులు తమ ప్రవర్తనను సమర్థించుకొనే తంటాలు పడుతున్నారు. నెహ్రూగారి కలకత్తా ఉపన్యాసం కూడా యీ ధోరణిలోనే ఉంది. ప్రజలు ప్రభుత్వంపై బాధ్యతారహిత ఆరోపణలు చేస్తున్నారంటూ యీ అలజడి అంతటికీ కమ్యూనిస్టుల ప్రచారమే కారణమని నిందించారు. కాని యీ కమ్యూనిస్టు అలజడికి అనువైన పరిస్థితులను ప్రభుత్వమే సృష్టించారన్న సంగతిని నెహ్రూగారు విస్మరించారు. ఇట్టి ఆత్మవంచన వల్ల కలిగే లాభమేమీ లేదు. కాంగ్రెస్‌వారు ఆత్మవంచన మాని ఆత్మపరీక్షకు పూనుకోవాలి. తమ పాలనలో ప్రజలకు కలుగుతున్న కష్టాలను తొలగించటానికి చిత్తశుద్ధితో ప్రయత్నించాలి. ప్రజల కష్టనష్టాలన్నీ ఒక్కరోజులో యెవ్వరూ తొలగించలేరు. అయితే తమ యిబ్బందులను తొలగించటానికి ప్రభుత్వం నిజాగా కృషి చేస్తున్నదని ప్రజలకు నమ్మకం కలగాలి. అట్టి నమ్మకం కలిగిననాడు యెన్ని బాధలైనా సహించి ప్రభుత్వానికి ఆసరాగా నిలబడగలరు. దురదృష్టవశాత్తు నేడు కాంగ్రెసు ప్రభుత్వంపై విశ్వాసం పూర్తిగా పోయింది. ప్రజలు ప్రభుత్వంతో సహకరించాలంటారు నెహ్రూగారు. కాని యిప్పుడు యథార్థంగా ప్రభుత్వమే ప్రజలతో సహకరించవలసి ఉంది.

ఏమైనా అధికార రాజకీయాలలో మునిగి తేలుతున్నవారెవరూ [illegible] చేయలేరు. ఎంత నీతివంతమైన సిద్ధాంతాలతో బయలుదేరినా అధికార వ్యామోహనకై జరిగే పోరాటంలో అది నీతికి, సూత్రాలకు దూరంకాక తప్పదు. అందువలననే రాజకీయాలలో నీతిని పాటించవలసిన అవసరంలేదనే అభిప్రాయం ప్రబలిపోయింది. అధికారం సంపాదనానంతరం కూడా తమ పదవులను నిలబెట్టుకొన తిరిగి [illegible], కుయుక్తులను ఉపయోగించవలసి ఉంటుంది. పార్టీ రాజకీయాలలో దిగినవారిలో నీతివంతులు బహు అరుదు. ఎన్నికలలో నీతివంతులనే పార్టీ అభ్యర్థులుగా నిలబెట్టాలనే ప్రయత్నం కూడా నెరవేరడం కష్టమయిపోయింది. అభ్యర్థులను నియమించేముందు అనేక విషయాలు ఆలోచించాలి. బాగా డబ్బు ఖర్చుపెట్టగలవారు, తిమ్మిని బ్రహ్మిని బ్రహ్మిని తిమ్మిని చేయగలవారు మాత్రమే జయం పొందగలుగుతున్నారు. కాబట్టి యెంత నీతివంతుడైనా, త్యాగియైనా పై యోగ్యతలు లేనివాడు నేటి రాజకీయరంగంలో అయోగ్యుడే!

ఈ విషమస్థితి తప్పాలంటే నేటి రాజకీయాల స్వభావంలోనే మార్పు తీసుకురావాలి. రాజకీయ కార్యక్రమాలకు నీతి ప్రాతిపదిక కావాలి. రాజకీయ కార్యక్రమమంటే కపట నాటకమనే అపోహ పోవాలి. పార్టీ రాజకీయాలకు అతీతులైనవారు, నైతికప్రమాణం గలవారు ఎన్నుకోబడునట్లు చూడాలి. ఎన్నికలలో అభ్యర్థి యే పార్టీవాడు అనే విషయానికి ప్రాధాన్యం యివ్వక వ్యక్తియొక్క నీతినియమాలకు, నిజాయితీకి ప్రాధాన్యం యివ్వాలి. ఎన్నికలలో పార్టీలు అభ్యర్థులను నిర్ణయించటానికి మారు ప్రజలే తమ మధ్యనుంచి తమకు పూర్తిగా విశ్వాసమున్న వ్యక్తిని ఎన్నుకొనే అవకాశం కలిగించాలి. దీనివలన ప్రజలకు తమ భవిష్యత్తు తమ చేతులలోనే ఉన్నదన్న ఆత్మవిశ్వాసం కలుగుతుంది. అట్టి వాతావరణంలో మాత్రమే డెమోక్రసీ బ్రతకగలదు. ప్రతినిధులకు కూడా తాము యేదో ఒకపార్టీ అభ్యర్థులం. ఆ పార్టీకి మాత్రమే బాధ్యులం— అనే అభిప్రాయం పోయి తాము ప్రజలకు బాధ్యులు అనే యథార్థజ్ఞానం కలుగుతుంది. 'మేము కాంగ్రెస్ పార్టీకే బాధ్యులం కాని మీకు బాధ్యులం కామని ప్రజలకు సమాధానమిచ్చే పాలకులు అప్పుడుండరు.



# జీవిత ప్రమాణము : వంశ ప్రభావము

యన్. సత్యనారాయణరావు

వివేకానందస్వామి కర్మయోగములో వ్యక్తి యొక్క జీవితము పూర్వజన్మలలో చేసిన కర్మను బట్టి ఆధారపడి ఉంటుంది కాని, వంశ ప్రభావము ఏమీ లేదన్నాడు. మత ప్రవక్తల ఆధ్యాత్మిక ఔన్నత్యానికీ వారి తల్లిదండ్రుల స్వభావమునకు సంబంధము లేకపోవుట ఉదాహరణగా సూచించాడు. ఉపనిషత్తులు, గీత, ఇతర మత గ్రంథాలు కూడ పూర్వజన్మల ప్రభావము ఈ జన్మమీద సూచిస్తూ, అందువలన ఈ జన్మలో సుకర్మ చేయవలసిన అవశ్యకత బోధించాయి. క్రిందటి జన్మలో చేసిన పాప పుణ్యాల ననుభవించడమే ఈ జన్మ అన్న దృష్టిని ఖండించారు అరవిందులు. ఆత్మ వికాసమే పునర్జన్మ అంతరార్థమని 'దివ్య జీవనము' లో వ్రాశారు. వంశ ప్రభావము అనేదే 'సాక్షి' కి ఒట్టు మందుగాని వచ్చింది. హిందూ రక్తములో పుట్టుక దగ్గరనుంచి చావు వరకు పూర్వజన్మకృత కర్మ కారణమన్న దృష్టి జీర్ణించింది. ప్రతి వ్యక్తికి ఆత్మ ఒకటి వుందని, దేహము యొక్క ప్రభావము ఆత్మమీద ఏమీ లేదని; తల్లిదండ్రులు, ప్రకృతి వ్యక్తిత్వమునకు కొంతవరకు కారణమైనా, ఎంత చిన్న విషయంలోనైనా వారి ప్రసక్తి ఏమీ లేదని దృఢంగా నాటుకొని పోయింది. ఎక్కడ, ఎందుకు, ఎప్పుడు పుట్టాలో ఆత్మ (అంటే పూర్వజన్మ) నిర్ణయిస్తుంది. ఆరోగ్యంగా, ఆనందంగా జీవితం గడుపుట ఆత్మ నిర్ణయిస్తుంది. అఖరికి ఆత్మ భగవదంశ కాబట్టి ఇదంతా భగవంతుని లీల, ఆనందం అనే కాని ఈ ప్రపంచంతో నిమిత్తం లేదని తేలుతుంది.

జనన మరణాలలో జననం పోర్టుఫోలియో విశ్వకర్మ చేతులలోంచి తల్లిదండ్రుల ఇష్టంలోకి వచ్చింది. వ్యక్తి పుట్టుకయే అతని కర్మమీద కాక పోతే ఇతర జీవితాంశముల సంగతి చెప్పేదేముంది? ఆత్మ వికాసమే జనన మరణాల మూలరహస్యం అంటే నాలుగైదేళ్ల బ్రతికి చనిపోయినవారి సంగతి అటుండనిచ్చి గర్భంలోనే మరణించే వారి ఆత్మలు ఏమి వికాసము పొందాయి అనే సందేహం కలుగక మానదు. జ్ఞానానికి కర్మ ప్రధానం కదా, ఏం కర్మ చేసి జ్ఞానం గ్రహించాయి ఈ ఆత్మలు? వారు ఎందుకు చనిపోవలసి వచ్చిందో అనేది కూడా రహస్యం కాదు. మనము, మన కర్మ, మన వాతావరణాలు కారణాలు. ఐతే ఆత్మ దేహాన్ని ఎప్పుడు విసర్జిస్తుంది అంటే అది పూర్వజన్మలో చేసిన కర్మమీద ఆధారపడి వుంటుందని భావిస్తుంది మతం. భౌతిక సూత్రాలు ఆత్మను వర్తించవు. గామా లాంటివారు గభీమని అంతర్ధానం అవుతారు. కాని పదిహేను రోజుల కొకసారి భోజనం చేస్తూ నారపేగులా జబ్బుల [illegible] జీవితం గడుపుతారు కొందరు. సర్వసంపద లుండి సుఖం లేకుండా కొంత మంది ఉంటుంటే నిరుపేదలైనా తాపత్రయం లేకుండా జీవితం గడుపుతారు కొందరు. భౌతిక సూత్రాలు వీటిని ఎట్లా సమన్వయం చేస్తాయని ఎగతాళి చేస్తారు మతాధికారులు. జీవితంలో జబ్బు ఎందుకు రావాలి, మనకి మరణం ఎప్పుడు సంప్రాప్తిస్తుందన్న విషయాల మనకు ఊహాతీతమైన ఆత్మ కాక, వంశప్రభావము (Heredity) అని చెప్పవచ్చును. భగవంతుడు ఈ విషయాలలో బయటపడడు. భగవంతుని లాగుకొనిరాకుండా విశ్వనిర్మాణపద్ధతిని విజ్ఞానంతో ఈనాడు కాకపోయినా ముమ్ముందు చెప్పగలము. మానవుడికి జననంకంటె మరణం అంటేనే ఎక్కువ తాపత్రయం. జీవితప్రమాణము మన ఊహాతీతమైన ఆత్మ, పరమాత్మ, పూర్వజన్మలమీద కాక చాలవరకు మన తల్లిదండ్రులమీద ఆధారపడి ఉన్నది. తల్లిదండ్రులు సంతతి కిచ్చేది వంశపారంపర్యంగా వచ్చే గుణాల సంపద. వ్యక్తియొక్క పెరుగుదల, ఆకారము, ఆరోగ్యం, తెలివి మొదలగునవి దానిమీద ఆధారపడి ఉన్నవి. మానవుల జీవితప్రమాణంమీద పరిశోధన

జంతువృక్షాలమీద పరిశోధనలే గాక అనేక యిబ్బందులతో నిండిఉంది. సంతతి కలుగుట పరిశోధకుడి యిష్టాయిష్టాలమీద ఆధారపడి ఉండదు. చెట్టుచేమలమీద పరిశోధనలు మానవునికి అనువర్తింపజేయడానికి- అభ్యంతరాలు కన్పరచవచ్చు. పరిణామంలో మానవుని స్థానము విశిష్టము, అత్యున్నతమైనది అని అనవచ్చు. కవలల మీద పరిశోధనలు కొంతవరకు జీవితము మీద జీనుల (gene) ప్రభావాన్ని సమర్థిస్తాయి. కవలలు రెండువిధాలుగా ఉద్భవించవచ్చు. ఒకే అండము పిండముగా మారి రెండుగా చీలి ఎదగవచ్చు; లేదా రెండు అండాలనుంచి పెరగవచ్చు. మొదటి తరగతిలో ఇద్దరూ స్వభావంలోను, మొత్తంలోను ఒకే రకమైన జీనులు కలిగి ఉంటారు. రెండవతరగతిలో భేదా లుంటాయి. అందువలన ఈ రెండు విధములైన కవలల జతలను పోల్చిన జీనుల ప్రభావము తెలగలము. మొదటి తరగతియందు జీనులు ఒకటే అవడంవలన ఇద్దరి రూప, గుణ, ఆయుర్దాయాలు ఒకేలాగున, ఒక పరిమితిలో ఉండాలి. రెండవ రకములో అట్లుండకూడదు.

కాల్‌మన్, సాండర్ అనే యిద్దరు విజ్ఞానవేత్తల మూడు సంవత్సరాల కృషి ఫలితంగా తేలిన అంశము లివి: వీరు కవలల చేరదంలో అందుబాటులో వున్న, మధ్య వయస్సుదాటిన వారిని మాత్రమే ఏరారు. ఆయుఃప్రమాణంలో కవలలకు, సాధారణ మనుష్యులకు భేదమున్నట్టు కన్పడదు. కావున వారిమీద పరిశోధనలు సాధారణ మానవులకు వర్తించును. మొత్తం 933 జతల కవలలలో, 431 జతలలో ఇద్దరూ బ్రతికి వున్నారు. కవలలలో 697 మంది మగవారు, 905 మంది ఆడవారు. ఇంకా ఈ ప్రపంచం పురుష సామ్రాజ్యమే అనడానికి వీలులేదు. ఇందలి ఆయుఃప్రమాణాలనుబట్టి అంతిమ నిర్ణయానికి రావడానికి వీలులేదు. ఎందుచేతనంటే అరవై ఏళ్లు దాటి సహజంగా చనిపోయినవారు 58 జతలు మాత్రమే ఉన్నారు. అయినా ఈ పరిశోధనబట్టి తేలేది ఒక అండమునుంచి పెరిగిన కవలలు సగటున ఒకరి కొకరు 3 సంవత్సరాల వ్యత్యాసములో చనిపోతే, రెండు అండాలనుంచి పెరిగినవారి మధ్య 6½ సంవత్సరాలు తేడా ఉంది. ఇది లెక్కలు బట్టి పరిశీలించిన, జీవిత ప్రమాణము "జీను"ల మీద ఆధారపడి ఉంటుందని తేలుతుంది. రెండు అండాలనుంచి పెరిగి, గతించినవారి మధ్య మూడుమాసాలకు తక్కువ వ్యత్యాసము లేదు. కాని ఒక అండమునుంచి పెరిగినవారిలో ఒకజత 86 వ యేట ఒకే కారణం వలన, ఒకేరోజున సహజంగా చనిపోయారు. ఇక రెండు జతలలో 85 ఏళ్ళని ఒకటి, 69 ఏళ్ళని ఇంకొకటి కవలలు 25 రోజుల వ్యత్యాసములో చనిపోయేరు. ఇందులో ఒకటి వింత అయినది. ఈ కవల చెల్లెళ్ళలో ఒకతె ఒక రైతును పెండ్లిచేసికొని పెద్దకుటుంబాన్ని చూసుకొంటోంది. ఇంకొకతె అవివాహితయై బట్టలు కుట్టుకుంటూ జీవించేది. ఇలా జీవితములో మార్పులున్నా ఇద్దరూ ఒక్క మాసంలోనే గ్రుడ్డి, చెవిటివారయ్యారు, ఒకేజబ్బుతో చనిపోయారు. ఆయుర్దాయం విషయంలోనే కాక వయస్సుతో వచ్చే మార్పులన్నీ ఒక అండంనుంచి పెరిగిన వారిలో సమానంగా ప్రతిఫలిస్తాయి. అదే రెండు అండాల నుంచి పెరిగిన వారిలో అంతగా కన్పడదు. వార్ధక్యంలో ఉండే సత్తువ, వచ్చే నిస్సత్తువ, జుట్టు తెల్లబడుట, బట్టతల, మొహాము ముడతలు, పండు ఊడడం, కండ్లవ్యాధుల దగ్గఱనుంచి అన్నిట్లలో పోలిఉంటాయి. ఒక కేసు కవలలో ఒకడు వివాహితుడై పసువుల్ని కాస్తూ ఉండేవాడు. చాలకాలం అనంతరం ఇద్దరూ కలుసుకున్నప్పుడు ఒకే పోలికగావుండి, బట్టతల మీద సమానంగా ఒకేరీతిని జుట్టువుంది. వాతావరణము మార్పుకలిగించే అవకాశము న్నా, ఈ కవలలు ఒకే విధంగా ఉన్నారు. మానసిక పరిశోధనల వలన తేలినది ఒక అండంనుంచి పెరిగినవారి మధ్య తెలివి వ్యత్యాసము రెండవతరగతి యందున్నంత లేదు. కాని సంతానం విషయంలో ఈ పోలిక వర్తించలేదు. దీనికి కారణము మానసికం. కవల భర్తలిద్దరూ అన్యోన్యంగా ఉండడం భార్యలకు యీర్ష్యగా ఉండడం, సహజం.

ఈ విధమయిన పరిశోధనలు మనకు తెలియక పోయినప్పటికీ వాడుకలో కవలపిల్లలకు ఏమివచ్చినా ఒకేసారి వచ్చునని చాల మందికి

తెలియును. కళావేత్తలందరూ పుట్టుకతోనే అయారుకాని కళాశాలలు వారిని తయారు చేయ లేదు. శ్రీరామకృష్ణ, గాంధీ, రమణ మహర్షులు పుట్టుకతోనే సిద్ధులు. వారు మనో నిగ్రహం గురించి ఎంతో బోధించినా వ్యక్తి యొక్క జెనెటిక్ మేకప్ ఎవరూ మార్చలేరు. అందుకనే చాలమంది తాము భగవంతుని నమ్మినా, అందుకై వలసినంత కృషి చేయలేక పోతున్నామని ఏకరువు పెట్టుకుంటారు. మహా ప్రవక్తల స్థితికి వారి పూర్వ జన్మల కృషి అని చెప్పే కారణాల కంటె వారి జీనులని, లేదా 'మ్యుటేషన్' అంటే ఎక్కువ సహేతుకంగా ఉండునేమో! విశేష ప్రజ్ఞావంతుడైనా, సాధారణ వ్యక్తియైనా ప్రజ్ఞకు, వ్యక్తిత్వము నకు జీనులే ఆధారములు. పుట్టుకతో వచ్చినవి పుల్లలతో గాని పోవన్న సామెత అందుకనే అయి వుండవచ్చు. ఈ దృష్టితో చూస్తే విశ్వామిత్రుని కోపస్వభావం విశ్వనాథ సత్యనారాయణగారు చక్కగా చిత్రించారు. ఎన్నివేల యేండ్లు తపస్సుచేసినా కోపాన్ని అణచలేక తపిస్తూనే ఉన్నాడు. వసిష్ఠులవారు బ్రహ్మర్షి అని మానసిక శాస్త్రవేత్తలా ప్రయోగించారు. అయినా విశ్వామిత్రుడు మారి ఉండడు.

భగవంతుని నిరూపించుటకొఱకు నిదర్శనాలు చూపించుట మన అజ్ఞానాన్ని ప్రదర్శించుకోవడమే. నిదర్శనాలు వెదకడంలో ఆస్తికత్వానికి హానిచేస్తున్నాం. ఉపనిషత్తులు ఘోషించినట్లు బ్రహ్మకు నామ, రూప, గుణ విశిష్టాదులు లేవని, మన సంకుచితమైన మనస్సుతో వర్ణించుట,నిరూపించుట అసాధ్యమని గ్రహించుట ఉత్తమం.

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

### సబ్సిడీ బావులు

ఈ సారి ప్రభుత్వం ఏప్రెలు మాసంలో చాలామంది రైతులకు బావులు త్రవ్వేందుకు సబ్సిడీలు మంజూరు చేసింది. ఈ సబ్సిడీలు యెవరికి యిస్తారో, మరెవ్వరికి నిరాకరిస్తారో అన్న సంగతీ, రైతు తాను బావి త్రవ్వగలడో లేడో అన్నదీ ఏప్రెల్ నెలలోనే నిర్ధారణ అయాయి. అదివరకు రైతులు ముందుగా యెట్టి యేర్పాట్లు చేసుకోడానికి గాని అనువైన సావకాశాలు లేవు. అంతేకాక, ఒకేసారి కొన్ని వందల బావులు త్రవ్వడం మొదలుపెట్టడంవల్ల లేబర్ సమస్య అపరిష్కృతంగా జటిలమైనదిగా మారిపోయింది. వీటన్నిటినీ యెదుర్కొని రైతు, తన జీవనాధారానికి ఆయువుపట్టు కాబట్టి, యెన్ని యిబ్బందులున్నా బావులు త్రవ్వడం ప్రారంభించాడు. ఈ యిబ్బందులన్నీ యెదుర్కొని ప్రారంభించేసరికి మే నెలలో కూడా కొన్ని రోజులు గడిచిపోయాయి.

ఇక మే నెల రెండవ వారం నుండి కొద్ది కొద్దిగా వర్షాలు పడ్డం ప్రారంభించాయి. ఏ సమస్యనైతే పరిష్కరించేందుకు ప్రభుత్వం రైతును ప్రోత్సహించి నూతులు త్రవ్వమన్నదో, ఆ సమస్యనే నిష్పాక్షిక దృష్టితో పరిష్కరించేందుకా అన్నట్లు ప్రకృతి కొంత తోడ్పడ్డంతో, ఇక యెవరిదారిన వారు వారి వారి భూములు దున్నేందుకు వారులు పట్టారు. తమ సంవత్సర భుక్తికి జరిగే మార్గం చూసుకున్నందున ఇందులో యెవరిదీ తప్పిదం లేదు. కూలీలకు సైతం చేతి నిండా పని వుండడంచేత బావులు సగంలో నిలిచిపోక తప్పిందికాదు. ఇక ఈమధ్య తీరిక దొరికినప్పుడల్లా త్రవ్వడం మాత్రం ఆపక జరిపిస్తూనే వచ్చారు. ఇలాగ జూన్ నెల వరకు జరిగింది. జూన్ నెల రెండవ వారంలో పూర్తిగా వ్యవసాయానికి కావలసినంత వర్షం పడ్డంతో, ఇటు రైతుకు, అటు కూలీకి కూడా బావి పని చూడడానికి వీలులేక పోయింది.

రైతులంతా చేలను దున్ని చల్లడానికి, మళ్లను దున్నడానికి తమ ఎద్దుకు విరివిలేని కార్యక్రమాన్ని అప్పగించవలసి వచ్చింది. ఈ పరిస్థితిలోనే ముఖ్యంగా చిత్తూరుజిల్లాలో రెండు మూడు సంవత్సరాలుగా పంటలు లేకపోవడంచేత యిటు ఆహారానికి, అటు పశుగ్రాసానికి దేవుళ్లాడవలసి వచ్చింది. కాబట్టి నాగళ్లు రోజుకు ఒక్కపూటే పని చేసినందున మాసం రోజులు పట్టేది రెండుమాసాలు పట్టింది. ఎలాగో కొందరు చేనులు, మరికొందరు మళ్లు, ఇంకా కొందరు రెండున్నూ సాధించగలిగారు.

ఇన్నీ దాటివచ్చేసరికి జూలై వచ్చింది. తీవ్రమైన వర్షాలచేత చెరువులు నిండిపోవడము, కొన్ని తెగిపోవడము, త్రవ్విన బావులుకూడ పూర్తిగా నిండిపోవడం జరిగింది. అయితే చెరువులు నిండినందున రైతులకు యిప్పుడు నారు

ఆగష్టు 11 వ తేది

అన్ని ముఖ్య కేంద్రములలో

జూపిటర్ వారి

న్నియిన్ కాదలి

లేక

తప్పుల తమాషా

ద్భుతమైన హాస్య చిత్రరాజము

మదరాసు, బెజవాడ, రాజమండ్రి,

ల్లూరు, గుంటూరు, తెనాలి, కాకినాడ,

జయనగరం, భీమవరం,

లూరు పట్టణములలోన —

ఇంకను తమిళనాడులోని పట్టణముల

ను విడుదల.

రామనాథ్, శేఖర్ల దే

DAPTED FROM SHAKESPEARES TWELFTH NIGHT....



పోయడము పూర్ప్రతము మొదలగు యింకా మూడున్నరరోజుల పని బాకీ వుంది.

ఈలోగా సెప్టెంబరు నెలలో బావులతనిఖీకై అధికార్లు వచ్చేసరికి అవి పూర్తియై వుండక పోతే సబ్సిడీని వడ్డీతో సహా వాపసుకట్టాల్సి వస్తుంది. చెరువులు భర్తీగా వుండడంతో, బావుల్లోని నీరు తోడేందుకు వి శాము గానీ, కపిల గానీ సరిపోదు. పోగా వాటర్ పంపులచే కూడా సాధ్యపడనట్లు కొన్ని చోట్ల బుజువైంది. చెరువుల్లో నీరు తగ్గేందుకు యింకా రెండు మూడు నెలలు పట్టుతుంది. ఇదికూడా యింకా రాబోవు వర్షాలపై ఆధారపడి ఉంటుంది. సాధారణంగా చెరువుల కిందనే బావులు త్రవ్వి వుండడంచేతను, చెరువుల్లో బావులకంటే యెత్తుగా నీరు వుండడంచేతను యెన్ని ప్రయత్నాలు చేసినా నీరు తరగడంలేదు. నీరు తరిగితే గాని బావి పని పూర్తిఅయే అవకాశాలు లేవు.

కొందరు బావిపని పూర్తిచేసి రాతికట్టడం కట్టవలసినవారు, మరికొందరు రాతికట్టడంకూడా అర్థం పనిచేసినవారు, కొందరు యింకా బావులను త్రవ్వాల్సిందే బాకీవున్నవారు—యిలా పలు విధాలుగావున్నారు. వీరిపనులు పూర్తి అవాలంటే బావిలోనూ, చెరువులోనూ కూడా నీరు తగ్గితే గాని, వీలులేదన్న సంగతి అనుభవవేద్యమే. అంతే కాక ఈ వర్షాలవలన కొన్ని బావులు గడ్డలు పోవడము, కొంతపూడిపోవడము జరిగి వుంటవచ్చు. ఈ మాత్రానికి రైతులు బావిని వదలబోరు. ఇంకెంత డబ్బు ఖర్చు పెట్టాల్సినా బావిపని మాత్రం పూర్తిచేయాలనే ఆసక్తిలేనివారుండరు.

కాబట్టి పై యిబ్బందులు తలచి, ప్రభుత్వం ఏప్రిల్ మాసంలో సబ్సిడీలు పొందిన రైతులందరికీ మరుసటి జనవరి నెలవరకు వాయిదా పొడిగించి, రైతులకు మేలు కలుగ జేయాలి. ఇందుకు గాను పత్రికలు, ప్రజాసంస్థలు, రాష్ట్రకాంగ్రెస్, రాష్ట్ర రైతుకాంగ్రెస్ సంస్థలు ఆందోళన జరిపి రైతుకు తోడ్పడాలి. ప్రభుత్వంకూడా ఈ సమస్యను శ్రద్ధగా హితదృష్టితో పరిశీలించాలి.

రాయల్ పేట      టి. ఆర్. గౌడ్

## మంత్రి తెలుసుకొంటే–

మద్యపాన నిషేధ శాఖామాత్యులు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు జూలై 21 తేదీన పార్వతీపురం వచ్చారు. బహిరంగ సభ అనంతరం తాలూకా కాంగ్రెస్ వర్కర్ల సభ జరిగింది. ఉద్యోగులు తాలూకాలో ధాన్యసేకరణ సందర్భములో చిన్నరైతుల తిండి గింజలు సేకరించుటేగాక, వారిపై తప్పుడుకేసులు సృష్టించి వారంట్లు జారీ చేయుచున్నారని, వందల బస్తాల అదనపు ధాన్యముగల ధనిక భూస్వాములు ధాన్యసేకరణనుండి తప్పించుకొనుచున్నారని, ఈ విషయములో స్థానికోద్యోగులు తమ విధులను విస్మరించడమే గాక పలుచోట్ల అధికార దుర్వినియోగము కూడ జరిగించిరని, లంచగొండి ఉద్యోగులపై ఫిర్యాదులు చేయుచున్నను పైని ఉద్యోగులు తమ తాబేదారులపై అధికపక్షపాతము వహించుచుండుటచే ప్రజలు భీతిల్లుచున్నారని తెలుపుచు, ప్రజల భీతిని పోగొట్టుటకు, కాంగ్రెస్ ప్రతిష్ఠ దెబ్బతినకుండుటకు అనంతపూరు జిల్లాలోవలె కరువుజిల్లాయగు విశాఖజిల్లాలోకూడా ధాన్యసేకరణ వెంటనే రద్దు చేయాలని, లేదా సేకరణ విధానములో జరుగుచున్న లంచగొండితనము, అధికారదుర్వినియోగము వెంటనే అరికట్టబడుటకు శ్రద్ధవహించాలని ఏబదిమంది కాంగ్రెస్ వర్కర్లు మంత్రిగారితో మనవి చేసుకొన్నారు. మంత్రిగారు వెంటనే తగుసహాయము చేయగలనని చెప్పి వెళ్ళినారు. తెల్లవారుసరికి తొమ్మిది మంది రైతులపై ధాన్యసేకరణ సందర్భములో వారంట్లు జారీ చేయబడినవి. ప్రజలు మిక్కిలి భీతిల్లుచున్నారు. కాని ప్రజలకు కల్గిన యిట్టి చేటువలన ప్రభుత్వాల కెంత ముప్పో! జాతీయ సంస్థయగు కాంగ్రెస్ కెంత చేటో? "ప్రజా ప్రతినిధి" బిరుదాంకితులగు కాంగ్రెస్ నాయకులు, మంత్రులు ఆలోచించగోరుచున్నాను.

యం. బాబు పరాంకుశం

లక్ష్మణాపురం

# తెలుగు స్వతంత్ర

## విషయ సూచిక

సంపుటి 2. సంచిక 3.

శుక్రవారం, ఆగస్టు 19, 1949



పుట

# హోమగుండం

చోడవరపు బాబూరావు

హోమజ్వాలలు హోమజ్వాలలు<br>
భగభగమని<br>
భగభగమని<br>
కృశియించిన విశ్వ ప్రేమ<br>
గుండెల్లో మండే మంటలు<br>
విషమించిన విషాద జీవిత<br>
కుసుమంలో స్ఫులింగ బ్రాంతం<br>
'గగనా' న్నంతా మసా చేసే.<br>
తమిస్రాన్ని ప్రజ్వలింప చేసే<br>
ముక్కంటి కంటి<br>
హుతభుక్కు దిక్కు<br>
ఇక్కట్లో మోడు<br>
హితవాక్కు లేదు.

* * *

చేరబోకు నేస్తం<br>
అది<br>
అత్యాశల్నీ<br>
అత్యాచారాల్నీ<br>
అర్థ జీవుల్నీ<br>
అక్రమ ఆక్రమణాల్నీ<br>
భగ్నం చేసే<br>
అగ్ని పర్వతం<br>
చూడబోకు నేస్తం<br>
అది<br>
బాధల్నీ<br>
వ్యథిత గాథల్నీ<br>
శాపాల్నీ<br>
విషాద వీణా గానాల్నీ<br>
సమాధాన్ని<br>
దురాక్రమణాల్నీ<br>
దగ్ధ చేసే బడబాగ్ని !<br>
విడిచెయ్<br>
నీ<br>
విశ్వ ప్రేమాన్ని<br>
సుడిచెయ్<br>
నువ్వు<br>
నమ్మిన నయాన్ని<br>
ఒదిలెయ్<br>
నిన్ను<br>
నమ్మిన ధర్మాన్ని<br>
బూడా చెయ్యనీ<br>
జీవితపు 'క్వాలిటీ'<br>
దుష్కృత్యాలను<br>
నికృష్టాలను<br>
భగభగ మండే హోమజ్వాలలు<br>
కష్టజీవులకు<br>
నష్ట జీవులకు<br>
భగభగ వెలిగే హోమజ్వాలలు.

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-3

ఆగస్టు 19, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

## ఒకే మనస్తత్వం

కరాచీలో ఇండియా హైకమిషనర్ కార్యాలయంపై, భారత స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో జరిగిన దుండగీడుతనం, మన దేశంలోపల కమ్యూనిస్టుల ప్రోద్బల ఫలితంగా అనేకచోట్ల, ముఖ్యంగా తెలుగునాట జరిగిన వ్యతిరేక ప్రదర్శనలు— యీ రెండూ ఒకే రకపు మనస్తత్వం ప్రాతిపదికగా గలవి. కరాచీ సంఘటన ఆకస్మాత్తుగా, తలవని తలంపుగా తాత్కాలికోద్రేకం వల్ల జనించినది కాదు. కుతంత్రం, కుటిలనీతి– వీటిపై నిర్మింపబడ్డ పాకిస్తాన్ స్వరూపాన్ని నిలబెట్టడానికి తాపత్రయాలలో ఒకభాగం మాత్రమే. అడుగడుగునా ఇండియాతో తనకు గల అన్ని వ్యవహారాలలోనూ పాకిస్తాన్ వక్రమార్గమే అనుసరిస్తున్నది. 1948 మే నెలలో ఒడంబడిక జరిగినా, నేటివరకూ ప్రత్తి, జనపనారలను ఇండియాకు రవాణా చెయ్యడానికేదో సాకులు చెపుతూనే ఉన్నది. శరణార్థుల ఆస్తిపాస్తుల విషయంలో భారతదేశ నాయకుల సహనశక్తి ఎంతవరకూ ఉన్నదో పరిశీలిస్తున్నది. కాశ్మీర్ సమస్య పట్ల పాకిస్తాన్ వైఖరి నిష్పాక్షికత్వానికి అలవాటుపడని మిత్రరాజ్య పరిశీలక సంఘసభ్యులకు సైతం దుర్భరంగా వుంది. అటువంటిదే కమ్యూనిస్టుల వైఖరి. దేశంలో సుస్థిరమైన ప్రభుత్వాన్ని కూలదోసి పరిపాలనా యంత్రం తమ హస్తగతం చేసుకోడానికి ఎన్నో విఫల యత్నాలు చేశారు. హింసామార్గం అవలంబించినకొద్దీ ప్రజా హృదయానికి దూరమైపోయారు. అయినా వారు గుణపాఠం నేర్చుకోదల్చుకోలేదు. స్వాతంత్ర్యోత్సవ సమయంలో కూడా అశాంతి లేవదీయడమే వారి ఆశయం. అంటే, స్వాతంత్ర్యోత్సవ సమయంలో విమర్శ కూడదనికాని, ప్రస్తుత ప్రభుత్వ చర్యలు ప్రజానీకానికి సంపూర్ణ పరితృప్తి నిస్తున్నాయని కాని ఎవరూ అనరు. ఇటీవల ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఉపన్యసిస్తూ డాక్టర్ రాధాకృష్ణన్ యిలా అన్నాడు:

> భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొంది రెండేండ్లు గడచినా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందలేదు. ప్రతివారూ కట్టగుడ్డ, తినతిండి, నిలువనీడ లేక బాధపడుతున్నారు. జీవితానికి సంబంధించిన ఈ కనీసపు అవసరాలను తీర్చడం ప్రభుత్వం ప్రాథమిక కర్తవ్యం. అప్పుడే యావద్భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించిందని అనగలం.

పై మాటలు బాధ్యతా రహితమైన

ఎవరో వ్యక్తి నోటినుండి వెలువడినవి కావు. భారతప్రభుత్వం తరఫున మాస్కోకు రాయబారిగా వెళ్ళబోయే వ్యక్తి చేసిన హెచ్చరిక. అయినా యీ స్వాతంత్ర్యం కేవలం స్వప్నప్రాయమని గాని, ప్రస్తుత ప్రభుత్వాన్ని హింసాయుత పద్ధతులతో కూలద్రోసిననాడు తప్ప ఇండియాకు మోక్షం లేదనికాని ఆయన అభిప్రాయం కాదు. ప్రభుత్వ విధానాన్ని సరియైన దారికి తీసుకువచ్చి ప్రజలకు మేలు కూర్చే ఆశయం ఆయనది, కాని అటు పాకిస్తాన్ పరిపాలక వర్గం, యిటు ఇండియాలో కమ్యూనిస్టులు ప్రస్తుతం వైషమ్య ప్రబోధమే ఆశయంగా పెట్టుకున్నారు. దుండగీడుతనమే వృత్తిగా పెట్టుకున్న కొందరిని పోగుచేసి సాగించేవారి చర్యలు, సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే, వారి పతనానికే దారితీస్తాయి.

## భక్త్యంజలి

మూడు తరాలుగా ఆంధ్రదేశంలో దేశభక్తికిమూలస్తూత్రంగానిలిచి,ఎనభై మూడు సంవత్సరాల నిండు జీవితం గడిపి, మొన్నటి ద్వితీయ స్వాతంత్ర్యోత్సవంనాడు, స్వర్గస్థులైన కొండ వెంకటప్పయ్యగారు చరితార్థ జీవనులు.'అనేక యుద్ధముల ఆరియు తేరిన వృద్ధమూర్తి.' 1909 నాటికే ఆయన కాంగ్రెసుసభ్యులు. చిరకాలం ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా ఉండేవారు. మహాత్మాగాంధీ 1920 సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించినప్పుడు, అచంచల విశ్వాసంతో నడుంకట్టి ఉద్యమంలో అడుగుపెట్టిన వైతాళికుల్లో శ్రీపంతులుగారొకరు. 1921 లో, అనగా బార్డోలీ సత్యాగ్రహానికి పూర్వమే, గుంటూరు జిల్లా పెదనందిపాడులో 'పన్నుల నిరాకరణోద్యమం' ప్రారంభించడానికి ఆయన సర్వసన్నాహాలూ చేసి, గాంధీజీ ఆశీర్వాదం పొంది, చివర నిమిషాన కాంగ్రెస్ ఆదేశానుసారం విరమించవలసి వచ్చింది. ఖద్దరు ఉద్యమం వ్యాప్తికి తెచ్చి అఖిలభారత చరఖా సంఘం ఆంధ్రశాఖను అభివృద్ధికి తెచ్చిన వారిలో పంతులుగారు ముఖ్యులు. తరువాత గాంధీజీ నాయకత్వాన నడచిన అన్ని స్వాతంత్ర్యోద్యమాలలోనూ దక్షిణ భారతదేశంలో ఆయన ప్రముఖ పాత్ర నిర్వహించారు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సైతం, వయఃప్రాభవం తగ్గి వార్ధక్యంతో క్రుంగిపోయినా ఆయన ప్రజాసేవాసక్తి, ధర్మానురక్తి సన్నగిలలేదు. మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు సంస్థలో ప్రవేశించిన అవినీతికి క్షోభిల్లి, పంతులుగారు గాంధీజీకి వ్రాసిన ఉత్తరం, ప్రతి కాంగ్రెస్ నాయకుని అంతఃకరణలోనూ కలవరాన్ని రేకెత్తించింది.

బాపట్లలో 1913 లో ఆంధ్రరాష్ట్రోద్యమానికి అంకురార్పణ ఆయన చేతుల మీదుగా జరిగినది. అది మొదలు ఇటీవల బెజవాడలో జరిగిన నిఖిలాంధ్రజాతి మహాసభకు అధ్యక్షుడిగా ఎన్నుకోబడే వరకూ, ప్రత్యేకాంధ్రరాష్ట్ర సాధన కోసం ఆయన నిర్విరామకృషి చేశారు. ఆ సుందర స్వప్నం నిజం చెయ్యడానికి చిత్తశుద్ధితో పాటుపడడం కన్న, ఆయన పవిత్ర స్మృతికి సమర్పించే భక్త్యంజలి ఆంధ్ర నాయకులకు గాని, ప్రజానీకానికి గాని వేరేమున్నది ?

# యథాలాపం ::

"ఉండు నొక్కొక్కఁ డెల్ల
రలో బుణ్యాశరీరి." (భర్తృహరి.)

**ఆం**ధ్రనాయకు లందరిలోను గాంధీజీ విశ్వాసాన్ని చూరగొన్నది దేశభక్త కొండ వెంకటప్పయ్యగారొకరే. కడచిన రెండున్నర దశాబ్దాల గాంధీనాయకత్వపు కాలంలో, ఏ మాత్రం పెద్దరికం వహించదల్చుకున్నా అందుకు మహాత్ముని సుహృద్భావం అత్యవసరంగా ఉండేది. గాంధీజీ ఆదరణ, ప్రజానీకపు మన్నన, రెండూ ఒకనికే లభించడం సర్వత్రా ఒకేలాగుండేది కాదు. రెండూ కలిసివచ్చిన నాడు, ఆరాష్ట్రం భారత రాజకీయాలలో విశిష్ట స్థానం పొందగల్గేది. ప్రజాబలంగల రాష్ట్రనాయకులు గాంధీజీ విశ్వాసాన్ని పొందలేని నాడుగాని, ప్రజలకు ఆప్తులైనవారు అది సాధించగల్గిన నాడుగాని, వెనువెంటనే ఆయా చోట్ల పరిస్థితులు తల్లక్రిందు లయేవి.

* * *

మహాత్ముని హృదయంలో స్థానం పొందడానికి సహాయనిరాకరణం తిరుగులేని మార్గం. ఆయన అనుయాయులు మొదటి రోజులలో సహాయనిరాకరణోద్యమం సాగించిన వారినుండి ఏరుకోబడినవాళ్లు. అందులో అనేకులు న్యాయవాదులు; ఆయన పిలుపు అందుకుని, విపరీతమైన ఆర్జనలను విస్మరించి సుడిగుండాలవంటి ప్రమాదభరిత రాజకీయాలలోకి చొచ్చుకు వెళ్లారు. తిరిగి "అందులోనూ, యావజ్జీవిత బ్రహ్మచర్యము, నిరాడంబరత, నిష్కామ్యత, యీ మొదలైన ప్రతిజ్ఞలు స్వీకరించి, సత్యాగ్రహదీక్ష పైకొన్న ఆశ్రమవాసులు మరీ ఉన్నత వర్గానికి చెంది, మహాత్ముని హృదయానికి అత్యంత సన్నిహితులుగా ఉండేవారు. గాంధీవాదుల దృష్ట్యా అధికారం హస్తగతం చేసుకొండికి సాధనం సత్యాగ్రహం: కనుక అందులో



పైకి రావలెననే తహతహ గల కొందరు పతిత్యాగావేశపు పైపై చిహ్నాలను సంరంభంతో ప్రదర్శించేవారు. రాజకీయాశయాలు కలవారు ఆధ్యాత్మికాకాంక్షపరులైన సన్యాసులవలె మూర్తీభవించేవారు. మహాత్మునికి మతమూ, రాజకీయాలూ, రెండూ వేర్వేరు కావు. కాని ఆయన అనుచరులలో అనేకులకు రాజకీయాలను ఆధ్యాత్మిక ప్రపూరితం చేయడం కేవలం అవసరమైన ఒక చాతుర్యం మాత్రమే—ప్రచార సాధనార్థం ఎంత కొనియాడబడినా సరే. అయినప్పటికీ ఆ బాహ్యవేషంలోని ప్రచండశక్తి అనేకులను వెల్లువవలె యీడ్చుకువెళ్లి వారి చేత అద్భుతమైన ధీరకృత్యాలు చేయించింది. కేవలం మహాత్ముని ఆత్మయే, ఉత్కర్షయే ఇందరిలోనూ ప్రవేశించి, ప్రతి భావాలను జయించి పని సాగించుకుపోతున్నదా అనేటట్లుండేది. కాని మహాత్ముని పని పూర్తి అవగానే, ఆయన ఆశయం సిద్ధిపొంది బాహ్య చిహ్నాల అవసరం తీరగానే ప్రలోభం తిరిగి తల యెత్తుతున్నది. ఆనాటి సత్యాగ్రహయోధుడే నేడత్యాశకు అగ్రతాంబూలం పొందుతున్నాడు.

పరిస్థితులను చెప్పుగా సర్వనియోగం చేసుకుని, పదవినీ, పలుకుబడినీ యితోధికం చేసుకునే చాకచక్యం కొండ వెంకటప్పయ్య గారికి బొత్తిగా లేదు. ఆయన పంతమెరుగని అమాయకుడు; లౌకికత్వపు పోకడలు ఏమీ తెలియవు. లిబరలు పక్షపు పార్లమెంటరీ కార్యక్రమానికి స్వస్తిచెప్పి, గాంధీజీ సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశించిన వారిలో ఆంధ్రదేశంలో ప్రథముడు వెంకటప్పయ్య. అందులోకి అవ్యాజంగా అడుగు పెట్టాడు కాని, లాభనష్టాలు బేరీజు వేసి కాదు. ఆయన చిత్తశుద్ధిలోని బలం గాంధీజీని సైతం ఆకట్ట గల్గింది. అందుకనే మహాత్ముడు ఆంధ్రదేశంలోతన అనుయాయులకు మార్గదర్శిగా వెంకటప్పయ్యను ఎన్నుకున్నాడు. అంత బలీయమైన ప్రోద్బలం లభించి నప్పటికీ శ్రీ వెంకటప్పయ్య నడిమి మార్గంలో ఆగి పోయాడు; అదే పరిస్థితులలో తమిళనాడులో "సి. ఆర్" అందుకున్న శిఖరం వంటిది అందుకో లేకపోయాడు. "సి. ఆర్." మొదలైన తమిళ నాయకులు మొత్తంమీద "దేశభక్త", "దేశోద్ధారక", "రత్న", "కేసరి" యిత్యాది పటాటోపమైనబిరుదావళినుంచితప్పించుకునిశ్రద్ధగా తమ పదవి, ప్రాభవం సుస్థిరం చేసుకుని సంతృప్తి పడ్డారు. యావద్భారతం కాకపోయినా, కనీసం దక్షిణదేశం లెక్కలోకి తీసుకుంటే, గాంధీజీ కార్య క్రమాలలోని బహుళ సాహసోపేతమైన, విస్మయకరమైనఉద్యమాలన్నిటిలోనూ ధైర్యంగా నడుంకట్టి ముందడుగు వేసింది అశేషమైన ఆంధ్ర ప్రజానీకమే. కాని తీరా అధికారం, కాంగ్రెసు సంస్థపై యాజమాన్యం అనే విషయాలు వచ్చే సరికి, వారి కాంగ్రెస్ సేవాపరాయణత్వం ఎంత శ్లాఘనీయమైందో, వారిని తోసి పుచ్చడంకూడా అంత శోచనీయంగా జరిగింది. ఈ విభిన్న తత్వాన్ని నిరూపించడానికి శ్రీ కొండ వెంకటప్పయ్య నిర్దుష్టమైన ఉదాహరణ.

* * *

దేశభక్త్యావేశంలో ఆయన అనన్యుడు: కాని కార్యనిర్వాహక సామర్థ్యం ఎన్నడో అసాధారణ పరిస్థితులలో తప్ప ఆయనలో గోచరించదు. వరదలు, భూకంపం, అటువంటి విపత్కర సమయంలో ఆయనలో నుండి ద్యోతకమయే ఆవేశపు స్థాయీభావం కార్యాచరణకు దోహదంగా ఉండేది. ధన విషయంలో డాక్టరు పట్టాభివలె వెంకటప్పయ్య జాగ్రత్తగా ఉండేవాడు. తత్ఫలితంగా ఆయన ఆంధ్ర హృదయాన్ని రంజింప చెయ్యలేకపోయాడు. మితవ్యయులపట్ల ఆంధ్రుల ఆదరణ పారదు: ముందువెనుకల ఆలోచనలేక నిర్లక్ష్యంగా జీవించే వారిపై ఆంధ్రుల కృపావర్షం పెల్లుగా కురుస్తుంది. ఆంధ్రులది చిత్రమైన జాతి: బాగుపడి పైకి వచ్చి సౌమ్యంగా జీవించేవారిపట్ల వారి ఆదరణ అత్యల్పంగా ఉంటుంది. అలా కాక, ప్రతికూల పరిస్థితులకు లోనయి గాయపడిన నాయకులను చేరదీసి లాలించడం వారికానందం. ఆంధ్ర ప్రజానీకం నుండి జోహారు అందుకోడానికి కావలసినంతమేరకు దేశభక్త కొండ వెంకటప్పయ్య పడిన కష్టాలు సాగలేదు. తత్ఫలితంగా ప్రజానీకంలో పలుకుబడి అందకుండా పోయి రాజకీయంగా ఆయన పెంపు కవరోధం కల్గింది.

* * *

ధైర్య సాహసాలు, నిర్లక్ష్యం, సిరిసంపదలను త్యజించినందువల్ల కలిగే ఆకర్షణ, త్యాగజీవితం వల్ల ఎదుర్కోవలసిన బాధలు—ఆంధ్రదేశంలో యివన్నీ శ్రీ ప్రకాశానికే చెంది అశేషమైన ప్రజాభిమానాన్ని చేకూర్చి పెట్టాయి. లక్షలాది ప్రజల కాయన ప్రీతిపాత్రుడు. ప్రజాహృదయంలో ఆయన స్థానం చలిస్తున్నదనే సమయానికి ప్రధాని పదవీచ్యుతి రూపంలో తిరిగి ఆయనకు రక్షణ లభించింది. మహాత్ముని కృపావీక్షణమే ప్రకాశానికి లభించి ఉంటే, నేడు సంయుక్త రాష్ట్రాలలోవలె ప్రజాశక్తికీ, అగ్రనాయకత్వపు పర్యవేక్షణకూ చక్కని సమన్వయం కుదిరి, జాతీయరంగంలో ఆంధ్రదేశపు ప్రాముఖ్యం వలసినంతగా హెచ్చి ఉండేది. అంతర-రాష్ట్ర రాజకీయ వాతావరణంలో కావలసినన్ని తెర వెనుక భాగవతాలు, కాలుష్యాలు, ఈర్ష్యలూ ఉన్నాయి. అవి ఒక్కొక్కవేళల వాణిజ్యరంగంలో ఉండే పోటీలను సైతం మరపించేటంత నికృష్టంగా ఉంటాయి. ఈనాడు కీర్తివంతంగా ప్రకాశిస్తున్న గాంధీయులు ఆనాడు గాంధీజీ పక్కన చేరి, తమ నాయకత్వానికి భంగం కలి

...స్తారన్న శత్రువుల విషయంలో ఆయన దగ్గిర ఎవరైనా విషప్రచారం చేయడమే పనిగా పెట్టుకునే వారు. కొంతవరకూ వారి తంత్రం ఫలించినందువల్లనే, సంవత్సరాలపాటు గాంధీజీ విశ్వాసం ఆంధ్రనాయకులలో ఒక్క వెంకటప్పయ్యగారికి తప్ప యింకెవరికీ లభించకుండా చేయడంలో వారు కృతకృత్యులయారు. అలా లభించిన గాంధీజీ అభిమానాన్ని వెంకటప్పయ్యగారు ఫలదాయక మార్గాల్లో వినియోగించరని వారాశించారు.

* * *

అమిత సాహసోపేతుల్నికూడా ధైర్యంలో ద్వితీయుల్ని చేసిన ఉజ్జ్వల ఘడియలు శ్రీ వెంకటప్పయ్యగారి జీవితంలో ఉన్నాయి. ఆ సమయాల్లో ఆయన సంఘపు మూర్తీభవించిన సంయుక్త అంతరాత్మవలె గోచరించేవాడు. అప్పట్లో ఆయన అభిభాషణలు శక్తివంతమై, నిశితమై, నిర్మలాంతఃకరణతో కూడిన విమర్శకుని కుండే నైతిక ప్రకాశంతో భాసిల్లేవి. సుజనత్వానికి ప్రాతిపదిక అయిన లోపరాహిత్యం ఆయన సొమ్ము. శాసన సభ్యులు, మంత్రులు ప్రదర్శించే పాక్షిక భావాన్ని వెంకటప్పయ్యగారు ఖండించినంత తీవ్రంగా యింకెవరూ ఖండించలేదు. స్వార్థం గురించిన చింతన లేకుండా, కేవలం ప్రజాహితాన్నే దృష్టిలో ఉంచుకుని, మృత్యుగహ్వరం నుండి చేసిన గర్జనలోని నైతిక బలంతో కూడుకున్న దది.

—సాకా

---

# దేశపునర్నిర్మాణము : విద్యార్థులు

జి. సాంబశివరావు

పక్ష రాజకీయములకు దూరముగ నొక అఖిల భారత జాతీయ విద్యార్థి పరిషత్తును స్థాపించవలసిన యావశ్యకత గలదని బాబు రాజేంద్రప్రసాదు, ఆచార్య నరేంద్రదేవు లొక సంయుక్త ప్రకటన జేసిరి. ఇట్టిది యిదివరకే జరుగవలసియుండెను. ఆలస్యముగనైనను దీనిని మన నాయకులు గుర్తించుట ముదావహము.

నేడు విద్యార్థులు ఒకవిధమైన నిస్పృహా వాతావరణములో నున్నారు. వారి కష్టములు యినుమడించినవి. వారికి ఉపాధ్యాయులకు మధ్య ఘర్షణలు హెచ్చు పెరుగుచున్నవి. పొత్తు కుదురుటలేదు. వారిలో యుత్సాహమున్నది. శక్తి యున్నది. వారి యుత్సాహము నినాదములతో చార్చి వేయబడుచున్నది. వారి శక్తి పరస్పర నిందారోపణలయందు వ్యర్థము చేయబడుచున్నది. వారిబలము వివిధ రాజకీయపక్షముల, వ్యక్తిగత మతాలమధ్య నిర్మూలించబడుచున్నది. వారిశక్తిని యీదేశ నిర్మాణములో నుపయోగించుటకు తగిన అవకాశములు లేవు.

అస్వతంత్ర భారతావనిలో రాజకీయములతోను, రాజకీయ పక్షములతోను విద్యార్థుల కున్న సంబంధములో, స్వతంత్ర సముపార్జనానంతరము యెట్టి మార్పును రాకపోవుట నేటి శోచనీయస్థితికి మూలకారణము. అస్వతంత్ర దేశములో దేశములోని అన్ని వర్గములు, అన్ని శక్తులు స్వాతంత్ర్య సమరములో నాహుతి కావలసి యుండును. అందువలననే యొకరు వలదనినను, మరొకరు కాదనినను, భారతీయ విద్యార్థులు స్వాతంత్ర్య సమరములో తమ కర్తవ్యమును నెరవేర్చిరి. కాని నేడు మన దేశములో విద్యార్థులు రాజకీయములతోను, రాజకీయపక్షములతోను నుంచుకొను సంబంధములో తీవ్రమైన మార్పు కలుగవలసి యున్నది.

విద్యార్థులను సమీకరించి యొక త్రాటిపై నడిపించబూనిన విద్యార్థి ఫెడరేషను (అ. భా.) కమ్యూనిస్టుల చేతులలోకి వెళ్ళి వారి యడుగులకు మడుగులొత్తి, చివరకు తుది స్వాతంత్ర్య సమరములో జాతీయ వ్యతిరేకపంథా నవలంబించి, బ్రిటిషువారికి వంతపాడి దేశద్రోహమును కొడిగట్టి దాదాపు యంతరించినది. అ. భా. వి.

పరదేశీయులకు మంగళము పాడి విద్యార్థులు స్వాతంత్ర్య సమరములో తమ కర్తవ్యమును నెరవేర్చిరి. వారే అ. భా. జాతీయ విద్యార్థి సంఘముగ మారి, అ. భా. విద్యార్థి కాంగ్రెసుగ రూపొంది, ఏకైక భారత జాతీయ సంస్థకు అనుబంధముగ నేర్పడి, జాతీయోద్యమమునకు స్ఫూర్తిని చేకూర్చిరి. కాని స్వాతంత్ర్య సంపాదనానంతరము కాంగ్రెసులోని వ్యక్తిగత మతాతత్వములకు, కులతత్వములకు నాలవాల మైనందున దాని యనుబంధసంస్థయగు అ. భా. విద్యార్థి కాంగ్రెస్‌లో కూడ అవి ప్రవేశించి దానిని నామమాత్రావశిష్టము జేసినవి. అవియుం దాదాపు యంతరించు చున్నవి. నేడు ప్రతిరాజకీయ పక్షము కొక్కొక్క విద్యార్థి సంఘమును స్థాపించుచున్నది. సోషలిస్టులు, ఫార్వర్డుబ్లాకు వారు వానిని స్థాపించుచున్నారు. ఇంకను మత సంస్థలు కూడ విద్యార్థులను సమీకరించు చున్నవి. కాని యిందులో నేయొకటియు విద్యార్థుల కష్టములను నివారించుట లేదు. కేవలము తమ పార్టీ ప్రయోజనముల నాశించి వారిని తమ యిచ్ఛకొలది సాధించుచున్నారు.

నేటి విద్యార్థి వీని నుండి విముక్తి కోరు చున్నాడు. ఇన్ని విద్యార్థి సంస్థ లున్నను, అధిక సంఖ్యాకు లెందులోను సభ్యులు కారు. సభ్యులుగా నున్న వారిలో కూడ అనేకులు తోడి విద్యార్థుల మోమోటమి వలన, తదితర కారణముల వలన చేరిన వారే.

మత సంస్థల వలన దేశమున కెంతకీడు కలుగునో అనుభవ పూర్వకముగ గ్రహించినందునను, మన దేశము ఏ మతమునకు చెందని రాజ్యాంగమును నమలు జరుప బోవుచున్నది గనుకను విద్యార్థులకు రాజకీయములకు మతముతో మేళవించు సంఘములతో సంబంధ ముండరాదను టలో నెవరికి యాక్షేపణ యుండదు.

నేటి విద్యాసంస్థలు విద్యార్థులను ఆదర్శ పౌరులుగ తయారు చేయగలిగినవి కావు. ఈ విద్యావిధానములో తీవ్రమైన మార్పులు తేవలసియున్నది. డా॥ రాధాకృష్ణన్ అధ్యక్షతను పనిచేయుచున్న సంఘమునుండి మన మెంతైన యాశించవచ్చునేమో. కాని యెంత యుత్తమ విద్యావిధానమైనను సత్ఫలితముల నీయ వలయునన్న విద్యార్థి ఉపాధ్యాయుల మధ్య సంపూర్ణ సహకారము, పరస్పర ప్రేమ యుండ వలయును. వేలకొలది సంవత్సరములనుండి సంప్రదాయ సిద్ధముగ వచ్చుచున్న ఆ సంబంధము నేడంతరించినది. దీని కనేక కారణము లున్నవి. ముఖ్యముగ జాతీయోద్యమము యీ విద్యాలయముల నిరసించుటచేతను, వీని యధికారులు ఆంగ్లమనస్తత్వమును ప్రతిబింబింపజేయుట చేతను యిట్టి మనస్తత్వము విద్యార్థులలో నేర్పడినది. కాని యిది దేశానర్థదాయకమైనది. ఇది యెంత తొందరగ నంతరించిన నంతమంచిది.

విద్యార్థులలోని శక్త్యుత్సాహములను దేశనిర్మాణమునకు తోడ్పడునటుల వినియోగించ వలసియున్నది. ఇతరుల కంటె విద్యార్థులకు, ఉపాధ్యాయులకు తీరిక యెక్కువ. ప్రయోజన విద్యవంటి నిర్మాణ కార్యక్రమములో విద్యార్థులు, ఉపాధ్యాయులు కలిసి పనిచేసిన భారత దేశము పరిష్కరించవలసిన మహత్తర సమస్యలలో నొకటి సులభముగ కొద్దికాలములో తీరిపోగలదు. ఇందువలన ప్రజలకే గాక విద్యార్థులకును యెంతగానో లాభదాయకము. చదువు అనిన నాలుగు గోడలమధ్య, పుస్తకములను పఠించుట మాత్రమె కాదుగదా! విద్యార్థులు ప్రజల నిజజీవితమును, వారి సమస్యలను అర్థము చేసికొని యెంతయో విజ్ఞానము నార్జించగలుగుదురు.

విద్యాలయముల వెలుపల, ఉపాధ్యాయులకు దూరముగా, రాజకీయ పక్షములతో నినాదములతో, పరస్పర నిందారోపణలతో, కాలమును, శక్తిని వృధాపుచ్చుగల సంస్థగాగాక విద్యాలయములలోనే ఉపాధ్యాయులతో సహా సమీకరించబడిన భారతీయ విజ్ఞాన సంస్కృతులను జీర్ణింపజేసుకొని వాటి యాదర్శములను ప్రతిబింబింప జేయగలిగి అమూల్యమైన కాలమును విజ్ఞానోపార్జనకు, దేశనిర్మాణమునకు తోడ్పడగల కార్యక్రమములలో వెచ్చించగల విద్యార్థుల నట్లు తయారు జేయగలిగిన అ. భా. జా. విద్యార్థి సంస్థ నే డావిర్భవించ వలసియున్నది.

నవంబరు మాసములో శ్రీకృష్ణ బజాజ్ సమీకరించబోవు విద్యార్థిసంస్థ యిట్టి ఆదర్శములతో స్థాపించబడి సక్రమముగ పని జేయగలదని ఆశించవచ్చునేమో!

# అహింసా సిద్ధాంతం : ఇండియా విధానం

యస్. యస్. నారాయణ

స్వతంత్రం కొరకై గాంధీజీ నాయకత్వాన బ్రిటిషు వారితో మనం జరిపిన పోరాటం అహింసా ప్రధానమైన దగుటచే మనం అహింసా వాదమునే మనుగడగా గల్గినవారమని, శాంతియుత ధర్మమార్గంలో మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నామని అనేకుల నమ్మకం. యూరపు, అమెరికాలలోని కొందరు నాయకులు నేడు మన ప్రభుత్వం అహింసావాదమును అక్షరాలా పాటిస్తోందనీ, ప్రపంచంలోని క్లిష్ట పరిస్థితులను సైతం మన నాయకులు తమ అహింసాత్మక సూచనలతో పరిష్కరించగలరనీ ఆశపడుతున్నారు. ప్రపంచంలోకల్లా అహింసావాదమును తు.చ. తప్పకుండా పాటించేది ఒక్క భారతదేశమే కనుక హింసావాదమను బురదలో మునిగిపోయిన పాశ్చాత్యులకు ఏనాటికైనా కనువిప్పు కల్గించేది ఈ దేశమే నని కొందరి అభిప్రాయం. మన నాయకులలో అనేకులు తమ దేశ, విదేశోపన్యాసాల్లో ఈ విషయాన్నే పదేపదే శక్తివంచన లేకుండా ప్రచారము చేస్తున్నారు.

చిత్తశుద్ధికి గీటురాయి చేతలుకాని, మాటలు కావు. స్వతంత్రం పొందిన పిదప అంతకుముందు తెల్లవారు మిలిటరీ నిమిత్తమై వెచ్చించే మొత్తాన్ని మనవారు తగ్గించలేదు సరిగదా విపరీతంగా పెంచివేశారు. ఆధునిక యుద్ధపరికరములకు, నౌకా వైమానిక సాయుధ దళాలకు మనవారు వెచ్చించే మొత్తానికి అవధి అనేది లేదు. ఇతర ప్రజాహిత సమస్యల గతి ఏమైనా యుద్ధతంత్రరీత్యా దేశం బలపడుట అవసరమని వారి నమ్మకము. అత్యవసర సమయాల్లో పోలీసు, మిలటరీ దళాలతో సహకారముకై రెండు మిలియన్ల వాలంటీరుదళం నేడు తయారు చేయబడుతున్నది. దీని నిర్మాణమున కగు ఖర్చుసైతము అవసరమనియే భావింపబడుతున్నది. ఇతర జీవిత రంగాలలో స్త్రీ, పురుషుల మధ్య గల ప్రస్ఫుటమైన అంతరం దేశరక్షణకు సంబంధించిన యీ విషయములోను పాటింప బడుటలేదు. కనీసం తన శిష్యులు సైనిక రంగంలోనైనా స్త్రీ, పురుష భేదాన్ని పాటింపనందుకు బాపూజీ ఆత్మ శాంతిల్లుతుంది.

గొప్పగొప్పడిగ్రీలను పొందిన మహిళలుసైతం నేడీ ఉద్యమములో ఉత్సాహముగా చేరుతున్నారు. ఇటీవల న్యూఢిల్లీలో ఇన్‌స్ట్రక్టర్ ట్రైనింగు కొందరు పొందారు. హోం గార్డు శాఖ స్త్రీల కొకటి ప్రత్యేకింప బడింది. శిక్షణ ఆరు మొదలు ఎనిమిది మాసాల వరకు ఉంటుంది. ఏబది మందితో కూడిన మొట్ట మొదటి దళం అప్పుడే శిక్షణకూడా పొందింది. తొలిసారి దేశరక్షణకు తన బిడ్డల నర్పించిన సువశ బొంబాయి రాష్ట్రానికి దక్కింది!

పై సందర్భములో మాట్లాడిన బొంబాయి హోంశాఖామాత్యులు దేశంలో ప్రతిపౌరుడు నిర్బంధ ప్రాథమిక శిక్షణను పొందవలసిన అవసరాన్ని వివరించారు. నిర్బంధ సైనిక శిక్షణ అత్యవసర మనేవారు ఇంకా యితరులు కూడా ఉన్నారు. (వామపక్ష సమైక్యతకు సోషలిస్టు రిపబ్లికన్ పార్టీ నాయకుడు శరత్ బోసు తయారు చేసిన ఏకాదశ సూత్ర ప్రణాళికలో నిర్బంధ సైనిక శిక్షణ ఒకటి.) కావలసినంత ధనం లేక పోవుట వలన పేచీ వచ్చింది. లేకుంటే ఏనాడో ప్రతిపౌరుడూ యూనిఫారం లేని (గుడ్డ కరువు కూడా యిప్పుడే అవతరించింది!) సైనికు డయ్యే వాడు. కష్టపడితే యిప్పుడైనా మించిపోయింది లేదు.

నేటి పరిస్థితులలో నిర్బంధ సైనిక శిక్షణ సుసాధ్యం కాకపోయినా మిలిటరీ తత్వాన్ని ప్రతివానిలో జీర్ణింప చేయుట మన కనీస విధి. ఈ దృష్టితోనే అనేక మంది వివేకులు సైనిక శిక్షణను విద్యావిధానంతో మిళిత పరచుట సమంజస మని సలహా లిస్తున్నారు.

మిలిటరీరీత్యా అనేక సన్నాహాలు చేయుటయే గాక అవసరమైతే పక్షంలో హింసా ప్రయోగానికి కూడ మన ప్రభుత్వం వెనుదీయదని కాశ్మీరు, హైదరాబాదు సంఘటనలు వ్యక్త

పడుతున్నవి. ఉలవలు తింటూ తనగలని చెప్పటం రాజకీయ వాదులకు పరిపాటి. స్వతంత్రం వచ్చిన రెండేండ్లలో పోలీసు,మిలిటరీదళాలు రాజకీయ ప్రత్యర్థులయెడ, నిరాయుధులైన కార్మికుల యెడ ప్రదర్శించిన హింసాకాండ,ఈవిషయాన్నే బలపరుస్తోంది. కనీసం సత్యానికన్నా మనవారు కట్టుబడివుంటే మన తప్పులు మనకు తెలిసి ఉండేవి. రాజకీయాల్లో మొట్టమొదట విస్మరింపబడేదే అది.(ఈనాడు అన్ని విషయాల్లో.)

విదేశ దండయాత్రలనుండి దేశాన్ని రక్షించడానికి మిలిటరీ సన్నాహాలు అవసరమని కొందరి వాదం. ప్రజలలో అనవసరంగా యుద్ధభయాన్ని రేకెత్తించుట తప్ప యిందువలన ఒరగబోయేది లేదు. ఈనాడు మన దేశంపై దండెత్తవలెనను ఉద్దేశము ఏదేశానికీ లేదని పసిపిల్లవానికి సైతము తెలుసు. వినాశకరమైన యాటంబాంబుల వంటి మారణాయుధములతో కూడిన ఏగొప్పరాజ్యమన్నా ఒకవేళ దండెత్తితే యింతకు లక్షరెట్ల ధనాన్ని వెచ్చించినప్పటికీ ఇంతలో మనం దానిని జయప్రదంగా ఎదుర్కొనగల్గుట అసంభవం. ఇక్ష్వాకుల నాడు స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన మనం ఇంతట్లో కోలుకొనుట అసంభవం.

ఆసియా ఖండమునందలి ఏరాజ్యము బారి నుండైనా మనము తప్పించుకొనగల మన్నా ఆసియా రాజ్యముల భయము మనకసలే లేదని చెప్పవచ్చును.

గర్వహేతువైన తమ సంస్కృతిని అన్యజాతులను జయించి వారి నెత్తిపై రుద్దుటకు కూడ జాతీయవాదులు దేశాన్ని బలపరుస్తారని చరిత్ర మనకు నేర్పుతున్నది. నేడు ఆసియా ఖండంపై నాయకత్వాన్ని వెలిగించాలని ఇండియా ఉబలాట పడుతోంది కూడా ! (తమది సిసలైన ఆర్యజాతి గనుక ప్రపంచమంతా తమకు ఊడిగం చేయాలని ఇదివరలో ఒక పెద్దమనిషి పొలికేకలు వేస్తూండేవాడు !) నేటి అంతర్జాతీయ పరిస్థితులలో ఈ గొంతెమ్మ కోర్కె నెరవేరుటకు ఒక పెద్ద రాజ్యం యొక్క సహాకారం అవసరం. మన కలలు నిజం కావాలంటే కనీసం దానికి ఉపగ్రహంగానన్నా తయారవాలి. ప్రజలు కూడుగుడ్డలకు అలమటిస్తుంటే కేవల ప్రతిష్ఠకొరకు యితర దేశానికి తాబేదారు పని చేయుట (అమూల్యమైన దేశ సంపదలను ఖాడిద పాలుచేసి) అవమానకరమైన విషయము.

నేడు ప్రపంచాన్నంతా కలవరపెడుతూన్న కమ్యూనిస్టు ప్రమాదాన్నుండి ఆయుధ బలం దేశాన్ని రక్షింపగలదని మరికొందరి వాదం. దేశాన్ని అన్యదేశీయ దురాక్రమణ నుండి, అంతరంగిక కల్లోలం నుండి రక్షింపగల్గిన నిజమైన బలము సంతృప్తినొందిన మనస్తత్వము గల ప్రజలు గాని మారణాయుధములు కావు. ఈ విషయంలో చైనా మనకు గుణపాఠం నేర్పుతోంది. కొమింటాంగు పార్టీ పరాజయానికి ప్రజల సానుభూతి లేకపోవుటయే అసలైన కారణము. యుద్ధసామగ్రి లేకపోవుట కాదు. అమెరికా వారు సరఫరా చేసిన ఆయుధ సామగ్రికూడ కమ్యూనిస్టుల పరమగుటచే రక్షించుటకు బదులు వినాశనానికి తోడ్పడ్డవి.

విదేశీయ దురాక్రమణనుండి, కమ్యూనిస్టు ప్రమాదంనుండి రక్షింపలేని మిలిటరీ సన్నాహం క్రమంగా మిలిటరీ రాజ్యస్థాపనకు దారి తీయవచ్చును. మిలిటరీ రాజ్యంలో కొందరికి తాత్కాలికంగా ఉద్యోగాలు దొరకవచ్చును. ఆయుధపరిశ్రమల ఉద్ధరణవలన ఆర్థిక సంక్షోభం నుండి కొంతవరకు బయటపడ వచ్చును. తాత్కాలికంగా ప్రజలు తమ కష్టాలను మరువవచ్చును. కాని దెబ్బతినేవి ప్రజాస్వామ్యపౌరత్వాలు. అసంతృప్తిని ఏరూపమున వెల్లడించుకొనుటకూ ప్రజల కప్పుడు అవకాశం ఉండదు. మనం వల్లించిన ఆదర్శాలకే అడ్డు ఏర్పడుతుంది. అహింసావాదాన్ని గురించీ, దాని ప్రవక్తను గురించీ శుష్కప్రియాలు పలికే స్వాముల వలన అధికారాన్ని సుస్థిరంచేసే మిలిటరీ యంత్రం సృష్టింపబడవచ్చును. కాని దేశంయొక్క నిజమైన బల మనదగిన ప్రజల సాంఘిక, ఆర్థికాభ్యుదయంమాత్రం కుంటుపడుట తథ్యం. భారమంతా నాయకులమీద వేసి ప్రజలు రాజకీయాలనుండి పూర్తిగా వైదొలగడం విజ్ఞత అనిపించుకోదు.

(రాడికల్ హ్యూమనిస్టు పత్రికలోని ఒక వ్యాసాన్ని అనుసరించి)

కథానిక

# కన్న కడుపు

కార్యంపూడి కృష్ణమూర్తి

"ఏం పిల్లలో యేం లోకమో! ఎందుకొచ్చినట్టు. కూటికా - గుడ్డకా. కల్లకాట్లో పిల్లలు" అన్నాడు పిల్లలంటే ఒడిచచ్చే వరదయ్య నిష్ప్రమాలో.

నాటికి నేటికీ కొత్తరిగేట్టు కట్టెలు మోస్తూనే వుంది సుబ్బమ్మ. పాలబుగ్గల పసిడి ముద్దగ తయారైన తన వలపుపంట రామదాసును చూసుకుంటే కడుపు నిండేదామెకు. తనకు పెట్టినా పెట్టక పోయినా అవసాన కాలంలో యిన్నినీళ్లు గొంతులోపొయ్యడాని కున్న ఆధారమా పసిగుడ్డే. బిడ్డమీద వున్న వాత్సల్యమో, మోక్షమిప్పించడానికున్న ఒకానొక ఆధారమన్న అభిమానమో, లేక రెంటి చేరికో తెలియదుగాని సుబ్బమ్మ కా బిడ్డమీద వున్నంత ప్రేమ తన ప్రాణంమీద సైతం వున్నట్టు కనుపించదు. రక్తాన్ని డబ్బులుగా తయారుచేసే తన శరీర యంత్రంలోని భాగాలు అరిగిపోయినా, మరమ్మత్తు కోరినా లెఖ్ఖచేసేదికాదుసుబ్బమ్మ. వడియకట్టిన శిథిల జీవన సారంతో పెంచుతున్నదా బిడ్డను. ఏడాది క్రితం బ్రద్దలైన తన పసుపుకుంకాన్ని తలుచుకున్నప్పుడు పొర్లివచ్చే దుఃఖాన్ని నివారించ కలిగిందా పసిపాప ముద్దు మొగ మొక్కటే.

సుబ్బమ్మకు నా అన్న వాళ్లుండి కూడా లేని వాళ్లయారు. ఎద్దంటి మరి దుండేం ప్రయోజనం! పడివని తన్నుచూచి కాకపోయినా అర్థంపర్థం తెలియని అబిడ్డ ముఖం చూచైనా ఇంత సాయం చెయ్యవచ్చు. ఘనుడు యెలాగైతేనేం వున్న వూళ్లో పచ్చి మంచినీళ్లు పుట్టకుండా చేశాడు. ఆస్తి అప్పులకే సరిపోదని తెంచి పోసిన మరుక్షణం గడప తొక్క నివ్వలేదు. సీతారామయ్య గారి కేదో విషం పోసినట్టున్నాడు. ఆయన మంచంలో ఉన్న రెండు నెల్లా మంచీ చెడ్డా అంతా విచారించినవాడు ఆయన పోయిం తర్వాత తిరిగి చూడలేదు. పువ్వు లమ్మిన చోట కట్టె లమ్మినట్టుంటుందని సుబ్బమ్మ పసిపాపతో సహా వూరు విడిచి పోయింది. మరిది తన మీద యింత పగ బూనటానికి కారణ మామె కెంత యోచించినా మనసుకు తట్టలేదు.

సుబ్బమ్మకు పుట్టినింటి దిక్కు లేకపోలేదు. తల్లితండ్రీ లేకపోయినా ముగ్గురు అన్న లున్నారు. అంద రామె అవస్థ కండ్లారా చూస్తూ వూరుకున్నారు. తనకై తాను వాళ్లయింటి కెళ్లడాని కామె అభిమానం అడ్డు పడ్డది. తనను ముక్కలుగా చీల్చినా వూరుకుంటుంది కాని తన సర్వస్వం-రామదాసును వాళ్లు చిన్నమెత్తు మాటంటే ఓర్చుకో గలదా! తనజీర్ణకంకాళంమీద ఆనంద సౌధాలు నిర్మించాలి వాడికి.

సుబ్బమ్మ కొరుగనివాళ్లు లేరా వూళ్లో. ఏసుక్రీస్తంతటివాడు చచ్చిం తర్వాత గొప్పవాడనిపించుకుంటే సుబ్బమ్మ బ్రతికుండగానే మంచి పేరు తెచ్చుకుంది. ఆమెకు వచ్చిన ఆపదకు అందరూ విచారించేవారే. ఆమెకు సానుభూతి చూపని నరపురుగు ఆ గ్రామంలో లేదు. సానుభూతి చూపనివా లెంభర్మ,ఏవిధంగానూ సాయం చేసినవారు కూడా కనుపించలేదు. తన కాళ్ళ మీద తాను నిలబడలేనినాడు కాళ్లక్రింద భూమి కూడా క్రుంగుతుంది. సుబ్బమ్మకు సాయం చేయలేనివాళ్లు తమ నిస్సహాయతను తెలియజేస్తే, చెయ్యకలిగినవాళ్లు సాకులు చెప్పారు. రక్తసంబంధం వున్న అన్నదమ్ములే వూరుకుంటే, ఆమె ఏడుపు పెరగడానికి మాటల్ని జతచేసే యితరుల కేం పట్టింది.

ఎవరూ సాయం చెయ్యకపోయినా సుబ్బమ్మ విచారించలేదు. ఎవరుగానీ ఊరకనే సాయం చెయ్యరని ఆమెకు తెలుసు. తన్ను పుట్టించిన దేవుడికే తనమీద దయలేనప్పుడు యితర్ల సంగతి ఆలోచించవలసిన పని యేముంటుంది! వాకి లూడ్చే

దగ్గరనుంచి పక్కలు వేసేదాకా అన్నిపనులూ శుభ్రంగా చెయ్యగలదు. కన్నబిడ్డలను పెంచలేనివాళ్లు, జడలు వేసికోడంచేతగాని వాళ్లు, పెనిమిటికి పక్క వెయ్యడానికి అభిమానం పడే వాళ్లు అనేకమంది వున్నారు. అటువంటి వాళ్లకు పనులు చేస్తే తన పొట్ట కింతకూడు దొరక్కపోదు. రెక్కలున్నంతకాలం యితర్లమీద ఆధారపడాల్సిన అవసరమామెకు కనుపించలేదు.

* * *

తనకు ఆనందాన్ని, తృప్తిని యివ్వలేని దేన్నిగాని మానవుడు ప్రేమించలేడు. ఒకదానివల్ల కలిగే ఆనందానికంటే రెండవదానివల్ల యెక్కువ ఆనందం లభిస్తున్నప్పుడు రెండవదానిమీద కలిగిన ప్రేమ మొదటిదానిమీద వున్న ప్రేమను జయిస్తుంది. దీన్ని యే నైతికసూత్రం బంధించలేదు. అన్ని నైతికసూత్రాలు ప్రాపంచిక వ్యవహార సౌలభ్యంకొరకు యేర్పాటు చెయ్యబడ్డవన్న రహస్యం తెలుసుకున్న తర్వాత వాటి కున్న విలువ తగ్గుతుంది. దృఢమైన వ్యక్తిగతాభిప్రాయాలమీద దాడి సలుపుతున్నప్పుడు యే మానవుడూకూడా (వెన్నెముకలేని రాములవారి వంటివాడు తప్ప) సాంఘిక నియమాలకు దాసుడు కాజాలడు.

గారడీలా వుంది. లేక అదేమైనా మందూ మాకూ పెట్టిందో! ఆ అభిమానం, భక్తి, వినయం, గౌరవం యింతలో యేమైనాయో! ఏమో అంతా మాయగా వుంది. చిన్న నేరం చెయ్యడానికి దడగా వుండేది, అమ్మ ఏమనుకుంటుందోనని. తన్ను గురించి అమ్మ ఎందుకో కంట నీరుపెట్టుకుంది. ఆ రోజల్లా తను అన్నం తినలేదు. తనవల్ల దోషముంటే క్షమించమని అమ్మ రెండుకాళ్ళూ పట్టుకుని వలవల ఏడ్చాడు. "ఏం లేదు నాయనా!" అని తల్లి తన్ను బుజ్జగించి ముద్దులు చేసి నోటి కందిస్తుంటే అన్నం తిన్నాడు. ఇప్పుడు ఆ అమ్మే కంటికి మంటికి ఒకటేధారగా యేడ్చినా, నల్లరాళ్ళను కరగించే చూపులతో చేతులు జోడించి తన ముందు వ్రాలినా అసహ్యించుకుంటున్నాడు. వెనుకటి అమ్మే... వెనుకటి రామదాసే...

తల్లి యేం చెప్పినా వినడు. విన్నా "నీకెందుకే! ముసలిదానివి, ఏదో ఆది వేళ కింత కాచిపోస్తుంటే హాయిగా కృష్ణా రామా అంటూ కూర్చోక" అంటాడు. తప్పెవరిదైనా నిజానిజాలు తెలిసికొందామనే అభిప్రాయమున్నట్టు కూడా లేదతనికి. ఇరుగు పొరుగు వారు కూడా అదే మాటంటున్నారు. "నీకెందుకమ్మా ముసలమ్మకు, రేపో మాపో చచ్చే దానికి- వాళ్ళ యిష్టంవచ్చినట్టు వూరేగనివ్వక." ఇదేమిటి వీళ్లు కూడా యిట్టా అంటున్నారు! తనమీద వీళ్ళకుండే అభిమానమంతా యేమైపోయింది! ఒక్కరు కూడా న్యాయం చెప్పరేం? ముసలిదైనంత మాత్రంచేత యింట్లో తనకున్న అధికారాన్ని వదులుకుంటుందా? కోడలిమీద తన కొడుక్కు యెంత అధికారం వుందో తనకూ అంతే! అది యేపాటుపడ్డా చూస్తూ వూరుకోడానికా తను వుంది? పదినెల్లూ మోసి, కని, పెంచి పెద్దవాణ్ణిచేసి, దాని వల్లోపడి చెడిపోతుంటే చూస్తూ యెట్టా సహించడం? పిచ్చి సన్యాసి- తెలియక వాడు తన్ను తిట్టినంత మాత్రంచేత......

ఒకరి బాధ్యతను వొకరు నెత్తిన వేసుకోడం వంటి తెలివితక్కువపని మరొకటుండదు. తన కోడలిమీద తనకు బాధ్యత వున్నమాట వాస్తవము. కాని తనకంటే ఎక్కువ బాధ్యత కలవాడు తన కొడుకన్న విషయమా ముసలి బుర్రకు తట్టలేదు.

రామదాసు నడుపుతున్న బస్సును ఓవర్ లోడ్ చేశారు. అధికారులకు పట్టుబడ్డారు. బస్సు వోనర్కు మాటవొచ్చింది, రూపాయలూ వొదిలినై. రామదాసు వుద్యోగం వూడింది. కాళ్ళీడ్చుకుంటూ యిల్లు చేరుకున్నాడు.

పాపం ముసల్ది తన కొడుక్కు చదువు చెప్పించాలనని, అత నేదో ఉద్యోగం చేస్తుంటే చూడాలనని చాలా ఉబలాటపడ్డది. కాని రామదాసు సరైన అదుపులేక అల్లరి చిల్లరిగా తిరిగి చివరకు కారు నడపడం నేర్చుకున్నాడు.

రామదాసు యిల్లు సమీపిస్తుండగానే రంకెలు వినిపిస్తున్నాయి. తన యింటి ముందు పదిమంది పోగైనారు. వారందరితో ముసల్ది యేదో చెప్పుకుంటోంది. భార్య వంటగదిలో ఆకాశం దద్దరిల్లేటట్టుగా అరుస్తున్నది. నేరుగా వంట యింట్లోకి వెళ్లాడు రామదాసు. "ఏమిటే మాలగోల- ఆ

మనర్లేమన్నా పొరపాటు చేస్తే కొంచెం సర్దుకు పోకూడదమ్మా!" కోపంగా అన్నాడు. ఆ యిల్లాలు చేతులు తిప్పుకుంటూ "ఏమిటి సర్దుకుండేది. నా వల్లకాదు బాబు! ప్రతిదానికి సాధింపేనై పోయె ముదనష్టపు సాధింపు. అన్నిటికీ తప్పేనా? పంచలో కూర్చుంటే తప్పు, పొరుగింటి కెళితే తప్పు, పూలు ముడుచుకుంటే తప్పు, సినిమా సంగతులు మాట్లాడుకుంటే తప్పు- అన్నీ తప్పులే. ఆయనగారొచ్చే వేళయింది, కూకలేస్తారు, వంట త్వరగా కావాలి, కాస్త తాళింపు పెడుతుందమ్మా! సుబ్బాయమ్మ దగ్గరకు వెళ్లి వస్తానన్నందుకేగా యీ రాద్ధాంత సిద్ధాంతాలన్నీను. ఈ కాపురం చెయ్యడం నా తరం కాదు బాబు" అంటూ పెట్టె సర్దుతోంది శ్రీమతిగారు. తను వడివడిగా బైటకువచ్చి "నీ కెన్నిసార్లు చెప్పాలి తిని ఓచోట పడుండమని. ఇంట్లో విషయాలు నీకెందుకు? యిట్లా అయితే నా యింట్లో ఒక్క క్షణం వుండడానికి వీలు లేదు. దిక్కులేని దానివై పోతావని వూరుకుంటుంటే ... ..." ఉండబట్టలేక తల్లి చడామడా మాట్లాట్టం... సహించలేక రామదాసామెను బూటుకాలుతో తన్నడం అంతా అనుకున్నంతలో జరిగిపోయినై.

* * *

"ఆ! చేస్తే చేయించుకుందేవాళ్లే గాని పెట్టేవాళ్ళా పోసేవాళ్ళా" అని తరబడుతూ అంటుంది సుబ్బమ్మ. షష్టిపూర్తి దాటిన సుబ్బమ్మ అడుక్కుతింటున్నది. తన శరీరంలోని మేలురకపు కండలన్నీ కాల్చి యిచ్చి పెంచిన కొడుకు కండ్లయెదుటనే వున్నాడు. తన కడేపాట్లు చూస్తూనే వున్నాడు. తల్లి పట్ల యితరులు చూపే సానుభూతి సైతం చూపించడు.

"నీ కడుపున పుడతా, చిన్నం సాయం చేస్తావూ!" సుబ్బమ్మ కర్ర సాయంతో వచ్చి అడిగింది.

"తప్పకుండా" అన్నాను.

"ఏమీ లేదు. ముసలిముండను అడుక్కుతింటూ అందులోనే మిగిల్చి యీ గ్లాసు కొన్నాను..."

"అవుతే!"

"రెండణాల సగ్గుబియ్యం, అరణాల చక్కెర అరణాల బత్తాయికాయలు, ఒక పావలాకు అవ్వేంటమ్మా అవ్వి మొత్తం రూపాయి బేడ కావాలి!"

"ఎందుకూ!"

"ఎందు కేమిటి, డాక్టరు చెప్పాడు. అన్నం తింటే అరగదుట."

"నీకా? యింత పెద్దదానివైనా ప్రాణమంటే మమకారం పదల్లేదే నీకు."

"నా క్కాదు. అదేం చేసిం దనుకున్నా! అబ్బాయెనో! వాణ్ణి వొదిలిపెట్టి పోయిందిగా."

"ఎవరు?"

"ఎవరేమిటి? నీ దంతా విడ్డూరం. అదే మా కోడలు."

"ఎక్కడికి?"

"ఏమో!"

"ఎప్పుడు?"

"పదిరోజు లైంది."

"ఇంతకూ రూపాయి బేడా యెందుకో చెప్పావు కావేం?"

"కన్నకడుపు కావడాన నా కుంటుంది కాని యెవరి కేం పట్టింది? దానిదారి నది చక్కా లేచి పోయింది టెంగురంగా అంటూ. వాడు చస్తే దానికేం, వుంటే దానికేం."

"వాడికా యీ పరంజామా అంతా. తన ప్రాణంవుండగా నీచేతి పచ్చి మంచినీళ్లు ముట్టు కోనన్నాడు. ఏ దిక్కూ..."

"కోపం మానవుణ్ణి పశువుని చేస్తుంది. ఏదో కోపంగా వున్నప్పుడు అనివుంటాడు."

"నీకు దిక్కున్న చోట బ్రతకమన్నాడుగా నిన్ను. నేటికి నీవే దిక్కైనా వనమాటవాడికి."

"వాడి దేముంది నాయనా! పిచ్చి సన్యాసి. దానిమాటలు విని చెడ్డాడుగాని నా వరాలబాబు వాడికేం."

"ఊ! బాగానే వుంది..."

"ఇక్కడే కూచుంటే యేమా తుంది, దిక్కూ మొక్కూ లేకుండా మంచంలో ఒక్కణ్ణీ వదిలిపెట్టి. రా నాయనా! త్వరగా పోవాలి. వాడు మంచంలో 'అమ్మా!' అంటూ కలవరిస్తూంటాడు."

వింత పడుతూ లేచాను- సుబ్బమ్మకు డబ్బు యివ్వటానికి.

# పాతశంఖంలో కొత్తతీర్థాలు

ఈరంకి వెంకటరావు

**స్వాతంత్ర్యం:**

ఈరోజుల్లో స్వాతంత్ర్యం అంటే మనవాళ్ళ చేత మనమే స్వేచ్ఛగా బాధింప బడటం. మన జెండా కింద మన వాళ్ళను పరదేశీయుల కంటె కఠినంగా పాలించటం. వ్యక్తి స్వాతంత్ర్యం మాటల్లోనే, చేతల్లో శూన్యం.

**కీర్తి:**

దీని ప్రభావం తెలిసిన ప్రతీవాడూ దీని కోసం తాపత్రయ పడే అనాకార కాంత. లోకంలో అబద్ధాలు, అపసవ్య వ్యాపారాలు, అక్రమాలు, అన్యాయాలు దీనికోసం కూడా ఆచరణలో వున్నాయి. సిసలైన ప్రతిభావంతుడు దానికోసం ప్రయత్నించకుండానే కీర్తి కాంత దగ్గర చేరుతుంది. డాంబికులు ఎంత ప్రయత్నించినా లబ్ధి స్వల్పం.

**మాయ:**

కంటికి కనుపించక, మెదడుకు మాత్రమే గోచరించే ఒక ఊహావస్థ. కాని ప్రపంచం పుట్టినది మొదలు అంతమయేవరకూ అధికులు అల్పులతో, మాయికులు అమాయికులతో, పెద్దలు పిన్నలతో ఆడుకునే ఆట. ఒకరికి బాధ కలిగితేనే మరొకరికి ఆనందం కలుగుతుంది.

**మర్మం:**

పదిమంది నోళ్ళలోను, పదిమంది చెవుల లోను పడనంతకాలం యిది మర్మ మనిపించుకుంటుంది. వ్యాప్తి చెందిన కొద్దీ దీని పేరు మారిపోతుంది. అయితే రూపు మాత్రం అలాగే వుంటుంది.

**మంత్రి:**

కనీసం పనికైనా చదువూ, సంధ్యా కావాలిగాని, మంత్రి పదవికి ఏమీ అక్కరలేదు. ఓట్లు సంపాదించ గలిగితే ప్రధానమంత్రి కూడా అవొచ్చు. పదవిలోకి వచ్చేదాకా ప్రజల్ని పట్టటం. మంత్రాంగం ప్రజలకోసం కాదు, పదవి కోసం.

**బ్రాహ్మణుడు:**

పూర్వం భూసురుడు, యిప్పుడు భూతం. చదువుకుందుకు కూడా అవకాశం యివ్వకూడని మేధావి. పాలకులు,పాలితులు(అనేకులు) అణగ ద్రొక్కటానికి చూసే ఒక కులంవాడు. వాళ్లకి అపాయంలోనూ, అవసరానికి ఉపయోగించే స్వేచ్ఛ.

**బ్రాహ్మణేతరుడు:**

దక్షిణ హిందూదేశంలో అన్ని చదువులు, అన్ని ఉద్యోగాలు తన కోసమే సృష్టించబడినట్టు వ్యవహరించే ఒక తెగవాడు. బ్రాహ్మల్ని అణగ ద్రొక్కటమే జీవిత పరమావధిగా ఎంచే అమాయికుడు. సంకుచితత్వాన్ని పారద్రోలలేని బలశాలి.

**హరిజనుడు:**

ప్రభుత్వము, ప్రజలు ఎన్ని అవకాశాలు, ఎంత సహాయం యిచ్చినా ఉపయోగించుకోలేని కనిష్ఠ సోదరుడు. కొంచెం స్వశక్తితో అత్యున్నత స్థానంలోకి వెళ్ళగల అదృష్టశాలి. సంఘం బాగోగులకు సహకరించే పునాదిరాయి.



# కళాక్షేత్రం



## మన చిత్రాలలో మగపాటగాళ్లు

తెలుగులో టాకీ చిత్రాల నిర్మాణం ఆరంభమైనప్పుడు పాటకోసం మన చిత్రనిర్మాతలు ఆడతారలమీద కన్న మగతారలమీదే ఎక్కువ ఆధార పడ్డారంటే ఆశ్చర్యంలేదు. స్టేజిమీద ప్రసిద్ధగాయకులని పేరు గడించిన యడవల్లి, అద్దంకి, బందా, సి. ఎస్. ఆర్., కపిలవాయి, సూరిబాబు మొదలైన వారు అసంఖ్యాకులు వెండి తెరమీదికి వచ్చేశారు. కాని సినిమా సంగీతంలో కలిగిన పరిణామానికి వీరు తోడ్పడ్డట్టు కనిపించరు. ఆ కాలంలో ఇప్పటికీ సినిమాలలో నిలబడిఉన్నది సి. ఎస్. ఆర్., రఘురామయ్యా మాత్రమే.

సి ఎస్. ఆర్. అనే హ్రస్వనామం గల చిలకలపూడి సీతారామాంజనేయులు ఒకప్పుడు స్టేజిమీద విజృంభించి పాడి ప్రేక్షకులను ఆకర్షించినవాడు. ఆ పాటలో నాజూకుకన్న నిరంకుశత్వం జాస్తిగా ఉండేది. అప్పటి ప్రేక్షకులకు కావలసిన భావస్ఫూర్తి అతని పాటలో ఉండేది. కాని సి. ఎస్. ఆర్. పని పెట్టుకుని ఉత్తమనటుడు కావటానికి కృషిచేశాడు. జయించాడు. రాను రాను సి. ఎస్. ఆర్. సినిమాలలో ఒక హాస్యనటుడుగా స్థిరపడ్డాడు ఇవాళ మనం అతనినోట తెరమీదనుంచి వినే వన్నీ హాస్యపు పాటలే.

రఘురామయ్య జన్మతః పాటగాడు. అతను 'ప్రోడిజీ'. అనేక లక్షలమందిలో ఒకడు అపారగాన శక్తితోనూ గణిత శక్తితోనూ పుట్టుకువస్తాడు. రఘురామయ్య అటువంటివాడు. ఈ ప్రోడిజీలకు వేరే శిక్షణ ఇవ్వాలి. వీరు సానపట్టని వజ్రాలు. రఘురామయ్య సంగీతంలో క్రమశిక్షణ పొందాడు. అతని ఆశకు తగినంత క్రమశిక్షణ లభించిందని చెప్పలేను గాని, ఈనాటి సంగీత ప్రియులకు ఆనందం కలిగించేపాటి సంగీతపు మెళుకువలూ, స్వరజ్ఞానమూ, రాగజ్ఞానమూ, రఘురామయ్య కున్నాయి. దేనికన్నా సిద్ధపడే శారీరం ఉంది. అతని కంఠంలో కిన్నెర పలుకున్నది ఆకారంలో, రాగప్రస్తారంలో చక్కని శైలి ఉన్నది.

కాని నిజానికి గాన ప్రాధాన్యం లేని చిత్రాలలోనూ, సన్నివేశాలలోనూ రఘురామయ్య చేత పాడించటం వృథా. అతన్ని సరిగా వినియోగించాలంటే సంగీత చిత్రాలు (Musicals) తీయాలి.

అన్ని సన్నివేశాలూ, వాటి రసాలూ సంగీతం ద్వారా వ్యక్తం కావాలి. శక్తి సామర్థ్యాలు గల సంగీత దర్శకు లుంటే రఘురామయ్యను స్వేచ్ఛగా వదలినట్టయితే తెలుగువాళ్ళ చెవుల తుప్పు వదలగొట్టే చిత్రం తయారవుతుంది. (నేనే 10 లక్షలు ఖర్చుపెట్టి అటువంటి చిత్రం నిర్మించ బూనుకుంటే నాయికాపాత్రకు ఎస్. వరలక్ష్మిని ఎన్నుకుంటాను.)

మనకు ఉండి లేకుండా పోయిన ఇంకొక "ప్రాడిజీ" ఎస్. రాజేశ్వరరావు. ఎస్. రాజేశ్వరరావు కూడ క్రమశిక్షణ పొందినవాడే. ఇతను కొంత కాలం ఫిడేలు నాయుడిగారిదగ్గిరా, కొంత కాలం కీ॥ శే॥ సైగల్ దగ్గిరా సంగీతం అభ్యసించటమే కాక అనుక్షణమూ తనకు తానే గురువై చెవికి వినిపించే ప్రతి సంగీతంయొక్క రహస్యాలూ అన్వేషిస్తూ ఉంటాడు. పాశ్చాత్య సంగీతమైనా సరే తనకి లొంగివస్తేగాని అతనికి తృప్తిలేదు. అయితే ఇతను సంగీత దర్శకుల శ్రేణిలోకి వెళ్ళిపోయాడు. వాసన్‌గారి దయవల్ల ఇతను తెలుగు సినిమా పరిశ్రమకు లభించే పరిస్థితి ఏర్పడినా ఇతని గానాన్ని మనం ప్రత్యక్షంగా వినే అవకాశాలు తక్కువేమో.

గడచిన పదేళ్ళనుంచి మన సినిమా సంగీతానికి ప్రతినిధిగా నిలబడి ఉన్నవాడు చిత్తూరు వి. నాగయ్య. నాగయ్య సంగీతంలో రాజీ పద్ధతిలేదు అది ప్రధానంగా కర్నాటక సంగీతం హిందూస్థానీ, పంజాబీ కలగాపులగం లేకుండానే సినిమా సంగీతం రక్తికట్టవచ్చునంటూ చేసి నాగయ్యా, ఆయన తీసిన "త్యాగరాజు" ప్రత్యక్షతార్కాణం. ఈ పదేళ్ల కాలంలోనూ నాగయ్య పాట కొంత పరిణామం చెందక పోలేదు. ఒకప్పుడాయన పాటలలోనూ, పాటలోనూ కూడా బిగి తక్కువగా ఉండేది. కాని రానురాను అనుభవం ఆయనకు చాలా ఉపకరించింది. వస్తుతహా మేటి గాయకుడు కాకపోయినా, ఆయన ఇటీవలి చిత్రాలలో పాడినపాటలు వింటుంటే పాటలో ఉండే భావాన్ని ఎట్లా వ్యక్తం చేయాలో, పాట ఎట్లా ఎత్తుకోవాలో, ఎట్లా నిలపాలో, ఆర్కెస్ట్రాను ఏమాత్రం అదుపులో పెట్టాలో నాగయ్యకు తెలిసినట్టు మరొకరికి తెలుసునా అనిపిస్తుంది.

ప్రస్తుతం మన చిత్రాలలో నేపథ్యానా, పరోక్షంగానూ పాడేవారిని గురించి కూడా కొంత చెప్పాలి. వీరిలో చెప్పుకో దగినవాడు గంటసాల వెంకటేశ్వరరావు. గంటసాల దక్షత గల సంగీత దర్శకుడు ఇతని ప్రాభవంతో సినిమా సంగీతం కొత్తదారులు తొక్కుతున్నది. పాటల్లోనూ, పాటలోనూ లాలిత్యం తీసుకురావటంలోనూ, ఇతర సంగీతాలలోని లక్షణాలను మచ్చికచేసి తెలుగు సంగీతానికి మప్పటంలోనూ గంటసాల విజయం సాధించటమే కాక పద్యాలు మొదలుకొని పదాల వరకూ భావోద్రేకంతోనూ, రసవత్తరంగానూ పాడి వినిపిస్తున్నాడు.

నేపథ్యసంగీతం పాడేవారిలో ఎం. ఎస్ రామారావూ, వి జె వర్మా కూడా చెప్పుకోదగినవారు వీరి శారీరాలు నిండుగా ఉద్రేకవంతంగా ఉండి సరి అయిన సంగీత దర్శకుల సహాయముంటే కొన్ని కొన్ని సన్నివేశాలకు ఎంతైనా నిండుచేకూర్చగలిగిఉన్నాయి. — బృహస్పతి




(గతసంచిక తరువాయి)

## ఇమ్మడి హరిహరరాయల పుత్రులు

(క్రీ. శ. ౧౪౦౪-౧౪౦౬)

ఇమ్మడి హరిహరరాయ లసువులు విసర్జింపగనే సామ్రాజ్యాధిపత్యమునకై యతని పుత్రులకు పోరాట ప్రారంభమైనది. ప్రథమ విరూపాక్ష, ద్వితీయబుక్క, ప్రథమ దేవరాయలు మువ్వురును సామ్రాజ్యపదము తమదే యని ప్రకటించి సింహాసనమును దౌర్జన్యముతో నాక్రమించుకొనవలయునని ప్రయత్నము సేయగడగిరి. ఈ యన్నదమ్ముల పోరాటము రెండేండ్లపర్యంతము సాగెను, దాని వృత్తాంతమునుగూర్చి తెలియవచ్చు విషయము స్వల్పమే. తండ్రి మృతినందిన వెంటనె ప్రథమ విరూపాక్షరాయలు రాజ్యాభిషేకము జేసికొని యొక సంవత్సరకాలము ప్రజాపాలన మొనర్చెను. అతని దొలగద్రోసి యటుపిమ్మట ఇమ్మడి బుక్కరాయలు సింహాసనము నధిష్ఠించి కొంతకాలము రాజ్యము జేసెను. తరువాత మొదటి దేవరాయలు సింహాసనము నాక్రమించుకొని క్రీ. శ. ౧౪౦౬ మొదలుకొని ౧౪౨౨ వఱకు బదునారేండ్లు విజయనగర సామ్రాజ్యమును మహావైభవముతో బరిపాలించెను.

## మొదటి దేవరాయలు

(క్రీ. శ. ౧౪౦౬-౧౪౨౨)

అన్నదమ్ముల యుద్ధమున తుదకు విజయుండై మొదటి దేవరాయలు వజ్రసింహాసనముపై గూర్చుండి క్రీ. శ. ౧౪౦౬ వ సంవత్సరము నవంబరు నెల ౭ వ తేదినాడు పట్టాభిషేకము గావించుకొనెను. ఇతని శాసనముల నితడు ప్రతాపదేవరాయ లనియు గాడాచిక్కముగ ప్రౌఢదేవరాయ లనియు దేర్కొనబడి యున్నాడు. ఇతడు విజయనగర సామ్రాజ్యమును బాలించిన పదునారేండ్లును నిరంతరము శత్రువులతో బోరాడవలసి వచ్చెను. బహమనీ సుల్తానుతోడనో, యతని మిత్రులగు తెలింగాణపు వెలమలతోడనో, కొండవీటి రెడ్లతోడనో, యే కారణమువల్లనైన నేమి, యుద్ధము, తప్పినది కాదు. ఎందఱు బలాధికులైన శత్రువులు పైకొనివచ్చినను బెదరిపోవక మాఱొడ్డి వారితో పరిపోరుచు దేవరాయలు దన పరువు ప్రతిష్ఠలను నిలుపుకొనుటయే కాక పరరాష్ట్రములను సాధించి నిజరాజ్యమున గలుపుకొని సామ్రాజ్య వైశాల్యమును బెంపొందించెను

రాజ్యాభిషేకమైన వెంటనే దేవరాయలు సంగ్రామమునకు నడువ వలసి వచ్చెను. సింహాసనము నధిష్ఠించెనో లేదో యంతటనె వార్త వచ్చినది, బహమనీ సుల్తాను ఫిరోజుశాహు మహాప్రచండసైన్యముతో విజయనగరముపై నెత్తి వచ్చుచున్నాడని. సుల్తాను దండయాత్ర నిరీక్షితము గాదు; ఎదురు చూచుచుండినదే. ఇంతదనుక రాక పోవుటయే చిత్రము. ఇమ్మడి హరిహరరాయలు గతించిన పిమ్మట యంతః కలహముల మూలమున విజయనగరసామ్రాజ్యము సంక్షుభితమై పరరాజు లెత్తివచ్చుట కనుకూలముగా నుండినది. రాయలపై నెల్లప్పుడు

కయ్యమునకు గాలుద్రవ్వుచుండిన ఫీరోజుశాహా అట్టి యనుకూల తరుణమున నెత్తిరాక దేవరాయల పట్టాభిషేకమగు వఱకు కాల వేచియుండెనో తెలియదు.

ఈ దండయాత్రయొక్క కారణమును మహమ్మదీయ చరిత్రకారులు పలువిధముల వర్ణించియున్నారు. తబకాత్-ఇ-అక్బరీ యందు నిజామ్-ఉద్-దీన్ అహమదిట్లు వ్రాసియున్నాడు. దేవరాయలు బంకోలు (ముద్గోలు) ప్రాంతమున నివసించుచుండిన సౌందర్యవతియగు నొక విలాసినిపై మరులుగొని దాని నొడి తెచ్చుటకు ఘాజుల నంపెను. బంకోలు బహమనీ రాజ్యాంతర్గత మగుటచేత దన రాష్ట్రమునకు ఘాజుల నంపినందుకు దేవరాయలపై కోపించి యతని శిక్షించుటకు ఫీరోజు శాహు గొప్ప సైన్యముతో కూడ విజయనగరముపైకి నెత్తివచ్చెనట. కథారచనయం దద్భుతశక్తిగలవాడగు ఫెరిష్తా పై కథను పెంచి శాఖోపశాఖలు గల్పించి హృదయంగమముగ వర్ణించియున్నాడు. దీనితో పాటు ఫీరోజుశాహు దండయాత్రకు ఫెరిష్తా మఱియొక కారణముగూడ తెలుపుచున్నాడు. దేవరాయలు గుజరాతు మాళవ దేశపు సుల్తానులతో చెలిమి చేసికొని ఫీరోజుశాహును వరకు సేయక, అంతకు పూర్వ మతనితో జేసికొనియుండిన యొడంబడిక ప్రకార మతనికి జెందవలసిన కప్పము నాలుగేండ్ల వఱకు గట్టక నిరాకరించెననియు, తత్కారణమున సుల్తాను దండు వెడలెననియు వ్రాసియున్నాడు. బుర్హాన్-ఇ-మ ఆసీరు రచయిత యగు సైయ్యదు అలీ బిన్ అజీజ్-ఉల్-ల్లా తబాతబకు పైజెప్పిన రెండు కారణములును దెలియవు. బంకోలు సుందరాంగిపై దేవరాయలకు గల్గిన మోహమును గాని గుజరాతు మాళవ సుల్తానులతోడి దేవరాయల చెలిమిని గాని యతడెఱుగడు. విజయనగర సామ్రాజ్య వాస్తవ్యులైన కాఫిరులపై జిహాదు సేయుటయే ఫీరోజుశాహు యొక్క ప్రధానోద్దేశమని యతడు తెల్పియున్నాడు. మహమ్మదీయ చరిత్రకారు లిట్లు ఫీరోజుశాహు దండయాత్రకు కారణము నొకటిచుగాక పలువిధముల వివరించుచున్నారు. దేవరాయలు సింహాసనము నెక్కియు నెక్కకముందే బహమనీ సుల్తాను రాజ్యమునందు నివసించుచుండిన యొకానొకవనితపై మరులుకొని దానినొడి తెచ్చుటకు బహమనీ రాష్ట్రమునకు దళముల నంపి ఫీరోజుశాహుతో దగవును తెచ్చిపెట్టుకొనెనని నమ్ముటకు వీలులేదు. అప్పటికింకను దేవరాయలు సామ్రాజ్యమున సుప్రతిష్ఠితుడు గాలేదు. ప్రచ్ఛన్న శత్రువు లతని బరివేష్టించి యతని యసువులు గొన తలచి వేచియుండిరి.* నవసింహాసనస్థుండగుటను బహమనీ సుల్తానుతో కలహించినాడనుట నమ్మదగని విషయము. మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలలోని సత్యాసత్యము లెట్టులున్నను, ఫీరోజుశాహు దండయాత్రకు వాస్తవమైన కారణము బహమనీ సుల్తానులకును విజయనగర రాయలకును దరతరములనుండి వచ్చుచుండిన వైరమే.

ఈ యుద్ధవృత్తాంతము మహమ్మదీయ చరిత్రలయందు వర్ణింపబడి యున్నను నదియంతయు సత్యమని నమ్ముటకు వీలులేదు. మతపక్షపాతకారణమున తురకల యాధిక్యమును, హిందువుల సత్త్వహీనతను ప్రకటించుటయె వారి ముఖ్యోద్దేశము. అందు సత్యదూరములైన యంశములు పెక్కుగలవు. కావున నందు వర్ణింపబడిన విషయములన్నియు వాస్తవమని నమ్ముటకు వలనుపడదు.

మహమ్మదీయ చరిత్రల ననుసరించి యుద్ధరంగము కృష్ణా తుంగభద్రల మధ్యదేశమని చెప్పవలసి యున్నది. లభ్యమైన చరిత్రాధారములను బరిశీలించి చూడగా నదియంత

---

* దేవరాయల రాజ్యప్రారంభ దశయందు నాతతాయులు కొందఱు యతని వధించుటకు ప్రయత్నము సల్పిరి. కొందఱు దుష్టులు ఖడ్గహస్తులై నగరి పెద్ద దర్వాజాను ముట్టడించి దేవరాయలను వధింప గడగిరనియు, ప్రధానులలో నొక్కడగు లక్కణ దండనాయకుడు వారలను జంపి రాయదేవుని రక్షించెననియు, క్రీ. శ. ౧౪౧౦ నాటి యొక హంపి శిలాశాసనమున జెప్పబడుచున్నది. పై జెప్పిన హత్యాప్రయత్నము శాసనకాలమునకు అనగా క్రీ. శ. ౧౪౧౦ వ సంవత్సరమునకు పూర్వము ప్రాయశః రాజ్యారంభమునందె జరిగి యుండవలయును.

కంటె విస్తృతమైనదని తెలియ వచ్చుచున్నది. యుద్ధము నడచిన దొక కృష్ణాతుంగభద్రల మధ్య సీమయందు మాత్రమే కాదు. రాజ కొండ, కొండవీడు రాజ్యములును, విజయనగర సామ్రాజ్యాంతర్గత యుదయగిరి రాజ్యమును యుద్ధరంగమున జేరినవే. హిందువుల సహాయము వలన ఫిరోజుశాహు కీ దండయాత్రయందు జయము గలిగెనని చెప్పుట కిష్టపడక రాచ కొండ కొండవీటి రాజ్యములను మహమ్మదీయ చరిత్రకారు లీసందర్భమున స్మరింపక విడిచిపెట్టి పోరాటమంతయు బహమనీ సుల్తానునకును విజయ నగరరాయలకును కృష్ణాతుంగభద్రలనడిమి దేశము ననే నడచినదనియు, యన్యసహాయము లేక తురకలే జయమందిరనియు వ్రాసిరి.

దేవరాయలు బలాఢ్యుడనియు, యన్య సహాయములేక యతని రాజ్యముపై దండయాత్ర జయప్రదముగ సాగించుట సాధ్యము గాదనియు ఫిరోజుశాహు చక్కగ నెఱుగును. కావున తన పక్షమును బలపఱచుకొనుటకై తెనుగు రాజుల నొక వారితో సఖ్యము జేసికొని వారి సహాయమును బడసెను. బహమనీ వంశజులకు పరంపరగ హితులైన వెలమలు ఫిరోజుశాహునకు తోడ్పడుట యందు వింత లేదు. కుమారగిరి రెడ్డి నిర్యాణా నంతరము కొండవీటి రాజ్యమున కధిపతియైన పెదకోమటి వేమారెడ్డి రాయలయెడ ద్వేషభావము గల వాడగుటను గ్రహించి యతనితో చెలిమి వాటించి సాయ మర్థించెను. పెదకోమటి వేమా రెడ్డికి విజయనగర రాయలపై పగ గలుగుటకు ప్రబలమైన కారణములు గలవు. రాయలు సమయ మనుకూలపడినప్పుడెల్ల కొండవీటి రాష్ట్రము నాక్రమించుకొనుటయే కాక యతని విద్వేషియు రాజమహేంద్రవర రాజ్యాప హర్తయునగు కాటయ వేమారెడ్డితో నిమ్మడి హరిహరరాయలు,దేవరాయల నలహాప్రకారము, మైత్రినల్పి ప్రాపై నిలచుటయు నతని చిత్తము నెరియించుచుండెను. రాయలపై పగతీర్చుకొనుట కతని కప్పుడు మంచి సమయము చిక్కినది. కావున ఫిరోజుశాహు ప్రార్థన నంగీకరించి యాతడు కోరినట్లు విజయనగర దండయాత్ర యందు తోడ్పడుటకు పెదకోమటి వేమారెడ్డి యొప్పుకొనెను. వెలమ రెడ్డిరాజుల సాయము వలన రాయలపై దనకు విజయము చేకూరగల దను నమ్మకము ఫిరోజుశాహు హృదయమున దృఢముగ బాదుకొన్నది. ధైర్యముతో నతడు యుద్ధప్రయత్నములు సేయ నారంభించెను. విజయ నగర రాజ్యముపై రెండువైపులనుండి యేక కాలమున దండువెట్టిన, రాయల సైన్యము విభక్తమై యతని బలము సన్నగిలునని యోచించి, తాను కృష్ణా తుంగభద్రల యంతర్వేదిపై దండు వెడలినప్పుడె తన పంపులతో గూడ వెలమ రెడ్డి దళములు విజయనగర సామ్రాజ్యాంతర్గత తీరాంధ్ర భూమిపై నడువవలెనని తీర్మానించెను. ఈ సంవిధానము యుక్తి యుక్తమే; సమర విద్యాకోవిదులు సన్నుతింపదగినదే. అందువల్ల ఫిరోజు శాహు మనోరథము సంపూర్ణముగ గాకపోయి నను గొంతవఱకైనను సిద్ధించినది. సుల్తాను ఉద్దే శమును దేవరాయలు చక్కగా గ్రహించెను; అతడనుకొనినట్లు రాయలు తనదళములను విభ జింపలేదు. తీరాంధ్రదేశము శత్రువుల వశమైన నగుగాక; తన బలముల నన్నిటిని కృష్ణా తుంగ భద్రల యంతర్వేది యందు కూర్చి యొక్కుమ్మడి సుల్తాను నెదుర్కొనుటయే శ్రేయస్కరమని నిశ్చ యించి యట్లొనర్చి యుద్ధమునకు సంసిద్ధుడాయెను.

ఈ దండయాత్రయందు ఫిరోజుశాహు సంపూర్ణ విజయమును బొందెనని మహమ్మదీయ చరిత్ర కారులు వ్రాసియున్నారు. తక్కినవారికంటె ఫెరిష్తా యుద్ధచరిత్రను విపులతరముగ వర్ణించి యున్నాడు. అతడు వర్ణించిన యుద్ధవిశేష ముల నిట్లు సంగ్రహపఱచి చెప్పవచ్చును. నిర్ని రోధముగ ఫిరోజుశాహు దండుతో గూడ కూచి చేసి వచ్చి విజయనగరముకడ విడిసి కోటను దొమ్మిచేసి లగ్గలువట్ట బ్రయత్నము జేసెను; కాని యతనికదక నెరవేఱలేదు; దుర్గ సంరక్షక దళములచే విదళితుడై గాయపడి పరాఙ్ముఖుడై పోవలసివచ్చెను; కాని దండయాత్రను విరమించు కొనలేదు. కోటచెంత తస్సావేసి కూర్చుండి పరిసరప్రాంతములను కొల్లగొనుచు దేవాలయ ములను పాడుసేయుచు, పట్టణగ్రామాది జన నివాసస్థలములను దగులబెట్టుచు, బ్రజలను నానావిధముల హింసింప గడగెను. అతడు పెట్టు బాధల కోర్చుకొనజాలక మంత్రి సామంతాది నియోగివర్గమును తపోధనులగు బ్రాహ్మణులును

రాయలవారిదర్శనము చేసికొని రాష్ట్రజనము పడు కష్టములను వివరించి చెప్పి సుల్తానుతో సంధి చేసికొనుట శ్రేయస్కరమని విన్నవించిరి. దేవరాయలు వారి విన్నపము నంగీకరించి సుల్తాను శిబిరమునకు రాయబారుల నంపి సంధిని ప్రసాదింపవలయునని వేడుకొనెను. అపార ధనము నొసగి, రాయల కుమార్తె నిచ్చి తన కుద్వాహ మొనర్చి, బంకాపుర దుర్గమును వశపఱచిన గాని సంధికొడబడనని ఫిరోజుశాహు జవాబుచెప్పెను. అందుకు సమ్మతించి, దేవరాయలు దన కుమార్తెను సుల్తాను కిచ్చి పెండ్లిచేసి సంధి చేసికొనెను; విజయుండై సుల్తాను తన రాజధానికిమరలిపోయెను.

నిజామ్-ఉ-'ద్దీన్ అహమదుకూడ ఫెరిష్తా చెప్పిన కథనే చెప్పియున్నాడు. కాని వారిరువురికిని ఒక ముఖ్య భేదము గలదు. రాయల కూతురి వివాహ ప్రస్తావము నిజామ్-ఉ-'ద్దీన్ గ్రంథమందు లేదు. రాయల కూతు నిచ్చి తన కుద్వాహ మొనర్చినగాని సంధి కొడబడనని ఫిరోజుశాహు పట్టుబట్టెనని కాని, యందుకు సమ్మతించి దేవరాయలు దన పుత్రికను సుల్తాను కిచ్చి పెండ్లిచేసెనని కాని యతడు చెప్పలేదు. విషయ మల్పమైనది కాదు. మహమ్మదీయ ప్రపంచమునకు ప్రతిస్పర్థియై పరిపోరుచుండిన రాయల కుమార్తెను మహమ్మదీయ ప్రభువు విజయలక్ష్మితో కూడ కరగ్రహణము సల్పుట యసాధారణ విషయము. ఏ మహమ్మదీయ చరిత్రకారుడును విస్మరింప నొల్లనిది. ఈ వివాహము వాస్తవముగ జరిగియుండిన నిజామ్-ఉ-'ద్దీన్ దీని నేల స్మరింపక విడిచిపెట్టెనో! ఇక బుర్హాన్-ఇ-మఆసీరు రచయిత సయ్యదు అలీ వర్ణించిన యుద్ధ వృత్తాంతము సారయుదము. దానితీరే వేఱు. అతడు ఫిరోజుశాహు విజయనగర సమీపమునకు వచ్చినట్లు కూడ చెప్పడు. సుల్తాను సైన్యము విజయనగర రాష్ట్రమును ప్రవేశించినంతటనే కొల్లసేయుటకును కొల్లగొట్టుటకును ప్రారంభించెను; ప్రజలను శిక్షించుటకొఱకు వారి యునికిపట్లను బరశురామ ప్రీతి గావించెను. ఘనూరు మూసల్కలులకు చెందిన సీమలను గొన్నింటిని బాహు పరాక్రమముచే సాధించి వశపఱచుకొనెను. నిర్ణీతమైన కప్పము మొత్తము ముప్పదిమూడులక్షల ధనము రాబట్టుకొని కొల్లగొన్న విపుల వస్తుచయముతోగూడ ఫిరోజుశాహు మరలి నిజ రాజధానికి బోయి చేరెను. సయ్యదు అలీ వర్ణించు యుద్ధ వృత్తాంతమును బట్టిచూడగా ఫిరోజుశాహు దండయాత్ర ఘనూరు మూసల్కలు ప్రాంతములలో సాగి పోయినట్లు చెప్పవలసి యున్నది. ఈ రెండు ప్రదేశములును రాయచూరు జిల్లా పశ్చిమోత్తర భాగమున నుండు దేవదుర్గ తాలూకాయందు కృష్ణానదీ దక్షిణ తటమునం దున్నవి. అచటి సీమలను గొన్నింటిని జయించి ఫిరోజుశాహు నిజరాజధానికి వెనుదిరిగి పోయియుండినచో నతడు విజయనగరమునకు రానేలేదని చెప్పవలసి యున్నది. మఱియు సయ్యదు అలీ కూడ రాయల కూతు వివాహవృత్తాంతము నెఱుగడు. సుల్తాను దేవరాయల నెదుర్కొనినట్లు కాని, యుద్ధమున నతనినోడించి సంధికొడబఱచినట్లు కాని చెప్పడు. ఇట్లు పరస్పర విరుద్ధములైన మహమ్మదీయ చరిత్రకారుల రచనల నాధారపఱచుకొని, యీదండయాత్రయందు జరిగిన సంగతుల సత్యాసత్యములను నిశ్చయించి చెప్పుటకు వీలు కాదు. కాని చింతనీయాంశములగొన్నిటి నిచటవివరించుట సరి. ఫిరోజుశాహు ఎత్తివచ్చుచున్నాడని యెఱిగియుం నతని కడ్డపడు ప్రయత్నమును తలపెట్టక యతనిరాక నెదురు చూచుచు దేవరాయలుమిన్నక విజయనగరమున గూర్చుని యుండెననుట విశ్వసనీయము గాదు; మఱియు, కోట లగ్గలుపట్ట సుల్తాను గావించిన యత్నము భగ్నముజేసి యతనిదూరము దఱుమగొట్టిన దేవరాయలు ఫిరోజుశాహునకు దన కూతు నిచ్చి వివాహముజేసి యవమానకరముగు సంధి కొడబడెననుటయు సంశయగ్రస్తమే. నిజామ్-ఉ-'ద్దీన్ అహమదుకాని సయ్యదు అలీ కాని, యీ వివాహము మాట యెత్తక పోవుట వలన నిది సత్యము కాదని తోచుచున్నది. ఫెరిష్తా కథను యథార్థమని రుజువు సేయగల సాధనాంతరము లభించు వఱకును దేవరాయలు తన కుమారికను ఫిరోజుశాహు కిచ్చి పెండ్లిచేసి సంధి నిలిపెనని యొప్పుకొనుటకు వీలుపడదు.

తూర్పుదేశమున జరిగిన యుద్ధమును గూర్చి విశ్వాసపాత్రమైన సాక్ష్యము లభ్యపడి యున్నది. వెలమరెడ్డి దళములతో గూడ సుల్తాను ఫౌజాల

ఉదయగిరి రాజ్యముపై దిగువారితిని. ఈ సమయముననే శాబోలు దండయాత్రికుల మార్గము నరికట్టి వెలుగోడు తెలుగు చోళ ప్రభువు, తిప్పరాజు, కొచ్చెర్లకోట కడ యుద్ధము జేసినది. వెలమ రెడ్డి తురక దళములు కడప మండలము లోని బండికనుమదారి నడచినవి. రాయరాజువ కనుమ నాక్రమించి మార్గము నరికట్టెను. ఇరువాగులకు యుద్ధము జరిగెను. దేవరకొండ వెలమ దొర, పెదవేదగిరి నాయనిపుత్రుడు రామచంద్ర నాయుడు, ఘోరముగా బోరి విజయనగర బలముల బారిదోలి కనుమ మార్గమును నిర్విరోధము గావించి ఫీరోజు శాహు మన్ననకు పాత్రుడాయెను. తత్ప్రసాదసీమలయందమరమాగాణముల ననుభవించుచుండిన సంబెటపరిపల్లి రాజులను వెలమవా రోడించిన దీ దండయాత్ర యందై యుండవచ్చును. పొడచేడు దుర్గాధిపతియు, సుప్రసిద్ధశూరశిఖామణియునగు పోలేపల్లి బుక్కరాజు వెలమ వారిచే జిక్కిన దీ సమయమున నేమో. ఈ దండయాత్రకు ఫలితముగ నుదయగిరి రాజ్యమున జాలభాగము రాయసామ్రాజ్యము నుండి విడిపోయి శత్రుహస్తగతమైనది. కడప మండలమునకీశాన్య భాగమునను పొత్తపి, పులుగుల నాములు రెండును రెడ్లకు నైవసమాయెను. క్రీ. శ. ౧౪౧౩-౧౪ వ సంవత్సరము వఱకును ఏడేండ్ల పర్యంతము రెడ్ల ప్రభుత్వ మచట సాగెను. రాయసామ్రాజ్యముచే బరివృతమైన నీభూములపై రెడ్డిరాజుకాల మెట్లు దొరతనము సేయగల్గిరో వివరించి చెప్పుటకు సాధ్యము గాదు.

సమరాంగణమున రాయరాజువను బలుతావుల నిర్జించి విస్తారమైన రాష్ట్రము నాక్రమించుకొన్నను మిత్రమండలి విజయము సంపూర్ణమైనదని యెంచుటకు వీలులేదు. ఏలన, వెలమ రాజ్యమునకు బొడ్డనదగు పానుగంటి దుర్గము నుండి దేవరాయలను వెడలదోలుటకు వారికి శక్తిచాలదాయె. ఈ దండయాత్రయొక్క కడపటి దశయందేమిసంభవించెనో తుదకది యెట్లు పర్యవసాన మందెనో తెలియదు. సుల్తానును రాయలతో సంధి కుదిరిన వెంటనె యిచటను యుద్ధ మాగిపోయి యుండవచ్చును. దండయాత్ర యెట్లు పర్యవసాన మందియుండినను, దాని మూలమున రాయరాజ్యమున గొప్ప కలవరము గలిగినది. అమరనాయకులు గొందఱు రాయల యోటమికి గారణ మాతని బలక్షయమని తలచి స్వతంత్రులగుటకు బ్రయత్న మొనర్చిరి. కడప మండల మొదలి పుష్పగిరి ప్రాంతమున మల్లరాజులని ప్రతీతి నందిన యాంధ్రచోళ క్షత్రియులు రాజ్యమేలు చుండిరి. వీరి యందు అప్రతిమల్లగంగయదేవచోడమహారాజును, నతని పుత్రుడు ప్రతిమల్ల అహోబలదేవ చోడమహారాజును ముఖ్యులు. పైదేరొక్కన్న యవాంతరమును సందు చేసికొని వీరు రాయలపై దిరుగబడిరి. క్రీ. శ. ౧౪౧౩-౧౪ వ సంవత్సరమున దేవరాయలు తన పుత్రుని విజయరాయలను గొప్ప సైన్యముతో గూడ వారిమీది కంపెను. విజయరాయలు వారితో హోరాహోరిగ బోరి వారిని నిర్మూలము గావించి రాయల యధికారము నా ప్రాంతముల యథాపూర్వము నెలకొల్పుటయే కాక రెడ్లను వెడలగొట్టి పొత్తపిపులుగుల నాడులలో గూడ నుదయగిరి రాజ్యమును సర్వము స్వాధీనపఱచుకొనెను.

వైదేశిక దండయాత్రలచే కలగుండు వడి యుండిన విజయనగర సామ్రాజ్యమున శత్రూపద్రవముల నణచి శాంతిని నెలకొలుపుచున్న సమయముననే దేవరాయలు రాజమహేంద్రవర రెడ్డి రాజ్యవ్యవహారములందు ప్రవేశము గలిగించు కొనవలసి వచ్చెను. విషయము సుబోధమగుటకై యప్పటి రెడ్డి రాజ్యచరిత్ర నిచట సంగ్రహముగ వివరింపవలసియున్నది. క్రీ.శ. ౧౪౦౨వ సంవత్సరమున కొండవీటి రెడ్డిరాజు, కుమారగిరి, యస్తంగతుడాయెను. అతని యేకపుత్రుడు తతని కంటె ముందె లోకాంతరగతుడగుటచేత, అతని యనంతరము రెడ్డిరాజ్యమున కతనిజ్ఞాతి పెద కోమటి వేమారెడ్డి భాగ్యస్థుడాయె; కాని రెడ్డి రాజ్యమంతయు నతనికి వశపడ లేదు. కుమారగిరిరెడ్డి తన బావయు ప్రధానియు నగు కాటయవేమారెడ్డిని తాను సజీవుడై యుండగనె రాజమహేంద్రవర రాజ్యమున కధిపతిగ నియమించి యుండుటవలన, తూర్పుదేశము నంతటిని అతడు వశపఱచుకొని రాజమహేంద్రవరము రాజధానిగ పాలింపగడగెను. మిగిలి యుండిన కృష్ణ దక్షిణ రాష్ట్రమునకు మాత్రము

పెదకోమటి వేమారెడ్డి యధిపతియై తన పూర్వి
కులవలె కొండవీటినుండి పాలింపదొడగెను.
రెడ్డిరాజ్య మిట్లు రెండు స్వతంత్ర సంస్థానము
లుగ జీలిపోయినది. ఆద్యమునుండియు నీ రెండు
సంస్థానములకు పొందు కుదురలేదు. రాజ
మహేంద్రవరరాజ్య మేలుటకు గాటయవేముడు
బాధ్యుడని పెదకోమటి వేమారెడ్డి యొప్పుకొన
లేదు. కావున వారికి వైరము గలిగెను. మఱియు
రాచకొండ వెలమవా రతనియెడ ద్వేషము
వహించి యతని రాజ్యమునం దల్లరులను రేప
నారంభించిరి. రాజ్యచ్యుతుడై పరదేశముల
ప్రవాసముండిన తెలుచోళ రాకుమారుని, యన్న
దేవచోడుని, బిలిపించి యతని రాజమహేంద్ర
వర రాజ్యమున సంక్షోభము గల్గించు నుద్దేశ
ముతో నచటి కంపిరి. అన్నదేవచోడుడు చోడ
భక్తి రాజు కుమారులలో నొక్కడు; భీమలింగ
మనుజేశ్వరుని వైమాతురుడు. రెడ్డి రాజుల
కును వీరికిని సంబంధ బాంధవ్యములు గలవు.
రెడ్డి రాజులు భీమలింగని పక్షము
వహించి పితృపైతామహమైన రాజ్యము
నతని కిచ్చి యన్నదేవుని దేశకానిని చేసిరి. ఈ
కారణమున నతనికి రెడ్లయెడ వైరము గలిగెను.
రెడ్లకు ప్రకృశ్య మిత్రులైన వెలమవారి కడ కేగి
వారి నాశ్రయించి కొంతకాలము వారి సంస్థా
నము నందుండెను. ఈ కాలముననె విజయనగర
దేవరాయలు జయించిన నగరుకోటను మరల
స్వాధీనము జేసికొనుటకు కత్తిగొనుచుండిన ఫిరోజు
షాహునకు దోడై చని కర్ణాటకుల తోడి యుద్ధ
మున దన పరాక్రమమును జూపి యతని మన్ననకు
పాత్రుడాయెను. కులక్రమాగతమైన రాజ్యమును
స్వాధీన పఱచుకొన నలయునని దృఢసంకల్పము
గల సుప్రసిద్ధ వీరుని రాజమహేంద్రవర రాజ్య
ముపై కంపిన కాటయ వేముని కతడు ప్రక్క
లోని బల్లెము కాగలడని వెలమదొరల నమ్మ
కము. అన్నదేవుడు దన వెలమ మిత్రుల నమ్మ
కమును వమ్ము సేయలేదు. వా రుద్దేశించినట్లు
కాటయ వేముని రాజ్యమున గొప్ప యల్లరిని
రేపెను. కృష్ణా గోదావరుల మధ్య తీరదేశము
నాక్రమించు కొనెను. రాజమహేంద్రవర పట్ట
ణమును నైవసము గావించుకొని దన యధి
కారము నచట నెలకొల్పెను. అన్నదేవు డిట్లు
కృష్ణా గోదావరుల మధ్యదేశము నాక్రమించు
కొనుచుండిన సమయముననె దేవరకొండ వెలమ
రాజు, పెదవేదగిరినాయడు, గోదావరీలోయగుండ
తీరదేశము జొచ్చి, దక్షిణ కళింగ మండలి రెడ్డి
రాష్ట్రముపై బడెను. ఉభయపార్శ్వముల శత్రుల
మధ్యబడిన కాటయవేముని స్థితి యడకొత్తులోని
వక్కగతి యాయెను. పదమట రాజధానితో గూడ
దేశమంతయు నన్నదేవుని చేజిక్కెను;
తూర్పున కళింగ రాష్ట్రము నంతటిని వెలమవా
రాక్రమించుకొనిరి. మిగిలిన పిఠాపుర పెద్దాపుర
ప్రాంతభూములు మాత్ర మతని యధీనమం దుం
డిన వేమె. అతడు నిస్సహాయుడు; వెలుపలి
నుండి తోడువచ్చునన్న యాశ కెడములేదు.
విజయనగర చక్రవర్తి ప్రథమదేవరాయలు దనకు
మిత్రుడును సంబంధికుడును నగుట నిక్కమే. కాని
యతడు ఫిరోజు షాహుతో యుద్ధము సేయు
చున్నంగకాలమున నాతని వలన దనకు సహాయము
గలుగునని యెంచుటకు వీలు లేదు; కావున
కాటయ వేముడా యుద్ధ మెన్నడు
తుదముట్టునా యని ప్రతీక్షించుచు వేచియుండ
వలసి వచ్చెను. దేవరాయలు శత్రువుల నెల్ల
రాయసామ్రాజ్యము నుండి పారదోలి తన యధి
కారమును దృఢముగ జాటుకొల్పిన పిమ్మట
కాటయవేముడు రాజ్యమును మరల సంపాదిం
చుటకు తగుకాల సమయము వచ్చినదని యెఱిగి,
క్రీ. శ. ౧౪౦౦-వ సంవత్సరమున విజయనగర
ప్రభువు రాయల సహాయము నర్థించెను.
గోదావరీతీర మండలి రెడ్డిరాజ్యము యొక్క
స్వాతంత్ర్యమును గాపాడుట యత్యంతావశ్యక
మని దేవరాయలు గ్రహించెను. బహమనీసుల్తాను
తోడను నతని మిత్రులతోడను జరుగుచుండిన
యుద్ధము తాత్కాలికముగ నాగిపోయిన మాట
వాస్తవమే; కాని, వారతనికి సహజశత్రులగుటవలన
మరల వారితో గలహము గలుగకపోదని యాతడ
ెఱుగును. అట్టి యుద్ధమే సంభవించిన భవి
ష్యత్కాలమున రాజమహేంద్రవర రెడ్డి
రాజ్యము దనకు పెనుప్రాపై యుండునని తలచి
కాటయవేముని ప్రార్థన నంగీకరించి యతనికి
తోడువచ్చెదనని వాగ్దానము జేసి,మాటచొప్పున
దన సైన్యములకు గోదావరీ తీరముపై వెంటనె
కూచిసేయ మొదలపెట్టెను. (సశేషము)

చేస్తుంటే ఏం మజాగా ఉంటుంది! వాటి గత దుష్ప్రవర్తనకి అవి పశ్చాత్తాపపడి జాలిగా చూస్తుంటే మనకి అవమానం తీరినట్టు ఉంటుంది. మరి వాటిని ఒక్కసారిగా చంపేస్తే ఈ అవకాశం ఎలా లభిస్తుంది? గ్రహించారా——!

ఆర్థికంగా కూడా ఈ నిర్బంధిత మర్కటాల వల్ల చాలా ఉపయోగాలున్నాయి. సారవంతమైన మన ఆర్థికమంత్రుల మేధస్సులకి ఇవి తట్టకపోవడం మన దురదృష్టం.

నిర్బంధిత వానరాలకి సర్కస్ ఫీట్లు నేర్పించి ఊరూరా ప్రదర్శనా ఏర్పాటు చేస్తే బొక్కసానికి ఎంత లెక్క జమ వస్తుందో ఆలోచిస్తే కళ్లు తిరిగిపోతాయి, దీనివల్ల కొంతవరకు నిరుద్యోగ సమస్య కూడా తీరుతుంది. ప్రజలు ఆనందిస్తారు. దీని సాధ్యాసాధ్యాలు విచారించి నివేదించేందుకు మన ప్రభుత్వం ఒక కమిటీని వెంటనే నియమిస్తుందని ఆశిస్తున్నాను.

రామపాద సాగరం ప్రాజెక్టు కట్టేందుకు మా దగ్గిర డబ్బు లేదన్నది ప్రభుత్వం. వారధి కట్టిన వానరోత్తమ ఇంజనీర్లు రామపాద సాగరం ఆనకట్ట కట్టలేకపోరు. అవి ఒప్పుకోవద్దా అంటారేమో— కేవలమూ శ్రీరామచంద్రమూర్తి కోసం సేతుబంధనం చేసిన కోతుల సంతతి లక్షలకొలది ప్రాణాలు రక్షించటానికి చిన్న ఆనకట్ట కట్టటానికి వెనుదీస్తాయా? శ్రీరాముని నమ్మిన బంటు కదా ఆంజనేయస్వామి. ఆయన పేర కట్టబడితే ఆనకట్టకు ఆంజనేయస్వామి ప్రోద్బలం ఇవ్వకుండా ఉంటాడా? కనుక మన ప్రభుత్వం వానరాల్ని రామపాద సాగరానికి ప్రయాణం కట్టించి ప్రాజెక్టు పని కొనసాగించడం యుక్తం. వీట్ని చేయాలిసిందల్లా కొండ రాళ్లను తవ్వి సిద్ధం చేయడమే. మిగతా పనంతా కోతులే పూర్తిచేస్తాయి.

"కోతికి కొబ్బరికాయ దొరికినట్టు" అంటారు. వినే ఉంటారు. కోతులకి కొబ్బరికాయ లంటే మహాసంతోషం. పెద్ద పెద్ద కొబ్బరితోటలు గల ఆసాములకు కోతులను అద్దెకిస్తే మంచి ఆదాయం వస్తుంది ప్రభుత్వానికి. కొబ్బరికాయ లంటే వాటికి గల సహజమైన ఇష్టంకొద్దీ అవి కాయలు చకచకా కోసేస్తాయి. మరేం భయం లేదు— నిరర్థ్యాంతరంగా ఉపయోగించుకోవచ్చు అంత తింటానికి ప్రయత్నిస్తే తుపాకుల్లేవా!

కోతుల్లో మేలురకపు జాతి కోతులకి బాగా తరిఫీదు ఇచ్చి సైన్యంగా ఉపయోగించుకోవొచ్చు. రక్షణశాఖ వ్యయం చాలా ఎక్కువగా ఉందని మనవాళ్ళు గోలపెడుతున్నారు. ఈ ఉపాయంవల్ల ఖర్చుకి ఖర్చు తగ్గుతుంది, తృప్తికి తృప్తీ ఉంటుంది. ముల్లోకాలూ జయించిన రావణబ్రహ్మ పరివారాన్ని గడగడ లాడించిన వానరసైన్యం నరసైన్యానికి తీసిపోదు. ఒకనాడు జాజ్వల్యమానంగా వెలిగిన వానరజాతి పునరుద్ధరింపబడుతుంది. పోనీ పాపం. ఈ మర్కటా మహోదయం వల్ల మనుషులకు జరిగే మహోపకారమేమీ లేదు. ఉందని శంకించిన మరుక్షణం మన మరఫిరంగులు గర్జించవూ?

ఇంకెందుకు! ఈ మనిషి పోలిక తోకజంతువుల్ని తన అజమాయిషీలో ఉంచడం ప్రభుత్వానికి అన్నివిధాలా శ్రేయస్కరం, లాభదాయకమూ కూడా. ఇది పిచ్చితుగ్లకు పరిపాలనను మరిపోతుందని అనుమానించేవాళ్ళు అంటారా, ఆ క్షణంలో మనం ఈ ఉద్యమం చాలా అశ్యద్భుతమైనదనీ, అవశ్యాచరణ సౌభాగ్యమనీ నిస్సందేహంగా, టక్కున ఢంకా ఏదైనా ఉంటే అది పగిలేట్టు బజాయించి కూడా చెప్పొచ్చు. ఎందుకంటారా. పిచ్చి తుగ్లకు చర్యల ఉద్దేశాలన్నీ చాలా గొప్పవని ఈనాటి చరిత్రకారులందరూ అంగీకరించిందే.

# అప్పుడూ - ఇప్పుడూ

జోశ్యుల సూర్యనారాయణమూర్తి

"పుస్తకస్థాచయావిద్యా
పరహస్తేచ యద్ధనం।
కార్యకాలే సమాయాతే
నసా విద్యానతద్ధనం॥"

అంటారు పెద్దలు. ఋష్యాశ్రమాలు, వేద శాస్త్రాధ్యయనాలు అట్లా ఉండేవి. గురువు శిష్యునకు చెప్తోంటేనే విని వల్లించటం, అది వచ్చాక గుర్తుంచటమే అధ్యయన విధానం. ఆ శిష్యుడు గురు వయాక అదే శిష్యులకు చెప్పి వల్లింప చెయ్యటం. ఇదీ వరుస.

ఈ వరుస మంచిది కాదా! అని విచారిస్తే అర్థవివేచన సంపూర్ణంగా కలిగి విమర్శనబుద్ధితో చదివే చదువు అయితే చదివినది కంఠస్థం అయి ఉండటమే మంచిది. ఈ పద్ధతి ప్రకారం చదివినది కంఠస్థం కావటానికి ఆలస్యం పట్టను కూడా. అది లేని వల్లింపు వ్యర్థం. ఇంతకీ చదువబడే వస్తువులో ఉండే విషయ విశేష విభేదాలని బట్టి ఈ కంఠస్థపద్ధతి ఉంటుంది. మొత్తంమీద కంఠస్థం చెయ్యటం విద్యార్థికి ముఖ్యంగా ఉపయోగకరం. సదాచరణం నేర్చుకోటానికే విద్యాభ్యాసం అవశ్యకం అయితే యిప్పుడు ఆచరణకీ అభ్యాసానికీ సంబంధం లేకపోవటం వల్ల చదువుయొక్క ప్రయోజనమే మరియొకటిగా ఏర్పాటయి పోయింది.

పట్టుదల దేనికైనా అవసరం. అది విద్యాధనార్జనల విషయంలో ఇలాంటిదై ఉండాలన్నారు పెద్దలు— "క్షణశఃకణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" అని క్షణంపాడైతే 'అయ్యో! ఈ క్షణంలో ఒక పేజీ చదివేవాణ్ణమే. ఒక శ్లోకం వచ్చేదే. ఒక పద్యం వచ్చేదే!' అనే పశ్చాత్తాపం ఉండటం విద్యార్థికి అవసరం.

ఇంతకీ చదువైన తరువాత విద్యార్థి పరీక్షలో నెగ్గాలి. పూర్వపు చదువుల్లో ఒకసారి నెగ్గినంతమాత్రాన గొప్పవాడనే విఖ్యాతి కలిగినా ఎప్పటికప్పుడే అతడు పరీక్షకు సన్నద్ధుడై ఉండవలసిందే—అంటే "పుస్తకస్థా విద్యా" పనికి రాదన్నమాట. అట్లాంటప్పుడు పరిమిత విషయాలనే గుర్తుంచుకోవటం, నెగ్గగానే తగ్గటం కుదరదు. పసకంటె పెద్దల దగ్గర చిన్నవాడికి ఎప్పుడూ భయమే. అత డెప్పుడూ వారికి విద్యార్థియే.

ఇంక నాగార్జునకొండ పరీక్షా విధానం—ఆయుర్వేదం అభ్యసించిన విద్యార్థులు కొండల మీద తిరిగి పనికిరాని ఆకు గాని మూలిక గాని తేవాలి. అంటే ప్రతిదీ పనికిరాక పోదు గదా! అందులో ఏది ఏగుణం కలిగివుందో గుర్తించి వివరించటం—అంటే వారే వస్తుగుణదీపికలు కావటం—ఆ పరీక్షలో నెగ్గితే పరీక్షకుడు చదువు పూర్తియైనట్లు ఒప్పుకొని పంపేవాడని చెప్తారు.

ఇదే మాదిరిగ ఇతర శాస్త్రాలుకూడ బౌద్ధ విహారాలలో నేర్పుతూనేవారు. వట్టి ముక్కున పెట్టి పరీక్షలో వ్రాసి పడేసే తత్వమే ఆనాడుంటే చైనా, టిబెట్, జర్మనీ మొదలైన దేశాల నుంచి ఎందుకు వస్తారు విద్యార్థులు?

ఇప్పుడుకూడ మొత్తంమీద కంఠస్థ పద్ధతి ఉంది విద్యార్థులలో. కాని అది విషయగ్రహణం లేని అక్షరమాత్రము కంఠస్థంచేసే పట్టుదల. ఒకసంఘం ఏదో ఒకమాదిరి పుస్తకాలు నిర్ణయించటం, అవి వీరు వల్లించటం జరుగుతోంది.

ఇందులో గమ్మత్తు పరిశీలించాలి - క్షమించండి, అనక తప్పటం లేదు-గోతిదగ్గర నక్కలలాగ ప్రతీదానికీ కాసుకు కూర్చునీ వాళ్లు ప్రతీ "డిపార్టుమెంటు" లోను ఉన్నారు. ఇదే అసలైన లాభసాటి వ్యవహారం. పుస్తకాల కంపెనీల-

సిద్ధపడితే సవ్యమార్గం అవును. ఉపాధ్యాయుడు చెప్పేది వినక నోట్సు చదువుకోవచ్చు లే అనుకొనేటట్టుగా వాళ్ళని తయారుచెయ్యటం కంటె పూర్తిగ బాధ్యత ఉపాధ్యాయునికే వదిలేసి ఎప్పటికప్పుడు కుర్రవానిని పరీక్షించేలా చూడాలి గాని ఉపాధ్యాయుణ్ణి పరీక్షించేందు కధికారిని వేసి ఎంతకాలం విద్యాభివృద్ధి చేయగలం? అల్లా అయితే మరి ఆ పరీక్షాధికారి, నికార్సయిన వాడనే దెట్లా?

మామూలుగా? ఈ పద్ధతిగా మొత్తం ఈ శాఖ కూడా విశ్వాసరాహిత్యాన్ని పొందుతోంది. నైతిక దుస్థితిలో పడింది. ఇదే ముదిరితే అన్ని శాఖలూ ధ్వంసం కావటం అట్టే కాలం పట్టదు. రెండు ఉదాహరణలు—

విద్యాశాఖాధికారులు (న్యాయంగా ఉన్న వారిని తాకుగాని) అన్యాయ ప్రవర్తనగలవాళ్లు లేరనలేం కదా! అంటే మోసమే. ఆ మహాత్ములు పరీక్షకు దయచేస్తే ఉపాధ్యాయులు నానాయిబ్బందులూ పడి సత్కరించి పంపటం. ఆసలు చూచినా చూడకపోయినా ఏదో రిమార్కులు వ్రాయాలిగా. అవి ఒకేమాదిరిగా ఉంటాయి. ఇంతకాలానుంచి మనం పద్ధతులు బోధిస్తున్నాంగదా వాళ్ళకి పాటికి రావా! లేక రాలేదేం? అనే విచారణ అక్కరలేదు. ఆ రికార్డు (ప్లేటు) మళ్ళీ స్టాఫ్ మీటింగులో పెట్టటం, బండెక్కటంయున్నా. తనువాళ వచ్చే రిపోర్టు—

ఏక్లాసు చూడలేదో ఆక్లాసు. అయితే చాలా బాగుందని లేకపోతే ఛండాలంగా ఉందనీ వ్రాయటం. హిందీ క్లాసుకి వెళ్ళకుండానే "మెథాడికల్"గా "టీచింగ్" లేదనీ, హిందీ హిందీలో (ప్రత్యక్షానికి) బోధించటం లేదనీ రిమార్కులు. ఇతను గవర్నమెంటు సర్వాంతైన అధికారేనా! మరి గవర్నమెంటు హిందీని మాతృభాషలలో బోధింపగల హిందూస్తానీ ఉపాధ్యాయుడు అయి ఉండాలంటుంది. అది ఇతనికి కనిపించదా? అది ఉద్యోగ మివ్వటానికి మాత్రమేనా?

జాతీయత జాతీయత అని మాటలు చెప్పటానికే గాని ఒక విద్యానాథుడికీ జాతీయ భావాలలవడినట్టు కనిపించదు. హిందీయో లేకపోతే హిందూస్తానీయో అసలు అసంగతి అలా అట్టే పెడితే అసలు ఆ హిందీ అనే దానికి ప్రాముఖ్యం యివ్వాలనీ, దానిద్వారా జాతీయతత్వం పెంపొందించాలనీ గవర్నమెంటుకీ లేదు- ఆంధ్రపండితులకీ లేదు. అందుకే హిందీని కాదనలేక ఇంగ్లీషు మాత్రం ప్రత్యక్షాకారంలో ఉండక తప్పదని నిర్ణయించారు. మరి హిందీ, తెలుగు, ఇంగ్లీషు ఇన్ని భాషలు ప్రత్యక్షాకారంలో చెప్పితే ఆ చిన్న పిల్లలకి వస్తుందా ఏదైనా? అసలా పిల్లలికి అక్షరాలు రాగానే నాలుగు మాటలు ఏ ప్రయివేటు మాస్టరుదగ్గరో పడేసి "కొశ్చెన్స్—ఆన్సర్స్" బట్టీ పట్టించి హైస్కూలు మాస్టర్లని పట్టుకొని హైస్కూల్లో చేరుస్తున్నారు కదా! ఇంకెలాగ విద్యలు నేర్పటం? ఇవికాక ఇంకా ఇతర విషయాలున్నాయి!

ఈమధ్య "హయ్యర్ ఫారమ్సు"లో హిందీ లేకుండా తీసేస్తున్నారని ఒక వినికి. తెలుగు భాషకి ప్రాధాన్యం (మాతృభాష కనుక) ఇచ్చామని గొప్పలు విరుచుకొని చెప్పుకోటం బల్లకెక్కి. ఆ తెలుగు పాఠశాలల్లో ఒకే పరీక్ష పాసైనవాళ్ళలో లక్ష భేదాలు కల్పించి బాధించటం అలా ఉండగా మొదటి భాష వైన తెలుక్కు నాలుగే పీరియడులు బోధించటానికి అవకాశం కల్పించటం ఎంత ఔదార్యం?

మిగిలిన విషయాలన్నీ తెలుగులోనే కదా అని జవాబు చెప్పబోతారు. ఆ తెలుగు తెలుగేనా? తెలుగును బాగుచేసేదాకానైనా ఓపిక పట్టవద్దా? లేకపోతే ఆ తెలుగైనా నిర్ణయించాలిగా. పరీక్షలో తెలుగు వేరు. మాటు తెలుగు వేరు, వ్రాత తెలుగు వేరు అన్నది తప్పదేం?

ఇంతకీ నైతికపతనం తప్పించాలంటే అర్హతను పాటించి అధికారం ఇవ్వాలి. అందరికీ శ్రద్ధ, ఆత్మీయబుద్ధి లేకపోతే చదువులు బాగుపడవు. పరీక్ష లెందు కింక?

# రాజకీయాలు-సత్యాన్వేషణ
# 'లైసెంకో' వివాదం

యస్. సత్యనారాయణరావు

'సోవియటు రష్యాలో శాస్త్ర పరిశోధన' పై 'జగదీశ చంద్రుడు' గారు కమ్యూనిస్టు పద్ధతులలో లైసెంకో విమర్శకుల ఉద్దేశాలేమై యుంటాయని చర్చించారు. లైసెంకో సిద్ధాంతాలు విమర్శించినవారిలో (నేను చదివినంత వఱకు) ఒక్క హాల్డేన్, వాడింగ్టన్‌లు మాత్రం సమర్థించ ప్రయత్నించారు. ఇందులో హాల్డేను కమ్యూనిస్టు అభిమాని: కాని తన రచనలన్నీ మెండెల్ సిద్ధాంతాల ననుసరించే, తన పరిశోధనలన్నీ మెండెలిజానికి అనుగుణంగానే. పైగా ఆయన పద్ధతులు ఆజీవశాస్త్ర పద్ధతులే (అంటే 'స్టాటిస్టిక్స్'తో నిండిపోయి ఉంటాయి). ఐనా వీరిద్దరూ లైసెంకో సిద్ధాంతాలన్నీ పిచ్చి కావని. విమర్శించడంలో జాగ్రత తీసికోవలసిందనే వ్రాశారు. అలా రష్యాలో, ఇక ప్రపంచం అంతాకూడా, జెనెటిక్స్ అంటే సుముఖంగా ఉన్న శాస్త్రజ్ఞులు అందరూ కాపిటలిస్టులచే ప్రేరేపణచేయబడి సత్యాన్ని కప్పిపుచ్చి వ్రాశారని, వ్రాయగలరని విశ్వసించలేను. కాని వారి విమర్శలు రష్యా ప్రతికూలురకి చాలా సహాయం చేస్తున్నమాట నిజం. అంతమాత్రాన లైసెంకోను సమర్థించడం అసంభవము.

ఇక "జగదీశచంద్రుడు" గారి విమర్శగురించి: (30 పే. 4 పారా) బూర్జువా పత్రికలు తప్పుగా ప్రచురించడమూ, కథలు సృష్టించడమూ రష్యాలో ఏమి జరుగుతున్నదీ తెలిసికోడానికి అవకాశాలు లేక కాదా? (31 పే. 1 పా) రష్యాలో జరిగే పరిశోధనల గుఱించిన ఫిషర్, హాల్డేనులు ఇంకా ఏమన్నదీ అక్కడే వ్రాశారు కారు. ఆర్. ఎ. ఫిషర్ బయోమెట్రీకి పునాదివేసిన వారిలో ముఖ్యుడు. జెనెటిక్స్, పరిణామములమీద పరిశోధనలుచేసి విశేషఖ్యాతి గాంచాడు. హాల్డేను లో ప్రవృత్తిరంగులు ఇతరగుణాలు ఏవిధంగా సంతతికి సంక్రమించునో పరిశోధనలుచేసి పేరు గాంచాడు. వారు తమ బి. బి. సి. ప్రసంగాలలో ఇలా అంటారు. లైసెంకో శాస్త్రవిజ్ఞానాన్ని అపహాసించడమేకాక, భయపెట్టడానికి, హింసించడానికి, చంపడానికి పలుకుబడిగోసం రాజ్యాశ్రయం పడుతున్నాడన్నాడు ఫిషర్. హాల్డేను ఈ మహానాశాస్త్రవిజ్ఞానం ప్రభుత్వంచే సృష్టించడం విచారకరం అన్నాడు. (2 పా) రష్యా 'మహత్తర బాధ్యత'లు సాధించడం ఇదొక మార్గం కాదు.

లైసెంకో సిద్ధాంతాలు సరియైనవనడానికి ఇచ్చిన ఉదాహరణలు (3 పా) లైసెంకో సిద్ధాంతాల నేమీ సమర్థించవు. ఈ ఉదాహరణలు చూస్తే ఒక్క రష్యాలోనే అసామాన్య పరిశోధనలు జరుగుతున్నట్లు అర్థం ఇస్తున్నాయి. గోధుమలు ఇబ్బడి దిగుబడి ఉండడం ఒక్క రష్యాలోనే చూడనక్కరలేదు. స్వీడన్, బ్రిటన్, అమెరికాలలో మొదటినుండీ నిటారు రకాల నేరడం ఒక లక్ష్యం. మెండెల్ సిద్ధాంతాల ప్రకారం నిటారు గోధుమలు ఏ నిష్పత్తిలో వచ్చునో కూడా కనుగొన్నారు. మనదేశంలో కూడా హోవర్డు, షా, పాల్ పూసా గోధుమలను పేరుతో ఉత్తమ రకాలను వ్యాప్తికి తెచ్చారు. లైసెంకో సృష్టించిన తరగి మాంసన ఫలశాఖలను నిజంగా ఊహించడం కష్టమే! సైబీరియాలో మొక్కలు మొలిపించడానికి లైసెంకో జెనెటిక్స్ రానక్కరలేదు. నిత్యమూ ప్రపంచమంతటా వ్యవసాయ విధానంలో జరిగే మార్పులు తెలియనివారికి ఇవి అత్యద్భుతాలే. ఈ ఉదాహరణల వలన తేలేది నూతన పద్ధతుల నవలంబించడంలో రష్యనులఉత్సాహం తప్పించి లైసెంకో జెనెటిక్స్ కాదు.

డార్లింగ్టన్ మండలలో చేసిన పరిశోధనలు (32 పే. 2 పా) మెండెలిజాన్ని సమర్థించుకోడానికి కాదు. ఇప్పుడు ఏ శాస్త్రజ్ఞుడూ మెండెలిజాన్ని సమర్థించవలసిన పని లేదు. మెండెల్ సూత్రాలు అక్షరాలా నిజం కాకపోయినా, మూలసూత్రాలు ఈనాటికీ చెల్లుతాయి. ఇంకా మార్పులతో నియో-మెండెలిజానికి స్వరూప మిచ్చారు. డార్లింగ్టన్ ఉపయోగించిన మందు లేమిటి? కాల్చిసిన్, ఎసినాప్తీన్, మస్టర్డ్ గ్యాస్, అల్ట్రావయొలెట్, ఇన్‌ఫ్రారెడ్ కాంతులు, ఎక్స్-రే—ఇవి. వీటిని ఉపయోగించడం జీనుల నిజతత్వం తెలుసుకోడానికి కాని మెండెలిజాన్ని సమర్థించడానికి కాదు. ఆఖరికి నూతనపద్ధతులలో కూడా మెండెల్ సూత్రాలు, జెనెటిక్సు నిజమని నిరూపణ అవుతున్నాయి. ప్రపంచం అంతా లైసెంకో అవతరించడం చూసి కట్టుకట్టి మసిబూసి మారేడుకాయ చేస్తారంటారు కమ్యూనిస్టులు. ప్రభుత్వం ఈవాదు దానికి ప్రచురణ, ఆదరం ఇవ్వకపోతే ఈ ఝంఝామారుతం చెలరేగేదే కాదు.

ఈనాటి వరకూ జంతు, వృక్షాల అభివృద్ధి మెండెల్ వలన జరిగిందని ప్రపంచం ఏకగ్రీవంగా అంటుంటే అది ఆఖరికి ప్రపంచ శాంతికే భంగం కలిగిస్తుందన్నారు (3 పా). ఆయన వ్రాసినదానికి వ్యతిరేకం నిజం. పాశ్చాత్య శాస్త్రజ్ఞుల విమర్శలు శాస్త్రీయాలు కావనుకున్నా (6 పా), అవి అసమంజసం కావు. విమర్శకులు ఏ ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్రజ్ఞుని దగ్గరకైనా వెళ్ళి, "నీవు టెలిస్కోపు లోంచి చూసేవి కట్టుకథలు; నిద్ర లేక మబ్బులు నెబ్యూలాల క్రింద కనపడుతున్నాయి" అంటే ఆయన ఏం పదజాలం ప్రయోగిస్తాడో. హెన్రీ డేల్ రాజీనామా నివ్వడం (33 పే. 2 పా) ఓర్వలేక కాదు. లైసెంకోయిజం చూసి వికారంపుట్టి, ముల్లర్ (నోబెల్ లారియెట్) కూడా అదే పని చేశాడు. లైసెంకో తరగతి రహస్యాలో తప్పించి బయట ఎక్కడా లేదు, చూసి ఓర్వలేకపోవడానికి. వారి రచనా చమత్కృతి నుపయోగించి లైసెంకోను గెలీలియోతో పోల్చారు. గెలీలియో యెవరో ప్రపంచానికి తెలుసు.

ఇవన్నీ చాలనట్లు పామీదత్తు, బెర్నార్డ్ షాలను ఇందులోకి లాగుకొని వచ్చారు. లైసెంకో స్మట్సు, కాంత్, బెర్గ్సన్‌లను జెనెటిసిస్టులగా తీసికొన్నాడు. విమర్శకులు వీరిని సర్వజ్ఞులుగా గ్రహించి వుండరు. రాజకీయ శాస్త్రజ్ఞులు చెలగాటాలాడే విషయం కాదు జెనెటిక్సు. లైసెంకో గురించిన వివాదం మూడు విషయాలుగా విభజించవచ్చు: (1) లైసెంకో పరిశోధనలు, (2) లైసెంకో సిద్ధాంతాలు, (3) ప్రభుత్వజోక్యం, తత్ఫలితంగా జెనెటిక్సు పరిశోధనకు స్వస్తి.

(1) లైసెంకో పరిశోధనలు ముఖ్యంగా వెర్నలైజేషన్‌మీద. ఆ పరిశోధనలమీద అభిప్రాయభేదా లుండడం సహజమే. కాని అది ఇంత వివాదం పెంచే రకం కాదు. అదికాక, మిచూరిన్ అంటు కట్టడాలు- అమెరికాలోని లూథర్ బర్‌బాంకుని శాస్త్రవేత్త అంటే, మిచూరిన్‌ని శాస్త్రవేత్త అనవచ్చు. కాని బర్‌బాంకుని శాస్త్రవేత్త అనరు, అతడు మొక్కల పేరుటలో ప్రజ్ఞ చూపించినా. మిచూరిన్‌కూడా అంతే. మిచూరిన్ సిద్ధాంతాలకు వారు స్వయంగాచేసి తగినన్ని ఆధారాలు చూపలేదు. జె. బి. యస్. హాల్డేన్ వాటిని సమర్థించడానికి బూర్జువా పరిశోధనలు పేర్కొనవలసి వచ్చింది. రెండవది. ఆ ప్రయోగాలనే రెండోచోట చేస్తే రాకపోవడం. ఈ పరిశోధనలు ఇంతకుపూర్వం చేసిన వాటికి విరుద్ధంగా ఉండడం; రెండోచోట ఇతరులు చేస్తే ఆ ఫలితాలు రాకపోవడం; తీసికొన్న జాగ్రత్తలు, విధానాలు తెలుపకపోవడం-లోట్లు. అయినా ఇంత ఎత్తున జరిగే ఈ వివాదం పై వాటిగురించి కాదు.

(2) లైసెంకో ఊరుతోక పరిణామం, జెనెటిక్సు, సైటాలిజీలమీద దండయాత్ర చేశాడు. దానితో వచ్చింది ఈ బ్రహ్మాండమైన చర్చ. మొదటికే జెనెటిక్సు లేకుంటే ప్రపంచం దిగ్భ్రాంతి చెందింది. ఇటువంటిదే ఐన్‌స్టీన్ యొక్క సాపేక్ష సిద్ధాంతం-ప్రపంచాన్ని పాదల గొట్టింది. కాని జెనెటిక్సు సైటాలిజీలమీద పరిశోధనల చేయకుండా ఇటువంటి ప్రతిపాదనలు చేయగలిగిన దానికి సమీపమైన సాదృశ్యం కావాలంటే, గెలీలియో పరిశోధనలమీద

మతాధికారుల తీర్పు తప్పించి చరిత్రలో రెండవది కనపడదు. జవడోవ్‌స్కీ చెప్పినట్లు నెగెటేటివ్ ప్రోపగేషన్ మీద చేసిన పరిశోధనలు ఆధారంచేసికొని సెక్సు ఆఫ్ రిప్రొడక్షన్-ఇన్‌హెరిటెన్సుల మీద జెనరలైజు చేయ వీలులేదు.

(3) ఉదాహరణకి-ఆయుర్వేద వైద్యమును తీసికొందాము. ఇది ఆయుర్వేద శాస్త్రాని కనుగుణంగా వుండవచ్చునేమో కాని సరియైన శాస్త్రపద్ధతిని పెరిగిం చనడానికి వీలులేదు. ఎలోపతీ అందుబాటులో లేకపోవడం వలన పల్లెటూళ్ళలో వైద్యం చాలామట్టుకి ఆయుర్వేదమే. ఆయుర్వేదౌషధాలు పని చేయడంలేదని అనలేము. రెండవది, ఎలోపతీలో శస్త్రచికిత్స తప్పించి ఏజబ్బుకీ టక్కున తగ్గించే మందు లేదు. విమర్శకులు లైసెంకో సిద్ధాంతాలు కైటనడానికి—వెర్నలైజుడు గోధుమ వ్యాప్తి, మెండెల్ వాదులు ఏమీ చేయకపోవడం ఆధారాలకింద చూపించారు. వ్యాప్తిని బట్టి ఆయుర్వేదం ఎక్కువ శాస్త్రీయమైనదని చెప్పగలమా? ఎలోపతీలో ఇంతవరకూ ముఖ్యమైన జబ్బులకు మందులు లేవని సర్జను లందరినీ డిస్మిస్ చేసి, అందులో పరిశోధనల కట్టిపెట్టమనడం సబబు కాదు. రష్యాలో మెండెల్ వాదులు కనిపెట్టిన ఎగ్రోపైరాన్ X గోధుమ, రై X గోధుమలు వ్యవసాయాన్ని అభివృద్ధి చేయలేదా? కమ్యూనిస్టులకు 1917 తరువాత చరిత్ర ప్రారంభం అయింది. సహేతుకంగా లేకపోయినా, కొత్త అంటే రష్యాకి వింత. అతిప్రాచీన మైనంత మాత్రంచేత ఆయుర్వేదం, అతి విలక్షణమైందని లైసెంకోయిజం ప్రభుత్వాల మన్నన లందరాదు. సహేతుకత, శాస్త్రీయత ప్రధాన లక్ష్యాలు కావాలి.

ముగిస్తూ, ప్రజల కుపయోగించేదే నిజమైన శాస్త్రమని వ్రాశారు. ఒక్క శాస్త్రవిషయంలోనేకాదు; సాహిత్యం, కళ, విజ్ఞాన్వేషణ వాటి కోసమేనా లేక వేరే ప్రయోజనానికా అనే చర్చ ఈనాటి కాదు. దేకర్, లాక్, న్యూమన్ లు దీన్ని గురించి చాలా చర్చించారు. ప్రకృతి శోధ మెచ్చుకోవడంలో వేరే ప్రయోజన మేముంది? గాయకుడి సంగీతానికి ప్రయోజనమేనా ప్రధానలక్ష్యం? స్త్రీ సౌందర్యం ప్రజలందరికీ ఉపయోగపడితేనా సౌందర్యమైనట్లు? ఆండ్రోమిడా లో నెబ్యూలా ఎన్ని కాంతి సంవత్సరా లుంటుంది అని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు బుర్ర బద్దలుకొట్టుకోవడ మెందుకు? బ్రహ్మాండం విశాలం చెందుతోందా అని ఆరాలుతీస్తే రష్యా విస్తీర్ణత పెరగదు కదా! జంతువుకీ, మనిషికీ వుండే భేదమే ఈ సత్యాన్వేషణ. న్యూటన్ నెత్తిమీద యాపిలు పడితే, తిరిగి ఎవరి నెత్తిమీదా పడకుండా ఆపుచేయడానికి కాదు ఆయన నడుం కట్టింది. సత్యాన్వేషణ. తల్లిదండ్రుల గుణాలు సంతతికి ఏవిధంగా సంక్రమిస్తాయి; జీనులకి క్రోమోసోములకి సంబంధమేమిటి; జీనులు తమ ప్రభావాన్ని ఏవిధంగా బహిర్గతం చేస్తున్నాయి; వాటికి సంబంధించిన ఎన్జయిములు, హార్మోనులు ఏమిటి అనే పరిశోధనలకి అర్థం ఉపయోగం కాదు. ప్రకృతిని అర్థం చేసికోడం. అలా అని, ఈ ప్రపంచాన్ని వదలి వెళ్ళమని కాదు. శాస్త్రాన్ని, కళనీ మానవుని ఉపయోగార్థం వినియోగించవలసిన అవసరం ఈ నా డున్నంత ఇదివర కెన్నడూ లేదు. లేకపోతే ఈ రైల్వే నవలలు, వాస్తవికత- భావం-విజ్ఞానంలేని నేటి సాహిత్యంవలన భావ అడుగంటక మానదు. ప్రభుత్వం జోక్యం కలుగజేసికొని, సరియైన వాటికి ప్రోత్సాహం ఇచ్చి నడిపించవలసిన ఆవశ్యకతను ఎవరూ కాదనరు. కాని ప్రభుత్వం ఎంతవరకూ జోక్యం కలుగజేసికోవాలి అనే హద్దును గురించే నేటి ప్రపంచంలో రాద్ధాంత సిద్ధాంతాలు. అంతేకాక శాస్త్రవిజ్ఞానంలో జ్ఞానపరంగా పరిశోధన అభివృద్ధిచెందే కొలదీ, ఆ జ్ఞానం మానవాభివృద్ధికి వినియోగించడానికి అవకాశా లున్నాయి. 'రెండు గడ్డిపరకలు' (Two blades of grass) అనే పుస్తకంలో అమెరికాలో వ్యవసాయంలో జ్ఞానార్థపరిశోధనలకు పెట్టుబడిపెట్టిన సొమ్మునకు అనేక రెట్లు ప్రతిఫలం ముట్టినదని హార్డింగ్ (Harding) వ్రాస్తాడు. యాటంబాంబు ఇరవై సంవత్సరాలక్రితం తయారవడం అసాధ్యం. కేవల శాస్త్రవిజ్ఞానంలో పరిశోధనలు జరిగే కొలదీ దాని ప్రయోగానికి అవకాశా లుంటాయి. శాస్త్రవిజ్ఞానంలో సర్వతోముఖంగా పరిశోధనలు జరగవలసిందే.

నా 'కలం' గురించి వ్రాశారు. లైసెంకో యొక్క వెర్నలైజేషన్ గురించిన విషయాల్లో నాకేమీ అనుభవం లేదు. అమెరికా నన్ను ఎత్తినదీ లేదు. రష్యా దిగలాగినదీ లేదు. కాని సైటో జెనెటిక్సుమీద ఆసక్తి ఉండడం చేత, జెనెటిక్సు అభ్యుదయ నిరోధకం, అబద్ధం, బూర్జువా ఐడియాలిజం అంటే నాకలం విసురుగా నడిచిందేమో. ఒక నిమిషం లైసెంకో రష్యాను వ్యక్తి అని, కమ్యూనిస్టు పార్టీ ప్రోద్బలం ఉందని మరచి, అతని సిద్ధాంతాలు చర్చించినట్లయితే విమర్శకులు నాతో ఏకీభవించక మానరు. మార్క్సిజం అంటే నిర్వచిస్తూ ఒకరు సహేతుకంగా శాస్త్రీయమైన దర్శనం మార్క్సిజం అన్నారు. కాని మార్క్సువాదసుల పోకడలు మాత్రం కలవరం పుట్టక మానదు. రష్యా సోషలిస్టు సిద్ధాంతాలని ఆచరణలో పెట్టి ఆదర్శప్రాయమైంది. అయినా సీజరు పెళ్ళాంలా తప్పులు చేయదని నేను విశ్వసించలేను. రష్యా ఆక్రమిత ప్రాంతంలో లైసెంకోయిజాన్ని వ్యాప్తికి తెస్తున్నారు. ఈ బలవంతపు బ్రాహ్మణార్థం అందరూ సహించవలసిందేనా? బ్రిటనును పరమశత్రువుగా చూస్తున్న రోజుల్లోనైనా ఎవరూ షేక్స్పియరును ఇంపీరియలిస్టు రచయిత అని ఏవగించలేదు. శ్రోడింగరు, ఈన్‌స్టీన్, మాక్సుప్లాంకు ఫాసిస్టు దేశాల్లో పెరిగిన మూలాన్ని వారి సిద్ధాంతాలు ఫాసిస్టు సిద్ధాంతాలని త్రోసిపుచ్చలేము. రష్యా అంటే అభిమానమున్నంతమాత్రం చేత లైసెంకోను సమర్థించలేం. రాజకీయాలకు సరిహద్దులున్నాయేమో గాని, సత్యాన్వేషణకు సరిహద్దులు లేవు. బూర్జువా సైన్సు అని ఒకటీ, ప్రొలిటేరియను సైన్సు అని ఒకటీ లేవు. బూర్జువా ఐడియాలిజం అని స్లోగన్లతో నిజానిజాల్ని మరుగు చేయడం మార్క్సిజం కాదు. ప్రపంచంలో రాజకీయవేత్తలు తీసికొనిరాలేని సామరస్యం శాస్త్రజ్ఞులు తీసికొనిరాగలరు. కావలసింది శాంతి అంటే అభిలాష. మానవ పరిణామంలో అభివృద్ధికి మిగిలేది కమ్యూనిజం కాదు. సత్యాన్వేషణ, జ్ఞానసంపత్తి.

# ఏది జ్ఞానం?

సృష్టి భౌతిక పదార్థంతో కూడుకున్నదనీ, అందులో కలిగే ప్రతిమార్పుకూ భౌతికాధారం కలదనీ భౌతికవాదులు చెబుతున్నారు.

అయితే "పదార్థం" అనేది ఎట్లా ఉంటుందో మనకు తెలియదు, తెలుసుకునే అవకాశం లేదు. మనం తెలుసుకోగలవన్నీ దాని లక్షణాలే. వస్తువుల రంగూ, పరిమాణమూ, రుచీ, వాసనా, బరువూ, రసాయనిక స్వరూపమూ, నున్నదనమూ, గరుకుదనమూ, మెత్తదనమూ, గట్టిదనమూ, వేడీ, చలీ, సాగే శక్తీ, విరిగే శక్తీ, కరిగే శక్తీ, అరిగే శక్తీ మొదలైన అసంఖ్యాక లక్షణాలను మనం వివిధ పరికరాల సహాయంతో తెలుసుకోవచ్చు. ఈ పరికరాలలో కొన్ని మన పంచేంద్రియాలే నని వేరే చెప్పనవసరం లేదు.

వస్తువుల కుండే ఈ వివిధగుణాలను గురించి అయినా మనం ఎట్లా తెలుసుకుంటున్నామంటే ఈ లక్షణాలు ఏదో ఒక మార్పును లోనవుతున్నాయి కనక. ఉదాహరణకు ఒక వస్తువు మనకు ఎర్రగా కనబడిందనుకుందాం. అది ఎర్రగా కనబడటానికి రెండు కారణాలుండాలి: ఒకటి, అది ఎర్రటి కిరణాలను అవిచ్ఛిన్నంగా ప్రసారం చేస్తూ ఉండాలి; లేదా, రెండు, దానిమీదపడే కిరణప్రసారంలోనుంచి తతిమ్మా రంగులు సంగ్రహించి ఎర్ర కిరణాలను విసర్జిస్తూనైనా ఉండాలి. లేకపోతే మన కంటికి ఎర్రరంగు స్ఫురించదు. మనకి ఈ వస్తువు ఎర్రగా కనిపించాలంటే అది ఏదో ఒక మార్పుకు లోనవుతూ ఉండాలి. ఈ విధంగానే వస్తువుల ఇతర లక్షణాలు కూడా మనకు గ్రాహ్య మవుతాయి. వస్తువు యొక్క ఏ లక్షణానికి చెందిన మార్పు వస్తువులో జరగదో ఆలక్షణాన్ని గురించి మన కేమీ తెలియదు. గాఢాంధకారంలో మనకు వస్తువుల రంగు తెలియదు. ఎటువంటి కిరణాలనూ ప్రసరించని గాలి

-మనకు కనబడదు. నోట్లో ఏమాత్రమూ కరగని వస్తువు రుచి తెలియదు. తన లక్షణాలను మార్చుకోలేని వస్తువు అంటూ ఉంటే దానిని గురించి మనం ఏమీ జ్ఞానం సంపాదించలేం.

భౌతిక ప్రపంచాన్ని గురించి మనం పొందే జ్ఞానమంతా ఏదో ఒక పరికరం ద్వారా బుద్ధికి లభించవలసిందే. బుద్ధీంద్రియాలకు అతీతమైన జ్ఞానం ఉందని కొందరు చెబుతారు. ఆ జ్ఞానం ఎట్లా ఉండేదీ, అది కొందరికైనా కలుగుతుందనుకున్నప్పటికీ అందరికీ సమంగా కలుగుతుందో లేదో నిర్ణయించటం అసంభవం.

జ్ఞానం పరికరాల ద్వారా కలుగుతుంది కనక పరికరాలలో ఉండే లోపాలు మన జ్ఞానాన్ని అంటి ఉంటాయి. ఈ లోపాలను సరిదిద్దటం బుద్ధియొక్క ప్రత్యేక లక్షణం. కన్ను దూరాన ఉన్న వస్తువులను చిన్నవిగానూ, దగ్గిర వస్తువులను పెద్దవిగానూ చూపిస్తుంది. చాలా దూరాన కనిపించిన మనిషి జానెడే ఉన్నాడని మనం అనుకోం. మానవుడికి బుద్ధి ఉండబట్టే మన కంటికి కనిపించని ప్రసారంకూడా ఉన్నదని కనిపెట్టి దానిని ఫొటోలద్వారా కంటికి అందుబాటులోకి తీసుకు రాగలిగాడు; చర్మచక్షువులకు కనిపించని సూక్ష్మక్రిములనూ దూరస్థ నక్షత్ర సముదాయాలనూ పరికరాల సహాయంతో చూడగలుగుతున్నాడు; కోటానకోట్ల మైళ్ళ దూరానగల గోళాలతూకం అంచనా కట్టగలుగుతున్నాడు.

బుద్ధి సరిగా వికసించని పిల్లలూ, బుద్ధి వక్రించిన ఉన్మాదులూ క్రమజ్ఞానాన్ని సాధించలేకుండా ఉన్నారు. బుద్ధి జ్ఞానాన్ని-పదార్థాలలో కలిగే మార్పును-గ్రహించటమే కాక, జ్ఞానంతో పాటు తానుకూడా మారుతుంది. అందుచేత ఇదికూడా ఒకలక్షణమే-మెదడు తాలూకు ఒకగుణం. అయితే బుద్ధి శీఘ్రపరిణామం కలది.

బుద్ధికిగల నిజమైన ప్రత్యేకత ఏమంటే సృష్టిలో జరిగే అతి సున్నితమైన మార్పులను గ్రహించటమే కాక, సృష్టిలో ఉన్న వస్తుజాలాన్ని మానవ ప్రయోజనాల కనుగుణంగా మారుస్తుంది; అంటే మార్పునే కాక మార్పు తత్వాన్నికూడా గ్రహిస్తుందన్న మాట. బుద్ధి ఉన్న ఈ శక్తివల్లనే మానవుడు పంచభూతాలనూ నిగ్రహించి, సంపదను సృష్టించి, సుఖాలను హెచ్చించుకుని, ఆయురారోగ్యసంపదలను సాధించగలిగాడు. ఈ శక్తినే మానవుడు దుర్వినియోగపరచి కొన్ని వర్గాల ప్రజలను అజ్ఞానంలోనూ, దారిద్ర్యంలోనూ ఉంచగలుగుతున్నాడు. కనకనే మానవజాతి అవసరాలు తీర్చే జ్ఞానం ఉండికూడా ఆ అవసరాలు తీరడమనేది జరగటంలేదు. విత్తులు చల్లితే పంటలు పండుతాయని మానవుడు కనిపెట్టి ఎన్నో సహస్రాబ్దాలయింది. పంటలు పండించటానికి సిద్ధంగా రైతులున్నారు. కాని మానవ సమాజంలో ఆకలి నిర్మూలం కాలేదు... ధాన్యం ఎగుమతి చేసే దేశాలలోనే తిండికి లేనివాళ్లున్నారు. అందరికీ బట్ట లభించకుండానే బట్ట మిగిలిపోయి మన దేశంలో బట్టల మిల్లులు మూసే అగత్యం కలుగుతున్నది... రేపు మానవసమాజం అవసరమని గుర్తించే మార్పుకోసం ఇవాళ లక్షోపలక్షలు ప్రాణత్యాగాలు చేయవలసివస్తున్నది... నాగరిక దేశాలని పిలవబడే దేశాలలోనే కొందరు ప్రజలు చట్టాన్ని ఉల్లంఘించకుండా స్వయంకృషితో పొట్టపోసుకోవటానికి లేని పరిస్థితులున్నాయి.

అజ్ఞానంవల్ల కలిగే పరిస్థితులనూ వీటికి తేడా లేదు. నిజానికి ఏదో అజ్ఞానాన్ని పురస్కరించుకునే ఈ పరిస్థితులేర్పడుతున్నాయి. ఇది సాంఘికఅజ్ఞానం.

మానవసమాజంలో సాంఘిక అజ్ఞానం వ్యక్తిగతమైన జ్ఞానానికి అంతరాయమని చెప్పవచ్చు. శాస్త్రజ్ఞులు పగలని గృహపరికరాలనూ, ప్రమాదకరమైన రోగాలను కుదిర్చే దివ్యౌషధాలనూ, మానవ మనస్తత్వాన్నీ సృష్టి రహస్యాలనూ విశదీకరించే తత్వజ్ఞానాన్నీ సాధించవచ్చు. కాని ఇది సమాజానికి ఉపకరించేటట్టు చేసే సాంఘికజ్ఞానం కూడా ఉండాలి.

జ్ఞానం గురించి మాట్లాడేటప్పుడు విశ్వాసాలను గురించి కూడా చెప్పుకోవాలి. విశ్వాసాలు మనుష్యులకు రెండు విధాలుగా ఉపయోగపడతాయి. ఇవి సూత్రప్రాయమైన జ్ఞానం కావచ్చు. నీరు కాచి చల్లార్చి తాగితే కలరావల్ల అపాయం ఉండదని విశ్వసించిన వారంతా దాని ఆధారాలను తెలుసుకోకుండానే ఆ జ్ఞానం

కాలంలో ప్రయోజనాన్ని పొందవచ్చు. మరొక విధంగా అర్థంకాని కొంత అనుభవాన్ని అర్థం చేసుకునేటందుకు మనం కొన్ని విశ్వాసాలు కల్పన చేసుకోవచ్చు. జీవితంలో కొందరు సుఖ పడటానికీ, మరికొందరు కష్టపడటానికీ కారణం పురాకృత పుణ్యపాపాలు కావచ్చుననేది ఒక విశ్వాసం. అయితే ఏ విశ్వాసమయినా జ్ఞానానికి తల ఒగ్గటానికి సిద్ధంగా ఉండాలి. లేని పక్షంలో అవి మూఢవిశ్వాసాలై సాంఘికాభ్యుదయానికి అడ్డువస్తాయి. ఈ కారణం చేతనే సాంఘికజ్ఞానం అభివృద్ధికి నిరోధకులుగా ఉండే వాళ్ళు వ్యక్తికమైన జ్ఞానానికికూడా అడ్డం తగిలి మూఢవిశ్వాసాలను— జ్ఞానంచేత సంస్కరించ గల విశ్వాసాలను—బలపరుస్తారు; ఆ విశ్వాసాలను ఖండించే జ్ఞానం లేనట్టూ, ఉంటే అదంతా తప్పులతడక అయినట్టూ నటిస్తారు. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో గల లోపాలను గురించి మూఢ విశ్వాసాలు ప్రచారం చేయటానికి సిద్ధంగా ఉన్నతమంది పెట్టుబడిదారీ — లాభాలమీద ఆధారపడి ఉత్పత్తి సాగించే విధానం—సమర్థించటానికి లేకపోవటం మనం ప్రత్యక్షంగా చూడవచ్చు. నిజం ఏమంటే, ప్రపంచ జనాభాకు సరిపడా అవసర వస్తువుల ఉత్పత్తి సాగించే యంత్రపరికరాల ఉత్పత్తి జరిగిన నాటినుంచీ ఈ పరికరాలు ప్రత్యేకవ్యక్తుల స్వాధీనంలో ఉండవలసిన అవసరం తీరిపోయింది. ఈ రహస్యాన్ని కప్పిపుచ్చటానికి చాలా మూఢవిశ్వాసాలు ప్రచారం చేయవలసిన అవసరం ఉంది.

పాతిక సంవత్సరాలుగా ప్రజాస్వామ్యం కొరకు రాజకీయాలలో కృషిచేసి, మన దేశంలో లౌకిక రాజ్యాంగం ఏర్పరచటానికి పాటుపడిన నాయకుడు రాజకీయాలకన్న తత్వవిచారంలోనే ఎక్కువ ఆనందం ఉందని ప్రజలకు చెబితే, అప్రయత్నంగానో, సప్రయత్నంగానో ఆయన మూఢవిశ్వాసాన్ని ప్రచారం చేస్తున్నాడని భావించవలసి ఉంటుంది. ఎందుచేతనంటే ప్రజాస్వామ్యంలో ప్రజలకు తత్వవిచారం మీద కంటె రాజకీయాలలో ఎక్కువ ఆసక్తి ఉండటం సంఘానికి అవసరం.

"జిజ్ఞాసువు"



# ఎరువుల ధరలు కంట్రోలు చెయ్యాలి

రావెళ్ల హనుమంతరావు

ఆంధ్రదేశములో వర్షాలు విపరీతంగా కురుస్తున్నాయి. మే నెలాఖరు వారములో ప్రారంభమైన వర్షాలు ఇంకనూ కురుస్తూనే వున్నాయి. ఇవి ఇంతటిలో తగ్గిపోయే సూచనలు కనిపించటంలేదు. ఈ విధంగా వర్షాలు ఎడతెరిపి లేకుండగా కురవటం వలన ఆంధ్రదేశంలో రైతులు కష్టనష్టాలకు గురయ్యారు. ముఖ్యంగా "డెల్టా" ప్రాంతములలోని రైతులు మరింత అధికంగా బాధలు పడ్డారు. దుక్కులకు ముందునుండి వర్షాలు కురవటం వలన భూములకు సరిగా దున్నటానికి వీలులేక పోయింది. ఇందువలన భూముల నిండా తుంగ మొలిచి బీభత్సంగా పెరగటంతో దాన్ని పెడగొట్టేందుకు రైతులు ఎంతో కష్టపడవలసి వచ్చింది. ప్రతి సంవత్సరం ఊడ్పుల సమయంలో ఎకరానికి 4 లేక 5 గురు మగకూలీలతో బాగుచేత వగైరా పనులు పూర్తి అయితే యీ సంవత్సరం ఎకరానికి 40 లేక 50 మంది కూలీ లయ్యారు. ఈకారణం వలన రైతులు ఆర్థికంగా నష్టానికి గురయ్యారు. ప్రతిసంవత్సరం కంటే ఎన్నోరెట్లు అధికంగా పెట్టుబడి పెట్టవలసి వచ్చింది. ఇక శారీరక కష్టంమాట చెప్పనవసరం లేదు.

ఏదో విధంగా కష్టమో, నష్టమో భరించుకొని ఊడ్పులు పని పూర్తి చేశారు. ఊడ్పులైపోయి నెలరోజులు, కొన్ని ప్రాంతాలలో రెండు నెలలు పూర్తి కావస్తుంది. అయినప్పటికీ

ఏ ప్రాంతంలోనూ, ఏ పైరులూ కూడా కేవలంగా నవనవలాడుతూ తెలిగి రావటం లేదు. ఊడ్పులకు ముందునుండి వర్షాలు కురవటం వలన భూములు తోదుకపోయి గట్టిపడటంతో పైరులు బాగా పెరగటం లేదు. ఇంకనూ వర్షాలు కురుస్తూనే ఉండటం వలన భూములనిండా నీరు గట్టపైవరకు నిలిచి వుండటం చేత పైరు చిట్టి పెద్దగా దుబ్బు చేయటం లేదు. ప్రక్కన పుట్టుకు వచ్చే పిలక కర్రలు ఎప్పటికప్పుడు నీటి ఒత్తిడికి, చెడు గాలికి ఆగలేక వెంటనే చచ్చి పోతున్నాయి.

ఈనాడు భూమిలో వున్న పైరును బట్టి చూస్తే పంటలు సగానికి సగము తగ్గుతాయని పించుతోంది. క్రిందటి యేడాది కంటే యీ సంవత్సరం సాగుచేయబడే భూమిలో కొన్ని వేల యెకరాల భూమిని సాగుచేయకుండగా వదలి వేయటం జరిగిందని మన రాష్ట్రప్రభుత్వ ప్రకటనలే తెలియజేస్తున్నాయి. కొంత భూమిని సాగుచేయకుండా బంజరుగా వదలి వేయటం, సాగుచేసిన భూమిలో పైరులు సవ్యంగా లేకపోవటం వలన ఆహార పదార్థాల కొరత అధికమౌతుందనటంలో అతిశయోక్తిగాని, ఆశ్చర్యంగాని లేదు. మహానదులు, బంగారు పంటలు పండగల విశాల ప్రదేశాలు ఎన్ని ఉన్నప్పటికీ మన రాష్ట్రంలో ఉన్న ప్రజలకు సరిపడ ఆహార పదార్థములను మన మెప్పుడూ పండించుకోవటం లేదు. ప్రతిసంవత్సరం మన రాష్ట్రప్రభుత్వము ఆహార పదార్థాల కొరకు ఇతర రాష్ట్రాలమీద, కేంద్రప్రభుత్వం మీద ఆధార పడవలసి వస్తోంది. వారి దయాదాక్షిణ్యముల కెదురుచూస్తూ, వారు పెట్టెడి భిక్షకొరకు నిరీక్షించ వలసి వస్తోంది. ఇదే ఈ సంవత్సరం మరింత అధికమయ్యే సూచనలు కనిపించుతున్నాయి. పంటలు తరుగుతాయి. రాష్ట్రంలో కరువు కాటకాలు అధికమౌతాయి. ఏ రాష్ట్రానికా రాష్ట్రం స్వయం పోషకంగా ప్రజలకు సరిపడు ఆహార పదార్థాలను పండించుకోవాలనే నినాదం నామమాత్రం గానే వుండి పోతుంది.

ఈవిధంగా వర్షందెబ్బ తిని చెడిపోయిన పైరులకు "ఎరువులు" వేయటం చాలా అవసరము. ఇప్పుడు ఎరువులు వేయటం వలన పైరు బాగా పెరిగి, పంటలు మామూలుగా ఇంతకు పూర్వము రెండుమూడు సంవత్సరాలలో ఏవిధంగా పండాయో ఆ విధంగా పండక పోయినప్పటికీ, మొత్తంమీద ఎరువులు వేయటం వలన పైరుకు కొంతబలం చేకూరుతుంది. పంటలు కూడా చాలావరకు ఎక్కువగానే పండుతాయి. కనుక ఎరువులు అవసరమనే సంగతి నిర్వివాదాంశము.

ఎరువులలో ఆముదం పిండి-వేరు శనగపిండి మున్నగు పిండి ఎరువులను వాడటం చాలా కాలంనుండి ఆచారం. ఈరకము కృత్రిమపు ఎరువులు వాడటంవలన భూములు దెబ్బతింటాయనే మాట, గుల్లబారి సత్తువను కోల్పోతాయనే మాట వాస్తవమే. అయినప్పటికీ అందరు రైతులూ తమ కున్న అన్ని భూములకూ పశువుల ఎరువు వేయడంగాని-పాటి మన్ను తోలడంగాని సాధ్యపడదు. కనుక ఇలాంటి ఎరువులు ఆయా రైతులు-అప్పుడప్పుడు - అవసరాల్ని బట్టి తమ భూములకు వాడుతూనే వున్నారు.

ఈ సంవత్సరం-ఈ అవసరం ఇంకనూ ఎక్కువగా కనిపించుతోంది. ప్రతి రైతూ తనకున్న భూమిలో ఏదో ఒక భాగానికి యీ ఎరువులు వేయటం అవసరం. పంటలు తరగటంవలన దేశానికి కల్గే ఆహారపు కొరత, కరువు-కాటకాలు, ఆకలిరోగాలు వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈనాడు భూములకు ఎరువులు వేయటం ఎంత అవసరమో బోధ పడగలదు.

తమ దృష్టినంతనూ వున్న కాస్త కొండ్రి భూమిమీదనే పెట్టుకొని, ఎంతో కష్టపడి దానిని దున్ని బాగుచేసి ఊడ్చి, అది ఎంతో ఎక్కువగా ధాన్యం పండితే, ఈ అధికధరల సమయంలో వచ్చిన డబ్బుతో వున్న పాత ఋణములో కొంతవరకైనా తగ్గించుకోవచ్చునని ఆశలు పెట్టుకు కూర్చున్న రైతులు, భూమిదగ్గరకు వెళ్ళి చూడగానే వేసిన మొక్క వేసినట్లుగానే వుండి, పైరు నీరు గారుతూంటే, విచారగ్రస్తులై, తమ స్వార్థదృష్టితోనే గాక దేశకాల మాన పరిస్థితులనుకూడా దృష్టిపథమున వుంచుకొని, ముఖ్యంగా ఎక్కువ పంటల కొరకు ఇతోధిక

కృషి చేయమనే దేశనాయకుల ప్రకటనలను కూడా గుర్తుంచుకొని, తమ భూములకు ఎరువులను వేసి అయినా సరే ఎక్కువ పంట పండించాలనే పట్టుదలతో-ఎరువులు కొనేందుకు మార్కెట్టు వద్దకు వెళ్లితే అక్కడ ఎరువుల ధరలు చుక్కల నంటుతున్నాయి.

రైతు లోకంలో కనిపించుతూన్న ఆందోళనను, ఎరువుల అవసరాన్ని గమనించిన వ్యాపారస్థులు వీటి ధరలను విపరీతంగా పెంచివేశారు. ఇప్పటి కిప్పుడే ఆముదం పిండి బస్తా 18 రూపాయలు, వేరు శనగపిండి 15 రూపాయలు. ఈ ధరలు ఇకముందు ఎంతవరకు పెరుగుతాయో ఊహించలేము. ఇంత అధికధరలకు ఎరువులను కొని భూములకు వేయటం రైతులకు సాధ్యం గాకుండగా వుంది. ఈ సంవత్సరం ఇప్పటికే రైతులు తమ వ్యవసాయానికి ఎంతో ఎక్కువగా ధనాన్ని ఖర్చు చేసి వున్నారు. "గోరు చుట్టుమీద రోకలి పోటన్నట్లు ఇప్పుడు మళ్లీ ఇంత ధరకు ఎరువులు కొనాలంటే రైతులకు కష్టంగా వుంది. ఋణ భారం అధికమౌతుంది. పోనీ, వేయకుండగా వుందామంటే- పంటలు సరిగా పండేట్లు లేవు. ఎటూ నిర్ధారణ చేసుకోజాలక రైతు కొట్టుమిట్టాడుతున్నాడు.

ఈ విషమసమయంలో ప్రభుత్వం ముందుకు వచ్చి తగు శ్రద్ధ తీసుకోవాలి. స్వలాభాన్ని దృష్టిలో పెట్టుకొని రైతాంగాన్ని దోపిడీ చేయజూస్తూన్న వ్యాపారులను తగు విధంగా అదుపులో పెట్టడానికి ప్రభుత్వము ప్రయత్నించాలి. రైతు ఒక్కని క్షేమమేగాక రాష్ట్రంలో ఉన్న సమస్త ప్రజల క్షేమం కూడా ఈ సమస్య మీదనే ఆధారపడి ఉన్నది.

ప్రభుత్వము ఈ విషయంలో జోక్యం కల్గించుకోకుండగా వుంటే అందరు రైతులూ అధికమైన ధరలు చెల్లించి తమ భూములకు ఎరువులు వెయ్యలేరు, పంటలు పండవు, కరువుకాటకాలు తొలగవు. అధికోత్పత్తికి కృషి చేయండని ప్రజలను హెచ్చరించుతూ నాయకులు చేసే ప్రకటనల విలువ పత్రికలలో మాత్రమే వుండిపోతూంది. ఆహారపు కొరత, కరువు-కాటకాలు మాత్రం పెరిగిపోతున్నాయి.

ఈనాడు ఎరువుల కున్న ధరను తగ్గించుతూ వాటిధరలను కంట్రోలు చేయాలి. కంట్రోలు రేటు ప్రకారము ఎరువులను విరివిగా రైతులకు సప్లయి చేయాలి. తాలూకా వ్యవసాయ శాఖల ద్వారానూ, ఆహారసంఘాల ద్వారానూ, గ్రామ సహకార పరపతి సంఘాల ద్వారానూ, పంచాయతీల ద్వారానూ ఎక్కువగా ఎరువులను సప్లయి చేయాలి.

ఈ విధంగా చేసేటప్పుడు కూడా ప్రభుత్వం ఒక విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఇంతకు పూర్వము బ్రిటిషు సామ్రాజ్యవాదులు మన దేశాన్ని పరిపాలించు తున్నపుడు 1943 లో బ్రహ్మాండమైన కరువువస్తే ఆ తరువాత ప్రభుత్వము రైతులకు ఎరువులను విరివిగా సప్లయి చేస్తూ, వాటి ధరను అప్పటిలో చెల్లించజాలని రైతులకు అప్పుమీద ఎరువుల నిస్తూ ఆ అప్పు కూడా వడ్డీలేని అప్పుగా ఇచ్చివున్నది. ఆ విధంగా ఇవ్వటంవలన రైతులు ఎక్కువగా తమ భూములకు ఎరువులను వాడారు. పంటలు అధికంగా పండాయి.

తిరిగి ఇప్పుడు అలాంటి దుర్భర పరిస్థితులే దాపురించేట్లుగా కనిపించుతున్నాయి. "చేతులు కాలిన తరువాత- ఆకులు పట్టుకునే" దానికంటే ప్రభుత్వము ముందే మేల్కొని ఎరువుల ధరను కంట్రోలుజేసి, వడ్డీలేని అప్పుమీద రైతులకు ఈ సమయంలో ఎరువులను విరివిగా సప్లయి చేయటం అవసరం.



చల్లని పొంగులు :

# అమ్మను సంబోధించి...

కొత్తపల్లి లలిత

నీ ఒళ్లో ఆడుకొంటూ 'అమ్మా' అన్నాను. పని తొందర్లో నాకేసి చూడలేదు నువ్వు. నాకు కోపం వచ్చి నీ మెళ్లోని ముత్యాల హారాన్ని - నీకు నాన్న దేశాంతరం వెడుతూ ఇచ్చిన దాన్ని - రెండు చేతుల్తోటీ పట్టి తెంపేశాను. ముత్యాలు నా ఒళ్లోకి జలజల రాలాయి. వాటితో పాటు నీ కన్నీళ్లు కూడా... ఓ ముత్యం పగిలి నా చేతిలో గుచ్చుకొని రక్తం వచ్చింది. 'అయ్యో! నా తెలివి... పిల్లాడికి రక్తం వచ్చేటంతగా గుచ్చుకొందే' అని నిన్ను నువ్వు నిందించుకొన్నావు... అమ్మా! నీ కెందుకింత ప్రేమ నా మీద... నీ మీద నా కెప్పుడూ కోపం వస్తూనే వుంటుంది... నా మీద నీకు కోపం ఎందుకు రాదే?

'అమ్మా! నిన్ను వదలి వుండగలనా?' అన్నాను.. 'నేను మాత్రం వుండగలనా నాన్నా' అని కౌగిలించుకున్నావు... నీ గుండెకు నన్నదుముకొని నీ మెళ్లోని ముత్యాలహారం ఓ చివర మెళ్లో వేసి నన్ను నీలో కలుపుకున్నావు... నాకు బ్రహ్మానందం కలిగింది... కానీ అభాగ్యుణ్ణి- బాల్య చాపల్యం చేత. నీ కౌగిట్లో సరిగ్గా ఇమడక అటూ ఇటూ కదిలాను... మనల్నిద్దర్నీ ఏకసూత్రాన్ని బంధించిన హారం తెగిపోయింది. విడిపోయాం... అంతే...

ఆకలేసి నీ దగ్గరకు పరుగెత్తుకొని వచ్చా. 'ఏంకావాలి నాన్నా' అన్నావు, పాలమీగడ నవ్వుతో... ఏమిటో ముగ్ధుణ్ణయిపోయి అలాగే చూస్తూ ఉండిపోయా... నా ఆకలంతా ఏమైందో... అమ్మా! నీ చల్లని మాటలు, తియ్యని నవ్వు, వెచ్చని స్పర్శ నాకు పరమ శాంతి నిచ్చాయి... కొంతసేపటికి నా భావం గ్రహించి 'ఆకలేస్తోందా' అన్నావు వెన్ను చరుస్తూ... అలా అంటే నీ ముఖంలోకి చూడలేక నీ మెత్తని హృదయం మీదికి వాలి తల దాచుకొని నీ కౌగిట్లో కరిగి పోయాను...

కుంకుమ బోషి వున్న గూటిదగ్గర నిలబడి నువ్వు బొట్టెట్టుకొంటున్నావు... నేను నీ చీర కొంగు పట్టుకొని, నీ చీర కుచ్చిళ్ల మడతలు గోటితో సవరిస్తూ, నీ మంజీరాన్ని మోగిస్తూ అనుకొంటున్నాను... నాక్కూడా బొట్టెట్టమని ఏడ్చాను... చీర కొంగు లాగాను... అంతకంటే ఏం చెయ్యనూ... నువ్వు పువ్వులు జలజల రాలినట్టు నవ్వుతూ నన్నెత్తుకొని ముఖంమీద ముఖం పెట్టి ముద్దెట్టుకొన్నావు... బొట్టెట్టవేమని నిన్ను నా యిష్టం వచ్చినట్టు తన్నాను... నవ్వుతూ కిందికి దింపి వెళ్లిపోయావు... నేను తల ఎత్తి చూశాను... ఎదురుగుండా అద్దంలో నా ముఖాన్ని బొట్టు కనబడింది... నాకు ఊరంత ఆనందం కలిగింది... నా ముఖంమీద ముఖం పెట్టి ముద్దెట్టుకొన్నప్పుడు నీ ఫాలభాగంతో నాకు తిలకం దిద్దావని తెలియక 'అమ్మా, నాకు తెలియకుండా ఎప్పుడు బొట్టెట్టావే' అంటూ నీకోసం పరుగెత్తాను... నువ్వు కనబడలేదు... నువ్వు దగ్గరవున్నప్పుడు తన్నినందుకు నొచ్చుకున్నాను... ఏం లాభం!... నువ్వు లేవు గాని నీ తిలకం ఇచ్చిన సంస్కారం వుంది అని తృప్తిపడ్డాను.

నేను గదిలో ఓ మూల కూర్చొని కూని రాగాలు తీస్తూ ప్రపంచంలో నా వంటి గాయకుడు లేడని విర్రవీగుతుంటే నీవు వచ్చి 'మా నాయన ఎంచక్కా పాడతాడే' అంటూ ఎత్తుకొన్నావు... 'అమ్మా నీకంటే నేబాగా పాడనే!' అన్నాను. 'ఔ' నన్నావు... నేను చాలా గొప్పవాణ్ణని విర్రవీగాను... ఆవేళ సాయంకాలం నువ్వు వెన్నెట్లో పాడుతున్నావు నన్ను పడుకోబెట్టి... నేను పడుకోక దొంగతనంగా నీ పాటలు వింటున్నాను... నా ఎదురుగుండా పాడవెం చేలే అమ్మా!... నన్ను చిన్నబుచ్చడం నీ కిష్టం లేదా!... అమ్మా... చెప్పవే... నువ్వే—

# బొమ్మలాట

పిల్లలంతా బొమ్మలాటలు ఆడుకుంటున్నారు. వారి ఆటల అధ్యాయంలో నేడు బొమ్మల పెళ్ళిళ్ళు చెయ్యటం. ఉన్న పదిమంది పిల్లలూ అయిదుగురు మగపెళ్ళి వారుగానూ, అయిదుగురు ఆడపెళ్ళివారుగానూ చేరారు. ముందు సంబంధాలు మాట్లాడుకోటం దగ్గరనుంచీ ప్రారంభించారు. పిల్లవాడి తరఫువారు మూడువేలు కట్నమూ, అయిదు వందలు లాంఛనాలకిందా అడిగారు. పెళ్ళికుమార్తె తరఫువారు మా పిల్ల రత్నం లాంటిది, పిల్లను చూసి ఊరికే చేసుకోవచ్చు, పనిపాటల విషయంలో ఈకాలం పిల్లలందర్లోకీ వెయ్యిరెట్లు నయం, ఇటువంటి పిల్ల ఈ చుట్టు ప్రక్కల దొరకదని సమాధానం చెప్పారు. ఏమైనా కానీ అంతా కలసి అయిదు వందలు యిస్తామన్నారు. ఇరుపక్షాల వారికీ రాయబారం అయిన తరువాత సంబంధం స్థిరపడింది. ముహూర్తం కూడా వెంటనే పెట్టుకున్నారు. తాటాకు బొమ్మల పెళ్ళికూతురు పెళ్ళికొడుకులకు ఆ క్రితంరోజు దర్జీవాడి కొట్టు దగ్గర తీసుకొచ్చిన కత్తిరింపు పేలికలతో ముస్తాబు చేశారు. పెళ్ళికూతురుకు పూసల దండలు వేసి అలంకరించారు. "అబ్బ, మాపిల్ల పదహారేళ్ళ పడుచు - ఎంత బాగుంది; మాపిల్ల అందాల బరణి, మీపిల్లవాడు మాల మొగుడు" అన్నారు పెళ్ళికూతురు తరఫువాళ్ళు. పెళ్ళికొడుకు తరఫువాళ్ళు "మాపిల్లాడు కాలేజీలో బియ్యే చదువుతున్నాడు- అల్లరి చిల్లరిగా తిరిగేవాడుకాదు, బుద్ధిమంతుడు, ఇరవై ఏళ్ళవాడు- బుల్లి కత్తిరించిన మీసాలతో ఎంత అందంగా వున్నాడో చూడండి" అని పెళ్ళికొడుకు తరఫువాళ్ళు అన్నారు.- "సరే - పిల్లల అందచందాలు ప్రశ్నించుకుంటూ కూర్చుంటే ముహూర్తం దాటిపోతున్నది... పిల్లల్ని తీసుకు రండి త్వరగా" అని ఒకళ్ళు హెచ్చరించారు. పెళ్ళికొడుకునూ, పెళ్ళికూతురునూ చెరొకళ్ళూ పట్టుకు కూర్చున్నారు. ఇద్దరు పిల్లలు తాటాకు బూరాలు వూదసాగారు. ఒకళ్ళు చిన్న స్నో డబ్బా తీసుకొచ్చి కర్రముక్కతో వాయించసాగారు. కట్నం ఇచ్చే సమయం వచ్చింది. కట్నం డబ్బుకు వెనకాడారు ఇచ్చుకోలేక పెళ్ళికూతురు వాళ్ళు. కట్నమిస్తేనేగాని మా అబ్బాయి పుస్తె కట్టడు అన్నారు పెళ్ళికొడుకు తరఫువాళ్ళు. అమ్మాయి అబ్బాయివైపు జాలిగా చూస్తున్నట్టుగా కొంచెం బొమ్మతల పైకెత్తారు పెళ్ళికూతురువాళ్ళు. సూత్రం కట్టటానికి పెళ్ళికొడుకు తహతహలాడుతున్నట్టుగా కొంచెం ముందుకు వంచారు పెళ్ళికొడుకు తరఫువాళ్ళు. పెళ్ళికొడుకు ఇష్టపడ్డట్టుగా మళ్ళీ బొమ్మను అటూ ఇటూ కదిపి మంగళసూత్రం కట్టేశారు బొమ్మమెళ్ళో. పిల్ల తరఫు వాళ్ళకి ముఖం వికసించింది. పిల్లాడి తరఫు వాళ్ళకి ముఖం కొంచెం ముడుచుకుంది. మొత్తానికి పెళ్ళి అయిపోయింది. వేయించిన కంది పప్పుతో భోజనాలయిపోయాయి. పూర్ణంబూర్లకింద శనగ్గింజలు తిన్నారు. కూరకింద పెసరబద్దలు తిన్నారు. మొత్తానికి పెళ్ళంతా అయిపోయింది.

ఇదంతా ముసిముసి నవ్వులు నవ్వుతూ చాటుగా చూస్తున్నది కమల. ఈ పిల్లల్లో ఒక్కదానికన్నా పూర్తిగా పదేళ్ళు లేవు. పిల్లల అందచందాలూ, చదువుల దగ్గర్నుంచీ కట్నాల పేచీల వరకూ అచ్చంగా అసలు పెళ్ళిళ్ళ మాదిరే చేశారు. వీళ్ళ ఇళ్ళు బంగారంగాను అని దున

బి. యస్. ఆర్. కృష్ణారావు

స్నాలో అనుకుని నవ్వింది. ఆ సమయంలో తనను చూస్తే సిగ్గేసి ఆట ఆపేస్తారని వాళ్ళకు కనబడకుండా చాటుగా నుంచొని చూసింది. వాళ్ళ బొమ్మల పిల్లాడు చక్కగా ఇరవై ఏళ్ళ వాట్ట. కత్తిరించిన మీసాలతో ఎంతో బాగున్నాట్ట. కాలేజీలో బియ్యే చదువుతున్నాట్ట. అల్లరిచిల్లరిగా తిరిగేవాడు కాదుట. చాలా బుద్ధిమంతుట్ట. వాళ్ళ బొమ్మలపిల్ల పదహారేళ్ల పడుచుట. పని పాటల విషయంలో అందర్నీ తలదన్నిందిట. అంత మంచి పనిమంతురాలుట. పెళ్ళికొడుక్కి ఇరవై ఏళ్లు, పెళ్ళికూతురు పదహారేళ్ళ పడుచు. వాళ్ళ దాంపత్యం ఎంత బావుంది. పెళ్ళిలోనే ఆ పిల్లవాడు అవబోయే పెళ్ళాంమీద ఎంత ఇష్టం, అపేక్ష చూపించాడు. కట్నం ఇవ్వక పోయేసరికి తల్లిదండ్రులకు ఇష్టం లేకపోయినా బుద్ధిమంతుడు కనుక పిల్లమీద వుండే మోజు కొద్దీ మంగళసూత్రం కట్టేశాడు. అంత ఇష్టం భార్యమీద. ఎంత ప్రేమ. నాకూడా అటువంటి చిన్నవాడూ, బుద్ధిమంతుడూ దొరికితే ఎంత అదృష్టవంతురాల్ని. నాన్నకు కట్నమిచ్చే తాహతున్నా పిన్నిమాటలకు లొంగిపోయి కట్నంకింద డబ్బు దండుగ ఎందుకని ఆ అరవై ఏళ్ళ ముసలివాడికి ఇవ్వచూస్తున్నారే. తాటాకు బొమ్మ పిల్లపాటి అదృష్టం కూడా నాకు లేదా. ఆమాత్రం నోచుకోలేదా నేను. అమ్మ కనక బ్రతికుంటే ఈ సంబంధానికి ఒప్పుకునేదేనా? ఎప్పటికీ ఒప్పుకోదు. పదేళ్ళ పిల్లలకు కూడా ఇంగితజ్ఞానం వుండి తమ పిల్లలకు బుద్ధిమంతులనీ చిన్నవాళ్ళనీ అందమైన వాళ్ళనీ ఇచ్చి చేశారు. ఆమాత్రం తోచలేదా నాన్నకు! పిన్ని అరచేతిలో కీలుబొమ్మయి నా పదహారేళ్ళ బ్రతుకూ బండలు వెయ్యబోతున్నారు ... అనుకుంటూ ఆలోచిస్తున్నది కమల.

"ఎక్కడ తగలడ్డావే కమలా. ఇంట్లో పనంతా వదిలేసి పెత్తనాలు చేస్తున్నావా" అంటూ పిన్ని సుద్దరి)చేసి పమిటచెంగు లాగి దోపుకుంటూ వచ్చింది. ఈ కేకకు పిల్లలంతా చెదిరిపోయారు. ఎక్కడివాళ్ళక్కడ బొమ్మలనూ, లక్కపిడతలనూ, కందిపప్పునూ వదిలి పారిపోయారు. "వెంగనాచక్కి ఇక్కడుండి వాళ్ళచేత బొమ్మలాటలు ఆడిస్తున్నావా భడవా. సిగ్గు లేకపోతే సరి" అని కమలను నాలుగు బాది లక్కపిడతలు ఇంట్లోకి విసిరేసి తాటాకు బొమ్మలు కలిపి పారేసింది. పెళ్ళికూతురూ పెళ్ళికొడుకూ ఇద్దరూ వాకిట్లో మురుక్కాలవలో పడ్డారు. వాటితోపాటు పూసలదండలూ, గుడ్డపేలికలూ పోయాయి. పిల్లలంతా అదిరి చూడకుండా ఏడ్చారు. మాబ్బాయి పోయినాడంటే, మామ్మాయి పోయిందని. "పదహారురోజుల పండగయినా వెళ్ళందే, పెళ్లిపారాణి ఆరకముందే ఇద్దరూ పోతారా" అంది ఒక పిల్ల.

"పోనీలే- ఈ రాక్షసి చేతిలో ఇక్కడుండే బదులు చచ్చి స్వర్గానికెళ్లారు కొత్తమొగుడూ పెళ్ళాలిద్దరూ. అక్కడయినా స్వేచ్ఛగా బ్రతుకుతారు" అంది ఇంకో ముదినాపసాని పిల్ల.

* * *

వీళ్ళమాటలన్నీ వింటూ, ఒకనాటి బొమ్మలాటలే మరొకనాడు నిత్యజీవితాల్లో ప్రతిఫలిస్తాయి అనుకుని, దొడ్లోకి వెళ్ళింది కమల అంట్లు తోమటానికి.

* * *

పీటలమీద కూర్చున్న వధూవరుల నిద్దర్నీ అంతా చూసి ముక్కుమీద వేలేసుకున్నారు. నలుగురూ నాలుగు విధాలుగా అనుకున్నారు. ఇద్దరు వ్యక్తులకు మినహా ఆ వివాహం ఎవరికీ సమ్మతంగా లేదు. మొదటి వ్యక్తి కమల సవతి తల్లి వెంకాయమ్మ. రెండవ వ్యక్తి పెళ్ళికొడుకు. ఎవరెన్ని విధాలుగా అనుకున్నా పెళ్లి మాత్రం అయిపోయింది. కమల ఆవేదన, నిట్టూర్పులు ఆ మంగళతూర్యారావములతో కలిసిపోయి ఎవరికీ వినబడలేదు, సముద్రం అలలను మించిపోయిన ఆమె హృదయఘోష ఎవరికీ వినబడలేదు. పొంగి పొర్లుకొస్తున్న దుఃఖాతిశయంచేత వచ్చే కన్నీరు కల అనించి కూర్చున్న మోకాలిమీద చీరలోనే ఇంకిపోయింది. కళ్ళెర్రబట్టం పొగ నుంచి అనుకుంది వెంకాయమ్మ. సూత్రధారణ చేసే సమయంలో పెద్దతనంచేత పెళ్ళికొడుకు చేతులు వణికాయి.

పదహారురోజుల పండగనాడే మొక్కు చెల్లించి అత్తవారింటికి పంపించారు కమలని. మనోవేదనతో క్రుంగిపోయిన దాన్ని ఇంకా క్రుంగదీసేందుకుగాను పెద మోయలేనన్ని

నగలు పెట్టారు. అపర లక్ష్మీదేవి అన్నారు అత్తవారింట్లో అందరూ. ముసలాయన బోసి నోటితో నవ్వాడు.

రాత్రి భోజనాలయిం తరువాత కమల పడుకుంది గడియారంవైపు చూస్తూ. ఆమె హృదయాంతరాళంలో కలిగే ఘోషకు లయగా గడియారం టిక్కుటిక్కు మంటున్నది. ఆ గడియారపు ముల్లు ఆతురతతో నడుస్తున్నయ్యో, నెమ్మదిగా నడుస్తున్నయ్యో ఆమెకు తెలియటంలేదు. జీవంలేని గడియారం ఒకచోట నిలకడగా వుండి పరిభ్రమిస్తూ నిమిషాలనీ, గంటలనీ చూపిస్తూ అందరి ఆదరణనూ పొందుతున్నది. అచేతనాల్లో మరలతో నిండివున్న ఆ గడియారం యొక్క ఉనికి గడియారానికేమీ లాభం లేకపోయినా, అర్థంలేని జీవి అనిపించుకున్నా ప్రజాదరణ పొందుతున్నది. తనూ ఆగడియారం లాంటిదేను. తన జీవితంయొక్క ఉనికివల్ల తనకేమీ లాభం లేదు. కాని ఆఇంట్లో అందర్నీ, తన పుట్టింట్లో సవతితల్లినీ సంతోషపెడుతున్నది. గడియారం సర్వమానవుల్నీ సంతోషపెడుతున్నది తనకేమీ లాభం లేకపోయినా. కాని తను కొద్దిమందిని మాత్రమే. కాబట్టి గడియారానికన్నా హీనమైంది తన బ్రతుకు. ఆ ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో, బరువుగా వుండే ఆ హృదయాక్రందనాలతో మోడులాంటి జీవితాన్ని గడుపుతూ ఎన్ని సంవత్సరాలు జీవించాలి?

మూడు క్యాలండరు కాయితాలు చిరిగిపోయినయ్యి. నా భార్య అపరూప సౌందర్యవతి, లక్ష్మీదేవి- అది నా యింట్లో వుండటమే నా మనస్సుకు ఆనందం అనుకుంటున్నాడు ముసలాయన. ఏమీ చెయ్యలేని స్తబ్ధత నిరాశగా నిరీక్షించమంటున్నది కమలని. ఆనాటి బొమ్మలపెండ్లి తరువాత మచ్చుకయినా ఆమె ముఖంలో చిరునవ్వు ఛాయలు ప్రవేశించలేదు. తన పెండ్లితో నవ్వు, సంతోషమూ అనేమొక్క ఆమె మానసిక నిఘంటువునించి శాశ్వతంగా వెళ్ళిపోయింది. ముసలాయన దగ్గరకొచ్చినప్పుడూ, తనను స్పృశించి ముద్దుపెట్టుకోబోయినప్పుడూ చలనంలేని చందనపు బొమ్మలా వుండేది కాని చలించేదికాదు. తప్పుకుని అవతలికి వెళ్ళేది కాదు.

పరీక్షలయిపోయాయి. వేసంగి సెలవులు ఇచ్చారు. కొడుకు ఇంటికి రాగానే పినతల్లిని చూపించాడు తండ్రి. కొడుకు చూసి తలొంచుకున్నాడు. ఆ రోజు అతను సరిగ్గా భోజనం చెయ్యలేదు. ఏమిటో ఆలోచిస్తున్నాడు. రాత్రి భోజనాల వంతు వచ్చింది. అతను శూన్యంలోకి చూస్తూ ధ్యాస ఎక్కడో పెట్టుకుని ఆలోచిస్తున్నాడు.

"నారాయణా, అన్నానికి రా" అన్నాడు తండ్రి.

"నాన్నగారు మీకోసం కనిపెట్టుకూర్చున్నారు" అని వచ్చి చెప్పింది కమల. తలొంచుకుని గుమ్మంలో నుంచున్న పిల్లని చూస్తూ మంచం దిగాడు నారాయణరావు. మనస్సును అమరప్రపంచపు అంచుల్లో విహారింపచేస్తూ ఏదో దేవత్వం తనను అలముతుందని ఆశిస్తూ, సంకుచిత దృష్టితో ఆమెముఖంలోకి చూస్తూ వంటింట్లోకి వెళ్ళాడు భోజనానికి. అతని ఈ భావాన్ని అవగతం చేసుకునే స్థితిలో లేదు కమల. మనిషికి కోరికలు వుంటాయనీ, వివిధ భావాలూ విభిన్న ప్రకృతులతో నడుస్తాయనీ, ఇతరులకు కష్టం కలిగినా తమకు తృప్తి కలిగితే చాలని చాలామంది ఆశిస్తారనీ, ఇటువంటి విషయాలన్నీ పెళ్ళితోనే మర్చిపోయింది. ఇప్పుడల్లా ఆమెకు తెలిసింది ఒకటే. తాననే వ్యక్తి జీవచ్ఛవంలా ఈ ఇంట్లో వున్నదని మాత్రమే తెల్సుకో గలిగింది.

వారం పదిరోజులు గడిచిపోయినయ్యి. ఆ రోజు రాత్రి భోజనాలయినయ్యి. ముసలాయన చుట్టకాల్చుకుని పడుకున్నాడు. కమల భోంచేసి తన గదిలో పక్కమీద పడుకుంది. ముసలాయన ఇప్పుడంతగా ఆమెగదిలోకి వెళ్ళటం లేదు.

నారాయణరావుకు నిద్రపట్టలేదు. ఏవో ఆలోచనలు, ఏవో భావనాతరంగాలూ అతని మనస్సును ఊగిసలాడింపజొచ్చినయ్యి. మనస్సును ఎంతకుదుటపర్చుకున్నా కుదుటపడేటట్టుగా లేదు. తండ్రి మూడోపెళ్ళి చేసుకోబోతున్నాడని ఇదివరకే తెల్సు అతనికి. అదీ ఒకందుకు మంచిదనే అనుకున్నాడు. కొడుకు అభిప్రాయాన్ని ముసలాయన అడిగినప్పుడు అవశ్యం చేసుకోవలసిందే అన్నాడు. ఇప్పుడతడు ఆలోచిస్తున్నాడు.

తన కర్తవ్యం నెరవేర్చుకోటం ఎట్లాగాని. అరవైఏళ్లు దాటినా పదహారేళ్ళ పడుచును మూడవభార్యగా స్వీకరించటం ఎంత అవివేకమైన విషయమో పెద్దవాడు ఆయనకే తెలియవద్దూ, అటువంటి అవివేక ప్రకృతిగల అతండ్రి కొడుకయిన తనకే సవతి తల్లిని అపేక్షించటం అంతగా తప్పుగా తోచలేదు. అతనిలో దాగిన కామపుఖులు నేటికి బయటపడ్డాయి మనస్సులో ఆమెను తల్చుకున్నప్పుడు పరిపూర్ణమైన అతడి యౌవనమూ, ఉద్వేలమైన సముద్రతరంగాల్లా పొంగుతున్న అతడి మనః ప్రవృత్తీ, తీవ్రమైన అతడి రూపతృష్ణా వశం తప్పిపోతున్నాయి. గ్రీష్మకాలంలో మేఘములు కనిపిస్తే చాతకపక్షికి ఎలావుంటుందో అలాగేవుంది కమల అనే చాతకం కంటబడగా. మళ్లీ అతని మనస్సు వెనక్కి లాగింది-తల్లితో సమానమైన ఆమెను ఆశించటం తప్పేమోనని.

"ముసలాయనకు వివాహం చేసుకోమని చెప్పింది ఇందుకేనా- ఆయన నీతో ఈ విషయంలో ప్రస్తావించినప్పుడు ఆయన బుద్ధి మాంద్యాన్ని విమర్శించి వివాహం చేసుకోకుండా చేయవలసింది పోయి, ఆయన వివాహంకూడా నీ మంచికే అనుకుని ఇప్పుడీవిధంగా ఆమెను ఆశిస్తున్నావు - ఇదేనా నీ కాలేజీ చదువు" అన్నది అంతరాత్మ.

"సుఖదుఃఖాలనుభవించటం మానవుల విధి. ఒకరి సుఖంకోసం మరొకరి జీవితం నాశనం కావలసిందే. అది లోకరివాజు. ఆమె పరిపూర్ణ యౌవనవతి. మధుకలశం ఇంట్లో వుండగా దానిని సేవించకుండా చూస్తూవుంటే ఏమాత్రం లాభంలేదు. అనుభవయోగ్యమైన దానిని వదిలే వ్యర్థుడు ప్రపంచంలో లేడు. నీ కోరిక సిద్ధించే రోజు వచ్చింది కనకనే ఈ పిల్ల ఈ ఇంట్లో పడింది" అన్నది అతని రూపతృష్ణ.

"కన్నులు పోయిన పిదప సూర్యనమస్కారాలవల్ల లాభంలేదు. నీ వాచరించబోయే కార్యం బహు నీచమైంది. దీపంచుట్టూ మిడత తిరుగుతూ దాన్నేమో చేద్దామని అనుకుని చివరకు రెక్కలు కాలి రెపరెపలాడుతూ జీవచ్ఛవంలా తిరుగుతుంది. అట్లాగే నీవు కాకు" అన్నది అంతరాత్మ.

"షోడశకళలు సముపార్జించినప్పటికీ చంద్రుడుకూడా జనకుడగు సాగరుని సంక్షోభపెట్టును. కాబట్టి ఇందులో తప్పేమీ లేదు" అన్నది అతని రూపతృష్ణ.

ఆలోచిస్తూనే నిద్రపోదామనుకుని కన్నుమూశాడు. కాని రోగులకూ, యోగులకూ, భోగులకూ నిద్ర వుండదనే చందాన అతనికి నిద్ర పట్టలేదు. చివరకు కామతృష్ణ జయించటం మంచి, తాను చేయబోయేది చాలా తప్పు విషయమనే ఇనుపకచ్చడాలు విడిపోయి అతని హృదయం తరవట్లు తొక్కనారంభించింది. ఇంకొక్క నిమిషంలో ఆమె పెదవులను స్పృశిస్తూ ఆమె అధరసుధారసమును గ్రోలుతూ ఆమె రత్వంలో తేలిపోదామని అతని మనస్సు వువ్విళ్లూరసాగింది.

మెల్లిగా లేచాడు. ప్రణయ ప్రవాహంలో భ్రాంతినౌకనెక్కి కాంక్ష అనే తెడ్డుతో మెల్లిగా నడుపుకుంటూ ఆమె గదిలో ప్రవేశించాడు.

గదిలో దీపం వెలుగుతూన్నది. తన కోరికలన్నీ ఏనాడో తనలోనే జీర్ణింపచేసుకున్న దవటంనుంచి ఆమె అది మరిచి నిద్రపోతున్నది. పసికర్ల వాని కళ్ళకు ప్రపంచమంతా పచ్చగానే కనబడ్డట్లుగా కామోద్రిక్తుడైన అతనికి ఆమె పడుకున్న చందము సాంద్ర చంద్రికానికరమున మల్లెపూ పాన్పుపై పవ్వళించి, కౌముదీపాన కౌతుకమతియై సౌధోపరితలమునకు దిగివచ్చిన దేవకన్యలా కనిపించింది. నిమిషమునకు కొన్ని వేల పర్యాయములు పరిభ్రమించే యంత్రంలా దడదడ కొట్టుకోసాగింది అతని గుండె. రెండు చేతులతోనూ ఆమె భుజములు పొదివి పట్టుకుని కౌగలించుకోబోయాడు. నిద్రకళ్ళన ఉలిక్కిపడి లేచింది. గ్రహించింది. మాట్లాడకుండా మంచం దిగింది. ఖంగారుగా అతనట్లాగే మంచం మీద కూర్చున్నాడు.

అతనికి ఎదురుగా నిల్చుంది కన్నార్పకుండా చూస్తూ. ఆమె హృదయం పగిలిపోయినట్లయింది. ఈసంఘటనను విచారించలేక రాయిలా అయిపోయింది ఆమె మనస్సు. ఈ సమయంలో ఊరార్పు రాలేదామెకు. తాత్కాలికమైన సుఖంకోసం ఇంతపని చేస్తాడని అనుకోలేదు.

నాశనమైన జీవితాన్ని ఇంకా నాశనం చెయ్యాలనుకుంటారు కొందరు. ఈ సమీకరణ వారిద్దరి జీవితాన్నీ కొత్త అందాలతో తల మునకలు చేస్తుందని ఆశించాడతను. ఏనాడో నాశనమైన జీవితం ఇంకా నాశనమయే దేముంది! ఇంతవరకూ జీవితం నాశనమైనా, కోరికలు అణగారిపోయినా, మోడులా జీవిస్తున్నా తను ఆత్మను చంపుకోలేదు. ప్రాణి తనలోనుంచి పోలేదు. నేడు దానికంతుకూడా వచ్చిం దనుకున్నది ఆమె. ఎదుటివారు తనకు తీరని తలవంపులు తెచ్చి బాధపెట్టే స్థితిలో కొచ్చినప్పుడు వారితో పెదవి విప్పి మాట్లాడి జీవితాన్ని ఇంకా కలుషితం చేసుకోటం అంత సమంజసమైన విషయం కా దనుకుంది. ఇంత కాలం కేవలం నైతికంగానే పతనమైంది. ఇప్పుడు శాశ్వతంగానే పతనం కాదల్చుకుంది. వేడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో ఆమె బుస కొడుతున్నది. చలనంలేని తాడిమానిలా స్తంభించిపోయి అట్లాగే కూర్చున్నాడు పక్కమీద అతను.

ఆనాటి బొమ్మల పెళ్ళి మళ్ళీ ఈనాడు గుర్తొచ్చింది. ఆ రోజున తన సవతితల్లి ఆ బొమ్మలను నలిపి పారేసి వాటి ప్రాణాలు తీసింది. ఈనాడు తన సవతి కొడుకు తన ప్రాణం తియ్యబోయాడని తల్చుకుంది. శాశ్వతంగా ఈ లోకాన్నుంచి వెళ్ళిపోయేముందు ఒక్క చిరునవ్వుతో అతన్ని కితకితలు పెడితే! ఎంత ఆనంద మనుభవిద్దామనీ, సౌఖ్యపడదామనీ వచ్చాడో పాపం. అతను ఆశించినట్లుగా సమకూర్చక పోయినా కనీసం దిగజారిపోయిన సంతోషాన్ని కాస్త తెచ్చిపెట్టి పోదా మనుకుంది. ఇది తప్పని తోచి నప్పటికీ అతని సంతోషాన్ని కేవలం దిగజారనివ్వ దల్చుకోలేదు.

ఇప్పుడే వస్తా కూర్చో" అని ఒక్క చిరునవ్వు నవ్వి, అదే తన జీవితంలో అంతిమ నిశిగా భావించుకుని, అరమోడ్పు కంటితో అతనివైపు చూసి పోయిన సంతోషాన్ని కాస్త తిరిగి తెచ్చి తను మాత్రం దొడ్లోకి వెళ్ళింది. ఆమె పొందు ననుభవించి, ఆ స్మిత జ్యోత్స్న తరంగాలలో తలమునకలుగా తేలిపోతూ, రెండుహృదయాలూ ఏకంచేసి సంతోషాతిశయంతో గూడిన నిడివి నిట్టూర్పు విడిచి- "అబ్బ" అందా మనుకున్న అతనికి ఎత్తునుంచి ఏదో నీళ్ళలో పడినట్లుగా చప్పుడు వినిపించింది.




—శంకర్స్ వీక్లీ నుండి.

"ఎవరు గెలిచారో పోల్చుకోండి!"

స్కెచ్

# చెడిపోయాడుట

పోలవరపు శ్రీహరిరావు

రామూ చెడిపోయాట్ట. మేం యిద్దరమూ కలిసే చదువుకున్నాం, యిప్పటికీ ఒకే గదిలో వుంటున్నాం; నాకు తెలియనే తెలియదు - రామూ చెడిపోయాడని. ఇప్పుడు రామూతో సన్నిహిత సంబంధం లేని వాళ్ళందరికీ - రామూ చెడిపోయాడనే సంగతి ఎలా అర్థమయిందో నాకు తోచడంలేదు. మమేకంగా మెలగుతున్న నాకు తెలియకుండానే రామూ చెడిపోయాట్ట!

ప్రొద్దున్నే లేచి వీధి అరుగుమీద కూర్చుని ముఖం కడుక్కుంటూంటేగా యీ దుర్వార్త నా చెవిని పడింది. మల్లయ్యా, పుల్లయ్యా వీధి వెంట నడుస్తూ నావైపు చూశారు. వాళ్ళ చూపుల్ని పరీక్షించే అవసరం కలగలేదు. కాని నన్ను దాటగానే మల్లయ్య కాండ్రించి వుమ్మివేసి "ఛీ...పాడు సావాసాలు ఇట్లాంటి సావాసాల వల్లనే నసుకో, మంచింటివాళ్లు చెడిపోయేది!" అనడంతో - నే నటు చూశాను. పుల్లయ్య "రామూ నేస్తుడీ కుర్రాడేనా ఏమిటి?" అని అడిగాడు. ఇదేదో నామీద విరుచుకుపడుతూందనే ఆందోళన భయాలతో వాళ్ళ మాటలు విన్నాను.

మల్లయ్య "అవున్రా, రామూ నేస్తుడే. ఇద్దరూ ఒక్కంచాన తిని, ఓమంచాన పండే వారు...అయితేనేం? ఒకరిగుణా లొకరి కబ్బుతాయా? ఇతను శుభ్రంగా ఏదో నౌకరీ చేసుకుంటూంటే - వాడు ఆ పిచ్చ తిప్పకాయల సావాసం చేసి యిట్లా చెడిపోయాడు" అన్నాడు సాగదీస్తూ. వాళ్లు వీధిమూల తిరిగేవరకూ వాళ్ల మాటలు చెవుల్లో తిరుగుతూనే వున్నాయి.

ఇంతకూ రామూ నాతోగాక, మరెవరి స్నేహంవల్ల ఎలా చెడిపోయాడో నాకు తెలిసిందిగాదు. కాని యీ మల్లయ్యల మాటలు పైకి ఎంత సత్యాలుగా కన్పించుతాయో, లోపల అంత విచిత్ర వ్యతిరేక భావాలను కలిగి వుంటాయి అని తెలిసింది. స్నేహితాన్నిగురించి మల్లయ్యగారి విచిత్ర పై అభిప్రాయాలు పరికించండి. ఒకరిగుణా లొకరి కబ్బుతాయా అని అన్నాడు, తను సావాసాలవల్ల చెడిపోయాడనీ అన్నాడు. అసలు సంగతి రాముడు చెడిపోయాట్ట!

నాకు తెలియని చెడునడవడి రామూలో వున్నదని నాకే కోశానా నమ్మకంలేదు. నిప్పు లేకుండా పొగరాదన్నట్లు - అసలేమీ లేకుండానే చెడిపోయాడని అంటారా? ఏమో! ఏదీ నిశ్చయించుకో లేకుండానే ముఖం కడుక్కుని, చెంబు యింటిలో పెట్టి కాఫీ దేవాలయానికి నడుస్తున్నాను. ఎదురుగా కామయ్యగారు దొర్లుకొచ్చారు. ఆయన వలయాకారం నడుస్తూంటే గుమ్మడికాయ దొర్లుతున్నట్లే వుంటుంది. అందుకనే ఆయనిది నడకగాదు - దొర్లడే.

కామయ్యగారు దొర్లడం ఆపి, పన్నుగర్రమీద ఆని నిల్చుని నా కళ్లల్లోకి చూస్తూ నవ్వారు: ఓటేసుమండలో మాట్లాడినట్లు నవ్వు! సామాన్యపు నౌకరీ చేసుకుంటున్న నాముందు ఆ షావుకారు నిల్చుని అట్లా నవ్వుతూంటే — నాకు 'జూ' లో మృగం ఎదిరించినప్పుడు కలిగే ఆందోళన కలిగింది. పైగా కామయ్య కోరమీసాలను విలాసంగా దువ్వుకుంటూ పకిలించాడు. ఆ వాలకం చూస్తే పోట్లాటకి కాలుదువ్వే పొట్టేలు గుర్తొచ్చింది. వీడికెంత అహంకారమూ అనే అసహ్యంతో, ఆ వలయాన్ని తప్పుకుని వెళ్ళిపోబోయాను.

కామయ్య నాజబ్బను గట్టిగా పట్టుకున్నాడు. అతని ఎముగ్గొడ్డుపట్టు నా జబ్బను బాధించడమే కాక, నాకు మహాపెద్ద అసహ్యం వేసింది. ఎంత షావుకారైతే మాత్రం - యీ కామయ్యగాడు నా చెయ్యి పట్టుకుని నన్నాపే అధికారం ఎట్లా సంపాదించాడూ? పురుగును విదిలించినట్లు చెయ్యి గుంజుకున్నాను గాని అతని చెయ్యి వదల్లేదు. తీవ్రంగా కామయ్య ముఖంలోకి చూశాను. వాడి కళ్ళలో వెకిలి-చికిలింతలు మెరుస్తున్నాయ్.

ఛళ్ళున నవ్వి 'అయిందోయ్ పెళ్ళి, అణిగిం దోయ్ రంధి' అన్నాడు. వీడి అసందర్భ ప్రలాపా లేమిటా అని చికాకువేసింది. నేను నా చెయ్యి గుంజుకుని కూడా విడిపించుకో లేక పోయాననేగా వీడి ఎగతాళీ! ఇంతవరకూ ఎరుగున్న పెద్దమనిషి కదా అని వూరుకున్నాను గాని లేకపోతే నా ఒంటిమీద వాడిగాలిసైనా సోకనిచ్చేవాణ్ణా? ఇక వీడి పెద్దమనిషితనాన్ని మంటగలపాలి.

"ఏమిటయ్యా యిదీ!" అన్నాను కరుగ్గా. కామయ్య గట్టర్‌లోనుంచి వచ్చే ప్రవాహంలా నవ్వుతూ, నన్ను అటూ యిటూ ఊపి పేశాడు. నా కడి చెంచులవాళ్ళ కంచుతాళానికి ఎలుగుబంటి నృత్యం చేసినట్లుంది. కొంతసేపటికి పొంగుకొచ్చే నవ్వును మింగుతూ "అయిందిగా- కావలసినంతా! పీళ్ళబడాయి యెంతసేపోయ్? చెప్పినంతా చేశామా? మాతో పని అంతే, అంతే" అన్నాడు-తాగిన స్టేజీ టపుడింగా. మీసం పిడీ వేసుకుంటూ నన్నేదో చెప్పమన్నట్టు చూస్తున్నాడు.

నా కాతని మాటల సందర్భా సందర్భాలు పూర్తిగా అర్థం కాలేదు. కాని, అతనిమీది అసహ్యంతో పాటు-విషయ మేమిటో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. "అసలు విషయం ఏమిటండీ?" అన్నాను. అతగాడి నవ్వు అణగిపోయింది. దాని స్థానంలో ఆశ్చర్యం పొడుకుంది. "నీకు తెలియనే తెలియదా ఏమిటి?... రామూ - మీ రామూ అయ్యా" అని మళ్ళా నవ్వు మొదలెట్టాడు. "ఏం? మా రామూ కే మయింది?" అని సీరియస్‌గా అడిగాను.

"అయిందయింది... ఈ సంబరం, యీ కుప్పిగంతులూ మా ముందా? హాఁ... ఇదుగో, నువ్వు కాస్త బతుకుతెరువు తెలిసినవాడివి కదా- మీ మిత్రుడికి బుద్ధి చెప్పకూడదమా? ... వేసిందే ఒక గంతు, విరిగిందే ఒక కాలు!... ఇంతకూ మాతో పని—మాటలా? అహ్హహ్హా!" అన్నాడు. అప్పటికీ నా కర్థమయింది కాదు. మొత్తంమీద రామూకు యీ కామయ్య యేదో కీడు కలిగించాడనే అనుమానం కలిగింది. ఐతే రామూ చేసిన తుంటరం ఏమిటో నాకు తెలిసింది కాదు.

"రామూకేం ముప్పుముంచుకొచ్చిందేమిటి?" అన్నాను. సాధ్యంకాని వ్యంగ్యాన్ని సాధ్యం చేసుకుంటూ, కామయ్య 'అన్నట్లు నీకు తెలియనే తెలియదూ?...ఒక్క గదిలో, ఒక్కయిదిగా వుంటున్నారు కదా! చెదుపనుల్లో వేలు పెలెట్టొద్దని నువ్వు చెప్పనే లేదూ?... అటువెళ్ళి పోలీస్ స్టేషన్‌లో చూడవయ్యా, పిచ్చి వాడా... చూచితా" అంటూ నవ్వాడు. "రామూ పోలీసు స్టేషన్‌లో ఎందుకున్నాడు? అత నేం తప్పు చేశాడూ?" అని నే నడిగాను.

కామయ్య "ఇంకేం చెయ్యాలి? మాల గూడెంలో వాళ్ళందరికీ చదువంటూ ఒకవేషం వేశాడు. అది చదువు చెప్పడమూ గాదు, చట్టుబండలూ కాదు—'పాలేరు' అంటే రైతులో భాగస్థుడనీ; ఆతనికి కనీసం రెండుపుట్ల జీతమూ, రెండుజతల బట్టలూ, చెప్పులూ వగైరా యిస్తేనే రైతుకు జయమనీ; అలా యివ్వని రైతు కెవరూ పాలేళ్ళుగా వుండరాదనీ; మా గనుల్లో పనిజేసే వాళ్ళకు రోజు కూలిగాక, వాళ్ళుతవ్వే దాన్నిబట్టి కూలి నిర్ణయించాలనీ; అలా కూలిగాక ఏదో యిన్సూరెన్సు చెయ్యాలనీ, హాస్పిటాల్ వుండాలని... ఏమేమో చెప్పి వేర్పాడా బయుద్ధాయిలకు. వాళ్ళా సౌకర్యాలన్నీ చూపిస్తేనే కూలికొస్తామని మొరాయించారు. అంతే ..." అంటూనే వెళ్ళపొగాడు. నే నో క్షణంలోనే జరిగిన సంగతులు అర్థం చేసుకున్నాను. దూరాన కామయ్య "వెళ్ళిచూసుకో మళ్ళా ఏ అయవెల్లకో దర్శనం" అంటూ వికటంగా నవ్వుతూ మలుపు తిరిగాడు.

నేను వాడి వ్యంగ్యానికి చాలా చిరాకు పడ్డాను. అయినా ఆ కామయ్య నేం చేసి కసి తీర్చుకో గలను?... ముందుకు నడిచాను. కాఫీ హోటల్లో అయ్యరిచ్చిన కషాయం తాగుతూ రామూను గురించే ఆలోచిస్తున్నాను. నా బల్ల పక్క కూర్చున్న సూట్‌వాలాలు—"చెడిపోతావురా బ్రదర్ అంటే విన్నాడా వాడు...అబ్బే! చెడిపోయే వా డెందుకు వింటాడు? ఇక నయింది మనలాగా ఆ కామయ్యను నమ్ముకుంటే ఒకింటి వా డయేవాడా!"...లక్షకామెంట్లు విసిరారు. చివరికి రామూ పూర్తిగా చెడిపోయాడనే నిర్ణయించారు.

కథానిక

# పర్యవసానం

'సత్యమూర్తి'

'కాఫీలోకి కొంచెం పంచదార కావాలా, పార్వతీ?' అని అడిగింది ఆఫీసరు భార్య కాంతమ్మ, చెంచాతో పంచదార తీస్తూ.

'ఆ, కొద్దిగా... ఊఁ చాలు, చాలు' మొగమాట పడుతూ అంది పార్వతి.

'ఏమో, రాక రాక వచ్చేవు మా యింటికి. అప్పట్లో నీకుమాత్రం తీరికేదీ?... అందులో పని మనిషికూడా లేదో యేమో, అన్ని పనులూ నీవే ఒక్కచేతిమీదుగా చేసుకోవాలి పాపం, యేకోలే. ఇంకా నయం. నేనంటూ ఓ ముసలిదాన్ని యిక్కడున్నానని జ్ఞాపకం పెట్టుకుని, మాట్లాడ్డానికి వచ్చేవు.' సానుభూతి, కృతజ్ఞత ఉట్టిపడ్డాయి ఆవిడ మాటల్లో.

ఎందుకు వచ్చానా అనిపించింది పార్వతికి. ఆవిడ మనసు అప్పుడే మారిపోయింది. పైకి మాత్రం అంది, యేమీ అనకపోతే బాగుండదని:

'అదేం, అదేం లేదండి. రావాలనిపించే వచ్చాను. అయినా మీకు వృద్ధాప్యం వచ్చిందని ఎవరన్నారూ ?'

'పోనీ, నడివయస్సైనా వచ్చిందా? నేను చూస్తూండగా రెండు యుద్ధాలు జరిగాయి. రెండు యుద్ధాలు చూశాక నాకు ముసలితనం వచ్చిందనే అనిపిస్తోంది. మొదటి యుద్ధం ఇంకా అవుతూండగానే నాకు పెళ్ళయింది.'

అసహనం, ఏవగింపూ కలిగాయి పార్వతికి. ఈ ధోరణి ఆవిడ పుట్టినప్పటి నించి వింటున్నదే.

'పెళ్ళయేటప్పటికి, నాకు పట్టుమని పదిహేనేళ్ళయినా లేవు. పెళ్ళి, పచ్చిబద్దలూనూ! ఏం పెళ్ళి! పాడుపెళ్ళి! నీకైనా అంతకంటె వయసు మించలేదనుకుంటా—?'

'పెళ్ళినాటికి నాకు పదహారో యేడండీ' ముక్తసరిగా జవాబిచ్చింది పార్వతి. కాసేపాగి, యేదో జ్ఞాపకం వచ్చి 'అయితే మరి, పాడు పెళ్ళి అన్నారేం, ఎందుచేత?' అని అడిగింది.

నిజానికి యీ ప్రశ్న కాంతమ్మకి ఉత్సాహాన్నే కల్గించింది. అయితే దాన్ని పైకి తెలియనిచ్చేటంత తెలివితక్కువ మనిషి కాదు ఆవిడ.

'ఎందుకంటావా? పదిహేనేళ్ళ పిల్లకి సంసారం అంటే యేం తెలుస్తుంది చెప్పు. పదేళ్ళ తర్వాత జీవితం యెలా వుండేదీ, అంత చిన్న వయసులో యేఆడపిల్లకి అర్థమవుతుం దంటావ్?'

'కాని అర్థం చేసుకోగల్గిన వాళ్ళిక లేనే లేరంటారా' యేమీ తోచక అడిగినట్టు అడిగింది పార్వతి.

'అసలు లేరని నే ననను. ఉంటారు ఎవరో కొద్దిమంది పూర్వజన్మ సుకృతం చేసుకున్న వాళ్ళు. కాని చాలామంది విషయంలో తీరా పెళ్ళిచేసి కొని, జీవితంలో అడుగుపెట్టాక కాని అసలు విషయం బోధపడదు.'

పార్వతి శ్రద్ధగా వింటోంది. కాంతమ్మ ఎక్కడివస్తువు లక్కడ మామూలుగా సర్ది అంది:

'నే నిపుడు చెప్పబోయేది ఎప్పుడో గాని జరగదు. నీకో చక్కని కథ చెప్పమంటావ్?'

'పెళ్ళయిన ఆరుసంవత్సరాలకి నేను సూర్యారావుని ప్రేమించాను. అతనికి గుఱ్ఱపుస్వారీ బాగా వచ్చు. మంచి స్ఫురద్రూపి. చూసిన కొద్దీ చూడాలనిపించేటంత ముచ్చటగా వుండేవాడు. మల్లెపూవుల్లాంటి తెల్లటిబట్టలు వేస్తూండే వా డెప్పుడూను.'

తపీమని ఆగింది మధ్యలో. తెచ్చిపెట్టుకొన్నట్టున్న ఆవిడ చిఱునవ్వు పార్వతిలో యిదివరకంతగా కోపాన్ని తెప్పించలేక పోయింది.

'నవలల్లో వర్ణించే పాత్రల్ని చూసి అసహ్యించుకుంటాం కాని మన జీవితమే ఒక నవలలాంటిదని అనుకోం. అక్కడే వుంది తప్పంతా, ఉదాహరణకి నా విషయంలో అంతే ఐంది.'

'నా అనుభవమూ చాలావరకు అలాంటిదే.

అందుకే కానీండి, త్వరగా చెప్పండి' పార్వతి ప్రోద్బలించింది.

'విశేషించి చెప్పేందు కేమీ లేదు గాని మా వారంటే నా కెప్పుడూ అసహ్యం వుండేది కాదు. పైపెచ్చు యిష్టంకూడాను. అయితే ఆయ న్నెప్పుడూ నేను ప్రేమించి ఎరగను. మాకు పిల్లాజెల్లాకూడ లేరు. ఏ అడ్డంకులూ లేకపోయి నప్పటికీ, ఆయనంటే నాకున్న యిష్టమే ఆయన్ని విడిచి వెళ్లలేకుండా చేసింది నన్ను. ఆయన నన్ను తిట్టి, కొట్టి బాధిస్తే బాగుండు ననుకునే దాన్ని. ఆ నెపంమీదైనా ఆయన్ని వది లించుకోవచ్చని.'

పార్వతికి ముళ్లమీద కూర్చున్నట్లుంది. సాంతం వినందే ఆవిడ మనసు కుదుటబడేట్టు లేదు.

'ఆరునెలలకి గాని నేనొక నిర్ధారణ కంటూ రాలేక పోయాను.' పొయ్యిలో మండుతున్న కట్టె పేడొకటి క్రిందికి జారిపోయింది. దాన్ని మళ్లీ పొయ్యిలోకి ఎగదోస్తూ తన కథ పునః ప్రారంభం చేసింది కాంతమ్మ.

'చివరికి నే నొక్కటేముక్క అనుకున్నాను. మావారిని ఒంటరిగా వదిలేసి, సూర్యారావుతో లేచిపోదామని——'

పార్వతి సంతోషానికి మేరలేదు. నెత్తిమీది నుంచి ఏదో పెద్ద బరువు దించినట్లనిపించింది. కాంతమ్మంటే సానుభూతీ, ప్రేమా, గౌరవమూ ఆవిడ సుంద్రని కళ్లలో ప్రతిఫలించినయి.

కాంతమ్మ శాంతంగా చెప్పుకు పోతున్నది.

'నాకు యిప్పటికీ బాగా జ్ఞాపకం. ఆ రోజు మా ఆయన క్యాంపుకు వెళ్లారు. డెస్కుదగ్గరే ఆ రాత్రల్లా ఉత్తరాలమీద ఉత్తరాలు రాస్తూ కూర్చున్నాను. రాయడం,చించివేయడం; రాయడం,చించివేయడం-ఇలా జరిగింది. చివరికి-నన్ను క్షమించాల్సింది — అని మాత్రం రాసి సంతకం పెట్టాను. సూర్యారావుకి స్టేషనువద్ద కలుసుకోమని రాశాను. ఎన్నింటికి నన్ను అక్కడకి రమ్మనేదీ తంతి ద్వారా తెలియజేయు మన్నాను. నేను పడుకోబోయే టప్పటికి తెల్లగా తెల్లవారింది. ఉత్తరాలు తీసికెళ్లడానికి మనిషి కూడ వచ్చాడు.అతను వచ్చే టప్పటికి నేనింకా మేలుకునే వున్నాను, ఎందుకో కన్నెత్తి ఉత్తరాల తంక చూసే ధైర్యం లేక పోయింది నాకు. ఎలాగోలాగు మనస్సు దిక్కబట్టుకుని ఆ రెండు ఉత్తరాలూ వాడిచేతిలో పడవేశాను.'

ఇంతలో ఆమె భర్త కామాల్సు తలుపు తోసుకుని లోపలికి రావడంతో కాంతమ్మ కథ మళ్లీ కాసేపు ఆగిపోక తప్పిందికాదు.

'ఆయ నెవరండీ, సూర్యారావుగారా? మీరు ప్రేమించి—'మరి అడగ లేక పోయింది పార్వతి.

'లేదు. ఆయన నా అసలు భర్తే.'

నెత్తిమీద పిడుగు పడ్డట్లయింది- వెళ్లిపోదామని లేచి నుంచుంది పార్వతి.

'ఏం, అపుడే వెళ్తావా? వెళ్దువు గాని లే కూర్చో. పాపం రాకరాక వచ్చేవు. నీలాగ ఓపిగ్గా వినే వాళ్లని చూస్తే నాకెంతో సర్దా.'

'మరి మధ్యలో ఆగిపోయారు చెబుతూను' అన్నది పార్వతి,'సాంతం వినేదాకా ఆవిడెలాగా తనని వదిలి పెట్టదని గ్రహించి.

'ఓ, కథ సంగతా? నీకింకా పూర్తిగా చెప్పనే లేదుగా అన్నట్లు. ఆ... జ్ఞాపకం వచ్చింది. ఆ సూర్యారా వున్నాడే, అతను తర్వాత మిలిటరీలో చేరాడని తెలిసింది. కొద్దిరోజులకే ఎ. డి. సి. అయినాడని కూడా విన్నట్లు గుర్తు.'

'ఇంతకీ ఆ ఉత్తరాల సంగతి యేమయినట్లు' చాలా చిరాకుగా అడిగింది పార్వతి.

'ఆ, అయితే ఆ రోజు సాయంత్రానికల్లా అనుకున్నట్లే నాకో టెలిగ్రాం వచ్చింది స్టేషనునుంచి. అయితే దానిని పంపింది ఎవరోకాదు. మావారే. కాబులు పొరపాటుగా కవర్లలో పెట్టి, యిచ్చేశానన్న సంగతి తిరా టెలిగ్రాం చూశాక గాని నాకు తెలిసింది కాదు. అంతా అయాక యిపుడా విషయం తలుచుకుంటే దేవుడు చేసిన దంతా నా మేలుకొఱకే ననిపిస్తుంది.'

పార్వతి వెళ్లొస్తానని చెప్పి, యింటిదారి పట్టింది.

ఆఫీసరు భార్య యింకా అక్కడే చాలాసేపు యేమో ఆలోచిస్తూ కూర్చున్నది. ఇంతలో ఆవిడ భర్త తిరిగివచ్చాడు. భర్తను చూసి ఆవిడ చమత్కారంగా నవ్వుతూ అంది- 'ఏమండీ, యిల్లా కొన్నాళ్లు చెప్పగా చెప్పగా, చివరికి నా కథ నేనే నమ్మేస్తానేమో నని భయంగా వుంది.'

('కే హారిసన్' వ్రాసిన కథ ఆధారం)

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షికక్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## "ప్రభుత్వం అసమర్థత"— రైల్వే అధికారి జవాబు

"తెలుగు స్వతంత్ర" 29-7-1949 తేదీ సంచికలో 'జనవాక్యం' శీర్షిక క్రింద "ప్రభుత్వం అసమర్థత" అనే ఉపశీర్షికతో ప్రకటింపబడిన శ్రీ డి.యల్. దేశపాండే (విజయవాడ) గారి లేఖను పురస్కరించుకొని వ్రాసిన ఈ క్రింది "సంపాదక లేఖను" తమ పత్రికలో ప్రకటిస్తే సంతోషిస్తాను.

గతంనుంచి సంక్రమించిన లోటుపాట్లకు ప్రస్తుత ప్రభుత్వాన్ని నిందించతగదు. ఇట్టి అసహాయకర వైఖరిని ప్రదర్శించడం శ్రీ దేశపాండే గారి ఉద్దేశంకూడా కాదనే నమ్ముతున్నాను.

సాధ్యపడినంత త్వరలో ప్రయాణీకులకు సౌకర్యాలు కలగజేయాలనే రైల్వే అధికారులు తాపత్రయపడుతున్నారు నిజానికి-ఈ విషయానికే వా రెక్కువ ప్రాధాన్యంకూడా యిస్తున్నారు. చేస్తూన్న దెంతో వున్నప్పటికీ-ఈ విషయంలో బ్రహ్మాండమైన కృషి అవసరం కావడంచేత, అక్కడక్కడ క్రమక్రమంగా నిర్వర్తిస్తున్న కార్యకలాపాల సత్ఫలితం సర్వత్రా కానరావడం లేదు.

రైల్వే సంస్థ డబ్బుకోసమే ప్రాకులాడుతున్నదనడం ఉచితంగా లేదు. ఉన్న జాగా కంటె ఎక్కువమందికి టిక్కెట్లు ఇస్తున్నారంటే దానికి కారణం-నిరంతరంగా ప్రయాణాలను క్రమబద్ధం చేయడంవల్ల ప్రయాణీకులు మరింత ఆశాభంగానికి, అసౌకర్యాలకు గురి కావలసి వస్తుందని భావించడం చేతనే.

యుద్ధానికి మునుపున్నన్ని రైళ్లు, ఇంజన్లు, పెట్టెలతో మాత్రమే నాటికంటె రెండు మూడు రెట్ల ప్రయాణీకులను మన రైల్వేలు చేరవేస్తుండటం జనసమ్మర్దానికి కారణం. పైన చెప్పినట్లు, ఉపయోగకరమైన విధంగా ప్రయాణాలను క్రమబద్ధం చేయడం కష్టం.

టిక్కెట్లు లేకుండా ప్రయాణం చేసేవారిని వెళ్ళగొట్టడంలో ప్రయాణీకులు సహకరించిన నాడు జనసమ్మర్దం చాలావరకు తగ్గి తగుమాత్రంగా వుండడానికి అవకాశం వుంటుంది. టికెట్ చెక్కర్లు టిక్కెట్లు లేనివారిని పట్టుకొనే సందర్భాలలో కొందరు ప్రయాణీకులు టిక్కెట్లు లేనివారి పట్ల సానుభూతి ప్రదర్శించడం కూడా కద్దు. అనవసరమైన పెద్దపెద్ద సామాన్లను వెంట తీసుకు వెళ్ళకపోయినా జనసమ్మర్దం తగ్గుతుంది.

రైళ్లలో వ్యాపారం చేయడం అక్రమం. అట్టి వ్యాపారులను తగు రైల్వే ఉద్యోగస్థులు చూచినపుడు ఎలాగూ వెళ్ళగొడుతున్నారు. ఈ సందర్భంలోకూడా ప్రజా సహకారం అవసరం. ఆ వ్యాపారులదగ్గర ఏవస్తువూ కొనకపోతే అధికారుల కెంతో సాయంచేసినట్లు అవుతుంది.

అక్రమంగా బియ్యం తీసుకు వెళ్లేవారిపై చర్య జరపవలసినవారు ఆయా ప్రభుత్వాధి

కారులు. అప్పటికి రైల్వే ఉద్యోగులు అన్ని విధాలా వారికి సహాయపడుతూనే వున్నారు.

మద్రాసు యస్. ఆర్. శర్మ
పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, యం.యస్.యం రైల్వే

---

## జిల్లాబోర్డు ఎన్నికలు – కాంగ్రెసు

కాంగ్రెసు నాయకులలో స్వార్థపరత్వం, కుళ్ళు, పర్మిట్లకోసం, పదవులకోసం తహతహ సర్వే సర్వత్రా వ్యాపించిన సంగతి అబాల గోపాలం ఎరిగినదే.

అవినీతిని తొలగించి, కాంగ్రెసును పునరుజ్జీవింప చేయాలని నెహ్రూ, పటేలులాంటి నాయకులు ఎంత చెప్పులు పడితేమాత్రం ఏం ప్రయోజనం? రాష్ట్ర జిల్లా నాయకుల ఆలోచనలు, చర్యలు కులతత్వాలతోటీ, ముఠా రాజకీయాలతోటీ నిండిపోయి ఇంకేనాటికీ వీరి ప్రవర్తనలు బాగుపడవనటానికి మరో ప్రబల నిదర్శనం-నేటి జిల్లాబోర్డు ఎన్నికలు.

ఒక నియోజకవర్గానికి జిల్లా సెలెక్షను కమిటీ వారు ఒక పుల్లయ్యను సెలక్టు చేస్తే, రాష్ట్ర కాంగ్రెసువారు ఆ పుల్లయ్యపేరు తొలగించి మరో ఎల్లయ్యకి ఇయ్యటం జరిగింది.

ఇలా రాష్ట్రంవారు చేసిన సెలక్షన్లలో తమ గ్రూపువారు లేరనే కారణాన ఇంకో గ్రూపు వారు ఏ కులతత్వాన్నో ఆధారంగా తీసుకుని, మరో కన్నయ్యచేత నామినేషన్లు వేయిస్తున్నారు. ఇలాగ ఏ గ్రూపు కా గ్రూపు తమకు కావలసిన ఫలానా వ్యక్తి సెలక్టుకా లేదని ఎవరినో లేవదీసి తాము చెందిన కాంగ్రెసుని ఓడించటానికే శపథాలు తీసుకున్నారంటే; ఈ కాంగ్రెసు వారు ఎంత అసంబద్ధంగా ప్రవర్తిస్తున్నారో, అమాయక ప్రజాసామాన్యంయొక్క ఓట్లతో వీరు దేశాన్ని ఏవిధంగా మోసం చేస్తున్నారో స్పష్టమవుతుంది.

పిఠాపురం ఆర్. బి. పెండ్యాల

---

## ధర్మాసుపత్రులు

నేతి బీరకాయలో నెయ్యి ఎంత ఉంటుందో, నేటి మన ధర్మాసుపత్రులలో ధర్మం కూడా అంతే కనిపిస్తోంది. దీనికి కారణాలు అనేకం ఉండవచ్చు కాని ముఖ్యంగా మన ఉద్యోగులలో మితిమీరి పోతున్న ధనపిపాసే ఈ డాక్టర్లలో కూడా వ్యాపించిందనడం సాహసం కాబోదు. దీనివల్ల ఎక్కువగా బాధపడేది బీద ప్రజానీకమే కాని, వెనకా ముందూ ఇంత వున్నవారు కాదు.

వేళకు ఆసుపత్రికి వెళ్ళి రోగులను సాకల్యంగా పరీక్షించి, ఇన్ని మందునీళ్ళిచ్చే డాక్టర్లు అరుదు. హాస్పిటలులో మంచి మందులు ఉండవని కూడా అంటాయి. ఇవి నిజమైతే ఇంతకన్నా సహింపరాని విషయం ఏదీ ఉండదు. అరటిపళ్ళ మీదా, ఆఖరికి భారతనారి ప్రాణసమానమైన పసుపుకుంకాల మీదా కూడా పన్ను విధించే ప్రజాప్రభుత్వం (?) ప్రజల ప్రాణాలతో చెలగాట మాడుతోందంటే ఆశ్చర్యమేమిటి?

ఈ గవర్నమెంటు డాక్టర్లు ధనవంతుల ఇండ్లచుట్టూ తిరిగి వైద్యం చేస్తారు కాని చంటిబిడ్డకు పాలు కొనుక్కునే దిక్కులేని అమాయకులు కాళ్ళా వేళ్ళా పడి బతిమాలినా మందివ్వరు.

పోహారు ఆర్. యస్. మూర్తి

---

## ఆధునిక కవిత్వం

ఆధునిక కవిత్వం బహుముఖాలుగా వివిధ రూపాలను పొంది, ఈనాడు "ఖండగేయ" స్వరూపంలో (అంటే పంక్తులకోసం విధానరహితంగా ఖండింపబడిన వాక్య సముదాయం గల గేయం) చిత్ర విచిత్రంగా కొన్ని పత్రికలను అలంకరించడం విజ్ఞులంతా చూస్తూనే వున్నారు. ఈనాడు మానవసంఘంలో వున్న దురాచారాలు, నైతిక స్వభావాలు వాస్తవికదృష్టితో చిత్రించి, సంఘీయులు యెదుర్కొనవలసిన సమస్యలను, సవరించుకొనవలసిన లోపాలను, సుపరిచితం చేయడమే ఆధునిక కవిత్వముయొక్క ఆశయమని కొందరు పెద్దలంటూవుంటారు. కాని ఈనాటి గేయ కవిత్వంలో సామాన్యంగా, నిఘంటువుల కందని పదాలు, అగాధమైన భావాలు (ఉన్నాయో లేవో దేవునికే తెలియాలి) అతిపేలవంగా వుండే వ్యర్థపదాలూ, లేదా అతిదీర్ఘమైన సంస్కృత సమాసాలు, సంబంధ రహితమైన వాక్యసరణి, యే వ్యాకరణానికి, ఛందస్సుకీ కట్టుపడని వికృతరూపాలు, అర్థశూన్యమైన అలంకారాలు ప్రదర్శిత మౌతు-

న్నాయి. కొంతవరకు భాషాజ్ఞానం కలవారికే అర్థంకాని ఈ రచనలు సామాన్యులకు బోధపడే అవకాశం లేనేలేదు. వ్యావహారిక భాషలో రచనలు సాగించడం యిప్పుడందరికీ సమ్మతమే (ఏ ఒకరిద్దరికో తప్ప). కాని కొన్ని మాటలను మెలికలు త్రిప్పి, సాగించి, కుదించి, తలక్రిందులు చేసి, ఖండించి, అతి వికారంగా తయారు చేయడమంటే యెవ్వరికీ యిష్టం ఉండదు. దీనికితోడు అన్యభాషా పదాలను అనవసరంగా గుప్పించి విశృంఖల విహారం చేయిస్తే, యిక మన భాష నీతి నియమాలు లేకుండా వికృతాభరణాలతో విలసిల్లే విటకత్తెవలె ఉంటుంది.

అభ్యుదయ రచయితలు చాలామందికి అర్థమయే భాషలో, తమ భావాలను పాఠకులు గ్రహించుకొని ఆనందించగలిగిన శైలిలో వ్రాయడం అవసరంగదా! లేనిచో ఆ రచన అరణ్య ఘోషగానో, 'ధమ్మ ఘోష' గానో పరిణమించి వ్యర్థమై పోతుంది. ఇట్టి వ్యర్థరచనలు పెక్కింటిని చూచియే గాబోలు శ్రీ వా. వెం. నరసింహరాజుగారు 'తెగువ తప్పిన తెలుగు భాష' అని ఒక వ్యాసం వ్రాస్తే, దానికి శ్రీ బి. రామారావుగారు వెంటనే జవాబిచ్చారు. మంచి సరళమైన వ్యావహారిక భాషలో వ్రాయబడే వచన రచనలు అందరినీ ఆకర్షిస్తాయి గదా! అటువంటప్పుడు సర్వ నియమరహితమై, కుంటుపడ్డ నడకతో ఎలాగో కూర్చి చదువవలసి వచ్చే రకరకాల గేయ కవిత్వాలెందుకు! అవే కావాలంటే వాటితో పాటు వారి వారి వ్యాఖ్యానాలు, భావసరంగ, రసాలంకారాలను కూడా ప్రకటిస్తే మంచిది. పత్రికాధిపతులైనవారు ఇట్టి రచనలను ప్రకటించడంలో కొంత వివక్షత చూపవలసి వుంటుందేమో!

నిడుబ్రోలు — పె. సుబ్బారావు

---

నాటకకళా పునరుజ్జీవన సంఘం

క్రిందటి నెల 27వ తేదీన ప్రభుత్వం చే నియమించబడిన నాటకకళా పునరుజ్జీవన సంఘం వారు విజయవాడకు వచ్చారు. పట్టణంలో ఉన్న రెండుమూడు సమాజాల వారితోనూ, ఇద్దరు ముగ్గురు వ్యక్తులతో మినహా పట్టణంలోనున్న యితరులెవ్వరినీ కలుసుకోలేదు. ఈ విషయం ఎవ్వరికీ తెలియనట్లే తెలుస్తూంది. విజయవాడలో దాదాపు 10 ఎమెచ్యూర్ సమాజాలున్నాయి. ఎంతోమంది నటకులు, యితర కళావేత్తలు కవులు, రచయితలు, పత్రికాసంపాదకులు ఉన్నారు. వారిలో ఎవ్వరినీ కలుసుకోలేదు. పైన కలుసుకున్న వ్యక్తులను, సమాజాలవారినీ కమిటీవారే ఆహ్వానించారా? లేక పై సమాజాలవారు కమిటీవారిని ఆహ్వానించారా? ఏది ఏమైనా, కమిటీ వచ్చింది, వెళ్ళింది తప్పితే సరియైన విషయ నిర్ధారణ, విచారణ సంతృప్తికరంగా లేదు. దేశంలో అనేక సమస్యలమీద వచ్చిపోయిన అనేక కమిటీలమాదిరే యిదీ ప్రవర్తించింది. కనీసం ఒక కమిటీ ఒకపట్టణానికి వచ్చినప్పుడు, ఆపట్టణంలో ఎన్ని సంఘాలున్నాయో, ఎంతమంది నటకులున్నారో వారందరినీ కలుసుకోవలసిన బాధ్యత ఉంది. మరొక కార్యక్రమంలోనైనా పై రీతిని సమష్టిగా చర్చలు జరిపితే ప్రయోజనముంటుంది.

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి
విజయవాడ